౧౬౦-1173, ౧౬౫-1203, ౧౮౦-1248, ౧౮౩-1280, ౧౮౪-1298,
౧౮౭-1307, ౧౮౬-1319, ౧౯౨-1357, ౧౯౬-1403, ౨౦౦-1432,
౨౦౭-1505, ౨౧౪-1555, ౨౨౩-1636, ౨౨౭-1650, ౨౩౧-1681,
౨౩౨-1718, ౨౩౬-1756, ౨౪౦-1781, ౨౪౨-1786, ౨౫౪-1890,
౨౭౨-1989, ౨౭౬-1968, ౨౭౯-1979, ౨౬౫-2031, ౨౬౯-2041,
౨౬౯-2063, ౨౮౭-2119, ౨౮౮-2112, ౨౯౦-2152, ౨౯౧-2154,
౨౯౫-2196, ౨౯౬-2205, ౨౯౮-2209, ౩౦౯-2308, ౩౧౨-2336,
౩౧౪-2400.

తమాత్రమునకుంగూడ నవకాశముచాలనివారు విషయసం హాదికమును, ఈక్రిందిపుటలలోని పూర్వోక్తవిషయములను మాత్ర నియుం గందురుగాక.

౬, ౪౫, ౫౦, ౮౭, ౧౨౯, ౧౪౪, ౧౪౭, ౧౭౭, ౧౭౮, ౮౭, ౨౦౭, ౨౩౦, ౨౩౨, ౨౪౦, ౨౪౨, ౨౭౨, ౨౬౯, ౨౯౦, ౨౯౮, ౩౧౪.

మదరాసు,
సెంబరు, 1898.

వేదము వేంకటరాయ శాస్త్రి,

శ్రీ

# ఆంధ్ర ప్రసన్నరాఘవ విమర్శము.



## ప్రథమాంకము.

౧ - పుట.

1. జ్యాయస్.—ప్రా. 2. ఎంతోవేడ్కన్—య.

శా॥ చేయన్ శ్రేయమునవ్వివిద్రుమదళశ్రీకాంగుళిశ్రేణికల్
[9] జ్యాయశ్శ్లక్ష్ణసరోజకోరకరుచుల్ పద్మాక్షునల్సేతులున్
9 వ్రాయున్నల్వమొగంబులందు నెవిమేల్వ్రాల్దమ్మివాల్గంటిచ
స్థాయిం జెక్కిళులందుఁ బత్త్రములనెంతోవేడ్కనువ్వెత్తుగన్.

3. విద్రుమలతాశ్రీకాంగుళిశ్రేణి క—'శ్రేణికముల్' అని యమువాన్న పుంస
ముగా నుండవలయును; ఇది బహువ్రీహిసమాసము, 'నల్సేతు' లకు విశేషణము;
పగడపుఁదీఁగలశోభవంటిశోభగల వ్రేళులపరుసలుకలవి' అని యర్థము. 'వి...
ల్' అనునది కర్మధారయమేగాని బహువ్రీహి గాదనియు, చేతులకు విశేషణముగా
దనియు, 'అంగుళిశ్రేణులు శ్రేయముచేయును చేతులును శ్రేయముచేయును' అని
యన్వయమనియు ఇప్పుడొకవాదమునకుఁ దొడంగుదురేమో? ఆపక్షమున, ఉత్త
రార్థమందు పత్త్రిములను వ్రాయునవిగా నుపన్యసింపఁబడిన వేవో అవియేగదా యీ
పూర్వార్థమున శ్రేయముచేయునవి గావలయును. అవ్వి, ఎవి అనుయత్తచ్ఛబ్దా
ర్థక ప్రయోగముచేత నట్టియైక్యము ఏర్పడుచున్నది. ఆవ్రాయునవి వ్రేళులా
చేతులా? లేక ఉభయమా? ఉభయమనుపక్షము సరిగాదు, ఎట్లన, వ్రేళ్లు వేఱుగా
వ్రాసి చేతులు వేఱుగా వ్రాయవుగావున. మఱి, వ్రేళులే వ్రాయును చేతులు వ్రాయ
వనుపక్షమున చేతులను చెప్పనేల? చేతులేయనుపక్షమున వ్రేళులను చెప్పనేల?
వ్రాఁతయందు చేతులును వ్యాపృతములైనవని వానిని చెప్పుటయనుచో మోఁచేతు
లను చంకలను తదీయములను చెప్పనక్కఱలేదా? మఱియు, నల్సేతులున్ అన్న
...నే, నాలుగు అంగుళిశ్రేణికలు అని సంఖ్యను అచటనుంగూడ చెప్పవలదా? ఇన్ని
...గోధములచే నీయన్వయము పనికిరాదు. మఱియు నిది మూలవిరుద్ధము.

---

ప్రా.—ప్రాసపూరణము, య.—యతిపూరణము, పా.—పాదపూరణము.

మూ.—చత్వారః ప్రథయన్తు విద్రుమలతారక్తాఙ్గుళిశ్రేణయః
శ్రేయః శోణసరోజకోరకరుచస్తేశార్ఙ్గిణః పాణయః
ఫాలే ష్వబ్జభువో లిఖన్తి యుగప ద్యే పుణ్యవర్ణావళీః
కస్తూరీమకరీః పయోధరయుగే గణ్డద్వయే చ శ్రియః.

ఇటు మూలములో తచ్ఛబ్దము ద్వితీయపాదమున "తే" అని పుల్లింగము నుండుటచేత పాణిశబ్దముతో మాత్రమే అన్వయించినదై, చేతులు మాత్రమే వ్రాయుటకు కర్తగా నిర్దేశింపఁబడినవనియు, అంగుళిశ్రేణులు తదీయసాధనముగా నిర్దేశింపఁబడినవనియు, విద్రు...శ్రేణయః అనునది పాణులకు విశేషణమనియు బహువ్రీహియనియు స్పష్టపఱుచుచున్నది. అట్లుగాదన్న 'తే' అనుపదము పుల్లింగము 'అఙ్గుళిశ్రేణయః' అను స్త్రీలింగమునకు అన్వయింపవలయును; అసమానలింగతాదోషము కలుగును. మఱియు, 'విద్రు...శ్రేణికల్' అనుపదము బహువ్రీహియే చేతులకువిశేషణమే, ఈబహువ్రీహియొక్క స్త్రీలింగస్వారస్యముచేత చేతులంద స్త్రీత్వమారోపితమైనది అని యొకస్వారస్యమును వాదించుపక్షమున, 'అవి' 'ఎవి' యనుటకుమాఱుగా 'వారు' 'ఎవ్వరు' అని స్త్రీవాచకములు ప్రయోగించుకొనియుండవలయు నని బోధింతుము. తాపుసనిట లక్షణమేచెడి ప్రథమపద్యాని ప్రథమపాదమే కడమగ్రంథంపుసౌభాగ్యమునకు, మీఁగాళ్లవాపునకు మొగముపో సూచకపడవిం బొందియున్నది. 4. జ్యాయశ్శోణసరోజకోరకరుచుల్—జ్యాయస్ అనఁగా ముదురుది. కోరకమనఁగా మొగ్గ. పువ్వనఁగూడ లేఁతతనముం జెప్పుట యుచితమైయుండఁగా ముదురుమొగ్గయనుట సరిగాదు. మఱియు, జ్యాయస్—అనఁగా శ్రేష్ఠమనియు నర్థమే. ఈ విశేషణము లేకున్నను, హరికరములు మంచియెఱ్ఱదామర మొగ్గలవంటివి కావనియు, పనికిమాలిన యెఱ్ఱదామరమొగ్గలవంటివనియు, ఎవ్వరునుం దలంపరు. ఈ విశేషణముచేతనే ఆసందేహము పుట్టును. కాన ఈవిశేషణము వేయుట సరిగాదు. 5. పత్రములకు—దీనికిమూలము 'కస్తూరీమకరీః,' తెలుఁగులో కస్తూరి పనికిరాకపోయినది. 6. చెక్కిళులందు—మూలములో 'గణ్డద్వయే' అని ద్వయశబ్ద మున్నది. ఇటు తత్త్యాగము అపకర్షకముగా నున్నది. చెక్కిళ్లు రెండేగదా, రెండని వేఱే చెప్పనేలయని యాక్షేపింపకూనరు. స్తనములును రెండే, వానినిమాత్రము దోయియని లెక్కింపనేల? నాలుగుచేతులకును వ్యాపారము నాలుగుతావుల, రెండుచెక్కిళ్లను రెండుపాలిండ్లను అని సంఖ్యాసస్ఫూర్తికై యుగద్వయపదోపాదనము. 7. ఎంతోవేడ్క—ఎవరికీవేడ్క? హరికా, చేతులకా? హరికిచెప్పుట సరసముగాని చేతులకుచెప్పుట విరసమే. 8. ఈ వేడ్క యమూలకము, యతికై వేసికొన్న సొంతకవనము. ఇటు ఉప్పునీళ్లలో చేం

ంవంటిదే. 9. అవ్వి యని ఒత్తినందులకు సరిగా ఎవ్వి యనియు నొత్తిన నందము గా నుండును.

ఉ॥ పొక్కిలితమ్మినల్వగడుఁబొల్పెసఁగంబొగడంగఁగన్నులం
[10] జక్కఁగవిప్పెలర్పఁగను జందురుమోములరంగఁగిన్కమై
19 గ్రక్కుననుక్కుమీఱిమధుకైటభులన్సరసంబుగాసిరిన్
మక్కువవాక్పతింగనెడు మాధవుఁడేలెడుమమ్మునిమ్ములన్.

మూ.—నాభీపద్మపసచ్చతుర్ముఖముఖోద్గీతస్తవాకర్ణన
ప్రోన్మీలత్కమనీయలోచనకళాఖేలన్ముఖేన్దుద్యుతిః
సక్రోధమ్మధుకైటభౌ సకరుణస్నేహం సుతా మన్మథేః
సాశ్వాసప్రణయం సరోజవసతిం పశ్యన్హరిః పాతు వః.

1. కడున్ — పా. 2. పొల్పెసఁగన్ — య. 3. గ్రక్కునన్ — ప్రా. ఉక్కుమీఱి.— పా.

5. సరసంబుగా—దీనికి మూ. సకరుణస్నేహమ్. 6. మక్కువ—దీనికి మూ. శ్వాస ప్రణయమ్. ఈ రెండువిశేషణములును మూలములో సాభిప్రాయములుగా న్నవి. ఈ తెనుఁగులోనియీమార్పుచేత చెడినవి. 7. పొగడంగ, ఎలర్పఁగ, అలరం—ఈమూఁడుతుమున్నర్థకములును ఇచటి యీరచనాభంగిచే పరస్పరనిరపేక్షము గా సగపడుచున్నవి. మూలముంబట్టి చూడ, ఇందు ఉత్తరోత్తరమునకు పూర్వ ర్వము కారణముగా నన్వయ మొందవలయును. అట్టి యన్వయమునకు స్ఫోరక మిచట లేదు. 8. చందురుమోము — చంద్రునిముఖము అని యర్థము. చంద్రునివంటిదైన హరిముఖము అని మూలము. డుమంత పూర్వపద కర్మధారయము గ్రామ్యము. వీరితెలుఁగు అర్థముగాను, జయదేవుని సంస్కృతము దీనికి వ్యాఖ్యగాను ఉన్నవి. 'మోముచందురుఁడు' అన్నచో నీదోషములుండవు. 9. కిన్కమై—ఈపదము మోములరుటకు కారణము చెప్పునదివోలె నాభాసిల్లుచున్నది. మూలము నెఱింగినచో, హరి కిన్కమై మధుకైటభులనుగనియెనని, తెలియును. ఆయన్వయమున కడ్డముగా ఇందు 'గ్రక్కుననుక్కుమీఱి' అను పదసముదాయము సంభవించినది. దీనిచేత 10. ఉక్కుమీఱి, సరసముగా, మక్కువ, అను మూఁడును వరుసగా మధుకైటభులను, సిరిని, వాక్పతిని,గనుటకు క్రియావిశేషణములుగా నన్వయించుచున్నవి. ఇట్లుండఁగా, 'గ్రక్కుననుక్కుమీఱి' అను ముక్కకు పద్యముతో సంబంధము లేదనియు, ఇది పద్యమధ్యములో అక్షరములులేక వెలితిగా నుండుట సరిగాపని వేయఁబడినదనియు, క్కప్రాసముకొఱకును చేర్పఁబడిన దనియు,—ఈరహస్యపరంపర మూలముగనక తెలియుటయెట్లు? ఇట్టిపద్యభాగములక్రింద ర్తుగా అచ్చులో ఒకగీఁతయేని ముద్రింపించిన లోకోపకారకముగా నుండును.

యతిప్రాసములు అర్థావిరోధముగా కుదురక మొండికెత్తినప్పుడు పద్యముమాని గద్యముగా చెప్పుకొనిన బాగుగానుండును.

[1] 20 ఆస్యశారదారవిందలాస్య లాలసార్యాలోచన ఖంజనుండును—ఇది శంకరునికి విశేషణము. ఇందు ఆస్యమెవరిదో సందిగ్ధముగా నున్నది. శంకరునిదో ఆర్యదో? నిజాస్య అన్న నిజశబ్దప్రయోగ స్వారస్యముచే శంకరునిదే అనియర్థమగును. మూ.—నిజవదనశారదారవిన్దనర్తితగిరినన్దినీనయనఖఞ్జనస్య.

౨ - పుట.

1. ఊహన్—పా. 2. తలిర్పన్—ప్రా. 3. లీలన్—య.

[9] 29 క॥ నేర్పరులురూపుచేతనె । యేర్పఱుపంగలరుపరుల యింగితమూహన్
వేర్పడనిమొగలిపూవుద । లిర్పన్వలపుననునళుల లీలంబోలన్.

మూ.—ఆకారే ణైవ చతురా స్తర్కయన్తి పరేఙ్గితం
గర్భస్థం కేతకీపుష్ప మామోదే నేవషట్పదాః.

4. ఊహన్ — ఊహనేర్పఱుపంగల రనుట ప్రాసజీత్తు. ఊహింతురనుట సొంపు. కాదనుచో, ఊహనేర్పఱుపంగలుగుటను చేయంగలరు, అనివ్రాసికొనుదీపు! పరులయభిప్రాయమును వారుచెప్పకయే వారియాకారముచేతనే నేర్పరులు ఊహింతురు,అనివివక్షితార్థము 'రూపుచేతనె' అనుటవలనలభించుచున్నది. ఊహ నని శబ్దప్రయోగముచేయ నిచ్చయేని రూపుచేతనే అనుపదమును మానివేయవచ్చును; దీనిం బ్రయోగించుపక్షమున దానినిమానవలయును. రెంటినింబ్రయోగించుట మందము. 5. వలపుననను—దీనికి దేనితోనన్వయము? ఏర్పఱుచుధాతువుతోననుపక్షమున దాని ఈయుపమానవాక్యమందు ఆక్షేపకము లేదు. 6. లీలన్—ఈయతిపూరణము లేకున్న నీయనన్వయ దోషముండదు. 'వలపుననళులువోలె' అనియుండవలయును. లీలన్ అనుపదముచేత పద్యమనన్వితమైనది. 7. తలిర్పన్—ఈ ప్రాసబంధువులన నీయుపమానవాక్యమందు ఏర్పఱుచుధాతువునకు కర్మ లేకపోయినది. 8. సిద్ధమైయున్న పూవుశబ్దమును ఈప్రాసపూరణమునకు బలివేసి, తదర్థమై 'దానిని' [ఆపూవును] అనియధ్యాహరించుకోవలసియున్నది. లేదా, పూవును ద్వితీయార్థప్రథమగా 'ఏర్పఱుచుట'కుం గర్మనుజేసి 'తలిర్చుట'కు కర్తను 'అది' యని అధ్యాహరించుకొనవలయును. ఈ ప్రాసములు వాస్తవముగా ఇట్టి కవులపాలిటికిం బ్రాసములుగానే యున్నవి! 'వేర్పడని మొగలిపూవును వలపున నళులువోలెన్' అనిన ఎంతసుఖముగానుండును! 9. వేర్పడని—'గర్భస్థమ్' అనుటకిది. గర్భస్థమ్మనంగా లోపల దాంగియున్నది, పైకగపడదని యర్థమగుచున్నది. పరాభిప్రాయమును అట్టిదేగదా. కావున

గర్భస్థవిశేషణముచే నిట నుపమానోపమేయములకు చెప్పఁబడిన సాసాదృశ్యము 'వేర్పడని' యనుటచే పాడైనది. 'తలిర్పఁగా' చేర్చినను రాలేదు, 'లీల' ననియూడి నను రాలేదు.

సామాజిక సమాజముచేఁ జెప్పఁబడినవాఁడు నాయొక్క చెలికాఁడు రంగ తరంగుఁ డిక్కడనే యున్నాఁడు :—ఇది సూత్రధారుఁడు తనలోతానే అనుకొనుమాట. రంగమందు మఱియెవ్వరును లేరు. 1. చెప్పఁబడినవాఁడు—ఈమాటచే, ఇంతకుముందు సామాజికులు ఈసూత్రధారునితో రంగతరంగునివిషయము
[2] 31 పల్కియుండిరని యర్థమగుచున్నది. 'ఆజ్ఞాపింపఁబడినవాఁడు' లేక 'బోధింపఁబడినవాఁడు' అనియుండవలయును. ఇటు మూలమునందాత్పర్యమేమన.—సూత్రధారునికి ఇంకను సామాజికులు ఏనాటకముచూడ నపేక్షించిరో తెలియదు. సామాజికులు ఏనాటకముచూడఁ దమకిచ్ఛయో దానిపేరు రంగతరంగునికిఁదెల్పి ఆనాటకమును ఆడించునట్లు సూత్రధారునితో చెప్పుమని వాని కాజ్ఞాపించినారు. ఆయాజ్ఞఁగొని రంగతరంగుఁడు సామాజికులను వీడ్కొని సూత్రధారునికడకు వచ్చుచున్నాఁడు; ఇంకను రాలేదు.—ఇంతియగాని ఈ తెనుఁగులో చెప్పినప్రకారము రంగతరంగుఁడు సూత్రధారునితోఁగూడ రంగమందులేఁడు. కావున, 2. 'ఇక్కడనేయున్నాఁడు' అనుటయును దప్పే. 'ఇటకేవచ్చుచున్నాఁడు' అనవలయును. రంగతరంగుఁడు రంగమున నింకను లేఁడనుటకు నిదర్శనమేమన, ఇప్పటి కింక వానిప్రవేశము చెప్పఁబడలేదు, దీని తర్వాత చెప్పఁబడియున్నది.

ఇటు మూలములో 'ఇక్కడనేయున్నాఁడ'నుటకు 'ఇత ఏవాభివర్తతే' అని యున్నది. వర్తతే అనఁగా ఉన్నాఁడు; అభివర్తతే అనఁగా వచ్చుచున్నాఁడు. అభివర్తతే అనునీపదమున కర్థము తెలియక వీరు పలుమాఱు తప్పుతెనిఁగింపుడు గావించియున్నారు.—౧. ఇదియొకయుదాహరణము. ౨. "దాల్భ్యాయనుఁడితఁడిక్కడనేయున్నాఁడు" [౭-పు.] మూ. దాల్భ్యాయన ఇత ఏవాభివర్తతే; దాల్భ్యాయనుఁ డిచటికే వచ్చుచున్నాఁడని యర్థము. 3. "ఈయొడనిదియె జగన్మోహినియనసెనఁగెడునాహా." [౨౬-పు.] మూ. అహో ఇయమితో నూనం పునరప్యభివర్తతే; ఆహా ఈమె నిశ్చయముగా మఱల నిచటికివచ్చుచున్నది! అని యర్థము. ఇది సంస్కృతవిద్యార్థిమాత్రులకు తెలియువిషయమే. ఈపాటియేని సంస్కృతము తెలియక తెనిఁగించుటమంచిదికాదు. చెప్పఁబడినవాఁడు, ఇక్కడనేయున్నాఁడు, అనురెండు మాటలును ఒకదానికొకటితోడ్పడి మూలవివక్షితార్థమును రూపుమాపినవి. ఈలఘుగద్యమునకుంగూడ మూలముంగనియా యర్థమెఱుంగవలయు!

గీ॥ గుణగణంబులరూపించుఁగుతుక మొదవ
[6] గొప్పవారికిఁబేరెయీక్షోణియందు
37 మొగిసువర్ణంబుశ్రీఖండమునుమఱియును
తెలియరత్నాకరసుధాకరులెటులటుల.

మూ.— గుణగ్రామావిసంవాది నామాపిహి మహాత్మనామ్
యథాసువర్ణశ్రీఖణ్డరత్నాకరసుధాకరాః.

ఇందు, 1. కుతుక మొదవ—య. 2. ఈ క్షోణియందు—య. 3. మొగి—య. 4. మఱియును — పా. 5. తెలియ—ప్రా.— ఇవిపద్యవిషయములు. యతిప్రాసబాధచే, గ్రహింపఁబడినవి. ఇవిలేకున్న పద్యము సులువుగానుండును. వీనికి బదులు అయినవని కానిమ్మని బొట్లుపెట్టిన అందముగానుండును, భాషాసంజీవన మగును, ఆక్షేపముండదు.

మఱియునిందు,6. గుణగణంబుల అనుపదము అవధారణార్థక ఘటితమైన యష్ఠీహిత ప్రథమయో, ద్వితీయయో? పేరె అనునది ద్వితీయార్థక ప్రథమయో అభిహిత ప్రథమయో? వాక్యార్థము, గుణములు పేరిని రూపించుననియో పేరు గుణములను రూపించుననియో? ఈ సందేహములు పూర్వార్థశ్రవణమునం దీఱవు, ఉప్పతిల్లును. ఉత్తరార్థశ్రవణముననను దీఱవు. మూలమున నిట్టిసందేహములుకలుగవు. 'గుణగణములను' అని ద్వితీయాంతముగా చెప్పకొనియున్న నీసందేహములు లేక, పద్యము మూలానుగుణమగును. పంతులవారొకవేళ మూలశ్లోకమునకు 'గుణములే పేరిని రూపించు'నని యర్థముచేసికొనిరేమో? సందేహముచే నిట్లు రచించిరో?

3 - పుట.

గీ॥ బిసమనోజ్ఞభుజాసువికసితాయతనేత్ర
[3] శరదుదీర్ణపూర్ణచంద్రవదన
40 చంద్రికాస్మితయవుసత్కీర్తినవవ్యాప్త
దయితఁబోలెనెనయఁదగఁడెవఁడు.

మూ.— కీర్తిస్ఫురత్కౌశికమనీయభుజా మనిన్ద్ర
చన్ద్రాననాం సితసరోరుహచారునేత్రామ్
జ్యోత్స్నాచ్ఛస్మితా ముపహృతాం దయితా మివ స్వాం
లబ్ధ్వా న కః పున రుపక్రమ మాతనోతి.

ఇందు, 1. సు, 2. సత్, అనురెండుపదములు యతిపూరణములు. ప్రాయికముగా వీరిపద్యములం దీరెండుపదములును పాదపూరణార్థము జీవగఱ్ఱలుగా

జికులకు అనుపదముతర్వాత ఎడముకూడ పెట్టియున్నారు. సంస్కృతములో నిట్టి చోట్ల సామాజికులే వినువారేని ద్వితీయయేని చతుర్థియేనియుండును. సాహసించినమాత్రానఁ దెలియఁబోదు. వీరు షష్ఠ్యర్థము నెఱుంగలేక కడుంబాడు చేసినవాక్యము మఱియొకటి గలదు. [౨౮.—పు.]

క॥ నరులకు సురాసురులకుం । గరుడోరగసిద్ధసాధ్యగంధర్వులకున్
గరమరిదియైనచిత్రము । వెరవారఁగఁజూపుమెవనివృత్తమొనరెడున్.

ఇందు నరులలో సురాసురులలో గరు...ర్వులలో అని యర్థముగా మూలమున నిర్ధారణషష్ఠి ప్రయోగింపఁబడియున్నది. నిర్ధారణార్థాపరిజ్ఞానముచే పద్యమిట్లు పాడయినది. 'సామాజికులయొక్క సందేశరహస్యము' అని దిద్దవలయును. ప్రకరణవిరోధముంగూడ నెఱుంగలేమి వింతగానున్నది.

ఈపద్యము పనికిరాదు.

సీ॥ ప్రతియంకమునగు • సర్వరసాంకురంబు • న్నతముసుమావళి • రాజితంబు మఱియు
[4] • ఘర్మేతరాంశునికై • పడివక్రతనైన • నాహ్లాదదమైప్రక • టసు
4.5 సందర్భమైలో • కసన్నుతంబై నాట్య • ముఖ్యప్రబంధమస్ప్రిఖ్యనుగని
వేదరాశికినెల్ల వేదాంతశాస్త్రిమట్లవును సాహిత్యవిద్యకునెదిదుద

తే॥ సమరునమరాద్రివలె సువర్ణాప్తిరుచిర • పదకలననప్సరోంగసభంగియత్న •
ప్రకటనసీయార్థమునసిధిపగిదిఁగవికృ • తంబుశ్రుతిరంజనంబు గేయంబుసుకృ •

ఈపద్యమును వినుటవలననే సూత్రధారుఁడు సామాజికదిదృక్షితము 'ప్రసన్నరాఘవనాటకము' అనియు, అది 'రత్నకృతి' అనియు నెఱింగినట్లు దీనితర్వా గద్యములో నున్నది. వాఁడు పదేనేసియక్షరములు గల పదిబంతులుగా నీపద్యమును పరామర్శించుకొన్నట్లును ఆగద్యములోనే ఉన్నది. ఎత్తుగీతిపాదములలో తుదియక్షరములం బఠించుకొని రత్నకృతిపదమును గ్రహించినట్లును అందే ఉన్నది. పద్యము విని అట్టిగ్రంథమేదో తెలియకతడఁబడుచున్న సూత్రధారుఁడు పదేనేసియక్షరములుగానే ఏలవిభజించుకొనును? పదేనిగాఁగాని ఆఱేసిగాఁగాని ఏలవిభజించుకొనఁడు? అట్టి విభజనబుద్ధి వీనికెట్లుకలుగును? వీఁడేమిశ్రుతధరుఁడా? పద్యమేమేని చిన్న... మఱియు మధ్యలో సీసచతుర్థపాదమున ఈవిభజనవలనఁ బ్రయోజనము లేదు. కావున నిట సర్వమసంభవదోషగ్రస్తమైయున్నది. మూలమున నెట్లన—

ప్రత్యఙ్కమఙ్కురిత • సర్వరసానుభావ
స్నద్యోల్లసత్కుసుమ • రాజివిరాజిబన్ధమ్

ము ఇత్తెన్గుప్రబంధమును చెప్పఁజాలదు. చ్విప్రత్యయ మహిమచేత దీనిమూలమైన సంస్కృతనాటకమునే చెప్పను; దానినిగదా ఆంధ్రీకరించినారు.

ఇట్టిది యీకవిచేతనే చెప్పఁబడియెను — ఈవాక్యమునకుముందు రత్నశర్మ
50 యొక్క ప్రస్తావము కలదేగాని జయదేవునిపేరు లేదు, కాన నీతెనుఁగు వాక్యమున ఈకవియనఁగా రత్నకవియని యర్థమేర్పడుచున్నది. తదనుసారముగా ఈవాక్యముచే నవతారింపఁబడిన 'చదువువెలంది' యనుపద్యము రత్నకవికల్పిత మని యేర్పడుచున్నది. ఈపద్యము ఈతెనుఁగుకవి తెనిఁగించినదేగాని కల్పించినదిగాదు. ఇటతెనుఁగుకవిగారు తమ్మునే యీపద్యమునకు మూలకవిగాఁ జెప్పకొనుటచేత ఈపద్యమందలి కవనమహిమానువర్ణనమును తమకవనమునకే యపహరించినారు. జిత్తే యిది. అపజిహీర్ష లేనిచో 'ఈకవిచేతనే' యనక 'మూలకారునిచేతనే' అని వ్రాసియుందురు.

౪ - పుట.

చ॥ చదువువెలందిత్వచ్చరణసారసరేణుకణంబుచిత్తభూ
[21] మిఁదనరుసజ్జనాళికెదిమించునదే కవితాలతాకృతిన్
71 బొదలెడునీచెవింజివురుపొందికసూక్తిచలచ్ఛిరస్స్వర
ద్గదితసుపారిజాతకలికాస్తబకంబునఁబాదమూనెడిన్.

1. పొదలెడు—ప్రా. 2. గదిత—ప్రా. 3. సు—పా. జీవగఱ్ఱ.

ఊరక 'పారిజాత' యనక 'సుపారిజాత' యనుట రోఁతగానున్నది. మఱియు 'గదిత' యన్నం జాలక ఇంకను సు అనవలయునా? నీచెవియనుటకు మాఱుగా ప్రాసబాధకై పొదలెడు నీచెవి యనుటకన్న నసహ్యముండునా?

అన్వయంపుసొంపు—4. మించు—విశేషణమా, క్రియాపదమా? 5. పొదలెడు—విశేషణమా, క్రియాపదమా? 6. వాణీచిత్తభూమియందుం దనరెడుసజ్జనులకు ఏరేణుకణము మించునో ఆరేణుకణము అని యన్వయమా? లేక, సజ్జనాళీచిత్తభూమియందు ఏరేణుకణము తనరునో ఆరేణుకణము మించు ననియన్వయమా? 7. చివురుపొందిక సూక్తి — చివురువలె సూక్తియని యర్థము తొలిఁదొలి స్ఫురించుచున్నది. ఆపక్షమందు ఈయౌపమ్య కథనముచేత తత్పూర్వార్ధబద్ధమైయున్న యభేదకథనంపుస్వారస్యము పాడగును. 8. చివురు, పొందికన్, సూక్తి, అని మూఁడు వ్యస్తపదములా? లేక పొందికసూక్తి యని సమస్తముగాను చివురు అని వ్యస్తముగాను అన్వయమా? ఈరెండుపక్షములను చివురు అనెడిసూక్తి యని శఆవ్యస్తప్రయోగమున కభిప్రాయమా? సూక్తిచలత్ - అని సమస్తమా స్తబకాం

సూక్తి లోకసామాన్యమయిన చిగురువలె నీచెవిని నిలుచును అని సామాన్యార్థము లభించుచున్నది.— మూ. యత్కిసలయం సూక్తాపదేశమ్, అనియున్నది. సూక్త మను పేరుగలదైన యేకవితాలతాప్రవాళము, అనియర్థము. ఈయర్థమున సూక్తము నకును ప్రవాళమునకును అభేదము చెప్పఁబడినది. యచ్ఛబ్దమహిమచేత సూక్తము ఆకవితదియే, కిసలయము ఆ(కవితా) లతదియే, యని స్పష్టముగానున్నది. పంతుల వారి తెనుఁగులో 15. యచ్ఛబ్దార్థత్యాగముచేతను, రూపకమును 16. ఉపమగా మార్చి కొన్నందుచేతను, ఆసంబంధమును ఆయభేదమును నశించి తెనుంగుపద్యమునకును సంస్కృతమూలమునకును సామ్యమే నష్టమయినది. చలచ్ఛిరస్సరత్పారిజాత కలికాస్తబకంబునన్—అని చెవికి విశేషణము. ఇందు 17. చలచ్ఛిరః అనఁగా కదలు చున్న తల. మూ. శిరఃకమ్ప. శిరఃకంప మనుటచే శారద ఈసూక్తమున కా హ్లాదించి తలయూఁచినదని యర్థమగుచున్నది. దానికిబదులుగా పద్యములో చలచ్ఛిరః అనుటచే వాణికి వాతవ్యాధిచేత తలవిసరు ఆరంభమైనదని యర్థమగుచున్నది; లేదా, ఈకవిసూక్తమువలన వాణికి ఓకిలింత పుట్టి ఆమెతల ఆమెకు స్వాధీనపడక వికారావేగముచే కదలందొడంగెనని స్వారస్యముప్పతిల్లుచున్నది. చలచ్ఛిరమందు వాణిపెత్తనములేదు, తలదే పెత్తనము, లేక వ్యాధిదే, లేక జుగుప్సదే. శిరఃకంపమందు ఆమెయొక్క ఆహ్లాదమును బుద్ధిపూర్వకముగా తలయూఁచుటయుం గలవు. 18. శిర స్సరత్ — ఈతెన్గులో పారిజాత కలికాగుచ్ఛము వాణితలనుండి జాఱునట్లు చె ప్పఁబడియున్నది. ఈపెద్దసమాసము తలనుండి జాఱుచున్న పారిజాతకలికా గుచ్ఛ ముగలదైన అని చెవికి విశేషణ మగుటచేత, ఆగుచ్ఛము తలనుండి జాఱి చెవియందు వచ్చినిలిచినదనియర్థము స్ఫుటమైయున్నది. ఈవర్ణనమూలవిరుద్ధము, మూలములో చెవినుండియే గుచ్ఛము రాలిపోయినట్లు చెప్పఁబడియున్నది.—19. సరత్—జాఱు చున్న అని వర్తమానార్థకముగా నిందున్నది. మూలములో భ్రంశిత అని భూతార్థక ముగానున్నది, జార్చివేయఁబడిన యనియర్థము. ఇట భ్రష్ట అనక భ్రంశిత అనుట యందు జయదేవహృదయమేమన, శారద ఈసూక్తమునే ఆగుచ్ఛమునకంటె ను త్కృష్టమునుగా గణించినదై [ఆయవతంసముకన్న ఈయవతంసమునకు లోభపడి] దీనికి తనకర్ణమందు చోటుచేయుటకై [దీనితోఁగూడ నది యుండ ననర్హమనియు] దానిని తానే జార్చివేసినది అని సూక్తోత్కర్షవర్ణనము.—ఈపెద్దసమాసములోని భేదసంగ్రహము:—చెవినుండి స్తబకము రాలెననుటకు చెవిలోనేవచ్చి నిలిచినదనుట, శారద తలయూఁచె ననుటకుబదులు తలయే ఆడెననుట, ణిజంతక్తాంతముగా భ్రంశిత అన్నందులకుమాఱు అణిజంతశత్రంతముగా సరత్తనుట,—లోనగునవి. [మూ. 20. కంపమనఁగా కదలుటగాదు, కదల్చుట యర్థము. అందులకు భ్రంశిత యని ణిచ్కారణ

కవనకౌశలదౌర్గత్యము. 5. పుట్టపుట్టువౌ — ఔ — తలవిసరు, దీనికి రూపాంతరము పుట్టపుట్టువే. సత్సుధా, సత్కావి,—ఇందలిసత్తులు పాదపూరణంపు జీవగఱ్ఱలు. పూర్వపద్యమందలి గదితసువంటివి. సత్సుధ దుస్సుధ యని రెండు తెగలసుధల నెఱుంగము. కావ్యములలో దుష్కావ్యములును గలవుగాన, హితము వినమతిగలదేని, యిట్టికావ్యములు గావని తెలియుటకుఁగాను సత్కావ్యసుధా యన్నను కొంచెము మేలుగానుండును. 6. శ్రీరఘురాము—మూ. భాస్వద్వంశవతంసుఁడు. 7. ఆడఁగ — రంగమందు ప్రవేశించుతఱి నని మూలాభిప్రాయము. 8. తోడఁ—దీనికి, 'కూడ' నని యర్థముచెప్పక, 'వెంటనే' అనియర్థము చెప్పినను ప్రయోజనము లేదు, ఆడఁగ ననుపదము పాడుచేసినది. 9. వాద్యారవము కలుగునట్టిఁడు పుట్టపుట్టువు— మూలములో వాల్మీకియే వాదిత్రప్రథమధ్వనిగా చెప్పఁబడియున్నాఁడుగాని అట్టిధ్వనికలవాఁడుగాఁగాదు. వల్మీకము వాదిత్రముగాను అందుఁబుట్టినముని అందుఁ బుట్టినధ్వనిగాను జయదేవకవి చమత్కరించినాఁడు. 10. ఆచమత్కారణమున కనుగుణముగా [వల్మీకజముని యనఁగా నేమనుకొన్నారో వాదిత్రధ్వని సుమా అని చెప్పినట్లుగా] ముని ధ్వని అని సదృశశ్రుతిగా వినఁబడు శబ్దములను ప్రయోగించినాఁడు. ఆసౌభాగ్యము మన తెనుఁగులో రవము పుట్టువు అని విసదృశశ్రుతిగల శబ్దములం బ్రయోగించినందున పాడయినది. 11. వారక—మూ. ఆకల్పమ్; కల్పాంతమువఱకు ననియర్థము. కల్పాంత మవధిగా చెప్పినవిశేష మేమన, అటుతర్వాత ఈసృష్టియు ఈరామాయణమును ఉండవు. "కల్పాన్తం చ కృతం సమస్త మదశగ్రీవోపసర్గం జగత్" అను మురారివచనమునుం బరికింపుఁడు; వారక యనుట చప్పగానున్నది. 12. మఱియు, ఈయవ్యయము, కల్గిన, త్రావి, ఇడుఁ అను మూఁడుక్రియలలో దేనికి విశేషణము? సామీప్యముచే, కల్గుటకే విశేషణమేని మూలవిరుద్ధము. మూలములో ఆకల్పమ్మనుశబ్దము వర్షణక్రియకు విశేషణముగా నున్నది. వారకయనునది ఈ మూఁటికిని విశేషణమనుట సరియైన యన్వయసరణిగాదు. 13. మోము—మూ. వదన; వదనశబ్దమునకు నోరుకూడ నర్థముగాన, మూలములో, నోటఁజెప్పిన రామాయణకవనమర్థ మగుచున్నది. వదనేందుమండలమనఁగా, నోరనెడు చంద్రమండలమనియు, మోమనెడు చంద్రమండలమనియు, నర్థద్వయము లభించుచున్నది; తెన్గులో మోమన్నందున నోరు అను ముఖ్యార్థమే నష్టమైనది. 14. కల్గిన—దీనికిని మూలమందుంబోలె గళత్ అనుటకునుంగలభేదము సహృదయు లరయుఁడు. 15. వారిధిఁద్రావి—మూ. కిమపి; మూలములో వారిధిలో ఏమోరవంత త్రాగి యనియున్నది. ఇట వారిధినే త్రాగినట్లున్నది. వారిధియందు అని సప్తమ్యర్థము చేసికోవలయునని నిర్ణాయకమేమి? మూలమే.

మును పాడుచేసినారు. ఈపాటిసంస్కృతము తెలియదు, కవితాతత్త్వవిత్ప్రకాండములమని ప్రగల్భింతురు, ఆజ్ఞులను నమ్ముదురు, గతానుగతికులు ఘోషింతురు.

తే॥ తమ్ము నెమ్మది నెందు నుందను పుఁదమకు
[3] 97 సుగుణమణిగణమిడుఁగాన సుకవులెల్ల
నల్ల శ్రీరామభద్రు నెయ్యభినుతింత్రు
వారికదిదోషమే గుణపరమగుఁగద.

మూ.— స్వసూక్తీనాం పాత్రం రఘుతిలక మేకం కలయతాం
కవీనాం కో దోష స్స తు గుణగణానా మవగుణః
య దేతై ని శ్శేషై రపరగుణలుబ్ధై రివ జగ
త్యసా వేక శ్చక్రే సతతసుఖసంవాసవసతిః.

రాము నొకని నేగూర్చి పలువురు కవులు గ్రంథములువ్రాయుట వారిదోషము గాదు; ఆదోషము గుణములదే. ఏలయనఁగా, ఈగుణములెల్ల నతని యపరగుణముల యందు లుబ్ధములోయనునట్లు ఆయొకనియందే సుఖముగా నివసించియున్నవి, అని తాత్పర్యచ్ఛాయ. ఈ సరసార్థమునకును తెనుంగుపద్యమునకును ఏమేని సంబంధము కలదా! ఈ యాంధ్రీకరణము—శాన్తాకారమ్=బాగాశాంతాకారమైనటువంటిన్ని, భుజగశయనమ్ = శానాశానా భుజాలుగలిగినటువంటిన్ని, పద్మనాభమ్ = పెద్దనాభి గలిగినటువంటిన్ని, సురేశమ్=సులోచనాలజోడు వేసుకొనేటటువంటిన్ని [ముసలాడు పురాణపురుషుడన్నమాట], విశ్వాకారమ్=వీశకారంతినేటటువంటిన్ని [తినమనుయెవడుతింటాడో చూస్తామ్], గగనసదృశమ్=గగ్గన్నతో సమానమైనటువంటిన్ని [గగన్న వీశకారంతింటాడు], మేఘవర్ణమ్=మేకవన్నె గలిగినటువంటిన్ని [బ్రాంహాలు యగ్గంలో చంపుతారే ఆమేక, అంటే నల్లమేక], శుభాఙ్గమ్ = శుభాంగమైనటువంటిన్ని, లక్ష్మీకాన్తమ్ = కాంతలచ్చికూడా కలిగినటువంటిన్ని [పేదవాడుగాడు], కమలనయనమ్=కమ్మలకు నాయనయినటువంటిన్ని, యోగిహృద్ధ్యానగమ్యమ్= అది రహస్యం చెప్పరాదు, భవభయహరమ్=బావబాయిలను [స్తనములను] హరించినటువంటిన్ని, సర్వలోకైకనాదమ్= సర్వంలోకైకై నాదం చేసేటటువంటిన్ని [అదే నాదబ్రంహం], వన్దేవిష్ణుమ్=విష్ణుదేవుడిపేరుచెప్పి పౌరాణికుడికి వందస్వయంపాకాలు ఇయ్యవలిశింది.—అని కొండంభట్టు కమ్మవారికి పురాణము చెప్పినట్లున్నది.— 1. ఏతైర్నిశ్శేషైః[=ఈసకలగుణములచేతను,] దీనికి ఈ కవులందఱిచేతను అనియు, 2. సతుగుణగణానామవగుణః[=అది గుణగణములదోషమే,] దీనికి గుణపరమగుఁగద అనియు, 3. అపరగుణలుబ్ధైః[=రాముని యితర (తమకన్న పరము లేని అత్యుత్కృష్ట

మూ.—కర్ణే నిధాయ చ విధాయ చ కణ్ఠపీఠే
ధృత్వా చ మూర్ధని నతే హృదయే చ కృత్వా
చోరప్రచారచకితేన చిరం మయైష
త్వత్సూక్తిమౌక్తికగణః పరిరక్షణీయః.

నీసూక్తిముక్తాగణమును నేను దొంగలకు వెఱచినవాఁడనై, చెవినుంచుకొని కంఠమందిడుకొని, వంగినతలయందు ధరించి, హృదయమందుంచుకొని, కాపాడుకొని యెదను.—అనియర్థము. దొంగలు=ఈసూక్తులను తమవిగా తమగ్రంథములలో వేసి ప్రకటించుకొనువారు. చెవినుంచుకొని మొదలయిన యీవిశిష్టక్త్వార్థములకు వరుసగా, విని, వల్లించి, గౌరవించి, జ్ఞప్తియుంచుకొని, అని సూక్తిపరార్థము, పూర్ణముగానేర్చుకొనుట తాత్పర్యము. వానికే వరుసగా, కర్ణాభరణముగాను, కంఠిగాను, చూడామణిగాను, హారముగాను, అనిముక్తామణిపరమైన యర్థము, పలువిధముల నీసూక్తి తన కలంకారముగా నుండునని తాత్పర్యము. ఈ యుభయపరత్వము గాక సామాన్యముగా, మిక్కిలిజాగ్రత్తతో దొంగలకు చేపడనియట్లుగా దాఁచుకొనియెదను, అని అర్థము.

వంతువారికి శ్లోకార్థము తెలియమికి 1. మెడ 2. చేతఁదాల్చి, అనునీరెండునిదర్శనములు గలవు. కంఠమను మూలపదమునకు వీరుమెడయన్నారు. కంఠశబ్దమునకు వెలుపలిప్రదేశము లోపలిప్రదేశము రెండును అర్థములు. వెలుపలిది ముక్తాధారణమునకును, లోపలిది సూక్త్యుచ్చారణమునకును సంబంధించినవి. మెడయనఁగా ఆవెలుపలిప్రదేశము మాత్రమేగావున, ఆపదము ముక్తాధారణమునకు సంబంధపడునే గాని సూక్త్యుచ్చారణమునకు సంబంధపడదు. చేతఁదాల్చి—ఇది అమూలకము, మూర్ధకు విశేషణమైన నతే పదమునకు బదులు కరే యని తెనుఁగుముద్రణమునంబడినది. ఇది ముక్తాపరముగా నన్వయించుచున్నది. దీనికి సూక్తిపరాన్వయమున నర్థమేమి? హస్తాభినయమర్థమా? గ్రంథమెల్ల హస్తమాత్రమున నభినేతవ్యమగునా? చతుర్విధాభినయములో నేకదేశమయిన యాంగికాభినయములో నిది యేకదేశమేగదా. ఇది రక్షణార్థముపయోగించునేని కడముయభినయము లుపయోగపడవా? వానికన్న నిది యెక్కుడు ఉపయోగపడునా? వానినెల్లమాని దీనిని మాత్రము చెప్పుట యెట్టిది? ఉపలక్షణార్థమేని, కంఠమున ధరించి యను వాచికాభినయమే ప్రధాన ముక్త ముపలక్షణమగును, ఇదియునేల? ఇది సూక్తి రక్షణోపయోగిగాదు, తాటియాకుపుస్తకమునకేని రక్షణోపయోగియే. ఇది లేకయే విద్యార్థులెల్ల రక్షించుకొనుచున్నారు, పండితులును రక్షించుకొనుచున్నారు.—కావున ఈవాక్యావయవము జయదేవకవి

ఈయాంధ్రప్రసన్నరాఘవములోనే ౭-వ పుటలో “వక్రములంగవీశ్వరుల” అనుపద్యమును దానిమూలమునుం గనుఁడు. ఈ పంతులవారు ఆపద్యమును తన్మూల స్వారస్య జ్ఞానపూర్వకముగా రచించి యుండినచో ఇట నీవక్రశబ్దమును త్యజించి యుండరు. 9. అనువుగ—మూలము సానన్దమ్ [ఆనందముతో] అని. అనువనఁగా, ఉపాయము, విధము, అవకాశము, యుక్తము, అని నిఘంటువులో అర్థములు వ్రాయఁబడియున్నవి; ఆనందమనునర్థము లేదు. ప్రాసబాధచేత నయినమార్పుగదా. ఈ మార్పువలనిబాధ యేమనఁగా శృంగారము పోయి వైద్యము సంభవించినది; అందులకు అన్నులచన్నులు తోడ్పడినవి. 10. అన్నుల 11. చన్నులకా—మూ. కాన్తా కుచమణ్డలే. [కాంతయనఁగాప్రియ, ఎవఁడు ఏచెలువను కామించినాఁడో వాని కది కాంత]. ఇటకాంతకుమాఱు అన్నను పెట్టుట నీరసము, పైగా,చన్నులు.—ఈపద్యము వైద్యశాస్త్రోచితముగానున్నది.—

సీ॥ మదిరాక్షిచెవులుతొమ్మిదిలెక్కలనరాదు । ముద్దియకనులుతమ్ములనరాదు
శుకవాణిబుగ్గలుముకురంబులనరాదు । చెలిపండ్లుమల్లెమొగ్గలనరాదు
గజయానచండ్లుబంగరుగిండులనరాదు । సతిబొడ్డునుడినిమెచ్చదనరాదు
సరసిజాననముడ్డిసైకతంబనరాదు । హరిమధ్యకాళ్లిగుళ్లనఁగరాదు

తే॥ క్రమతవీనికివీనులుకన్నుదోయి
చెక్కులునుబలువరుసయునిక్కఁజన్నుఁ
గవయుఁబొక్కిలిపిఱుఁదుచొక్కంపుటడుగు
లనుచుమునువాడిరవియచేకొనఁగవలయు.

అనియిప్పకవి చెప్పుహితమును వినఁదగును. మూలకవి లీలావతీయని లీలచెప్పినందులకుసరిగా ఈదృష్టాంతమందు ఆనందమును చెప్పినాఁడు. పంతులవారు ‘అరయ’ చెప్పినందులకు సరిగా ‘ఎన్నను’ చెప్పినారు. చన్నులని కొందఱు కవులుప్రయోగించి యుందురని పంతులవారు ప్రయోగములు చూపుదురుగాఁబోలు. కలవుగాని స్థలవైభవముచే వానికి గ్రాహ్యతయుంగలుగునుండె. అనువుగగోళులుంచఁబడునన్నులచన్నుల నేరిచేత— ఇది యెట్లుధ్వనించుచున్నదనఁగా—మెడికల్కాలేజిలోని యేవిద్యార్థులు స్తనస్వరూపపరిశోధార్థమై చచ్చినయన్నుశవముల స్తనములను కోసితెచ్చి యొకబల్లమీఁద నుంచుకొని వానిని ఉపాయముగా తమగోళ్లతో పట్టి పరిశోధింతురో ఆవిద్యార్థులు—. అని. ఇందలి పదమహిమ యట్టిది. 12. అన్నులయని యీబహువచనమేల? మూలకారుఁడు కుచమణ్డలేయని ఏకవచనముననే తృప్తిపొందెనుగదా వీరికిమాత్రము 13. చన్నుల నని యీబహువచనమేల? అన్నుచనుంగవ అన్ననింతరుచిగా నుండదు గాఁ

షింపనిచో సాధువు లెట్లగుదురు? పాదపూరణ ప్రభావమున నిట్టిదే! మాకందము స్వాలవాలమునఁ గల్గియుఁ దా మకరందపూరముక్ — ఈపాదమును పంతులవారు యథావిధిగా పాదుచేసినారు. ఈమకరందపూరము ఈమాకందముదో, లేక లాతిచెట్టు నుండి కొట్టుకొనివచ్చి దీని యాలవాలమునం జేరినదా? ఇందు పంతులవారు జాగరూకతతో ఆలవాలము దీనిదని చెప్పినారేగాని మకరందము దీనిదని చెప్పినవారుగారు. **10**. నిజ, **11**. ఘనమకరన్ద, **12**. స్యన్దపూర్ణాలవాలః అని మూ. వీరు ఘనమకరన్దస్యన్దపూర్ణనిజాలవాలః అని యున్నచో నెట్లు తెనిఁగింపవలయునో అట్లు తెనిఁగించినారు. మూలకారుఁడు మకరందమునకు వేసిన నిజవిశేషణమును వీరు ఆలవాలమునకు వేసినందులకు మనము ఎట్లయిన మాతామాకువచ్చినదని సంతోషింపవలసియున్నది. వీరేల యిట్లుమార్పవలయు? మూలకార వివక్షితార్థ మెఱుఁగకయా, అది వచ్చునట్లు తెనుంగుపద్యము కుదురకయా?—స్వారస్యముకొఱకు మార్చిరిగావలయు! **13**.కల్గియు— ఈ మాటవలన ఆలవాలమందు మకరందపూరముండుట రసాలమునకు ఆవశ్యకమని యూహనీయ మగుచున్నది. ఆలవాలమందు తడియుండుటగాదు వివక్షితము, ఆచెట్టునకు మకరందసమృద్ధి యుండుట వివక్షితము. ఆయర్థము చక్కఁగా తెలియునట్లు— నిజ=తనదైన, ఘన=దట్టంపు, మకరన్దస్యన్ద=తేనెయోడికలచే, పూర్ణ=నిండిన, ఆలవాలః=పాదుగలదైన [రసాలము],అని మూలకారుఁడు, ఘన, స్యన్ద, పూర్ణశబ్దములచే పరమ స్వారస్యమును సూచించినాఁడు. సమృద్ధిగాక అలవాలపూరణమే వివక్షిత మనుపక్షమున, ఆలవాలము నిండినపిమ్మట అందు నీళ్లకుచో టెక్కడిది? కావున నట్టివాద మసంగతము. పంతులవారి తెనుఁగులో మకరందము ఆచెట్టుదే అని సూచితము కానందున, **14**. తత్సమృద్ధి వివక్షితమని తెలియఁబడదు. ఇది పాదము పాడైన క్రమము. మఱి ఆలవాలప్రస్తావమేలయనిన, పాదపమునకు పాదములు అనఁగా వేళ్లమనకు నాలుకయెట్టిదో అట్టివి గనుకను,పాదు మనకు నోరెట్టిదో అట్టిది గనుకను, చెట్టు తన మకరందమును తనపాదులో వేళ్లచేత రుచిచూచి పానము నేయవలయును కావునను, ఆలవాలపూర్ణత చెప్పఁబడినది. అందువలన, రసాలవృక్షము తన తేనెను తాను సమృద్ధిగా పానముచేసి యానందించుచుండియు, అని యభిప్రాయము.

ఈ 1. సభికులు—సభికులనఁగా జూదమాడించువారు. 'సభికా ద్యూత
[1] కారకాః' అమరము. అట్టివాని కొకనికి మదరాసులో ఈ నడుమ
135 250 రూపాయలు దండము విధింపఁబడినది. అమరుఁడు ఈయర్థము
నీశబ్దమునకు కంఠోక్తముగాఁ జెప్పుటయు, "సభాసదస్సభాస్తారా స్సభ్యాస్సామాజికాశ్చతే" అని సభ్యపర్యాయములలో ఈశబ్దమును చెప్పమియుఁ జూడ, దీని కిది రూఢ్యర్థమనియు సభ్యార్థమందు దీనిని వ్యవహరించుట లేదనియు

నెఱుకపడుచున్నది. యోగముచే సభ్యార్థమును సాధింతుమని వాదించుపక్షమున—“సభాద్యూతమాత్రేయత్వే నాస్యాస్తీతి ప్రీత్యాదిత్వాత్ ఠక్” అని రామాశ్రమీయము. ‘రూఢిర్యోగమపహరతి’ అనఁగా రూఢి యోగమును హరించునను న్యాయమేమిచేయను! మత్వర్థముచే సభ్యార్థమును సాధించుట క్లిష్టము. ఇన్నిటికిని విరుద్ధముగా నెట్లో యోగాశ్రయముచే ‘ఓ సభికులారా’ యని సభ్యులను సంబోధించుట, [విధవశబ్దమును గొప్పప్రభువని యర్థముగా దూలాదిగణమందు చేర్చనెంచి] వారినే ‘ఓ విధవలారా’ యనుటవలె నున్నది. సభ్యులు సభికశబ్దతత్త్వము నెఱింగినచో ఈ రెండుసంబోధనలచేతను సంబోధ్యులకు తుల్యఫలమే గలుగును.

చ॥ పరఁగ సుధాబ్ధియందమృతపానముఁ బల్కుచు సేయుచుండ యో
[6] ధరుఁడుడురూపములెల్లఁ దివ్వ ధారుణిపై వడగండ్లనవ్వియుం
141 గరకలుగాఁ దెలుపు నెమ్మగలముసంగతిసంబులై యటే
నిరతసుధాబ్ధిరంబులు మనీషులసత్త్వవిభూషలొప్పెడున్.

1. ధారుణిపై—మూ. స్ఫటికావనౌ [స్ఫటికభూమియందు]. ఈపద్యము నకు మూలార్థము లేదు. ఇది పూర్వోక్తశ్లోకాంతరాకారపురాణకథ ననుసరించియున్నది. 2. ఇందు మేఘుఁడు సుధాబ్ధిలో అమృతముద్రావి భూమిమీఁద వడగండ్లుగురియు నని చెప్పఁబడియున్నది. ఇదియసంభవము. ఈపద్యమునందలి యర్థము—అమావాస్యా రాత్రియందు పూర్ణచంద్రుఁడు వెలుంగును, ఆ పూర్ణచంద్రునివలె శారదాదేవిముఖము తేజరిల్లుచున్నది యనినట్లుంచినగతిగా నున్నది. ఈపాదుపద్యమునకు మూలభూతమైన యమృతంపుబుగ్గ యిదిగో:—

మూ.— అమృతజలధేః పాయంపాయం పయాంసి పయోధరః
కిరతి కరకాస్తారాకారా యది స్ఫటికావనౌ
తదిహ తులనామానీయన్తే ఘనం కఠినాః పునః
సతతమమృతస్యన్దోద్గారా గిరః ప్రతిభావతామ్.

పయోధరుఁడు అమృతసముద్రమునందు పయస్సులను గ్రోలిగ్రోలి నక్షత్రాకారములనుగా వడగండ్లను స్ఫటికభూమిపై రాల్చినచో, అప్పుడుగదా, కోలుపు ఘనము నేర్చు కఠినములును సదా అమృతరసనిష్యందంబులు నగు ప్రతిభావంతుల సూక్తులకు సామ్యము గలుగును.—అని యభిప్రాయము. ఇఁక పంతులవారి తెలుఁగు.—

3. అటే—ఎటువి? మేఘుఁడు వడగండ్లం బడిపినరీతిగానా? లేక వడగండ్లమ తారతిసములైన రీతిగానా? లేక, ఈరెండురీతులనునా? 4. ఘనంకఠినాః, సతతము

మృతస్యన్దోద్గారాః—అను నీగిర్విశేషణములను రెంటిని పంతులవారు పక్షపాతము లేకుండ వడగండ్లకొకటియు ఉక్తులకొకటియుఁ బంచిపెట్టినారు. రెంటిని ఉక్తులకే విశేషణములం జేసినచో, రెండును సాధారణములై కరకలకును ఉక్తులకును రెంటికిని అన్వయించును. రెంటిని కరకలకే విశేషణములనుగాఁ జేసినను అఫలమేగలుగును. ఈ దాయవిభాగముచేత ఆయాపద్యంబు చెడినది. 5 మూ. స్ఫటికావనా—ఉత్త భూమిని చెప్పక స్ఫాటికమును చెప్పుటలో ఇది స్వారస్యము—నిర్మల సత్త్వమందు గ్రహీతృగ్రహణగ్రాహ్యముల విషయమున తత్స్థతదంజనతాసమాపత్తిగావున తాదృశ సమాపత్తిలబ్ధికై యిట స్ఫటికావనా అనుట; దానిచే నిర్మలసత్త్వము సూచింపఁబడినది. అదియీతెన్గున 'ధారుణిన్' అని పట్టి చేయఁబడినది. 6. అశ్లే, తారాస్తారాః—అని తారశబ్దప్రయోగముచే ప్రతిభావంతుల గిరములు భవసాగరతారకములని సూచితమైనది. ఏకైకరసనీయత్వ స్ఫుటగ్రహణీయత్వాదికములు ఉపమాప్రయోజనములు. భవతారణములనునర్థము ఉడురూపములనుటచే [తార అనక ఉడు అనుటచే] ధ్వనితమైనది. ఇవ్విధమున నీపద్యము నరునికి బదులు వెఱిబొమ్మయైనది. ఇట్లు మార్చికొనిన కొంచెమేని మూలమువలె నుండును:—

పరఁగసుధాబ్ధియందమృతపానము మాటికిఁ జేయుచుం బయో
ధరుఁ డుడురూపముల్ స్ఫటికధారుణిపై వడగండ్లు రాల్చినన్
బొరనెడినంత సాటిపదమున్ క్షణమాత్రకఠోరభావముల్
నిరతసుధోద్గిరంబులు మనీషులప్రాతిభసూక్తులొప్పగాన్.

1. ధీర - య. 2. వరిష్ఠ - య. 3. అరయంగ - ప్రా. 4. సు - ప్రా.

ఉ॥ దేనికిఁ జోరుఁడౌఁ దుఱుము ధీరమయూరుఁడు గర్ణపూరమౌ
[9] లేనగవౌను భానుఁడు వరిష్ఠవిలాసము గాళిదాసుఁడౌ
150 నౌనరయంగ హర్షుఁడు సుహర్షము బాణుఁడు పంచబాణుఁడౌ
నేనికిఁ గాదదిక్కవిత యిష్టవధూమణికౌతుకాప్తికిన్.

5. ఇందు చతుర్థపాదమున కర్థము— ఎవ్వనికి కవిత్వము ఇష్టవధూమణీకౌతుకము నియ్యదు! అని పొడకట్టుచున్నది. ఇట కవిత్వమునకు తుఱుము, కర్ణపూరము, విలాసము, హర్షము, మన్మథుఁడును చెప్పఁబడినవి. ఇవి కామినికిం గలుగునుగాని కవితకుం గలుగవు. కావున—కవితయనెడు నిష్టవధూమణి యెవనికిఁ గౌతుకమిడదు!— అని యన్వయముగా రచించుకొని యుండిన బాగుగానుండును, మూలానుగుణము నగును.

గండపుఁ బూఁతచేతఁ దెల్లనైన తనభుజములతోఁ బోల్పఁబడిన చిలువఱేని
[2] మేనిజిగిగలవాఁడు —
187 మూ.—మలయజరసధవళితనిజభుజ దణ్డవిడమ్బిత భుజఙ్గరాజశ్రీః.

1. బుజములతోఁ 2. బోల్పఁబడిన—భుజములచేఁ బోలఁబడిన అనవలయును. పోల్పఁబడిన యనినచో, ఎవరు పోల్చినారు? ఆవిషయ మప్రసక్తమేని ఆయాకాంక్షంబుట్టించుట సుప్రసక్తమా? కాన ప్రేరణార్థకమిచట తప్పు. మూ. భుజదణ్డ విడమ్బిత. విడంబించుటయనఁగా పోలుటగాని [అప్రేరణమున] పోల్చుటగాదు. "పురమొప్ప న్మహికంఠహారతరళస్ఫూర్తి న్విడంబించుచున్" పెద్దనగారు. "విడమ్బయతి దాడిమీకుసుమమత్ర సౌత్రామణీ" [తూర్పు దాడిమపుష్పమును పోలుచున్నది]. బిల్హ. "వపుఃప్రకర్షేణ విడమ్బితేశ్వరః"—రఘు. "విడమ్బితేశ్వరోను కృతపినాకీ" మల్లి. "ఋతుర్విడమ్బయామాస నపునః ప్రాపతచ్ఛ్రియమ్" రఘు. "విడమ్బయామాసానుచకార" మల్లి. "ఆసారసిక్తక్షితిబాష్పయోగాన్మా మక్షిణోద్యత్ర విభిన్నకోశైః, విడమ్బ్యమానానవకన్దలైస్తే వివాహధూమారుణలోచనశ్రీః." రఘు. "విడమ్బ్యమానానుక్రియమాణా" మల్లి. "విడమ్బయత్యస్తనిమగ్నసూర్యమ్" రఘు. "విడమ్బయత్యనుకరోతి" మల్లి. పంతులవారు తులితభుజఙ్గ యను నాంధ్రలిపిముద్రణపాఠమునే యనుసరించియుండినను, ఆపక్షమందును, అప్రసక్తముగానే ప్రేరణార్థముకల్పించుకొన్నారు. ఇట తులయతియందలి ణిచ్చు తత్కరోతిణిచ్చుగాని ప్రేరణణిచ్చుగాదు. "ప్రాసాదాస్త్వాం తులయితు మలం యత్ర తైస్తైర్విశేషైః" మేఘ. "స వర్ధిష్ణుం విష్ణుం కలితదరచక్రం తులయితా" హంస. "తులయితా—అనుకరిష్యతీత్యర్థః" టీక.

శా॥ ఆకర్ణంబుగనీడ్చునీహరధను ర్జ్యావల్లిజ్యామండనుం
[8] దేకల్యాణగుణుండునానికడకే యింపొందఁగన్వచ్చుఁదా
195 త్మాకాంతాత్మజ మందయానదరకూజత్కాంచికాశ్రోణియై
యాకర్ణాక్షిమహోత్సవంబుకొఱకాఁపాభాగ్యమెవ్వానిదో.

మూ.—ఆకర్ణాన్తం త్రిపురమథనోద్దణ్డకోదణ్డసజ్యాం
మౌర్వీ ముర్వీవలయతిలకః కోపి యః కర్షతీహ
తస్యాయాస్తి పరిసరభువం రాజపుత్రీ భవిత్రీ
కూజత్కాఞ్చీముఖరజఘనా శ్రోత్రనేత్రోత్సవాయ.

త్రిపురమథనముచే నుద్దండమయిన (యీ) కోదండమునకుం గట్టియున్న (యీ) యల్లెత్రాటిని ఇందు ఏ భూపాలపుంగవుండు చెవివఱకు లాగునో అతని

చెంతకు మొరయుచున్న మొలనూలిచేత వాచాలమైన శ్రోణిగలదై వచ్చుచు రాజపుత్రి) అతనికి శ్రోత్రనేత్రములపండువు కై యగును.—అని శ్లోకార్థము.

ఇందు సీతాకృతిచే నేత్రోత్సవ మగును, శ్రోత్రోత్సవము దేనిచేత? కాంచీకాధ్వనులచేత. ఆకాంచీకాశింజితములు ఇతరులకు భగ్నమనోరథులకు వినఁబడవా? వినఁబడినను వినఁబడునుగాని, వారికి శ్రోత్రోత్సవమునొసంగవు, పైగా తాపమునే యొసంగును; అతనికిమాత్రము శ్రోత్రోత్సవము నేయును, కావున నతనివిషయమై యవి ‘నీదాననేను’ అనుసీతాలపితములుగా వినఁబడునని స్వారస్యము. ఇదియెల్ల పద్యములో సీతకే శ్రోత్రోత్సవము అనునన్వయమున నిర్మూలమైనది. ఆకర్ణాక్షి మహోత్సవంబుకొఱకు—(క) ఇట ఆశబ్దము అర్థభంజకమైన తచ్ఛబ్దార్థక సర్వనామమా? అర్థభంజక పాదపూరణములు యతిప్రాసపూరణములును పిల్లగ్రంథములందు భూయిష్ఠముగ లేగదా. (ఖ) ఆకర్ణాక్షి [=కర్ణములవఱకు (వ్యాపించిన) నేత్రములు గలది] యని శ్యామాంతాత్మజకు విశేషణమా? (గ) చెవులవఱకు వ్యాపించినవైన యక్షులయొక్క మహోత్సవముకొఱకు అని ఆకర్ణాక్షిశబ్దము కర్మధారయమాత్రమా? ఈమూఁడు వికల్పములలో ప్రథమము కడమ రెంటికన్న జఘన్యముగాన దానిం ద్యజింతము. కడమ రెండువికల్పములును మూలమునుండి సంపాదనీయములే. ఆ శ్రోత్రనేత్రా+ఉత్సవాయ అని భిన్నపదములుచేసిన రెండవవికల్పమగును. ఆ శ్రోత్రనేత్రోత్సవాయ యని యేకసమాసముగాఁగొన్న మూఁడవ వికల్పమగును. (ఘ) శ్రోత్రనేత్రోత్సవాయ యని అవ్యవహితముగా అక్లేశముగా నొకశోభను లభించుచున్నది. ద్వితీయతృతీయవికల్పములందు, మహోత్సవంబుకొఱకు వచ్చుననుటచే వచ్చువారికే మహోత్సవమని భాషాస్వభావముచేత నేర్పడుచున్నది. అందువలన ఉత్సవము సీతకే అనునీకవనములో ఆకర్ణాక్షియను విశేషణమునకు గొప్పదైన తన కనులకు ఉత్సవమగునట్లుగా అని సీతాన్వయిగా స్వారస్యముచెప్పవలయును. సీత యారాకొమరుని తనవెడందకన్నులు నిండార విప్పిచూచునేని యాంపర్ణన సొబగుగా నుండును, అట్లు చూడదు గదా.

కాన్తేన తస్య నిర్వర్ణయితుం చ రూప మిచ్ఛాస్తి తద్పూర్వసమాగతానామ్
న చ ప్రియేష్వాయతలోచనానాం సమగ్రపాతీని విలోకితాని.— కాళి.

అ॥ లోకచుక్కలఁబోలుదృక్కోయజములు వెలితిలేకుండఁదమిబోఁటిచెలులఁజూచుఁ
గాంతనీక్షింపదరగంటఁగానిమున్ను । నేను చేసినయపరాధమేమిచెపుము.—నైష.

కావున సీతాక్షిపర్ణనమతము అప్రాస్తము. మఱి “కొఱకు వచ్చు” నను ప్రతిబంధకమునెట్లో యవ్యవిష్యగతులచే దాఁటి, ఉత్సవము రాకొమరునికే యని సాధించు

పక్షమున, తృతీయవికల్పమున, ఆకర్ణాక్షి రాకొమరునిది గావలయును. ఆపక్షమున అతనికి కనులపండువు చెవులపండువును రెండునుంగలుగుచుండఁగా అప్రసక్తముగా 1. ఆజ్ఞొకటి లోకపెట్టి శ్రోత్రోత్సవమును పంతులవారు పోఁగొట్టనేల? కావున ఈ యాజ్ఞ జయదేవునిదిగాదు; తస్య ఉత్సవాయ భవిత్రీ—అనుటచేత ఉత్సవమును మూలకవి రాకొమరునికే చెప్పెనని నిస్సందేహము. పంతులవారు 2. భవిత్రీశబ్దార్థము నెఱుంగక దానిని తెనిఁగింపక మానియేవేసినారు 3. ఉత్సవాయ యను చతుర్థికి కారణమును గనలేకపోయినారు. "క్లృపిసంపద్యమానేచ" అను వార్తికముచేత వచ్చిన చతుర్థియిది, కాన ఉత్సవాయ భవిత్రీ యనఁగా ఉత్సవముకై యగును, అనఁగా ఉత్సవమునుగలిగించును అనియర్థము. ఇది తెలియకయు ఎక్కువస్వారస్యము లాగఁ జూచియు పద్యమును దయ్యముచేసికొన్నారు. 4. 5. పంతులవారు ఆశ్రోత్రనేత్రోత్సవాయ్య ఆయాస్త్రీ భవిత్రీ=(ఆ) శ్రోత్రనేత్రోత్సవముకొఱకు వచ్చుచున్నదగును =(ఆ) శ్రోత్రనేత్రోత్సవముకొఱకు వచ్చును, అని సమన్వయించుకొన్నారు. తస్య పరిసరభువ మాయాస్త్రీ (తస్య) శ్రోత్రనేత్రోత్సవాయ భవిత్రీ అని యన్వయించుకొనవలయును. 6. వానికడకే—ఏకార మసహ్యము, పలువురికడకు వచ్చుననియేని మఱియొకనికడకు వచ్చుననియేని యెవరుతలంతురు? మందయానదరకూజత్కాంచికాశ్రోణి. 7. కా యని దీర్ఘము తప్పు. కూజించునది కాంచికగాని శ్రోణిగాదు. శ్రోణియేని కాదీర్ఘముండవచ్చును. శ్రోణీకూజనము పంతులవారికి సమ్మతమయిన నగుఁ గాక, ఇతరులు దాని నొల్లరు; కావున కాంచికాకూజనమే యర్థమగునట్లుగా మంద... కాంచిక యనువఱకు నొకబహువ్రీహిగాను పిమ్మట దానితో శ్రోణికి మఱల బహువ్రీహిగాను రచింపవలయును. ద్వితీయబహువ్రీహిలో కాంచికాంతమునకు పుంవద్భావము వచ్చి—కాంచిక యగును. ఇట్లు సవరించుకొన్న బహుదోషములు తొలంగును.

ఆకర్ణాంతము నీడ్చు నీహరధను ర్జ్యావల్లి జ్యోమండనుం
డేకల్యాణుఁడు వానికి న్సరస కెంతే నింపుమై వచ్చుచుఁ
క్ష్మాకాంతాత్మజ మందయానదరకూజత్కాంచికశ్రోణి యా
హా కర్ణాక్షిమహోత్సవంబుకొఱకై సౌభాగ్య మెవ్వానిదో.

8. ఆహా భాగ్యమెవ్వానిదో అని యిది యిచ్చోట "ఇల్లిదుగో నాచేతులో ఒకతాయం వుంది" అని శిశువులంబోలె తెలిపించుట విరసముగానున్నది. దీనివలననే ఇది అమూలకమని యెఱుంగవచ్చును.

1. రానైరి— దీనికి వచ్చిరని యర్థముగానేరదు. రావలసినవారైరి అనియ ర్థము, వచ్చినారో లేదో ఈమాటవలనం దెలియదు. వచ్చిరనునర్థమున నిటప్రయో గింపఁబడియున్నది. 2. అన్నక్—య. 3. ఈచో—య. 4. చూ—య. 5. హీ నత్వంబును గన్నదయ్యెనె—పం౹. 6. నిర్వీరమై—దీనిని 'నిర్వీరమా' అనిమార్చినచో 'హీనత్వంబును గన్నదయ్యెనె' అనువాక్యమెల్ల ఇందలి యాకు సమానము. 7. నల్వొం దఁగా—య. ఆంధ్రీకరణసౌభాగ్యముం జూతము. శ్లోకద్వితీయ చరణమునకు అర్థము.—బంగారమువంటి కోమలకాంతిగల యీకన్యయు, వెండివంటి కోమల కాంతిగల కీర్తియును ఉత్కృష్టమైన లాభములు. ఇందు 8. కన్యను 9. తద్వర్ణన ను, ఈనాటకముతో సంబంధము కలవికావని పంతులవారు త్రోసివేసి, స్త్రీలు దుష్టు రాండ్రను హేతువుచేత 10. కీర్తిశబ్దమును స్త్రీలింగమును మార్చి 11. యశమని నపుంసకలింగము ప్రయోగించినారు. 'కలధౌతం రౌప్యహేమ్నోః' అను నిఘంటు వుచే కలధౌతమనఁగా వెండియు బంగారంబును రెండునర్థములు. కీర్తి యని స్త్రీ లింగశబ్దమును ప్రయోగించుటయందును దానికి సీతావిశేషణమునే కలధౌతకో మలరుచిపదమునే విశేషణము చేయుటయందును జయదేవుని హృదయమేమనఁగా, సీత యెట్టికన్యయో—అట్టిదే కీర్తియు నింకొకకన్యయనియు, ఈకన్యతోఁగూడ ఆక న్యయు లభించును అనియు, స్వారస్యము. రాజులు కన్యను పెండ్లియాడఁగోరుదురాని కోరరు. నపుంసకుని పెండ్లియాడఁగోరుదురు. కావున పంతులవారు కన్యను మా నియశస్సును పెట్టి జయదేవునికపనమును దెద్దినారు. శ్లోకతృతీయపాదములో 12. ఆకర్షణ 13. టంకరణ నమన చాలనములు నాలుగుక్రియలు చెప్పఁబడినవి. పంతుల వారు అన్నిచెప్పిన నల్లరియగునని నమనచాలనములను రెంటినిమాత్రమే చెప్పినారు. 14. ఆరెంటినేని కొంచెమేని మూలవివక్షితస్వారస్యము వచ్చునో యనుభీతిచే సరి యైనవరుసను జెప్పక విపరీతముగా చాలన నమనములనుగాఁ జెప్పినారు. ఆకర్షణా దులక్రమమున నిది తాత్పర్యము:—ఎవఁడు ఆకర్ణాంతము ఈధనుస్సును ఆకర్షించు నో వానిని సీత వరించును అని యింతకుముందు చాటించినారు. కావున సీతేచ్ఛ వులు ఆకర్షింపవలసియున్నది. ధనుర్వ్యాపారమందు ముందు ధనుస్సును ఎత్తి చేతఁ గొనుట, తర్వాత వంచుట, తర్వాత టంకారముచేయుట, అటుతర్వాత ఆకర్షించుట యుఁగదా వరుస. ఆకర్షించుటవఱకు వచ్చినవాఁడు లేఁడు సరియేగదా, టంకారము వఱకైనను సాధించినవాఁడు లేఁడు, అంతవఱకు చేతఁగాకున్న పోనీ, వంచినవాఁ డేనియు లేఁడు, కదలించినవాఁడే లేఁడు, అని అంత్యకృత్యమయిన యాకర్షణము మొదలుకొని ఆద్యకృత్యమయిన చాలనమువఱకును క్రమముగాఁజెప్పి ఉత్తమ

ఉ॥ కాదిదిమించు మేఁడపయిఁ గ్రాలునొకానొకచానమేనిడాల్
గా దళుకొత్తెడుంబసిడికమ్మిగఁగల్వలతోఁటమేటియుం
గాదు సమీనశైలసముగన్న నుదన్న యనావలోకమే
కాఁదగునబ్బురంబహహ కాంతయుఁ దేనికిఁ గాంతయానొకో.

ఔ నిది సీతానామధేయము గలది కన్యారత్నము!

ఇందులకు మూలము.

పురుషః.—...కథం మమాపి చాపారోపణే సంశయః!

మఞ్జీరకః.—అథకిమ్.

పురు.—తదైష మమాపి సంభావ్యతే, యది,
విసైవాम्బోనాహం బహుళరుచిలిప్తామ్బరతలా
తడిల్లేఖా హేమద్యుతివితతిరమ్యా విలసతి

యదివా,

విసైవ స్వర్గఙ్గాం నభసి రభసోన్ముద్రశఫరీ
పరీవర్తైః సాకం స్ఫురతి నవనీలోత్పలవనమ్.

[విలోక్య సవిస్మయమ్] కథ మస్మత్ప్రతిజ్ఞాభఙ్గాయ విపరీతసృష్టి నైపుణ్యం ప్రణీత వాన్విధిః! [పునర్నిపుణం నిరూప్య] అయే సాదృశ్యాత్ప్రతారితోస్మి!

తడిల్లేఖా నేయం విలసతి పరం సౌధశిఖరే
వసన్త్యాః కస్యాశ్చి త్కనకరుచిరా గాత్రలతికా
అపీదం నోన్మీలత్కువలయవనం మీనతరళం
పరం తస్యా ఏవ స్ఫురతి నయనాలోకలలితమ్.

మూలమునకు అర్థము.

[ఇచ్చోట పూర్వోక్త ప్రతిజ్ఞావాక్య విషయకదోష మొకానొకటిపక్క కడమ మూలమెల్ల ఆంధ్రనాగరములకు ఇంచుమించుగా సమముగా నేయున్నది. మఱి యిటఁ నేను బ్రదర్శించు దోషములు పాఠభేదములచేఁ గలిగినవి గావు. కావున ఆసమాధాన ము నూహించుకొనవలదు.]

పురుషుఁడు.—ఏమి! నేను విల్లెక్కిడుదునను విషయమందును సంశయమా!

మంజీరకుఁడు.—అవును సంశయమే.

పురు.—నావిషయమున నిది మెప్పడు ఊహింపఁదగు ననఁగా,—

మేఘము లేకయే మెఱుపుఁదీఁగ కాంతి పెల్లుచేత ఆకాశప్రదేశమును అలుకుచు బంగరు

యతిపూరణము. పంతులవారికి శఫరీ గిశరీ యని యదేమో అరణ్యరోదనముగా తోఁచినది గావలయును. కానిచో దానిని మాని యిన్ని పూరణములు పెట్టుకొందురా. కాదిది.—12. "కాఁదగునబ్బురంబహహ కాంతయి దేనికిఁ గాంతయానెకో" —ఈపాదమెల్ల నమూలకము. దీనిని హెచ్చుగా వేసికొన్నందులకు త్యక్తములు:—మేని—మూ. గాత్రలతికా 13. లతిక త్యక్తము. మించుతో సామ్యము చెప్పినాఁడు గాన మూలకారుఁడు ఆవశ్యకమని లతికాశబ్దమును వేసినాఁడు. 14. పసిఁడికమ్మిగ—మూ. కనకరుచిరా, బంగారువలె ప్రకాశమానమైన యనియే మూలముగాని, కమ్మి మూలగతముగాదు. కమ్మియన్నమాత్రాన లతికోపమాస్వారస్యము రాదు. లతికోపమయందు, కొమ్మలవలె కాలు సేతులును, పూగుత్తులవలె పాలిండ్లును, పల్లవములవలె కెమ్మోవియు కేలుదోయియు, నని యిట్టిస్వారస్యము లభించుచున్నది. కమ్మియన్న నిదిరాదు. కల్వలతోఁట 15. మూ.—ఉన్మీలత్ [వికసించుచున్న] త్యక్తము. ఇది నీరసవిశేషణము గాదు, దీని స్వారస్యమును

"కాలోన్మీలత్కువలయదళాద్వైత మాపాదయన్తమ్."

"తవాపర్ణే కర్ణేజపనయనపైశున్యచకితా
నిలీయన్తే నీరే నియతమనిమేషాశ్శఫరికాః
ఇయం చ శ్రీర్బద్ధచ్ఛదపుటకవాటం కువలయం
జహాతి ప్రత్యూషే నిశి చ విఘటయ్య ప్రవిశతి."

ఇత్యాద్యభియుక్తోక్తము గని యెఱుంగవచ్చును. ఉన్మీలనార్థమునే నవనీలోత్పల వనమ్మని నవశబ్దముచే దీనివిషయిపరశ్లోకమందు కవి చెప్పినాఁడు. 16. పేటి—పా. 17. కన్నను—య. 18. మోసపోతిని—పోతిననుటయెట్లు సాధువు? "పోతివి గదవే తప్పాలా బొంకించి పోతివే తప్పాలా" అను కూచిపూడిభాగవతమే ప్రమాణమా? అంతసరసముగా సుఖాన్వయముగానున్న మూలమును పంతులవారు ఎంతవిరసముగా నరసముగా కఠినముగా రచించినారో కనుఁడు.

రావణుఁడు.—అటుగాకున్న నీమత్ప్రతిజ్ఞాభంగమునకై యావిధియెవఁడు?

[ఈపద్యము పనికిరాదు.]

మ॥ అలదుగ్ధాబ్ధిని నున్న వెన్నునిదియా నందంపునాభ్యబ్జినిన్
[17] 252 జెలువొందన్ని జవాపికాకమలినిం జేయన్నది స్గౌరియం
కిలిశంకన్నలు మోములం బలుకు వీక్షింపంగ నాదైనయ
ర్మిలికై తియ్యనిపల్కునం బలుమఱున్మేలొందఁ గానీతఁడున్.

ఆంధ్రీకర్తగారికి నిజ నిభృత శబ్దముల యర్థము తెలియలేదు.

మూ.— మయి క్షీరోదన్వన్నిభృతమురజిన్నాభినళినీం
నిజక్రీడావాపీజలకమలినీం కర్తుమనసి
పదభ్రంశాశఙ్కీ మధురమధురాలాపచతురై
శ్చతుర్భిః స్వైర్వక్త్రైరనునయపరో భూ దయ మపి.

1. కోరి.— కోరినవారెవరు ? పలుకా, నలుమోములవేలుపా ? మూలముం బట్టిచూచిన, కోరినవాఁడు ఏతత్పద్యవక్త రావణుఁడు. ఇట నవ్విషయము దురూహము.

పద్యార్థము:— పాలసముద్రములోని విష్ణుని పొక్కిటి తామరతీఁగను తనడిగ్గియలో తెచ్చి నాటుకొనుటకుఁ గోరినదై పలుకు [సరస్వతి] [విష్ణువు] అడ్డగించునేమో యని సందేహించినదై [బ్రహ్మయొక్క] నాలుగు ముఖములనుండి నాస్నేహముకొఱకు [నాసాహాయ్యముకొఱకు] [నన్ను చూడఁగా, అప్పుడు బ్రహ్మ పలుమాఱు నన్ను మంచిమాటల వేఁడుకొని మేలుపొందినవాఁడై యుండఁగా [అట్టి యాబ్రహ్మ నాప్రతిజ్ఞను భంగించుట కేపాటివాఁడు? అని అవలారికావాక్యముతో వెనుకటికన్వయము].

మూలార్థము.—పాలసంద్రములో డాఁగియున్న హరియొక్క పొక్కిటి తామరతీఁగను నేను [రావణుఁడు] ఆత్మీయమైన [నాయొక్క] ఆటడిగ్గియలో నాటుకొన నుంకింపఁగా, ఈ బ్రహ్మ తనకు నివాసభంగము గలుగు నని వెఱచి తన నాలుగు మోములతోను అతిమధురవాక్యముల నన్ను బతిమాలుకొన్నవాఁడాయెను. [పదభ్రంశమునకు తెలుఁగుముద్రణము పరిభ్రంశము. అట్లును ఇదే యర్థము.]

మూలములో ఆటడిగ్గియ రావణునిదని సులువుగా విశదమైయున్నది. స్వకీయార్థకమైన నిజశబ్దమునకు మయికర్తుమనసి పదములతోడి సంబంధముచేత మత్సంబంధమైన యనునర్థము ఘటిల్లుచున్నది. 2. తెలుఁగుపద్యములో ఇట్టి సంబంధిపదము గా పలుకుశబ్దమున్నది. కనుక పద్యములో నిజ యనఁగా సరస్వతిదైన యని యర్థమేర్పడుచున్నది. మూలములో కోరినవాఁడు రావణుఁడని మయికర్తుమనసి పదములచే స్పష్టమైయున్నది. ఇందు 'కోరి పలుకు వీక్షింప' అనుటచే, పలుకు కోరినదని స్పష్టమయియున్నది. 3. పదభ్రంశాశఙ్కీ—అనఁగా తనకు నెలవు లేకపోవునని భయపడుచున్నవాఁడై యని యర్థము. దానిని చక్కఁగా పాడుచేయుట కుపాయ మేమనఁగా, అంకిలిశంకఁ అనుటయే. 4. వీరు నిభృత శబ్దార్థమెఱుంగక ఉన్న యని వ్రాసినారు. ఈ శబ్దముచేత ఈ గ్రంథములోనే మఱిరెండుచోట్ల తప్పినారు. ౮౨-వ పుటలో 'వినుతారవతి' పద్యములో నిభృతమ్ అనుటకు తిన్నఁగఁ అని వ్రాసినారు, అవిదితుఁడనై యని వ్రాయవలయును. ౮౩-వ పుటలో 'ఎవనికిఁజెప్పి' యను పద్య

ములో నిభృతమ్ అనుటకు ఒద్దిక యని వ్రాసినారు. రహస్యమయిన [ఇతరులకుఁ దెలియని] అని వ్రాయవలయును. 5. అట్లే వీరికి నిజ శబ్దార్థముకూడఁ దెలియదు. 'నిజ' అన్నమాత్రాననే 'నాయొక్క' అని యర్థ మని వీరియభిప్రాయము. ఈతప్పుచేత వీరు కడుంగడుం బాడుచేసిన వాక్యమొకటి ౭౮-వ పుటలో కలదు. అందు నిజసహోదరీమ్ అను పదమును తనతోఁబుట్టువు అని తెనిఁగించుటకు మాఱుగా 'నాతోఁబుట్టువు' అని తెనిఁగించి వీరుకల్పించిన రసాభాసములు ఆవాక్యముపై విమర్శయందుం గనవచ్చును. ౬౧-వ పుటలో నిజ జీవితే అనుపదము "నాకుంబ్రాణప్రదుఁడైన వీనియందు" అని పాడుచేయఁబడి యున్నది. దాని పూర్ణ స్వరూపమును దానితావుననే గనఁదగును. ఇందు మూలార్థమును మఱిఁగించుటకును చెఱుచుటకునుం దోడ్పడినపాదపూరణములు.—6. పలుకు, 7. వీక్షింపంగ, 8. మేలొందఁగాఁ, 9. దియానందంపు, 10. చెలువొందఁ, 11. డైన, 12. పల్మఱుఁ. 13. పల్కినఁ—అని ఏకవచనము విరసముగానున్నది, పల్కులఁ అని బహువచనమే మేలు. 14, 15. మయి కర్తుమనసి—నేనుకోరఁగా ;—'కోరఁగా' అనుటకు 'కోరి' యన్న తప్పటుండఁగా 'నేను' అనక మానుట యొకతప్పు. 16. నిజవాపికా— మూ. నిజక్రీడావాపీ; క్రీడా శబ్దత్యాగము నీరసము. 17. అవతారికలో 'ఆవిధి' యన్నాఁడు గావున, పద్యములో తత్పరామర్శలో 'ఆతఁడుఁ' అనుట మేలు, లేదా, అవతారికలో 'ఈవిధి' యనియేని మార్పవలయును.

"కదళీ కదళీ కరభః కరభః కరిరాజకరః కరిరాజకరః
భువనత్రితయేపి బిభర్తి తులా మిద మూరుయుగం న చమూరుదృశః."

అని యొకశ్లోకము ఇటమూలములోనున్నది. తెలుఁగుప్రతిలో లేదు. పంతులవారు కడమగ్రంథమెల్లం దెనిఁగించుట లోకోపకారము గాదు, దీనినిమానుట త్రైలోక్యోపకారము. తెనిఁగించియుండిన నిది యేమై యుండునో!

౧౩-వ పుట.

పురుషుఁడు.—ఆ! దృష్టియని యేమి చెప్పుచున్నావు? ఓయీ ముష్టియే యీయఁబడుచున్నది. [ససంరంభంబుగం బరిక్రమించి శేఖరభ్రంశ మభినయించి సవిషాదంబుగం గాంచుచున్నాఁడు.]

[7] క॥ ఓలం కేశావిగళిత । చూడాలోకనము చేతఁజూచ నెడుఁగదా
259 కాలంబు గావునన్వే । శూలిదివిల్లందుకొమ్ము శూరతమీఱఁ.

పురుషుఁడు.—[తనలో] నేనెట్లు వీనిచే నెఱుఁగఁబడితిని? అటుగాదేని ఘుణాక్షర న్యాయానుసారముగ శబ్దసామ్య మీయది.

**1**. ఇచట రెండుమాఱులు పురుషుఁడని ఒడఁడే వక్త యుండుటచేత మధ్య
లో ఇంకొక వక్త యుండవలయును. అట్లే 'ఓలంకేశా' పద్యము సందర్భానుసార
మున మంజీరకునిదని స్పష్టము. ఇటు నీపురుషుఁడు మాఱురూపున వచ్చియున్న
రావణుఁడు. ఇతఁడు రావణుఁడని కథలో నచటివా రెవ్వరు నెఱుఁగరు. వీనితోఁ
బల్కుచున్న మంజీరకవైతాళికుఁడును ఎఱుఁగఁడు. ఈ పురుషుఁడు [రావణుఁడు]
స్వయంవరశాలలో సీతకొఱకు శివునివిల్లు వంప లేచి వింటికడకు నడచునప్పుడు వీని
తలనున్నమాల్యము జాఱి పడిపోయినది. అపశకునమునకు వీఁడు వింటికడకుఁ
బోవుటమాని యచటనే విషణ్ణుఁడై నిలిచి యామాల్యమును చూచుచుండఁగా [వీఁడు
రావణుఁడని యెఱుంగకయే] మంజీరకుఁడు వీనింగూర్చి ఓలంకేశాపద్యమును పలికి
నాఁడు.

పురుషః.—ఆః కిముచ్యతే దృష్టిరితి, నన్వయం ముష్టి రేవ దీయతే. [ససం
రమ్భం పరిక్రమ్య శేఖరభ్రంశ మభినీయ సవిషాదం విలోకయతి].

మఞ్జీరకః.—అయేలఙ్కేశవిస్రస్తశేఖరాలోకనేన తే

సమయో యాతి తత్తూర్ణం గృహాణ హరకార్ముకమ్.

పురుషః.—[ఆత్మగతమ్] కథమనేనవిదితోఽస్మి [విమృశ్య] అథవా, ఘుణాక్ష
రన్యాయాగతం శబ్దసాదృశ్య మేతత్.

పద్యము.— **2**. ఇందు 'ఓలంకేశా' అని మంజీరకుఁడు పురుషుని సంబో
ధించినాఁడు. ఇతఁడు లంకేశుఁడని మంజీరకుం డెఱుంగఁడు. ఇందులకు ఘుణాక్షర
న్యాయమని పురుషుఁడుచేసిన టీకకు పంతులవారికి అర్థము తెలియలేదు. మూలము
లోను ఈ 'లఙ్కేశ' యను వర్ణసముదాయ మున్నది, లమ్ అని ముగియు పూర్వప
దమునకు కేశ శబ్ద యోగముచే నిష్పన్నమైనది. అంతియకాని బుద్ధిపూర్వకముగా
మంజీరకుఁడు రావణా అని యర్థముగా లఙ్కేశ అని సంబోధింపలేదు. రావణుఁ
డు తన్ను సంబోధించినట్లు భ్రమసినాఁడు. మూలమునకు— "అయే + అలం + కేశ
విస్రస్తశేఖరాలోకనేన" అని మంజీరకుని ఛేదము. "ఓయి + మానుము + జుట్టు
నుండి రాలిన పూదండం గాంచుటను, ఆపూదండను చూడకుము," అని యభి
ప్రాయము. [కేశవిస్రస్తశేఖర (+ ఆలోకనేన—)సిగనుండిరాలినదండగలవాఁడా,
అనియు పోలికను]. "అయే + లఙ్కేశ + విస్రస్తశేఖరాలోకనేన" అని రావణుని
ఛేదము. "ఓయిలంకేశుఁడా రాలిన శేఖరమును చూచుటచేత" అని పిమ్మట కన్వ
యము. జయదేవుని ప్రతిభను చక్కఁగాం బరికింపుఁడు. తొలుత రావణుఁ డిట్లుభ్ర
మసి, పదప విమర్శించుకొని "అయే + అలం + కేశ..." అను మంజీరకచ్ఛేదమును

గ్రహించి తనపేరు మంజీరకుఁ డుద్దేశింపక వేఱేమో యుద్దేశించి చెప్పఁగా అదితన పేరుగా పరిణమింపఁగా ఆపరిణతి ననిపురుగు తొలుచునపుడు ఒకారము తొలుపవ లయునని సంకల్పించుకొనకపోయినను అది తనకిరవుగాఁ దొలుచుకొన్న తొలి ఒకారముగా పరిణమించినరీతిగా, నున్నదని, దానిని ఘుణాక్షరన్యాయమన్నాఁడు. పంతులవారు ఈ రావణటీకచేతనేనియు మూలమునంగల యర్థద్వయ మెఱుంగలేక మంజీరకునిచేత తద్బుద్ధిపూర్వకముగానే 'ఓలంకేశా' యని తప్పుసంబోధన చేయించి, రావణునిచేత దానికే 3. ఘుణాక్షరన్యాయమని తప్పుటీక చేయించినారు. సాహిత్య మెచటనో! మఱిల దివ్వటీలు వెలిఁగింపుఁడు.

4. చూడాలోకనము—మనపంతులవారికి చూడా శేఖరములకు భేదమే తెలియదు; చూడయనఁగా జుట్టు, శేఖరమనఁగా శిరోమాల్యము. రెంటికిని జుట్టనియే యర్థము చేసికొన్నారో, రెంటికిని శిరోమాల్యమనియే యర్థముచేసికొన్నారో, తెలియ రాక యున్నదిగాని, చూడాశేఖర శబ్దములు పర్యాయ శబ్దములని గ్రహించినా రనుట సిద్ధాంతము. మూలములో శేఖరము పడిపోయినదనియు, దానిని రావణుఁడు చూచుచు నిలిచిపోయెననియు, రావణుని మంజీరకుఁడు "ఏలకోయి ఆపడిపోయిన శేఖరమును చూచుచున్నావు?" అని హేళనము చేసినాఁడనియు, రెండు తావులను శేఖరశబ్దముతోనే రెండువాక్యములును నిబద్ధములై యున్నవి. పంతులవారి తెనుఁగులో, శబ్దార్థములు ఎఱిఁగిన వారికి,— రావణుఁడు రాలినమాల్యమును గాంచుచుండఁగా మజీరకుఁడు వీడిపోయినజుట్టుం గాంచెదవేమని హేళనము చేయుట—యను విరోధము దేదీప్యమానముగా నగపడును. ఆహా! సాహిత్యమంట! మఱిల దివ్వటీలు వెలిఁగింపుఁడు, ఇంక నార్పకుఁడు.

5. చూ.—ఈ యతీంద్రులు, "ఈ।చోనేఁడుం గదలింపఁడయ్యె ధనుపుం జూవంప లేఁడయ్యెడుఁ" [౧౧ - వ పుట]. అను చూయతిగారికి తమ్ములు. కదాశబ్ద మున్నదికదా ఇంకను చూ యేలకో? 6. శూలిది—ఈ పాదపూరణ దివ్యాస్త్ర ముయొక్క ప్రభావము వింటిని అవలఁబడవేసినం దెలియును. "శూలిది యందుకొను విల్లు శూరతమిఁటఁ." అందిన కొనవచ్చును. శూరతమిఁటఁ—అమూలకము, అవిరుద్ధమని చేర్చుటయేని, 7. "శూరుఁడవైనఁ" అన్నమేలు, మంజీరకుని హేళనశక్తికి అనుగుణతరమగును. చిఱుతుకమార్పులచే దీనిని పద్యముఁ జేసెద, ఆంధ్రీకరణము చేయను.

క॥ ఓలంకేశా రాలిన । చూడామాల్యంబునట్టె చూచెదవేలా
కాలముచనుఁగావునవే । శూలిశరాసనముఁగొమ్ము శూరుఁడవైనఁ.

ప్రొయ్యివలచు కట్టియ వచ్చుచున్నది.

[14] తే॥ హేలమెయి నారినిం గట్టి యెక్కువెట్టి। తూలి విలు మేలు మేలనఁ జూడఁబడుడు
273 నేను బూనిననిది యెంత పూనన డ్డ। మేమి యుండెడు నీ దారిఖాతతమంబు.

మూ. సావహేలకమనీయ ముదస్య । క్రీడ యైవ వినిబధ్య చ మౌర్వీమ్
కృష్ట మేవ హరకార్ముక మేత । ద్దృశ్యతా మనుహృదాం హృదయంచ.

శ్లోకార్థము.— నేను సరకుసేయక యందముగా ఎత్తి, అటగానే నారిని గట్టి, ఈహరకార్ముకమును శత్రువుల హృదయమును రెంటిని ఆకర్షింపనే ఆకర్షించితిని, ఇదిగో చూడఁబడుఁగాక.—పద్యమున, 1. ఎత్తుటలో అందముపోయినది. 2. మొదలు ఎత్తుటయే లేకపోయినది. 3. ఇందుకై మేల్మేలను సాధువాదము వచ్చినది. 4. ఆకర్షణము తుత్తిక్కైనది. 5. అనుహృత్తులు పలాయితులైనారు. 6. పంతులవారు ఉదస్య యనుటకు ఎక్కువెట్టి యనియర్థము చేసికొన్నారు. (ఉత్ = ఎక్కు, అస్ = త్రోయుట, అదియే పెట్టుట). ఉదస్య యనఁగా ఎత్తియనియర్థము, ఎక్కువెట్టియని గాదు. పంతులవారు ఈయపార్థము చేసికొని తదనుగుణముగా పద్యమును పాఠముచేసి మూలమును దిద్దినట్లు భావించి యున్నారు. 7. అదెట్లనిన నారికట్టుటయే ఎక్కువెట్టుటయని యెఱుఁగక, ఆరెండును వేర్వేఱు క్రియలనియు, అందు, ముందు నారికట్టుట, పిమ్మట ఎక్కువెట్టుటయు ననియు, అది మూలములో విపరీతమైనదనియు భ్రమసి, "నారినిం గట్టి యెక్కువెట్టి" అని అపార్థానుగుణముగా 8. నూతన క్రమము కల్పించుకొన్నారు. 9. మేలుమేలన— అమూలకము, దీనికి పూర్వమున కన్వయమా పరమునకా? 10. చూడఁబడుడు—దృశ్యతామ్ అను ప్రథమపురుషైకవచనమునఁగల యర్థోక్తుల తికమకలో దాని నుత్తమపురుషైకవచనముగా భ్రమయంబోలుదురు. లోపర్థముపోయినది. దృశ్యతాంపదమునకు హరకార్ముకము, అనుహృద్ధృదయమును, కర్తలు. మూలకారుఁడు ధనుస్సు ఎత్తుటయు, నారికట్టుటయు, ఆకర్షించుటయు చెప్పినాఁడు. తొలిరెండును మూఁడవదానికొఱకు, మూఁడవదానిని అనఁగా ఆకర్షణమును చెప్పినభావ మేమనఁగా, ఆకర్షించినవాని కడకు సీతవచ్చునని చాటింపుగాని నారికట్టినవానికడకు వచ్చునని గాదు [౧౦-పుటలోని "ఆకర్షంబుగనీడ్చు" ననుపద్యముం జూడుఁడు.] గావున, జనకప్రతిజ్ఞాత పణ నిర్వహణ సూచనార్థము. 11. అట్టియా యాకర్షణమును పంతులవారు వదలుట తత్ప్రయోజనాపరిజ్ఞానసూచనార్థము గదా. 12. కృష్టమేవ—అని భూతార్థకప్రయోగము కర్షణనిశ్చయబోధకము, తప్పక కర్షించెదనని భావము. తెలుంగుననది యెక్కడ? 13. అనుహృద్ధృదయకర్షణమనఁగా నేమో తెలియక పంతులవారు దానియునుబనే మానినారు. శత్రువులహృదయమును లాగుట యనఁగా వారికి దుఃఖముచే గుండెలు వ్రీలునట్లు చేయుట. "శత్రు

పులగుండెతోఁగూడ ఈధనువును లాగెదను చూడుము ” అన్నమాట యెంత రసవంత ముగా మనోహరముగానున్నది! అదిలేని యీపద్యము ఆత్మలేనిబొందియకదా! **14.** శూలి విలు నారినింగట్టి యను మూఁడు పదములకుఁ దప్ప కడమపద్యమునకు మూలముతో సంబంధములేదు. ఎంత రమణీయధ్వని యిట లెస్సగాఁ ధ్వంసిత మైనది! ఈ యాంధ్రీకరణమేల దాపరించినది!

౧౪ - వ పుట.

**1.** భూరి—పా. **2.** ఉరు—ప్రా. **3.** సు—జీవగఱ్ఱ.

[10] 283 తే॥ భూరిరోషారుణాక్షీకోషోరుభిన్న। భ్రూవిభంగవిఘటితసు భ్రుకుటియుతము కోశనిర్ముక్తనిస్త్రింశఘోరబాహు। దండచడంబునరవీరమండలంబు.

**4.** భిన్నభ్రూ—ఇందు న్న కారమునకు గురుత్వములేదు. ఇట్టియగౌరవము తెలుఁగులో జఘన్యకవులగ్రంథములందేగాని మహాకవులగ్రంథముల నుండదు. **5.** విఘటిత— ఇందలి వి వర్ణము అర్థభంజకమైనపాదపూరణము. మూలమున ఘటనమే చెప్పఁబడి యున్నది. ఇందు విఘటనము; మూలవిరుద్ధముగదా; భ్రూభంగమేగదా భ్రుకుటికికారణము. అట్లుండ నదియె తద్విఘటకమనుట స్వభావవిరుద్ధముగాదా? అయినను భయము వలదు; గురిగింజకవి ‘రాజా నీప్రతాపము గురిగింజలాగున, క్రొత్తనీళ్లలాగున, ఎఱ్ఱమట్టి లాగునను వెలుఁగుచున్నది’ అనిచెప్పినప్రతాపవర్ణనమందు, గురిగింజనలుపును గూర్చి తలారివేసిన యాక్షేపమునకు కవి ‘క్రొత్తనీళ్లంగలిపినయెఱ్ఱమట్టి యానలుపునుగొట్టు’ నని చెప్పిన సమాధానము మనకెక్కడికిఁ బోయినది? అట్లే భ్రుకుటినుండఁటి సుకారము ఘటితముండఁటి వికారమును కొట్టును. విశేషముగా ఘటితమని యర్థము చేసికొనుటకు పద్యమంతచదివి తాత్పర్యము గ్రహింపవలసిన యాలస్యమున్నది. సాంఖ్యరహస్యమెఱింగిన, అంతకుముందే వీని సూ కొట్టివేయును.

మూ.—రోషారుణీకృతవిలోచనకాన్తిభిన్న। భ్రూభఙ్గభీమఘటితభ్రుకుటీవిటఙ్కమ్ ఉత్ఖాతలోలకరవాలలతాకరాళ। దోర్దణ్డచణ్డచరితం నరవీరచక్రమ్.

**6.** కరవాలలతా—**7.** భ్రుకుటీవిటఙ్కమ్—తెలుఁగులో లతా విటం కోపమానములను త్యజించుట మందముగానున్నది. **8.** ఉత్ఖాత—యనుటకు కోశనిర్ముక్తయనుట జబ్బు. ఉత్ఖాత = దూయఁబడిన, ఈశబ్దముచే ఆ వీరులయొక్క స్వకీయమైన సరభస వ్యాపారము రావణదండనార్థకము సూచితమగుచున్నది. కోశనిర్ముక్త యనుటలో అది యణంగినది. **9.** లోల **10.** భీమ—వీతత్త్యాగము సరిగాదు.—ఇప్పద్యములోని భ్రంశములును పాదపూరణములును మాత్రమే పంతులవారివిగాని, ఇందలి యర్థోచిత ఘడంబరము దైయదేవునిదే.

1. అదిది—కటుసంధి. 2. ప్రాణభూతము 'కృపాకృపణము' త్యక్తము.

[5] 288 తే॥ దారితారిద్విరదకుంభతటవిముక్త। మౌక్తికసుతారకితనభోమండలరుచి
కాళరాత్రివలెనెయెదిగ్రాలునాల। మునసదదినాదుకైదువుభూపులార.

మూ.—నిర్భిన్నవైరికరికుమ్భతటీవిముక్త
ముక్తాఫలప్రకరతారకితామ్బరశ్రీః
యః కాళరాత్రి రివ భాతి రణే స ఏష
రేరే నృపా మమ కృపాకృపణః కృపాణః.

3 మౌక్తిక—ముక్తాఫలప్రకర అన్నస్వారస్య మిందులేదు. కృపాకృపణః = దయాదరిద్రము = దయాహీనము = చంపకమానదనుమా మిమ్ము-అనిభావము, దీనిని మానివే యుటకన్న ఈపద్యమును మానివేయుటమేలు. 4. రేరే = ఓరోరి;—ఈమాట లేమిచే పద్యము మూర్ఛిల్లినది, మిమ్ము చంపకమాన దనుమాటలేమిచే చచ్చినది. 5. సు—పా.

మనిపూని చేసిన నేరేడుcబండు.

తే॥ ఒకcడcబెక్కండ్రతోనెట్టులోపుదునని
[13] 301 సలుపననివగమానుముతలcతువెద్ది
జయమదియొనర్పుచిత్తముసమరమునను
బూనిసమరేఖచేనిందుcబొందుగాను.

మూ.—ఏకః కథం బహుతరై స్సుభటైః కరోమి
సంగ్రామడమ్బరమితి త్యజ రే విషాదమ్
యమ్మన్యసే సుజయ మత్ర సహైవ తేన
చేతో నిధేహి సమరే సమరేఖయైవ.

రే బహుతరై స్సుభటైః ఏకః కథం సంగ్రామడమ్బరం కరోమీతి విషాదం త్యజ। అత్ర యం సుజయం మన్యసే తేనైవ సహ సమరేఖయైవ సమరే చేతో నిధేహి॥— ఓరీ, 'మిక్కిలి పెక్కండ్రు వీరులతో ఒక్కcడను ఎట్లు యుద్ధాడంబరము నేయుదును,' అని వగపు మానుము. వాలో ఎవనిని సులువుగా జయింప శక్యునిcగాc దలంతువో వానితోనే [అయొకనితోనే] సమరీతినే [అనcగా ఒకనితో ఒకcడుగానే] యుద్ధమందు మనస్సు ఉంపుము [పోరుటకు ఉంకింపుము]. (పంతులవారిమూలములో సుజయమ్ పదము సుజయమ్ అని యచ్చుపడినది.)

1. పెక్కండ్రతో—బహుతరైః సుభటైః అనుటకు పాడు. 2. పెక్కండ్రతో— అనుటలో తరప్రత్యయ స్వారస్యము రాలేదు. 3. రేశబ్దమును తెనిcగింపమి లోపమే. ంతులవారికి ఉత్తరార్థము అర్థముకాలేదు. 4. అత్ర = మూలో, పంతులవారి తెలుcగు

'ఇందు'. 5. యమ్=ఎవనిని, పం. తె. ఎద్ది. 6. సుజయమ్=సులువుగా జయింపశక్యనిఁగా, పం. తె. 7. పొందుగాను జయము. మన్యసే=పం. తె. తలఁతువు. సమరేఖయైన=పం. తె. సమరేఖచే (8. ఏవ త్యక్తము). సమరే=సమరమునను. తేనైవసహ=వానితోనే=ఆయొక్కనితోనే, పం. తె. 9. అది ( 10. ఇట ఏవకారము త్యక్తము, తదర్థమును చేతశ్శబ్దార్థముతో చేర్చినారు). చేతః=చిత్తము. (11. చిత్తము+అ=చిత్తమే). నిధేహి=ఉంపుము, పం. తె. పూన్కొనుసర్పము. 12. చిత్తమసమరమునను అనుటచే, చిత్తము +అ(చిత్తమే)+సమరమునను అనియే భేదమో, లేక, చిత్తము+అసమరమునను అనియే భేదమో, అనిసందేహపెట్టి విద్యార్థులను ఏడ్పింపవచ్చును గదా. 13. సుజయపదము నూహించుకోలేక సువర్ణమును దిద్దుకోనేరక యుత్తరార్థమునెల్ల పాడుచేసినారు. సాహిత్యమఁట ! ఏమో ప్రకాండకమఁట !

సంతోషింపుఁడు సంతోషింపుఁడు, పీఁకుట ! పీకుఁట ! సత్సంతోషింపుఁడు
సత్సంతోషింపుఁడు, సద్దశనాంకురములు! సత్ప్రకటీకృతంబులు !

చ॥ అమరసరిత్సువర్ణజలజాంచితభూరిబిసాంకురంబులన్
సముదదిగంచితోల్లసితసామజసద్దశనాంకురంబులన్
[8] 309 ప్రమదముచేతనేయవిపరంగనుబీఁకుటఁబాపెబాలభా
వమువిమదీయబాహులివిబాగుగసత్ప్రకటీకృతంబులో.

మూ.—మన్దాకినీకనకపద్మబిసాఙ్కురాణాం
కించోగ్రదిగ్గజలసద్దశనాఙ్కురాణామ్
ఉన్మూలనై రల మనీయత శైశవం యై
స్తేమీ నిజా మమ భుజాః ప్రకటీభవన్తు.

పాదపూరణారణ్యము—1. అంచిత—య. 2. భూరి—పా. 3. అంచిత—ఆహా! ఏమి! వింత! పాదపూరణములకుఁగూడ కఱవువచ్చినది !—పా. 4. సత్—పాదపూరణ జీవాతువు. 5. పరంగను, ప్రమదముచేత—రెంటనొకటి పా. పరంగను య. ప్రమదము—ప్రా. 6. బాగుగ—య. 7. సత్—ఇసీ! ఏమి పాదపూరణముల కఱవు ముదురుచున్నది! 8. మఱి పీఁకుట యఁట—వీరి కింతకన్న శబ్దముదొరకక పోయెనా! ఊరక పీఁకుటగాదు, ప్రమదముచేత నఁట! ప్రమదముచేత నని తప్పఁదొరఁ బీఁకుటగాదు, పరంగనుబీఁకుటయఁట! ఈ ప్రథమాంకములో పీఁకుటచే బాలభావము గడపుటయేగాక, సప్తమాంకములో జడలను పీఁకుటయు నగపడుచున్నది. "ఏనికగున్నలు తొండము। తోనెఱిసింగములజడలఁ జెలఁగుచుఁబీఁకున్." ౧౦౩ - వ పుట. ఇట వక్త రావణుఁడు, సప్తమాంకమున వక్త లక్ష్మణుఁడు. ఇట్టి యుత్తమోపనాయక

ప్రతినాయకులకు ఈ గ్రామ్యోక్తి తగదు. పంతులవారు "గ్రామ్యత్వ మధమోక్తిషు" అని లక్షణము నేర్చుకొనవలయును. వీరిమతమున నీచపాత్రములకు లక్షణవిరుద్ధమయిన గ్రామ్యము పనికిరాదఁట! రావణ లక్ష్మణులకు ఈ గ్రామ్యము పనికివచ్చునఁట. ఏమి సరసవ్యవస్థ! ఇట్టి పండితులే వ్యవస్థాపకులు.

(క) నూపురకుఁడు— [భయముతో] కావున నన్ను నాప్తకాఁడు
[12] కాపాడవలయును. ఓయీ! రక్కసుఁడే తన కెదురుపడిన మానిసి
321 న్మెక్కుచున్నాఁడు వెండియు రక్కసులయొడయం డననేల?

(చ) మంజీరకుఁడు.— [నవ్వి] చెలీ! వెఱపేల? వీరవారముచే నభినందింపఁ బడఁదగినదిగదా, వందిజాతి? అందువలన భువనైకశూరుఁడైన యీనిశాచర చక్రవర్తి మనవంటివారి విషయమున నెట్లు విపరీతవర్తనము గలవాఁడగును?

(ట) వ॥ కావున నిస్సందియముగ నితనిం గుఱించి చెప్పెదను. అహా! ఇన్ని తలలేమనియెన్నఁబడుచున్నవి? ఏమనియా? ఒక్కటిం ద్రోచి తక్కినవి నఱికి యెక్కడనేని విడవఁబడకుండవు?

ఈ క చ ట వాక్యత్రయములలో ట వాక్యమునే విమర్శింప దొరకొంటిని. దాని ప్రకరణాదికము బోధపడుటకై క చ వాక్యములను దాహరించితిని. (క) వాక్యార్థము:— మిత్రమా నన్నుఁ గావుము. రక్కసుఁడే మానుసుల మెక్కునఁట, ఈ రక్కసులఱేఁడు నన్ను ఏమి చేయునో యని భయపడుచున్నాను. (చ) వాక్యార్థము:— భయపడకు, మనము వందులము, ఈయన మహాశూరుఁడు, శూరులు వందులను నొంపరు.— ఈ రెండువాక్యములచేతను నూపురకవైతాళికుఁడు రావణుంగని భయపడినట్లును మంజీరకవైతాళికుఁడు భయముతీర్చినట్లును విశదమయినదిగదా. ఇఁకను—

(ట) వాక్యవిమర్శము.— 1. ఈ క చ ట వాక్యములు మూఁడును పంతులవారిపుస్తకములలో ఇటు నీవిమర్శమందుంబోలె మూఁడుగా వేర్వేఱుగా [మూఁడు పేరాలుగా] ముద్రింపఁబడియున్నది. ట వాక్యమునకు పూర్వము వ॥ అనియు ముద్రితమై యున్నది.— ఇది వచనమే, సరియే, దీనికిముందుదియు వచనమేగదా? అట్లుండఁగా ఈ చ ట లు రెండును ఒకనిభాషితములే అయినచో, దీనిని దానుండి విడఁదీసి వేఱుగా ముద్రించుట యేల? దీనికిముందు వ॥ అని వచనచిహ్న మిడుటయు నేల? ఈ రెండు కారణములంబట్టి చూడఁగా నిది మంజీరకునివాక్యము గాదనియు నూపురకునివాక్యమనియు తెలియుచున్నది. నాగరపుస్తకమందు ఇది నూపురక వాక్యముగానే ప్రాకృతముగానే యున్నది. చ వాక్యము మాత్రము మంజీరకునిది గానే సంస్కృతముగానే యున్నది. తదనుసారముగానే పంతులవారి యీ

హాంధ్రీకరణములోఁ గూడ మంజీరకునిదైన చ వాక్యము తత్సమభూయిష్ఠమై యు
ది, ఈ టవాక్యము అచ్చుగా నున్నది. [ప్రాకృతభాషితముల కచ్చయు సంస్కృ
భాషితములకు తత్సమమిశ్రంబునని వీరు ఈగ్రంథములో నొకవ్యవస్థ చేసికొన్నట్లు
డుచున్నది]. కాన నిది నూపురకవాక్యమ యనుటకు సందియము వలదు.
తులవారు తెనిఁగించిన తెనుఁగుముద్రణమందును ఇది నూపురక వాక్యముగానే ము
తమైయున్నది. అట్లుండఁగా వీరు దీనికిముందు 'నూపురకుఁడు'— అని వ్రాయు
స బదులుగా వ॥ అని వ్రాసికొనుటయు, 2. దీనిని మంజీరకవాక్యముగా ముద్రిం
టయు, అయినను నూపురకవాక్యరీతిగా అచ్చులో వ్రాయుటయు, కనఁగా నిట
స కడుం దికమకలో పడినా రనుట విశదము. అందుల కారణ మీనూపురకవాక్య
న కర్థము తెలియమియే, ఫలము ఈతెనుఁగువాక్యము కడు రసాభాస మగుట
.— కనవచ్చును.— దీనిమూలము, ఛాయ.—

నూపురకః.— [సహర్షమ్] యదీదృశం తత్కిమపీమం నిశ్శఙ్కీభూత్వా
క్ష్యామి. [ఉపసృత్య] అయే కిమి త్యేతావన్తి మస్తకా న్యుదుహ్యన్తే? కిమితివై
రక్షిత్వాపరాణి యత్రకుత్రాపి న నిక్షిప్యన్తే?

తెనుఁగువాక్యములో నూపురకుఁడు మంజీరకునితోనే పలికినట్లుగపడుచున్న
రావణుఁగూర్చి 'ఇతనిని' అను సర్వనామము పెట్టుట అందులకు గమకముగా ను
ది.. నూపురకుఁడు కొంతమంజీరకునితోను కొంతరావణునితోను పలికినచో ఆవి
గమును తేటపడనీయక ఈతెనుఁగుకవిగారు చెఱిచివేసినారు. 3. వీరికర్మార్థకప్ర
భాగములు ఆవిభజనను తేటపడనీయవు. ఒకవేళ నూపురకోద్దిష్టశ్రోత యెవరో
కే సందేహమై రావణమంజీరకోభయ సాధారణముగా వ్రాయుటకై కర్మార్థకప్ర
భాగమును వీరు ఆశ్రయించి యుందురా? నాగరలిపి తెలిసి యుండిన నీపాఠుఁడె
గుముద్రణముముఖము చూడవలసియే యుండదుగదా, ఈప్రయాసలు నుండవుగ
.— 4. నిస్సందియముగ— ఎవరికి సందేహము? ఏమని సందేహము? 'నిర్భ
యండనై' అనవలయు. మూ. నిశ్శఙ్కీభూత్వా. ఇతనిం 5. గుఱించి 6. చెప్పె
స— వీఁడేమి చెప్పినాఁడు? వీఁడు ప్రశ్నలు వేసినాఁడేగాని ఏమియు చెప్పలేదు.
తని నడిగెదను' అనవలయును; మూ. ఇమం ప్రక్ష్యామి. ఇంతవఱకును నూపుర
డు మంజీరకునితో పలికినవాక్యము. ఇఁకను గలవాక్యశేషము నూపురకుఁడు
వణు నడిగినప్రశ్నలు. ఆహాపదమునకు ముందు మూలములో [ఉపసృత్య] అని
మున్నది. రావణునిసమీపించి యని దానియభిప్రాయము. 7. ఎన్నఁబడుచున్నవి
మోవఁబడుచున్నవి' అనవలయు. మూ. ఉదుహ్యన్తే; తెనుఁగుప్రతిలో 'ఉహ్యే

స్తే' కు 'ఊహ్యాస్తే' అనిపడినది. 8. ఏమనియా ? ఈముక్క రచనాభంగిచేత ప్రశ్న యొక్క ఉత్తరమునకు అవతారికగానగపడుచున్నది. అట్లవతారితమయినవాక్యమైనను నో ఉత్తరముగానుండలేదు. కావున నిట నిది గార్దెస్టుకమ్ [తోఁటకూర] తర్జుమా యనుటకు శంకయేల ? కిమితివా—[కిమ్—ఏమి, ఇతి—అని, వా—ఆ] ఏమనియా ? 'ఏమని' యనవలసినది. యాను ఎత్తివేసికోవలసినది. 9. విడువఁబడకుండవు—ఈకవిగారికి ఇప్పలుకు పులకండము లాలుకుచున్నది గావలయును; ఇందు 'పడక' అనుదాన నొకవ్యతిరేకము 'ఉండవు' అనుదాన నొకవ్యతిరేకమునుం గలవు. ఈరెండును అన్యోన్యక్షయ మొనర్చి పదసముదాయమును వ్యతిరేకార్థ శూన్యముగాఁ జేయునుగదా ? పైగా విధానమును బలీయముం జేయునుగదా ? ఇందువలన ఆపదసముదాయమునకు "అవశ్యము విడువఁబడును" అని యర్థము సిద్ధించినది. అట్టి క్రియాపదముతో ఆవాక్యము ప్రశ్న మగుట యెట్లు ? 'విడువఁబడునా' అని మార్చుకొన్నచో, ప్రశ్నయగుఁగాని, సందర్భమేమి ? పంతులవారిపక్షము వహించి 'ఏమనియా' యనులఘువాక్యమును మార్పక యుంచుకొన్నచో, ఆయవతారికావాక్యముంబట్టి చూడఁగా, మన మేమిసమాధానము కల్పించుకోవలసి యున్నదనఁగా,—రావణుఁడు చెప్పఁదగిన యుత్తరమును నూపురకుఁడే ఉద్భావించినవాఁడై [ఆయుత్తరమునే యొసంగ రావణుం డంగీకరించునేమో కనుంగొనుటకై] దానినే ప్రశ్నరూపమునఁ బలుకుచున్నాఁడు—అని కల్పించుకోవలసి యున్నది. 'యా ?' ను 'పీఁకి' వేసి 'ఁబడకుండ' ను పగులఁగొట్టినచో వాక్యమగును. ఈ ముక్కకిముక్కి గార్దెస్టుకం తెనిఁగింపులో ఈయనన్వితార్థకాపార్థక మూలవిరుద్ధార్థక వ్యాకరణవిరుద్ధార్థ కాంధ్రీకరణములో జయదేవబద్ధార్థమును గ్రహించుట శత్రుమధ్యములో అర్ధాన్నము విందు భుజించుటగా నున్నది. దీనిమూలమును నేఁదెనిఁగించెద.

నూపురకుఁడు.— (సహర్షము) అట్లేని, నిర్భయుఁడనై యితని నేమేని ప్రశ్నచేసెద. (సమీపించి) ఓయి, ఏల యిన్నితలకాయలు మోచెదవు ? ఒకటి నిలుపుకొని కడమ కోసివేసి ఎక్కడనేని ఏల పెట్టివేయవు ?—

తెనుఁగుముద్రణమున ఏతన్మూలవాక్యములో 'భూత్వాప్రక్ష్యామి' అనుటకు షష్ఠ్యే, అపరాణి యనుటకు అపరాణి చ్ఛిత్వా, నిక్షిప్యాస్తే కు విముచ్యాస్తే, ఉదుహ్యాస్తే కు ఊహ్యాస్తే, అని భేదములున్నవి. అందు, ఊహ్యాస్తే పొరఁబాటు, కడమ భేదములవలన అర్థభేదము లేదు.

వ్యాకరణపాండిత్యము. 10. ప్రోచుటకు కర్త ? 11. నఱుకుటకు కర్త? ఈ క్త్వార్థకములు సమాపకక్రియతో నేకాశ్రయములు కావలయుఁగదా ? 'ఉండవు,

సమాపకక్రియ, 'తక్కినవి'దానికర్త; అవేనా ప్రోచినవి ? అవేనా నటికినవి? "సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకం బగు" ననుసూత్రమును పంతులవారనుభవమునకు తెచ్చుకొనమికి ఈగ్రంథమందు ఈయొకనిదర్శనమే గాదు. ఏండ్లతరబడి యాంధ్రోపాధ్యాయులంట ? కవితాతత్త్వవిత్తంట ! ఆంధ్రవ్యాకరణ పాండిత్యమిట్లున్నది ! ఈపాండిత్యముతో ఆంధ్రభాషా సంజీవకులంట ! కాలమహిమ ! **12.** నిస్పందియము.

౧౫ - వ పుట.

రావణుఁడు.— (సక్రోధుండుగ) హా! ఓరి పాపుఁడా ! అయుక్తముగా
[16] నాదు శిరశ్ఛేదము దెలుపుచు నాయమంగళమును భావింపుచున్నావు.
337 మంజీరకుఁడు.— (విహసించి) ఓయిదశకంఠుఁడా అయుక్తముగా మస్తకచ్ఛేదంబును మంగళమున కెట్లగు ?

రావణుఁడు.—ఓరీయుక్తమే, ఎట్లన్న;

(పిప్పిపద్యము)

క॥ ఘనవిద్యాధరవనితా । జనకరవిన్యస్తకుసుమచయసంకీర్ణం
బునశివచరణమునసురణ । మునఁదలగమిలెగుటనాకు మొగిమంగళమే.

**1.** అయుక్తముగా— మూ. అస్థానే=అస్థానమందు. ["ఉభయోరప్యస్థానే యత్నః." "అస్థానే మహా నర్థోత్సర్గః క్రియతే." "అస్థానే కోపః." ముద్రా.

**2.** "అయుక్తముగా మస్తకచ్ఛేదంబును మంగళమున కెట్లగు ?"—రావణుఁడు ఏతత్పూర్వభాషితములో "నాయమంగళమును భావించుచున్నావు" అని యడిగియుండఁగా, ఆమాటలో దోషము చూపఁగోరినవాఁడై వైతాళికుఁడు నిజోద్యమవిరుద్ధముగా 'అయుక్తముగా' అని ప్రశ్న వేయుట సరసముగా లేదు. వైతాళిక ప్రశ్నకు ఇట్లు అర్థము కల్పింతురు గావలయు:— అయుక్తముగా మస్తకచ్ఛేదము అమంగళమునకే అగును. అందుల కాక్షేపమేమి ? —అని. ఈయర్థము ఏతద్వాక్యాక్షరములకు సరిపడునేగాని యిది యుత్తరవాక్యములను విరోధించుచున్నది. ఎట్లన ?—'యుక్తమే' అని రావణుఁ డిందులకు ఉత్తరము చెప్పెనుగదా. ఏమి యుక్తమని యతనియభిప్రాయము ? అయుక్తముగా మస్తకచ్ఛేద మమంగళమున కగుట యుక్తమే యని గదా యతని యభిప్రాయము కావలయును ? అందులకు యుక్తతాసమర్థకముగా నతఁడు చెప్పిన 'ఘనవిద్యాధరే' త్యాదిపద్యము అమంగళమును

సిద్ధాంతింపక మంగళమునే సిద్ధాంతించునది విరుద్ధముగదా? కావున వైతాళికవాక్యమునకు ఉత్ప్రేక్షింపఁబడిన యీద్వితీయార్థంబును సరిగాదు. తొలిదియు సరిపడలేదు. అయుక్తముగా మస్తకచ్ఛేదమువలన నమంగళ మని రావణుఁడు కోపగించినాఁడుగావున, యుక్తముగా నైనచో మస్తకచ్ఛేదము మంగళమునకా యని వైతాళికుఁడు ఆక్షేపించి యుండిన, ఆంధ్రీకరణము సరిగాకపోయినను ఆంధ్రవాక్యములలో ప్రశ్నోత్తరములకు సంగతియేని సిద్ధించును. ఆయాక్షేపమునకు రావణుఁడు 'యుక్తముగా మస్తకచ్ఛేదము మంగళమే' యని యుత్తరము చెప్పి సమర్థింపవచ్చును; తొలిరెండు ప్రశ్నోత్తర భాషితములు నీరసములే మూలవిరీతములే అయినను పరస్పరము సంగతపడియుండును. ఆమార్పుతోఁగూడ మూఁడవభాషితమును. **3**. 'యుక్తమే, ఎట్లన్న' అనుదానిని 'యుక్తముగానైన మంగళమే ఎట్లన్న' అని మార్చుకొన్నచో అదియు, ఆరెంటితో సంగతపడును. మఱియు రణమందును శివచరణమందును తనతలలు తెగుట యుక్తముగా తెగుట యనియు, వేఱుచో తెగుట అయుక్తముగా తెగుట యనియు, రావణభావముగా నన్వయమై యీపద్యముగూడ జఘన్యముగానే యయినను కడమభాషితములతో కొంత సంగతపడును. పూర్ణముగా సంగతపడమి యేల యనఁగా, చోటులను చెప్పుట సాక్షాత్తుగా యుక్తతను సమర్థించుటగాదుగదా, ఆచోటుల తెగుట యుక్తమని మఱల సమర్థనసాపేక్షముగదా. ఈమూఁడుభాషితములును ఇట్లు పాడయినందులకు కారణము:— స్థానశబ్దమునకు ప్రదేశార్థము గ్రహింపక యుక్తార్థము గ్రహించుటయు, ద్వితీయభాషితమందు **4**. నఞ్ఞు పెట్టుకొనుటయు. ద్వితీయభాషితము తెనుఁగుముద్రణములో "అయే దశకన్ధర, కథమస్థానే మస్తకచ్ఛేదోపి మఙ్గళాయ భవతః" అని యున్నది. పంతులవారు **5**. భవతఃపదమును తెనిఁగింపక వదలినారో భవతి యని మార్చుకొన్నారో? భవతః=నీకు. భవతి=అగును. వీరు భవతఃపదమును తెనిఁగించి యున్నచో, ఈద్వితీయవాక్యమున నీకుశబ్దము నిరర్థకమై అస్థానేపదమునందలి నఞ్ఞు తప్పని సూచించును. అట్లే దానిమూలమందు భవతఃపదము సూచించుచున్నది. నాగరముద్రణమున నఞ్ఞు లేదు. ఈదోషములు దిద్దుకొనిన ఈభాషితములు మూలార్థమిచ్చును.

రావణుఁడు.—[సక్రోధంబుగ]...అస్థానమందు నాదుశిరశ్ఛేదము దెలుపుచు నాకమంగళమును భావించుచున్నావు.

మంజీరకుఁడు.—[విహసించి]...స్థానమందైనచో మాత్రము మస్తకచ్ఛేదము మంగళమునకా?

రావణుఁడు.—ఔను, స్థానమందైన మంగళమునకే, ఎట్లన—

మూ. విద్యాధరప్రణయినీకరపల్లవాగ్ర। లీలావిముక్తకుసుమప్రకరావకీర్ణే
శ్రీచన్ద్రచూడచరణే చరణే చ కామం। ఛిన్నోపి మస్తకగణో మమ మజ్జతాయ.

తెనుఁగుపద్యములో, **6, 7, 8.** పల్లవాగ్రలీలలు పోయినవి, **9, 10.** శ్రీచంద్రచూడలుపోయినవి, **11.** అపిశబ్దస్వారస్యము పోయినది, **12.** కామమ్ [అకామానుమతో కామమ్]—దీనిస్వారస్యంబును పోయినది; అనఁగా, శృంగారము, భక్తి, విషయస్వారస్యము ఈ మూఁటిని పంతులవారు 'పీఁకి' పాఱవేసినారు. వీనికి బదులుగా **13.** ఘన **14.** జన **15.** మొగులను ప్రాసబంధు యతిప్రాసోభయబంధు యతిమాత్రబంధువులను ముగ్వురిని సంపాదించినారు. **16.** సంకీర్ణ మనుటకన్న వక్తవ్యార్థమునకు అవకీర్ణమనుటయే మేలు. పిప్పిపద్యమేనా? సందేహమా?

ఈ సమర్థనమందు రావణుఁడు యుక్తతను బొత్తుగా తలపెట్టకయే పోయినందునను మస్తకచ్ఛేదమునకు స్థానమునే చెప్పినందునను పూర్వభాషితములందును స్థానమునుగూర్చియే చర్చగాని యుక్తతనుగూర్చి యెంతమాత్రమునుగాదని ముంజేతికంకణమువలె తెలియుచున్నది.

**1.** వర—ప్రా. **2, 3.** తచ్ఛివ—పా. **4.** ఒకఁడు—పా. **5.** లజ్జఁగా—పా.

[16] క॥ పురహరగిరిసంచాలన। వరశక్తిసమన్వితములు బాహులునావీ
353 గురుభుజములచేఁ దచ్ఛివ। శరాస మొకఁడెక్కిడ నెటు సైఁతునులజ్జఁగా.

మూ.—యే చన్ద్రచూడాచలచాలనైక। చాతుర్యచిన్తామణయో భుజా మే
తైరేవ భూయిష్ఠతరైః ప్రవృత్త। శ్చాపాధిరోపాయ కథం న లజ్జే.

**6.** పురహర— చంద్రచూడ అన్నంత రంజకముగాదు. **7.** వర—ఇది ఏకచాతుర్యచిన్తామణయః అనుటకు సమానమా? **8.** గురు—ఇది భూయిష్ఠతరైః అనుటకు సరియా? **9.** తైరేవ—ఇందలి ఏవకారము తెనుంగునం బోయినది. **10, 11.** తచ్ఛివశరాస మొకఁడెక్కిడ—తచ్ఛివ అన నేల? ఇంకొకరిశరాసమైన నెక్కిడ లజ్జ యుండదా? **12.** ఒకఁడు—మూఁడుశరాసములయినచో ఎక్కిడ లజ్జ యుండదా? మఱియు **13.** ఒకఁడనుపూరణముచేత, ఒకపక్షమున,నితని బాహువులతో అన్యుఁడెవఁడో శరాసన మెక్కువెట్టింపఁ గడంగుచున్నట్లు అర్థమగుచున్నది. ఇంకొకపక్షమున **14.** అట్టి గురు బాహువులుగలవాఁడనయ్యు నన్యుఁడెవఁడో శివచాప మధిరోపించుచుండ నేనెట్లు సహింతును,అని యర్థము స్ఫురించుచున్నది. పాదపూరణప్రభావ మగపడుచున్నదా? **15.** ఎటుసైఁతును అనుటకు లజ్జింతును అనియే భావము. దానిని వాచ్యభంగిగా 'లజ్జఁగా' అనిచెప్పుట సొబగు చెఱుచుటగానున్నది. **16.** మఱియు నిట రచనాభంగిలో ఈవాక్య

ముతో లజ్జిత అనుపదము సుఖముగా అడుకదు. శరాసమెక్కిడ నెట్లులజ్జింపను, అన్న నెంతయు చక్కఁగానుండును; మూ. కథం నలజ్జె. తచ్ఛివశరాస మొకఁ డెక్కిడ— మూ. చాపాధిరోపాయ; తెనుఁగులోని యెక్కువమాటలు మూలములో లేవు.

[పనికిమాలినవాక్యము.]

నూపురకుఁడు—నెచ్చెలీ, దిగులొందకుము. ఈరాచపిండునందెల్ల నొకం
[1] డైనను తగనిపనికిఁ బూనిన వీనికెదురుగ నిలువఁగలవాఁడు లేఁడు.—
354 సీతను రావణుఁడు బలాత్కారమున హరించునని మంజీరకవైతాళికుఁడు దిగులుపడుచుండఁగా వానికి నూపురకుఁడు దిగులుతీర్చువాక్యము ఇది. రాచపిండులో రావణునిదౌర్జన్యము నాఁపఁగలవాఁడెవఁడేనియున్నచో మంజీరకునికి దిగులుతీఱును గాని లేనిచో దిగులెట్లు తీఱును? 1. లేఁడా అనవలయును.

[పనికిమాలినవాక్యములు.]

నూపురకుఁడు—[సహర్షంబుగ] బ్రతికితిమి అ. వేయిచేతులుగల కృతవీర్యు
[4] కొడుకువచ్చెనా?
358 మంజీరకుఁడు—[విహసించి] ఇస్సీ తెలివిలేనివాఁడా, పరశురాము కఠోరకుఠారధారాజల నిమగ్నుఁడైన యర్జును నీవుదెట్లు చూచుచున్నావు?

కృతవీర్యసుతుఁడు వచ్చెనని నిశ్చయముగా తలంపనిచో నూపురకుఁడు బ్రతికితిమి బ్రతికితి మని యేల హర్షావేశముతో పలుకును? వచ్చెనని తలంచినచో వచ్చెనా యని ప్రశ్నయేలచేయును? 1. వచ్చెనాయనఁగూడదు వచ్చెను అనవలయును. 2. వేయిచేతులుగల కృతవీర్యకొడుకు— కృతవీర్యుఁడు వేయిచేతులవాఁడు అని యర్థమగుచున్నది, అతని కొడుకు వేయిచేతులవాఁడని యర్థముగావలయును; వేయిచేతులుగలకృతవీర్యసూనుఁడు అనవలయును. 3. “ఎట్లుచూచుచున్నావు”—ఈధిక్కారము తెలివితక్కువను సూచించుచున్నది. చూచుచున్నానని నూపురకుఁడు చెప్పలేదు గదా, ఎట్లుచూచుచున్నావు అని యీయధిక్కార మెట్లుపొసంగును? 4. పైగా నూపురకుఁడు కార్తవీర్యుఁడు వచ్చెనా యని పలికెనేగాని, వచ్చెననియే చెప్పలేదుగదా? ఎట్లు చూచుచున్నావనుటయు వచ్చెనాయనుట తప్పేయనుటకు నిదర్శనము. నూపురక భాషితమునకు నాగరముద్రణములో మూలము.

నూపురకః.—[సహర్షమ్] జీవితోఽస్మి। ప్రేక్షస్వ ప్రేక్షస్వ। నను సంప్రాప్తః సహస్రబాహుః కృతవీర్యపుత్రః.

నూపురకుఁడు.—[హర్షముతో] బ్రదికితిని, చూడుము చూడుము, అదె వచ్చినాఁడు వేయిబాహువులవాఁడు కార్తవీర్యుఁడు.— అని యర్థము. నూపురకభాషిత

మును ఇట్లు తెనిఁగించుకొని యున్నచో, మంజీరక భాషితములో 'ఎట్లు చూచుచున్నావు' అను దూషణ సరిగానే యుండును. "ప్రశ్నావధారణానుజ్ఞానునయామన్త్రణేననను" అని యమరము. ననుశబ్దమునకు ప్రశ్న, అవధారణము, అనుజ్ఞ, అనునయము, ఆమంత్రణమును అర్థములు; ఇందు పంతులవారు ప్రకృతవిరుద్ధమైన ప్రశ్నార్థమును గ్రహించినారు. అవధారణార్థమును గ్రహించి యుండవలసినది.

౧౬ - వ పుట.

అనన్వితము, చవుడు.

[10] క॥ కైలాసముకంటెఁడు । సారతరంబైనధనువుశర్వునిదిదినే
368 లీలంగుసుమసమముగఁ । గేలంగావింతుభుజవనిఁసఫలముగఁ.

1. రలప్రాస మహాభాగ్యము.— 2. కేలఁ—మూలముంబట్టి 'కేలంగొని' యని యుండవలయును. అట్లుండమిచే నుత్తరార్థ మనన్వితముగా నున్నది. కేలం గావింతు ననఁగా చేతఁగొనియెద నని యర్థ మేని దానికి, దీనిఁ [ధనువును] అన్న కర్మ యధ్యాహార్యమై, లేక, 'ఇది' కర్మయై, భుజవనిఁ అనుద్వితీయకు గతి లేకపోవును. కావింతు ననుటకు చేసెదనని యర్థ మేని దానికి భుజవని కర్మ యగును, కుసుమసమముగఁ అను క్రియావిశేషణమునకు క్రియ లేకపోవును. 'ఇది కేలం గుసుమసమముగఁ' [కుసుమసమము కాఁగా] అని యొక విపరీతార్థము చెప్పపక్షమున, నేను శబ్దము కేలన్పదమునకు తర్వాత నుండవలయును. శర్వునిదిది యనుపఙ్క్తి వాక్య సమాప్తి యను తలంపునం జేయు నన్వయము లివి. అట్లుగాక శర్వునిదైన యీధనువును అనియర్థముగా ఇద్యాదిపదములు ద్వితీయార్థము లనుపక్షమున, కుసుమసమముగఁ అనుపదమునకు కుసుమసమము కాఁగానని విపరీతార్థము చెప్పిన, ఆకన్నునకు కాఁగా ననునర్థమున కర్తగా ఇది (శర్వునిధనువు) అని యొకప్రథమను అధ్యాహరించుకొనిన, ఆకన్నునకు కేలఁ అధికరణముగాఁ గొనిన, నొక యన్వయ మగును. కావించుటకు పని కర్మ యగును. పంతులవారి యభిప్రాయ మిట్టిదే యగునెడల, "సారతరము నీధనువును శర్వునిదానిఁ" అని ద్వితీయపాదమును వ్రాసికొని యుండరాదా? పద్యము నిట్లు మార్చిన నన్వయము కలుగును.—

కై...నా। కేలం గుసుమసమముగఁ। గ్రాలం గావింతు భుజవనము సఫలముగఁ.

మూ. కైలాసశైలశిఖరా దపి భూరిసారం। నిస్సీమసార మధునా ధనురిన్దుమౌళేః
ఆలమ్బ్య పుష్పసదృశం కరపల్లవేన। స్ఫీతం భుజద్రుమవనం సఫలీకరోమి.

కైలాసశైలశిఖరముకన్న సారతరంబును మేరలేనిసారము గలదియు నగు నిందుమౌళిధనువ్వును ఇదె ఇప్పుడు నేను పువ్వునుంబోలె నా కరపల్లవమునం గొని విస్తీర్ణమైన నాభుజవృక్షవనమును సఫలము చేసెదను.—అని మూలార్థము.

తెలుఁగు పద్యములో 3. శైలశిఖరము పోయినది. 4. నిస్సీమసారము పోయినది. 5. అధునా, పోయినది. 6. ఇందుమౌళికిబదులు, [బాణాసనం భగవతో వృషభధ్వజస్య యను పాఠాంతరముప్రకారము భగవతోవృషభధ్వజస్యకు బదులు] శర్వుఁడు పడినాఁడు. 7. ఆలంబనము పోయినది; కేలన్—మూ. కరపల్లవేన, 8. పల్లవము పోయినది. పుష్పసదృశముగా ధనువును కరపల్లవమునం గొని భుజద్రుమ వనమును సఫలముచేసెద నని మూలములో పుష్ప పల్లవ ద్రుమ వన ఫలములచే సూచితమయిన చమత్కారము తెలుగులో 9. ద్రుమ 10. పల్లవ త్యాగము చేత నష్టమైనది.

రావణుఁడు.—[వినఁబడిమిచేత] ఓయీ! ఇప్పుడును సీత రప్పింపఁబడ
369 కున్నదా?—ఈ ప్రశ్నవాక్యమువలన, సీత వచ్చినదో రాలేదో రావణునికి తెలియనట్లు అర్థమగుచున్నది. వచ్చియున్నచో ఇరువదికన్నులు గలవే తెలియదా? కానిచో, వచ్చియు తనకదృశ్యయై యుండునని రావణుఁ డేల తలంచును? 'రప్పింపఁబడ కున్నదేమి?' అనవలయును. ఉన్నమాటకే యీయర్థమును సాధింపవచ్చుననుచో, ఎంతయు ప్రయాసపడక అది కాదు.

బాణాసురుఁడు.—...ఓయీ ఇంత శూరవారమందు నెవరిచేతఁగాని యీ సింగాణి యెక్కిడఁబడదయ్యెనా?

[2] మంజీరకుఁడు.—ఎక్కిడఁబడదయ్యెడు.
371 రావణుఁడు.—[చూడఁబడమిచేత] అందువలన నాదుచంద్రహాసమే సీతను రప్పించును.

ఇందు మంజీరక వాక్యమునకు మూలము "నారోపణీయంచ" అని. దానికి ఆరోపింప నశక్యము అని అర్థము. రావణుఁడు దానికే ఆరోపింప ననర్హము అని యర్థము కల్పనచేసికొని, అందువలన [ఆరోపింపఁ గూడదు గాన] పోయి అంటటిని నఱికి సీతను తెచ్చెదను, అని యభిప్రాయముగాఁ బలికినాఁడు. [అందువలన అనుటచే ఇంకను సీతను మీరు తీసికొనిరాలేదు గావున అనియును రావణుని యభిప్రాయమే.] 1. నారోపణీయమ్మనుటయందలి శక్యార్థార్హార్థములు ఎక్కిడఁబడదయ్యెడు అను లాట్టుచే రాకచెడిపోయినవి. బాణాసురునిప్రశ్నలో ఎక్కిడఁబడదయ్యెనా అనఁగా ఎవనికిని శక్యముగాక పోయెనా యనియే అభిప్రాయము. ఎక్కిడఁబడియున్నయెడల స్వయంవరము నిర్వృత్తమైయే యుండునుగదా. కావున ఎక్కిడఁబడినదా లేదా యనుప్రశ్నకు అవకాశమేలేదు. కాన మంజీర కోత్తరంబును శక్యతాపరమే. రావణుఁడు నిజాశక్తిని చెప్పకోఁడుగావున దానికి అర్హత్వార్థము గల్పించుకొని యుత్తరము చెప్పటయు న్యాయ్యమే.

2. "భూతంబున లజికి లిడంతంబగునగుధాతు వనుప్రయుక్తం బగు." బాల. క్రియా. ౧౧౪. వాఁడు రాఁడయ్యెను...మేము రామయితిమి—అని యుదాహరణములు. ఏతత్సూత్రరీతిని వ్యతిరేకమునకుభూతమున అగుధాతువు భూతార్థము అను ప్రయుక్తమగునుగాని లాడాధికములు కానేరవు. ఎక్కఁడఁబడదయ్యెడునఁట! నలువది యేండ్లయాంధ్రపండితుల యాంధ్రవ్యాకరణజ్ఞానము ఎట్లురేఁగుచున్నదో యరయుఁడు. ఇది రెండవమాఱు వీరితప్పుచేయుట. ౧౧ - పుటలో 'లేఁడయ్యెడుఁగా' అని తొలిమాఱయినది. వీరే క్రొత్తవ్యాకరణము చేయవలసినవారు.

బాణుఁడు.—[విహసించి] నీ వీరలక్ష్మీవిలాస మిటువంటిదేని, విల్లెక్కు వె
[2] ట్టకయే సీత యెట్లు రప్పింపఁబడును? ఆ! పొల్లుప్రల్లదము లాఁడువాఁ
373 డెవఁడు వీఁడు?

రావణుఁడు.—

ఆ॥ చండబాహుదండచలితహరాచల । కీర్తిశాలి నగుచుఁ గెరలునాకు
బాలబిససదృశము బాణాసనము నెక్కు । వెట్టుకోర్కిఁ గల్గు నెట్టిదనము.

బాణుఁడు.—ఇది యశక్తిపర్యాయోక్తి.

ఇందు "నీవీరలక్ష్మీ...రప్పింపఁబడును?" ఈభాగము సరిగా నాంధ్రీకృతము గాలేదు. [నీవీరలక్ష్మీవిలాస మిటువంటిదేని—చంద్రహాసముచే సీతను రప్పింపఁగల వీరుఁడవేని] 1. విల్లెక్కు వెట్టకయే సీతయెట్లు రప్పింపఁబడును? అనుటకు మాఱుగా, విల్లెక్కువెట్టియే యేల సీతను రప్పింపవు, అనుట సరి. దానికిదే తాత్పర్యమందురేని, దుర్ఘటము. విల్లెక్కువెట్టకయే సీతను రప్పింపనేల, అనియేని వ్రాసికొని యుండినం గొంతమేలు. 2. ఈ యధిక్షేపమునకుం గెరలి రావణుఁడు 'ఆ! పొల్లుప్రల్లదములాడు వీఁడెవఁడు,' అని పలికినాఁడు. ఈ ముక్క ఈ తెలుఁగులో బాణభాషితముగానే యున్నది. బాణుని ఇంతవఱకును రావణుఁడు చూడలేదు. 'నీవీరలక్ష్మీ...రప్పింపఁబడును?' అను భాషితము విని, అంతట బాణునిం గనుచు రావణుఁడు 'ఆ! పొల్లు' ఇత్యాది వాక్యము పలికినాఁడు. బాణుని రావణుఁడు తొలిమాఱు చూచిన ఘట్టముగాఁ జెప్పఁదగినది ఇది తప్ప వేఱు దీని తర్వాత లేదు. కాన నీ లఘువాక్యమును రావణభాషితములో చేర్చియుండవలసినది. ఇది బాణభాషితమే అని వాదించుపక్షమున [నీవీర...రప్పింపఁబడును], తన యధిక్షేపమునకు ఉత్తరము రాకముందే బాణుఁడు ఇట్లు ఉలికి పలుకుట సరిగాదు. చంద్రహాసమే సీతను రప్పించు ననురావణవాక్యమునకే బాణుని యాకేకరింతయేని, ఇది యా చంద్రహాసాదివాక్యమునకు అవ్యవహితముగా నుండఁదగును. అట్లు లేదు; కావున నిది బాణవాక్యము గాదు, రావణవాక్యమే. పంతులవారి మూలములో నిట్లున్నది.

బా॥ విహస్య—యది తావ దీదృశీ వీరలీలా—కథం చాప మనారోప్యైవ హా నీయతే సీతా—అః కోయ మళీకవాచాలకః॥

ప॥ ఉద్దణ్డచణ్డిమలసద్భుజదణ్డషణ్డ । హేలాచలాచలహరాచలచారుకీర్తేః
కీదృ గ్వ్యశ స్తులితబాలమృణాలకాణ్డ । కోదణ్డకర్షణకదర్థనయానయామే.

బా॥ సోయ మశక్తిపర్యాయః.

ఇందు రెండుబాణభాషితములకు నడుమ రావణభాషిత మెటనారబ్ధమైనదో ముద్రితముగా లేదు. ఆయచ్చుపొరఁబాటును వీరు దిద్దుకొనలేక, అర్థసందర్భమును గనలేక వాచాలకః అనుపదముతర్వాతికుడ్యయుగమే ప్రమాణముగా విభజించుకొన్నారు. అర్థజ్ఞులకు అః కోయమ్ మొదలు రావణవాక్యముగా తెలియును. నాగరముద్రణమున సరిగానే యున్నది. వీరు ఆయక్షరము లేని నేర్చియుండరాదా!

నీవీరలక్ష్మీ—పంతులవారి మూలములో నీ లేదు.

[2] రావణుఁడు.—ఆ! ఓరీ ఈ దశాస్యునిశక్తిసంభావన యెట్లు?
375 బాణుఁడు.—[నవ్వి] ఓయీ! బహువదనత్వము బహుప్రలాపితకు హేతువు పరాక్రమమునకు బాహుబలమే.

1. అశక్తిపర్యాయమని బాణుఁడన్నందులకు కినిసి, దశాస్యుఁడనైననాకుం గూడ నశక్తియా,యని రావణుఁడు బాణు నధిక్షేపించువాక్య మిది.దీనికుత్తరమైన బాణవాక్యము అశక్తినే స్థాపించుచున్నది. ఈ రావణభాషితంపు మూలవాక్యములో. ప్య అనుటకు బదులు స్య అని అచ్చులో పొరఁబాటుపడినందున పంతులవారికి ఈ పాటు సంభవించినది. అర్థసంగతి యేల? అంధబలీవర్దన్యాయమేగదా కావలసినది.

రా॥ రే అః కథం దశవదనస్యాస్య శక్తిసంభావనా॥

దశవదనస్యా ప్యశక్తిసంభావనా అనియుండవలయును. 'ఆ! ఓరీ! ఏమీ! దశవదనునికిఁగూడ నశక్తి యనితలంచెదవా?' అని తెనిఁగింపవలయును. నాగరముద్రణములో ప్యశక్తి యనియేయున్నది.

2. బహువదనత్వమనుటకు సరిగా బహుబాహుత్వమే యనుట మేలు. మూ. బహుబాహుత్వైవ. తెలుఁగులిపిలో భుజశాలిత్వైవ అనియున్నది. అదియుభావప్రత్యయాంతమే. తెనుఁగువాక్యములో ఏసామ్యమును రాలేదు.

బాణుఁడు.—పలాలజాలనిస్సారమా, నాభుజసారము? ఇక్కడఁగదా?

శా॥ పాతాళంబున కేగితండ్రిదిపదాబ్జద్వంద్వముంగూర్చి సం
[11] ప్రీతిం ద్రొక్కఁగనెన్నిమాఱులటనావేచేతులందాల్చి యీ
386 ధాత్రిన్ నిర్గతభారసర్వఘనుఁగందద్దందహూకేంద్రుసం
ప్రీతుం జేయఁగనైతి యూర్మ్యకిటి దిగ్వేదండముత్మ్యేలనన్.

బాణః.—కథం పలాలజాలనిస్సారో మే భుజసారః। అత్ర హి।
పితుః పాదామ్భోజప్రణతిరభసోత్సిక్తహృదయః
ప్రయాతః పాతాళం న కతి కతి వారా నకరవమ్
సహస్రే బాహూనాం ఝటితివలయ మాసజ్య సకలం
గళద్భారోద్వేలాం ఫణఫలకమాలాం ఫణిపతేః.

1. "ఇక్కడఁగదా"— ఏమర్థము? మిథిలానగరములోనా? అచటనేనా పాతాళమున్నది? పద్యములో నొక యటశబ్ద మున్నది. ఆ యట యన నెట? పాతాళమందా? ఇటనే అట, అటనే యిట, నని పాతాళమే మిథిల, మిథిలయే పాతాళమని, పిల్లి మంతరములా? హూలముంబట్టి 'ఇక్కడ' ననుమాట 'వేచేతులకు' విశేషణము. రెండునుంజేరి 'యీవేచేతులందు' అనియర్థమిచ్చును. పంతులవారు ఆయన్వయమును గ్రహింపలేదని మూలములోలేనిది పద్యములో నొక 2. యటశబ్దము దూర్చుటచేతను, 3. నాశబ్ద మొకటి చేర్చుటచేతను, విశదమగుచున్నది. 4. తండ్రిది— అది యేమి? ఏయవయవము? అది యెక్కడపెట్టుకోవలయునో అక్కడ అతఁడే పెట్టుకోలేఁడా? అదియేనా పాతాళంబున కేగినది? మ్రొక్కులు దేనికి? తండ్రిదానికే అని యన్వయమగుచున్నది. మఱియు దానిని పలుమాఱు తన వేయిచేతులందాల్చుటచేత నీధాత్రియందు ఫణిపతికి భారము తగ్గించినట్లును సమన్వయము పాదపూరణాది వర్జ్యప్రభావముచేత గందరగోళించుచున్నది. కూర్మకిటి దిగ్వేదండము ల్మేలనఁగా.—ఇది యమూలకము, పాదపూరణము. 5. 'మేలనఁగా' అనుటకుమాఱుగా 'మ్రొక్కఁగాఁ' అనిన సరసముగానుండును, కూర్మాదులును మోచునవియేగావున భారావతారణోపకారమునకై యితనికి నమస్కరించిన వని యర్థమగును. ఇక్కడఁగద అనుటకుముందు, '[బాహువులనుజూపుచు]' అని వ్రాసికొని, అట యనుటకుబదులు తమకభ్యాసమైయున్న యహాదమును వేసికొని, దిపదాబ్జమునకు బదులు చరణాబ్జమును పెట్టుకొని, మేలనఁగా అనుటకు మ్రొక్కఁగా నని మార్చుకొన్నచో, పద్యము ఇంతకన్న మేలగును, పంతులవారిఘక్కిగానే యుండును, తదీయదోషములు కొన్ని తొలంగును.

ఈపద్యములో ముందు రాఁదగినపదము ప్రాయికముగా తర్వాతనే వచ్చుటచే అర్థగ్రహణమందు వృథాక్లేశము కలుగుచున్నది. ఏగి మ్రొక్కఁగ—అనుటలో సహజముగా 6. ఏగిమ్రొక్కినప్పుడు అని యర్థమగును, అటుపై కొంతదూరము చదివినపిమ్మట అది గాదనుకొని 7. మ్రొక్కుటకు ఏగి యని యర్థముచేసికొనవలసియున్నది. [దీనికిఁదోడు తండ్రిదానిని అతనిపాదములంబెట్టి యనియు నొక యర్థము

మధ్యలో అసందర్భపడుచున్నది]. మఱియు 8. ప్రొక్కుటకై యీ పేచేతులం దాల్చినట్లు అన్వయమగుచున్నది. 9. పదాబ్జద్వంద్వమున్దాల్చి యనియు అన్వయము తొలిఁదొలి స్ఫురించుచున్నది. తాల్చుటకు కర్మమైన ధాత్రి ముందే వచ్చియుండిన నీదుష్టాన్వయము లుండవు.

10. ఫణుఁగన్ సంప్రీతున్ అనుట సొంపుగా లేదు, ఫణతన్ సంప్రీతుననిన ఇంతకన్న కొంత బాగుగనుండును. 11. చేయఁగనైతి—మూ. న అకరవమ్. చేయన్ పదము మూలానుసారముగా వ్యతిరేకమేని గన్ పనికిరాదు, తుమున్నంతమేని, చేసితి నని మూలార్థము రాదు. పంతులవారు అవిచారితరమణీయముగా వ్యతిరేకముగానే ప్రయోగించియుందురు. పద్యమిట్టున్న నింతకన్న సుఖముగా నుండునని తలంచెద.

బాణుఁడు.—. . . . . . దీనియందే,

శా॥ తాతాంఘ్రిద్వికు శేశయీ ప్రణమనోత్క స్వాంతపద్మండనై
పాతాళంబున కేగి యెన్నితఱవల్ బాహాసహస్రంబునన్
ధాత్రిం దాల్చి ఫణీంద్రు నిర్గతభరోద్దామస్ఫటామాలికా
స్ఫీతున్ బ్రీతు నొనర్ప నైతిఁ గిటిదిగ్వేదండము ల్జే యనన్.

17 - వ పుట.

1. మది—య.

[2] ౩౮౮ ఆ॥ చంద్రమౌళిధరము శయపల్లవశయంబు। గాఁగఁజేనెనే వికలశసంప్ర
తిష్ఠ వీరలక్ష్మి దివ్యసౌధంబులౌ। మద్భుజములమహిమ మది నెఱుఁగవు.

మూ.—దోష్ణాం న మే విదితవా నసి వీరలక్ష్మీ
ప్రాసాదవిభ్రమభృతాం పదవీం గరిష్ఠామ్
యే చన్ద్రశేఖరగిరౌ కరపల్లవాఙ్క-
పర్యఙ్కశాయిని దధుః కలశప్రతిష్ఠామ్.

ఇందు బాహువులు మేడ యనియు కైలాసము తదుపరి కలశమనియు భావము. ఈ భావమును పదమునం గనిపట్టుట మూలార్థజ్ఞానపూర్వకముగా యత్నించినను 1. కష్టముగానున్నది. ఈ యర్థమువచ్చునట్లుగా పద్యమును ఇట్లన్వయించుకొనవలయును.—ఏవి శయపల్లవశయంబు [ను] చంద్రమౌళిధరము [ను] కలశసంప్రతిష్ఠ గాఁగఁ జేనెనో (చేసికొనెనో) వీరలక్ష్మీదివ్యసౌధంబులు [అగు] ఆమద్భుజముల మహిమ[ను] మది నెఱుఁగవు. ఇట్లు మార్చిన, కొంకిబికి చెడకయే అన్వయము కలుగును.

చంద్రమౌళిధరము శయపల్లవశయంబుఁ। గలశసంప్రతిష్ఠగా ధరించి
నటులు వీరలక్ష్మి పైజయంత మయి యే। మద్భుజములు వానిమహిమఁ గనవు.

1. వబప్రాసము. 2. ప్రవరత—ప్రా. 3. ఏ—పా.

బాణుఁడు.—

[5] క॥శివధర్మ మెక్కు వెట్టుట । యవనితనయ నేను బెండ్లియాడుటకై కా
393 దు బహుళ దోర్వ్యూహబల । ప్రవరత ప్రథితముగఁ దెలియఁబఱుచుటకొఱకే.

4. నేను.—దీనిచోటు సరిగాదు. ఇది పద్యముతొలుత నుండవలసినది. ఇప్పు డున్న తావున నిది యప్రయోజకము. పద్యముయొక్క 5. చప్పందనము మూలముం గన్నఁ దెలియును. కొఱకే—ఈయవధారణ మప్రయోజకము.

మూ.—త్రిపురమథనచాపారోపణోత్కృష్టితాధీ
ర్మ మనజనకపుత్రీపాణిపద్మగ్రహాయ
అపి తు బహుళబాహువ్యూహనిర్వ్యూహమాలా
బలపరిణతిహేలాతాణ్డవాడమ్బరాయ.

1 సు—య. 2 యా—పా:

రావణుఁడు.—

[2] క॥శివగిరిశిఖరముఁ బెఱికుట । సువిదితమస్మద్భుజబల సుపరీక్షయిదో
395 శివధనురానమనక్రియ । యవనిజకుచయుగళకేళికాసక్తినెయా.

సుపరీక్ష—ఇది సుపారిజాతమువంటిది. యా—ఇది తలవిసరు; ఔననుట వాక్యపటిమం జెఱుచుట.

1. క్త్వార్థేకారసంధి. 2. అశ్లీలదోషము.

[3] క॥ఎవఁడేని సురాసురమా । నవకిన్నరసిద్ధచారణఖగాహులలోఁ
398 దివిచెక్కుడునీధనువుఁ । దవువాఁడు మదీయసుతకుధవుఁడుగనుండన్.

తివిచెక్కుడున్=తివిచి+ఎక్కుడున్, క్త్వార్థేకారసంధిదోషము; మఱియు, 2. తివిచి ఎక్కుడు అనుక్రమము సరిగాదు, ముందు ఎక్కుడుట, పిమ్మట తివుచుట. ఈకవి ప్రాసపూరణము దొరకినయానందములో మునిఁగెనేగాని, అర్థము చెడుటం గనలేక పోయెను. అట్లే తుదను పాదపూరణార్థమై దొరకిన యుండను సంతోషమొందెనే గాని ధవుఁడుగనుండుటకు అనఁగా, ఉంచుకొనుటకు, అను నశ్లీలార్థము సంభవించుటను గనలేకపోయెను. ఉత్తరార్ధము నిట్లు మార్చుకోవలయును.—

తివిచెడునెక్కిడియీవిలు । తవునావీరుండు నాసుతం బెండిలిగాన్.

మ॥ ఎవఁడేనన్యుఁడుదీని భీమునిదియానిప్వాసమెక్కించితా
[8] నవనిప్రోద్భవఁ బెండ్లియాడిననునేనత్యద్భుతిన్ మైథిలిన్
406 జవమారంగనులంకఁ జేర్తునువచస్సంతర్పితం జేయుదున్
స్వవశంగానొనరింతునెంతయుమహాసంతోషముంగాంచెదన్.

1. దీనిన్ ఇష్వాసము—భిన్నవిభక్తితాదోషము. 'దీనిభీమునిదియానిష్వాసమును' అనియేని, 'ఇది భీమునిది యానిష్వాసము' అనియేని, ఉండవలయును. 2. ఎక్కించి—ఎక్కువెట్టియనుట మేలు. 3 అవనిప్రోద్భవఁ బెండ్లియాడినను నేను మైథిలిన్ లంకఁజేర్తును—ఇట సర్వనామముచే పరామర్శ చేయనందున, అవనిప్రోద్భవ వేఱు, మైథిలి వేఱు, అని భ్రమ యుత్పత్తిల్లుచున్నది. పర్యాయపదోపాదానముచే కథితపదతాదోషపరిహారము గానేరదు. 4. స్వవశ యనగా తనకే తాను వశ్యురాలుగాని ఒరులకుఁ గాదని యర్థమగునేగాని మద్వశ యని యర్థముగానేరదు.—మూలములో రావణునికి వశ్య యని యున్నది. పంతులవారికి స్వశబ్దము మదీయశబ్దార్థక మని యొకభ్రాంతి కలదు. దానిచే వారు అత్యంతాద్భుతముగా పాడుచేసినపద్యమొకటి తృతీయాంకము 3౭-వ పుటలో 'మిగుల రూపరులు' ఇత్యాది కలదు. అందు స్వజన మనఁగా 'మదీయు' లని పాడుచేసినారు. 5. చేర్తును, చేయుదున్, ఒనరింతున్, కాంచెదన్.—ఇందు తుదిలకారముచే ప్రక్రమముచెడినది; కాంతున్ అన్న సరిగా నుండును, ఛందస్సునిమిత్తము 'పొందుదున్' అన్న సరిపడును. [దీనిన్ అనునది అవనిప్రోద్భవకు విశేషణ మని మూలము గననివారిని భ్రమపెట్టుచో దూరాన్వయదోషము కలుగును. వీరు దీనిని ఇష్వాసమునకే విశేషణముగా ప్రయోగించి రని మూలమందు 'చాప మిదం వికృష్య' యనుచో ఇదంశబ్దమువలెనే తదర్థకముగానే చాపముతోనే ఘటితమై యుండుట సూచకముగానున్నది. మఱి మూలములో సీత యని తొలుతను జనకేంద్రపుత్రి యని తర్వాతను పరామర్శ కలదని సమాధానము చెప్పఁదలంతురో? అట పరామర్శ 'ఏనా' మని సర్వనామముచేత చేయఁబడియున్నది. దానిం గనునది. మూలమందు నయామి, అనునయామి, ఆనయామి, యని మున్మూఁటను ఏకలకారపురుషవచనప్రయోగము మనోహరప్రక్రమము తెలుఁగులోని ప్రక్రమభంగమునకు లజ్జవెట్టుచున్నది.] మూలముం గనుడు.

అన్యోపి కోపి యది చాప మిదం వికృష్య
సీతాకరగ్రహవిధిం విదధీత వీరః
లజ్జాం నయామి చ గిరానునయామి చైనాం
ద్రా గానయామి చ వశే జనకేన్ద్రపుత్రీమ్.

తెనుఁగులో.— 6. వీరుఁడు త్యక్తుఁడు; 7. వికర్షణమునకు బదులు ఎక్కించుట. 8. మహాసంతోషముంగాంచెదన్ — ఇది అమూలకము, లంపటు వృథపవ్ర ౦చితము. వికర్షణమునకు పంతులవారి కిష్టమైన పీఁకుధాతువును బ్రయోగించిన మూలార్థములో గ్రామ్యత్వదోషము వచ్చును. పద్యము నిట్లు మార్చిన మేలగును.

ఎవఁ డే నన్యుఁడు వీరుఁ డుగ్రునిధియానీవిల్లు కర్షించి తా
నవనీపుత్త్రికఁ బెండ్లియాడినను నే నత్యూర్జితప్రక్రియన్
జవమొప్పంగను లంకఁ జేర్తు మృదువాక్చాతుర్యమేపార బు
జ్జవము ల్సల్పుదు మద్వశంవదనుగా సాధింతు నామైథిలిన్.

పంతులవారు ఈపద్యములో ఇన్నిదోషములు చేయఁగలిగిరి. ఇంత దోషానుకూలమైనయీచోటనుం గూడ మూలకారుఁడు ఈదోషములలో నొకటియేనియు చేయనేరఁడాయెనుకదా: వీరిముందఱ నాతఁ డేపాటికవి!

౧౮ - వ పుట.

[4] ఆ॥ బాణపంచశతినిబఱపరబాణుండ । కలదు నాదు కేలఖడ్గలతిక
410 పంచబాణనీవు పఱపరబాణముల్ । నన్నుఁగూర్చివచ్చునన్నెలఁతుక.

మూ.—రే బాణ ముఞ్చ మయి బాణశతాని పఞ్చ
నన్వస్తి మే కరతలే కరవాలవల్లీ
రే పఞ్చబాణ వివృణు త్వమపి స్వబాణా
న్నన్వేతి సా యువతిలోకలలామవల్లీ.

ఇత్తెన్గులో ఖడ్గలతిక, అన్నెలఁతుక, అనుపదములచే, కరవాలవల్లీ యువతిలోకలలామవల్లీ పదముల స్వారస్యము రాలేదు. 1. రెంటను వల్ల్యుపమానము చెప్పటచే, బాణబాణములకు ఈవల్లియు, పంచబాణబాణములకు ఆవల్లియు, ప్రతీకారములు గలవని యొక సామ్యచమత్కారము నిబద్ధమైయున్నది. 2. శ్రవణసౌభాగ్యము చెప్పవలసినదే లేదు. 3. సీతకు వల్ల్యుపమాస్వారస్యంబును అల్పము గాదు. 4. తెనుఁగులో యువతిలోకలలామ యను సీతావర్ణనము లుప్తమైనది.

రావణుఁడు.—అహా! ఎట్లాత్మశ్లాఘనీయుఁ డగుచున్నాఁడు, పంక్తికంఠుఁడు?
411 ఆత్మశ్లాఘనీయుఁడు—మూ. ఆత్మ నైవ శ్లాఘనీయః [తనచేతమాత్రమే శ్లాఘనీయుఁడు]. ఇందు ఏవకారము ఇతరులచే శ్లాఘనీయుఁడుగాఁడను నర్థమును తెలుపుచున్నది. ఇదియే యిట ప్రధానముగా వివక్షితము, కావున దీనినే తెలుపునదైన యేవకారమునే వదలివేయుట సరిగాదు. తెనుఁగులో సమాసము చేసికొనవలసిన కష్టము సంభవించినయెడల ఏవార్థకమాత్రశబ్దఘటితముగా చేసికొన రాదా? ఆత్మమాత్రశ్లాఘనీయుఁడు అనవలసినది. అగుచున్నాఁడును, తీసివేసి 'అహా! ఏమి? ఆత్మమాత్ర శ్లాఘనీయుఁడా పంక్తికంఠుఁడు?' అనిన నీవాక్యము తెలుఁగగును.

శా॥ మామందోదరిగొప్పకొప్పునరహింపంజారుమందారదా
[10] 421 మామోదమ్మకరందమానుచును సమ్మానంబునంజొల్చువీ
ణామాధుర్యధురంధరధ్వనిని విన్నాణంబునందెల్పుచా
రామద్విక్రమమున్మధువ్రతములున్ రంజిల్లఁగీర్తించెడున్.

మూ.—మన్దోదరీకుటిలకోమలకేశపాశే। మన్దారదామమకరన్దరసంపిబన్తః
వీణానినాదమధురధ్వనిముద్గిరన్తో। మద్విక్రమంమధుకరా అపికీర్తయన్తి.

1. మామందోదరి—ఈమె యెందఱికి ఉమ్మడి? ఇది ప్రాభవ సూచకమైన బహువచనము, ఉమ్మడిసూచకము కాదు,అందురా? అట్లేని, ఈ యాఁడుదానికఁ దంగల ప్రాభవము రావణునికి విక్రమముకడ లేకపోవుట యేమి? మద్విక్రమ మేమి? మాద సరిగా అస్మద్విక్రమ మనుఁడు, ఒండె, మత్తునకు సరిగా నామందోదరి యనుఁడు. అన్వయముగా నుండవలయునేని సర్వనామమే మందోదరికి ముందు తీసివేయుఁడు. 2. గొప్పకొప్పు మనస్సును హరించినదిగాని కుటిలతా కోమలతా స్వారస్యము తెలియరపోయినదిగదా? వీనికన్న గొప్పతనమే చిత్తముహరించుట గ్రామ్యకామ్యుచితము. "స్నిగ్ధ నీల మృదు కుఞ్చి తైకజా మూర్ధజా స్సుఖకరా స్సమం శిరః" అని వరాహమిహిరుఁడు స్త్రీలక్షణమందు మృదుకుంచితత్వములను జెప్పినాఁడు గాని గొప్పతనమును జెప్పలేదు. 3, 4. కుటిల కోమలత్వములచేత సుఖానుభవము, దానిచే రావణుని యైశ్వర్యము, దానిచే విక్రమమును సూచితములు, కావున కుటిలకోమలతలు ప్రకృతోపయోగములు. గొప్పతనము ఏబనివికేనియు నుండును. అటయిన గొప్పతనము పనికిరాదా యనవలదు, పనికివచ్చును; అందముగాఁ జెప్పిన సందర్భముగానుండును. మూ. పాశశబ్దముచే గొప్పతనము గమ్యమైయున్నది. గొప్పగొప్పునన్, పెద్దకొప్పున అని యిట్లు గ్రామ్యభంగిగా గొప్పచన్నులు, పెద్దపిఱుఁదులు అని చెప్పుటయు అసహ్యముగా నున్నది. రహింపన్.—ఏమి రహింపనఁగా యతి రహింపన్ అని యన్వయము. 5. చారు మందారదామ—మందారదామముచే దనే రావణుని స్వర్గజయమును నందనవన పారిజాతనము ఇతనిభార్యకు ఊడిగములు సేయు మండుటయును సూచితమయినవి. చుటి యీచారెందులకు? ఈ పంక్తిలో చారు మందారదామ పంక్తిలో మకరందము ఇట్లు పంక్తిలో పలపక్షము చేయవచ్చునా? ఈదామమును వర్ణించుటకన్న కుటిలకోమలయను విశేషణములకే చోటు కల్పించుకొన్నచో, పూర్వోత్తర ప్రయోజనములు కలుగును. 6. ఆమోదత్—ఈ పదమందు సంస్కృత భాషాజ్ఞానము పీఁచురేగిపోయినది.—ముదధాతువు ఆత్మనేపది. ఆమోదమాన అనవలయును. దానికి పరస్మైపదిరూపము రానేరదు. చ్యుతసంస్కారదో

షము. ఇఁకపంతులవారు తమతెనుఁగు దోషముల నాపేక్షించినవారిని, ' ఆ సూత్రము నన్నయ్యది గాదు,' ఆంధ్రశబ్దచింతామణియే నన్నయదిగాదు, అని మున్ను గద్దించినట్లే, పాణినీయమే ప్రమాణముగాదని గద్దింపవలయు. ఆ వినోదముం జూచెదముగాక. 7. సమ్మానంబునం బొల్చు—ఈ సమ్మానము ఎవరికో తెలియునా? యతీశ్వరులవారికి. 8. విన్నాణంబునన్—ఎవరిదో యీవిన్నాణ మెఱుంగుదురా? యతీశ్వరులవారిదే. 9. రంజిల్లన్—ఎవరో రంజిల్లువా రెఱుంగుదురా? శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యులవారే. 10. ఔరా—ఏల యింత ఆశ్చర్యమనఁగా, నలువురుయతుల కేకభిక్ష చేసినందులకు.

౧౯ - వ పుట.

ఎట్లు వీఁడు పోయెను.—ఎట్లా? నడిచి. మూ. కథ మయం నిర్గతః. దీని
422 కది గోకంబర్డు తెలుఁగు. మన తెలుఁగులో,—ఏమి! వీఁడుపోయినాఁడే!

[13] క॥ నాయుపజీవిదియేడువు । నీయదనన్వినకయున్న నేనిటనీతా ।
435 తోయజనేత్రంబలిమిన్ । జేయకచేకొనకపోదు నేయిటులయ్యెన్.

1. ఉపజీవిది యేడువున్—భిన్నవిభక్తితాదోషము. షష్ఠీవిశేషణములకు ప్రథమవచ్చుట కలదుగాని ఇతరములకు వచ్చుట అరుదు. సర్వనామమున కట్లు ప్రథమవచ్చుట అసహ్యముగానున్నది.—నేను దుర్బలునిఁ గొట్టినాఁడు, దుర్బలుని నేను గొట్టినాఁడు, వాఁడు శత్రువును సంహరించితిని, శత్రువును వాఁడు సంహరించితిని, అని దుర్బలుని నన్నుఁ గొట్టినాఁడు, ఆ శత్రువును సంహరించితిని, అనునర్థమున ప్రయోగములు అసహ్యములు గావా!

2. పద్యములో పాదపూరణములు గుప్పించుకొను కవులెందఱో కలరుగాని వీరివలె వానిచే నశ్లీలార్థములు పుట్టించువారు అరుదు. 3. ఇందు ' చేయక ' యని పాదపూరణము. దానిని వదలి, ' బలిమిం జేకొనకపోదునే ' యన్న నిర్దోషము. దానిని ' బలిమిఁజేయక ' యని పెంచుటచేత విశేష మేమనఁగా,—తెలుఁగుభాషలో స్త్రీని బలిమిచేయుట యనఁగా బలాత్కారముగా భోగించుట.—ఈ యనార్యార్థము చేయక యను పాదపూరణము లేకున్నం గలుగదు. పద్యమునకు యతిప్రాసములు కుదిరిన ధన్యతలో ఇట్టి యశ్లీలార్థము గూడ పంతులవారి కగపడమి ఆశ్చర్యముగానున్నది. ఇందు పాదపూరణములు.— 4. దివర్ణము,— 5. ఈ యదనన్, 6. ఇట, 7. తోయజనేత్రన్, చేయక, 8. ఇటులు, 9. అయ్యెన్. ఈ పాదపూరణములు పోఁగా శేషము—' నాయుపజీవియేడ్వను వినకయున్న నీతన్ బలిమిం జేకొనకపోదునే ' ఇన్ని పాదపూరణములు వేసికొన్నందులకు త్యక్తములు ఏ మనఁగా,—

మూ.— అనాహృత్య హతా త్సీతాం నాన్యతో గన్తు ముత్సహే
న శృణోమి యది క్రూర మాక్రన్ద మనుజీవిన.

10. ఉత్సహే—(ఉత్సహింతును), 11. అన్యతః—(అవలికి), అవలికనకుండ చేకొనకపోదునే యనిన గమన మర్థముగాకుండ చేకొననా యనియే ఒకపక్షమున అర్థమగును. అదియే వివక్షితమో, గమనముకూడ వివక్షితమో అని సందిగ్ధతాదోషము కలుగుచున్నది, అన్యతః అను పదమునుంగూడ తెనిఁగించియుండిన నీదోష ముండదు. పంతులవారి మూలములో నాన్యత: అనుటకు నన్విత: అని పడియున్నది. తెలివిగలవారి కిది తప్పని తెలియకమానదు. అందలి ఇతశ్శబ్దమును అత్రార్థకముగా ఇట అని తెన్గించి పద్యములో నొకమూల పడవేసినారుగాని, ఇటనుండి అని తెన్గించి 'పోదునే' క్రియకు విశేషణముగా వేయవలసినది. అట్లు చేసిన సగముతప్పు తొలంగును. [అను జీవియొక్క—] మహత్తరమైన యాపదను తప్పించుటకైనచో సీతాహరణము మాని తాను పోవుట యుచితముగాని స్వల్పాయాసపరిహారమునకైనచో యుచితముగాదు గావున, ఏడ్పునకు మూలములో 12. క్రూర మని విశేషణమున్నది. ఆ క్రూరతయే ఇతఁడు సీతాహరణమును మానివేసి యనుజీవిరక్షణార్థముపోవుటకు ఉపపత్తి గావున దానినే వదలుట పంతులవారి సారగ్రహణపారాయణతాపతాకగా నున్నది. 13. ఇటులయ్యో—అని గోణుగుపూరణము వేసికొని ముగించుట వీథిభాగవతములో "ఏంశేతూ నేంశేతూనే" అని యేడ్చినట్లున్నది.

436 ఈ వృత్తాంతము 'ఊనికి విన్నవింతుము—విన్నవింతము అనవలయును.

---

## ద్వితీయాంకము.

౨౦-వ పుట.

"ఆహా! పెక్కులు చిలుకపిల్లలతోఁ గూడుకొనుటవల్లం బెల్లుగఁజామనిచాయగలిగిన గజికతీఁగలగములచే బాగుమీఱిన పూఁదోఁటయందు
[2] 438 వాటమైనట్టి యీయునికిపట్టు నాయుల్లమును జల్లఁజేయుచున్నది."—

మూ.—ఆహో అయ మనేకశుకశాబకానుగమనికామశ్యామల హరితలతావితాన మనోహర మారామరమణీయసన్నివేశః ప్రదేశః.

పెక్కులు చిలుకపిల్లలు గజికతీఁగలగుములం దున్నట్లు వర్ణించుట సొంపుగా లేదు. ఆరామమునకు గజికలతలా ముఖ్యాంగము? చిలుకలు చెట్లులయందును వల్లికలయందును పండ్లకొఱకు చేరుట గజికలలోచేరుటకన్న ప్రసిద్ధము. ఆరామమునకును

గఱికకన్న లతావృక్షములు ప్రధానముగదా. 1. గఱికతీఁగలగములచేత — మూ. హరితలతావితాన—పసరువన్నె తీఁగల మేలుకట్టుచేత అనవలయును. దీనికి పంతుల వారిమూలమున 'శాద్వలలతావితాన' అనియున్నది. వలవితానములనుబట్టి శాద్వల శబ్దముతప్పని గ్రహింపవచ్చును. 2. పూఁదోఁటయందు వాటమైనట్టి యీయునికిపట్టు మూ. ఆరామరమణీయసన్నివేశః ప్రదేశః—తోఁటయొక్క మనోహరమయినయుని కిగలదైన యీప్రదేశము అని యుండవలయును.

౨౧ - వ పుట.

[26] 464 తాపసుఁడు.—అంతట సంతుష్టుఁడైనయామునిచే నాభూమీశ్వరునికి దివ్య మయిన తాటంకయుగళము పారితోషికముగా నొసఁగఁబడియెను. మఱి, తాటంకద్వంద్వము వెలుఁగొందందగినది.

క॥ కాననిదివీరజననివి । వీనులకుచితంబటంచు విలసిలునోరా
మానికములలోవర్ణవి । తానముతానే తెలిపెడుఁ దథ్యముగాఁగన్.

అందుచేతఁ గౌసల్యకర్ణములయం దునుపఁదగినది యని చెప్పంబడియె. రాచ కొమరు లిరువురిచే ననుసరింపఁబడుచు నమ్ముని నిజాశ్రమంబునకుం జనియెను.—

ఈ భాషితమందు వాక్యవిభాగక్లేశము ఎంతగలదో యరయుఁడు. 1. తాటంక ద్వంద్వము వెలుఁగొందందగినది—దీనికి వక్త యెవఁడు. 2. తెలిపెడున్—దీనికి కర్మ యేది? 3. విలసిలున్—దీనికి కర్త యేది? వర్ణవితానమా? అదితెలుపుటకుఁగదా కర్త? 4. వెలుఁగొందందగినది—వెలుఁగొందందగినది యగుటయా వీరజననివీనుల కుచితమగుటకు కారణము? 5. వెలుఁగొందందగినదనఁగా అర్థమేమి? ఇప్పుడు వెలుఁగు లేదా, వెలుఁగొందందగినదానికి వెలుఁగుండునా? 6. తగినదోతగనిదో తెలియుటెట్లు? 7. కానన్—దీని సంబంధము పూర్వవాక్యమున నెంతవఱకు? వెలుఁగొందందగినది గాననా? 8. పారితోషికముగానొసంగఁబడియెనుగానను వెలుఁగొందందగినదియుఁ గాననా? 9. ఆమునియొక్క సంతుష్టియు ["సంతుష్టుఁడైనయామునిచే"] ఈవీర జననీశ్రవణౌచిత్యమునకుం గారణమేనా? 10. అటంచున్—ఈ యన్నమాట ఎది మొదలు ఎంతవఱకు? 11. విలసిలున్—ఈ సమాపకక్రియను విలసిలన్ అని తుమున్నంతముగానేని, 'విలసిలుచున్' అని శత్రంతముగానేని మార్చినచో ఇప్పద్యమున నేమేని ఇప్పటియసందర్భము కొంత తీఱునా?

మూ.—తదిదం వీరసూకర్ణనివేశోచితమిత్యసౌ
అస్యాఃస్ఫురన్తీ రత్నానాం వర్ణమాలైవ శంసతి.

అట్టియిది వీరజననివీనుల నుంపఁదగినదియని దీనియందు ప్రకాశించుచున్న వర్ణముల [కాంతుల, అక్షరముల] మాలికయే చెప్పుచున్నది.—అని యర్థము. పంతులవారు. 12. 'విలసిలుౘ' అనుట స్ఫురత్సీ యనుటకు. 13. అన్తః అని స్ఫురంతికి విశేషణమున్నది. అన్తః అనుదానియర్థము 'మానికములలో' అను లో విభక్తిచేత అనూక్తమైనది. కాని 14. ఆవిశేషణసంబంధము నష్టమైపోయినది. విశేషణత కావలయునేని మానికములలో విలసిలుచు అనవలయును. 15. అటంచుౘ—ఇది తెలిపెడు ననుక్రియతో ఘటితముగావలయును. 16. విలసిలుతో ఘటితమైనది. ఈ భేదములం గనఁగా ఈయుద్ధృతతాపస భాషితమెల్ల, అందును ముఖ్యముగా ఈ శ్లోకము, పంతులవారికి అర్థముగాలేదని నిస్సందేహముగా తెలియనగుచున్నది. పాదపూరణములు.—వీరజననివివీనులకు—17. ఇందలి వివర్ణము వీనులకు పరమాసహ్యముగా నున్నది. 18. మఱియు నిట్లు షష్ఠీవిశేషణమయిన సర్వనామమునకుం బ్రథమపెట్టుట యసహ్యమ్ముగా నున్నది. ఈ ఫక్కికచే, 'వాఁడు మనుష్యని కిచ్చెను' అనువాక్యమునకు ఆమనుష్యునికిచ్చెనని యర్థముగావలయు. 19. ఔరాయని ఇచ్చువాఁడే అశ్చర్యపడుటకన్న పుచ్చుకొనువాఁడు ఆశ్చర్యపడిన బాగుగానుండును. దాతయగు విశ్వామిత్రునివాక్యమైన యీపద్యములో ఈయాశ్చర్యము లేకున్న బాగుగానుండును. 20. వర్ణవితానము మూ. వర్ణమాల. మాల యనుట చండాలస్ఫోరకమని దూషింపవలదు, మాలయనుట పూలసరమువలె నొప్పుచున్న యక్షరపంక్తి యని స్ఫురింపఁజేయుటకు. వితానమనుటచే ఆసొబగు పోయినది. 21,22. తథ్యముగాఁగౘ—ఇది యతిపూరణము, గొణుగు. ఇది లేకున్న పటిమగా నుండును. ఇది ౧౬-వ పుటలోని నాయుపజీవిపద్యముతుదినుండు 'నిటులయ్యెనే' వంటిది. 23. వెలుఁగొందఁదగినది. మూ. దివ్యమ్. 24. చెప్పఁబడియె—ఎవరిచే?

మనుష్యులకుం దెలియు తెనుఁగున నీ భాషితమిట్లుండును:—

తాపసుఁడు.—అంతట సంతుష్టుఁడై యాముని యా భూమీశ్వరునకు దివ్యమయిన తాటంకయుగము పారితోషికమొసంగి, 'రాజా,ఈతాటంకయుగము దివ్యమయినది. ఇది వీరమాతవీనుల నుంపఁదగినది, ఇట్లని దీనిలో వెలుంగురత్నములవర్ణమాలయే చెప్పుచున్నది. కావున దీనిని కౌసల్యకర్ణములయం దునుపవలసినది, అని' చెప్పెను. రాచకొమరుల నిరువురిఁ దోడ్కొని యమ్ముని నిజాశ్రమమునకుం జనియెను. 25. కానౘ—మూ. తత్—అది ఇట నవ్యయముగాదు, హేత్వర్థకముగాదు; కౌసల్యకర్ణములయందు 26. ఉనుపఁదగినది—ఉనుపవలసినది అనవలయును.

భిక్షుఁడు—మాల్యవంతునిచే మఱియు నేలయాలకింపఁబడియె. మూ. కథంపు

465 నరిదం వృత్తాన్తజాత మాకర్ణితం మాల్యవతా; "కుతః పున రాకర్ణితం

మాల్యవతా" అని తెనుఁగుముద్రణము. మఱి ఈవృత్తాంతమెల్ల మాల్యవంతుని కెట్లు తెలిసినది, అని నాగరముద్రణమునకు తెనుఁగు. మఱి మాల్యవంతుని కెట్లు తెలిసినది, అని తెనుఁగుముద్రణమునకు తెనుఁగు. తెలిసినద్వారమే ప్రశ్నవిషయమని ఈప్రశ్న యొక్క యుత్తరముచే నవగతమగును. వేగులద్వారా తెలిసినదని యుత్తరతాత్పర్యము. పంతులవారికి ఇందు కుతశ్శబ్దార్థము తెలియలేదని యేలశబ్దము విశదీకరించుచున్నది. కుతః—ఎవనివలన అని యర్థము, ఇచ్చట ఏల యర్థముకాదు.

తాపసుఁడు.—

[2] 467 తే॥ వార్తకౌతుకకరివిద్యపరమవిమల । మఱిజగన్నుతమృగనాభిమహితగంధ
మంబువునఁదైలబిందువునట్టులణఁగ। కేచునీమూఁడుదముయంతనీజగమున.

అందునుం బలుగుంద్ర వేఁగువాండ్ర నియోగించినవాఁడు మాల్యవంతుఁడు.—

పద్యములో పాదపూరణములు 1. పరమ—య. మూలములో విమల యని మాత్రమేకలదు. పరమవిశేషణ మావశ్యకమేని కేవలవిమలవిద్య ప్రసరింపదా? జయదేవుఁడు చెప్పినమాట తప్పేనా? 2. మహిత—య. అధిక స్వాధికంఘల మ్మని దంచుట గానున్నది. జగన్నుత అన్నతర్వాత మఱల మహిత యన నేల?

[2] 469 తాపసుఁడు:—[సహర్షంబుగ] ఇప్పుడు చెప్పు మదియంతయు సతాటంకమగు తాటకావనమును.—

ఇట ప్రస్తావ మేమనఁగా:—విశ్వామిత్రుఁడు కౌసల్యకై దశరథునికి ఒకదివ్యతాటంకయుగళము నిచ్చెనఁట. దానిని లంకేశునితల్లికై దొంగిలించితెమ్మని తాటకకు మాల్యవంతుఁడు (రావణమాతామహుఁడు) వేగువానిచే నాజ్ఞ పెట్టినాఁడఁట. ఈ వక్త తాపసుఁడు ఆకమ్మదోయిని మాల్యవంతుని యాజ్ఞచే లంకకు తెచ్చుటకై తాటకావనముకు పోవుచున్నాఁడు. వీనితోఁబలుకుచున్న యాభిక్షువే తొలిఁ దాటకకు మాల్యవంతునాజ్ఞం గొనిపోయినచారుఁడు. వీరిరువురు నిట మిథిలానగరమున నొండొరుం గలసికొని తెలిసికొనిరి. 'తాటక తాటంకములు తెచ్చి తనకడ నుంచుకొనియున్నదా?' యని మొదటివేగును రెండవవేగు అడుగుచున్నాఁడు, ఆప్రశ్నవాక్య మిది. తాటకావనము సతాటంకమా సవిస్తరముగాఁ జెప్పుము అనిప్రశ్న. ఇప్పుడు చెప్పుము. ఇత్యాది వాక్యము అందులకు హాటెంటాట్ భాష. 1. అదియంతయు నని వనమునకు విశేషణమా? ఆయెడల దానినంతయు ననుట మేలు. దానినంతయు ననిన, వనము నంతయు వర్ణింపుమని యభిప్రాయమా? తాటంకహరణ వృత్తాంతము నని యభిప్రాయమేని 2. 'కూర్చి' యని తుది ఘటింపుఁడు, అదిని ఎత్తివేసికొనుఁడు; అప్పటికి సరిపడును.

తాపసుఁడు.—తాటకకు దేనిచేత నంతకపురప్రవేశము?—మూ. కేన పునః
470 ప్రతిహారాయిత మన్తకపురీ ప్రవేశో తస్యాః? దేనిచేత ననుటకు మూ
లములో 'ఎవఁడు ప్రతీహారుఁడయినాఁడు?' అని యెంత యలంకృతమై యున్నదో
కనుఁడు.

౨౨ వ - పుట.

వసంతలక్ష్మియే యవతరించినది.—మూ. అవతీర్ణైవ వసన్తలక్ష్మీః, వసంతల
471 క్ష్మి అవతరింపనే అవతరించినది, అనఁగా రానేవచ్చినది, అనఁగా, ఋ
తుధర్మము లెల్ల చక్కఁగా ఆవిర్భవించియున్న వని తాత్పర్యము. మూలములో ఏవ
కారము అవతీర్ణశబ్దముతో ఘటితమైయున్నది. కావున నీయర్థము కలిగినది. పం
తులవారి తెనుఁగులో ఏవకారార్థము వసంతలక్ష్మితో ఘటితమైయున్నది. ఈభేదము
నరయునది. సాక్షాద్వసంతలక్ష్మి యని స్వారస్య మందురేని ఆసాక్షాత్త్వకథన ప్ర
యోజనము లక్ష్మీత్వకథనముచేతనే గతార్థమని వచించెదను. వసంతలక్ష్మియే వచ్చి
నదా మఱియొండు వచ్చినదా యనుసందేహమునకు అపనోదనపర మీవాక్యమను
ట సరిగాదు, అట్టిసందేహమే యసంభావ్యము. ఋతుధర్మావిర్భావమందు సందేహ
ము కలుగవచ్చును, ఆసందేహము దర్శనముచేత తీఱును, ఋత్వాగమనము మాస
జ్ఞానముచేతనే తెలిసియున్నది. కాన ఆసందేహమును తీర్చునదిగా ఉక్తప్రాదుర్భా
వమును సిద్ధాంతీకరించునదిగా ఆరామశోభ యిట్లు వర్ణితమైనది.

తే॥ తేఁటిపూఁదేనెద్రావెడుతేఁటిబోంట్ల
[17] కాకలీధ్వనియింపయిప్రాలుఁజాల
488 దక్షిణానిలనిర్దిష్టతత్పదగతి
నిందువంజులమంజరియెలమినాఁడు.

మూ.—ఇహ మధుపవధూనాం పీతమల్లీమధూనాం
విలసతి కమనీయః కాకలీసంప్రదాయః
ఇహ నటతి సలీలం మఞ్జరీ వఞ్జులస్య
ప్రతిపద ముపదిష్టా దక్షిణే నానిలేన.

1. ఇక్కడ (ఈవంక) మల్లెపువ్వుయొక్క తేనెను (2. సురను) త్రాగిన తేఁటివధూటులయొక్క (3. సురద్రాగువారి స్త్రీలయొక్క) 4. గురుపరంపరోపదేశముచే నేర్చిన కలసూక్ష్మ 5. గానము ఒప్పారుచున్నది. ఇక్కడ(ఈవంక) దక్షిణదిక్కునుండి వీచు (6. నేర్పరియైన) గాలి 7. అడుగడుగున ఉపదేశము చేయు

చుండఁగా 8. లీలతో వంజులవృక్షముయొక్క చిగిరించిన లేఁగొమ్మ, నాట్యముచేయు చున్నది.—అని శ్లోకార్థము.

ఇందు సంప్రదాయశబ్దస్వారస్యము [గురుపరంపరోపదేశోక్త్యేక్ష], మధు శబ్దశ్లేషయు నష్టములు. [మితమధుపానముచేత పాటయందు రక్తి అతిశయించును]. 9. మల్లీపుష్పోక్తిస్వారస్యమేమనఁగా మల్లెపువ్వులనెడు రజతవజ్రాదినిర్మితచ షకంబుల నని ధ్వనితము. మల్లెలచే పరిమళితములయిన యనియు నర్థమే. ప్రతిపద మ్మనుటచే మంజరీనటి వేసినయడుగెల్ల ముందుగా దానికి అనిలభరతాచార్యుఁడు తెలుపుచుండె నని యభిప్రాయము. అందువలన గాలి యెటు కదలిన మంజరి యటు కదలుచుండుట యట్లు ఆచార్యదర్శితనటనానునటనమునకుం బోల్పఁబడినది. ఈస్వా రస్యమేమియు పద్యములో చేరలేదు. ఇందులకు బదులుగా 10. తేఁటి 11. తత్—అని రెండుయతిపూరణములు చేరినవి. రెండు ఇహాలలో 12. ఒకయిహ పోయినది. మంజ రికి ఇందు అని ఇహ వలయునేని కాకలికిమాత్రము వలదా? 13. కాకలీధ్వని— గానము చెప్పవలసినచో ధ్వనిమాత్రమును చెప్పుట మందము. 14, 15, 16. ఇంపయి గ్రాలుఁజాల—యతిపూరణ పాదపూరణభూయిష్ఠము, ఇంచుక్ అనుటకు. 17. ఎల మిక్—సలీలమ్ అనుటకు మందము. తత్పదగతి—ఇందు ఉత్తరైమా శనైశ్చరా వతారముగా నున్నది, ఇది మంజరికి పరామర్శయా? అనిలమునకుఁ బరామర్శ యా? దేనికేని పరామర్శ అనావశ్యకము. ప్రసిద్ధార్థకమా? అవును. ఏమి ప్రసిద్ధి యనఁగా యతిభిక్షాప్రసిద్ధి.—

ఇట్లే ఋతులక్షణప్రాదుర్భావవర్ణనచేత, 'అవతీర్ణైవ వసన్తలక్ష్మీః' అనువా క్యమున ఆప్రాదుర్భావమే వివక్షిత మనియు ఏవకారార్థము అవతరణముతోనే చేర్ప వలసినదిగాని వసంతలక్ష్మితోఁ జేర్పఁగూడదనియు చేర్చుట విరసమనియు విశదమయి యుండును. అన్యమహాకవులు ఇట్టితావుల నిదే స్వారస్యముగాఁ దలంచిన సంవాద ముం గనవచ్చును.

"హన్త! ప్రవృత్తైవ కలముగ్ధ కోకిల సంలాపినీ వసన్తమాసలక్ష్మీః! తథాహి;

అమీ పున రుదఞ్చితా మధురగుఞ్జదిన్దిన్దిరా
స్సుగన్ధిమలయానిలా మదనగర్వనాడిన్ధమాః
అశోకతరుతాడనక్వణితకామినీనూపురా
హసద్వకుళధూళికాపటలధూసరా వాసరాః.

ఇందు ప్రసన్నరాఘవమందుంబోలె అవతరణ వాక్యంబును దానివెంట తత్సమర్థ నశ్లోకంబును నున్నవి. వాక్యములో ఏవకారము లక్ష్మితోనున్నదో ప్రవృత్తితోనున్న

దో గనుఁడు. శాకుంతలము షష్ఠాంకములో కాళిదాసు “కథ ముపస్థితో మధుమాసః” అని ముందుగా ఉపస్థితశబ్దమునే ప్రయోగించుటచే ఈయర్థమునే తెలియఁజేసినాఁడు.

ఉ॥ చిత్తజరాజశాసనముచేమలయాచలమందునుండియా
[20] గిత్తహుమాయిరౌతుదగుకీర్తితశైలముదాఁకభూతలం
508 బిత్తఱిగెల్వఁగోరిసురభీడితబాలసమీరణుండుమున్
జిత్తజవైరివ్యాళధరుఁజేరఁగజంకుచుఁబోవుఁదిన్నఁగన్.

మూ.— మలయశిఖరా దాకైలాసం మనోభవశాసనా
ద్భువనవలయం జేతుం వాఞ్ఛన్వసన్తసమీరణః
విహితవసతిం కైలాసాగ్రే భుజఙ్గధరం హరం
మనసి విమృశ న్భీతశ్శఙ్కీ ప్రయాతి సమీరణః.

మలయశిఖరమునుండి కైలాసమువఱకు మదనాజ్ఞచేత భూలోకమెల్ల జయింపఁగోరినవాఁడై వసంతవాయువు కైలాసశిఖరంబునం గాపురమున్నహరుని భుజంగధరుని మనస్సులో తలపోసికొని భీతిగొన్నవాఁడై పయనము సలుపుచున్నాఁడని తలంచెదను.—అనియర్థము.

పాదపూరణారణ్యము 1. ఆగిత్తహుమాయి రౌతుదగుకీర్తితశైలము—కైలాసమనుటకు ప్రా. యు. 2. ఇత్తఱి—ప్రా. 3. ఈడిత—య. 4. బాల.—పా. 5. మున్—పా. 6. చిత్తజవైరి.—ప్రా.

మూలములో 7. శిఖరము 8. అగ్రమును చెప్పఁబడినవి; వైరస్యము కొఱకా? వానిని పంతులవారు త్యజించుట స్వారస్యముకొఱకా? బుద్ధిమంతులు ఊహింపుఁడు. 9. చిత్తజరాజశాసనము—రాజ—అమూలము. దీనిం బెట్టుటచేత నేమి స్వారస్యమనఁగా, ఏతదనుసారముగా సమీరణునియందు సేనాపతిత్వమో సామంతత్వమో కథనీయమైయుండఁగా దానిని మానుటచేత పద్యము చెడిపోవుట. ఏకదేశవివర్తిరూపకముగాఁ గొనరాదా యనిన సమీరణునివిషయి ఏదో నిశ్చయముగాఁ దెలిసినచో ఆయత్నమేని చేయవచ్చును. విషయినిశ్చయము లేదుగదా. 10. భూతలంబు— మూ. భూవలయమ్. వలయశబ్దముచేత అఖిలమని యభిప్రాయము లభించుచున్నది. తలశబ్దముచే నదిరాదు. 11. సురభీడితబాలసమీరణుండు—సురభిచేతను పొగడఁబడిన బాలవాయువు అని సహజముగా నర్థమగుచున్నది, అది మూలాననుగుణము. సురభియొక్క వాయువు అని మూలము. ఈడితశబ్దముచేత కలిగినఫలమిది. సురభిచే పొగడఁబడినది వార్షికవాయువేనియుఁ గావచ్చును. పొగడు

టయేగదా చెప్పఁబడినది, వేఱుసంబంధము కాదుగదా. 'అట్లు కానేరదు, వసంత మాసములో వార్షికవాయువుండదు, తెప్పించుశక్తి విష్ణుపుత్త్రుఁడైన నగునుగాక మదనునికిఁగూడ నుండదు,' అని వాదించుకొని ఉండదనియే సిద్ధాంతీకరించుకొని వసంతవాయువే యని గ్రహింపవలయును. ఈ ప్రయాస ఊఢితశబ్దము లేకున్నఁ గలుగదు. షష్ఠీసమాసమే స్ఫురింపరాదా యనిన ఊఢితశబ్దము లేకున్న నదియే స్ఫురించును. ఈ శబ్దముండుటచే, తృతీయాసమాసము పనికిరా దని తోఁచిననేగాని యది స్ఫురింపదు. తోఁచనిచో దానితోనె (అనఁగా ఆయపార్థముతోనే) తృప్తియగును. 12. బాలసమీరణుండు—ఇందు బాలశబ్దము సప్రయోజనము. ప్రయోజనంబేమన్న, వాని పంపినరాజు బుద్ధిహీనుఁడనియు, వానింబొగడిన వసంతుఁడు అజ్ఞదుష్టా న్యతర సామంతుఁడనియు. కావున ఆశబ్దముచే పద్యమునకు కడుంజెఱువు కలదు. 13. ముకా—దీని స్వారస్యమేమన ముందుగా వీఁడు మారునిమీఁదికి పోవుచున్నాఁడు, అతని భుజగముల పాలుగాక వచ్చె నేని మఱలవచ్చునపుడు [అనఁగా మలయమారుతముగాదు దక్షిణమారుతముగాదు, వసంతమారుతముగాదు, ఉత్తరపుగాలి] కడకు భూవలయమును గెలువయత్నించును, అనఁగా సారాంశము దక్షిణపుగాలి కొట్టుచున్నంతకాలము భూవలయములో మదనోద్దీపనములేదు, అది మాఱిననేగాని కలుగదు, వసంతములో మరుకేళికి కఱవు—అని స్వారస్యము. ఇది పనికిరాదని తెలిసికొన్న తర్వాత ముకా అనఁగా ఎదుట నని యర్థముచేసికోవలయు నని తోఁచును. సమీపమునందున్నదానికి ఎదుట ననుట సరసముగాని మలయాద్రినుండి వెడలినదానికి మలయాద్రికడనే ఎదుట ననుట సరసముగాదు. చేరఁగ ననియుండుటచే ప్రదేశవాచకముగా ముకాశబ్ద మనావశ్యకమయి కాలవిశేషణముగానే యన్వయించి ఉక్తానర్థపరంపరను దుర్నివారమొనర్చుచున్నది. ఈ పదములేకున్న నెంతబాగుగా నుండును! 14, 15. మనసి విమృశ—అను పదములను దెనిఁగించిన చక్కఁగా నుండును. ఆ గిత్తమువూయి రౌతు అని యంతయాడంబరముగా ముందు పేర్కొని యుండుటచే చిత్తజవైరి వ్యాళధరు ననుచోట, 16. సర్వనామముతో పరామర్శించుట అవశ్యము, అటు చేయనందున ఆ రౌతు వేఱు చిత్తజవైరి వేఱని భ్రమజనకముగా నేర్పడును. 17. చిత్తజవైరి—సమీరణము భయపడుటకు వ్యాళధరత్వమే చాలినకారణము, చిత్తజవైరిత్వముం గూడఁజెప్పుట అధిక స్వ్యాధికంఘలమ్మని దంచుట. చిత్తజవైరిగావున అతఁడే చంపును, ఇది వాయువుగాన భుజంగములు భక్షించివేయును, అని స్వారస్య ముందురా? ఆపక్షమున రెండవదాని స్వారస్యమును మొదటిది చెఱిపినదని యెఱుంగునది. గెలువఁ దరలినవాఁడు వైరికి జంకి మెల్లఁగాఁ బోయెనని వర్ణనయా? వైరిలేనిచో

జయించునుగాఁబోలును. జైత్రునికి వైరి తప్పఁడు. శత్రుమాత్రునితోనైన, బలాబలములు చూడవచ్చును. గాలి పాములకు భోజనము. ఆస్వభావము తప్పించుకొన శక్యముగాదు. ఆయనవలన అంతభయమేని ఆయనచెంత వీచుచుం బోవునప్పుడు [ఆఙ్ అభివిధ్యర్థకము], ఆయనతోఁ బోరకున్నం జాలును, అనఁగా ఆయనకు మదనతాపము పుట్టింపక మిన్నకున్నం జాలును. ఆపాములనోటి నెట్టుకట్టవచ్చును!

18, 19, 20. కైలాసే విహితవసతిమ్—నివసించియున్న, ఏతత్త్యాగము సరిగాదు. రాతుపగు—అను దానియందలి తచ్ఛబ్దముచేత తదీయత తెలియునేగాని తన్నివాసత వాచ్యముగాదు. ఉపపత్త్యంతరఖ్యాతముగాన వాచ్యభంగిగానే చెప్పుట మంచిది. తిన్నఁగన్—తిన్నశబ్దమునకు మనోజ్ఞత, యుక్తత, స్వాస్థ్యము, ఋజుతయు నర్థములు. ఇందొకటియు నిట పనికిరాదు. దీనితర్వాతిపద్యములో మన్దమ్మన్దమ్మనుటకు తిన్నతిన్నఁగ నని వీరిప్రయోగమున్నది. ఇటనుంగూడ మందతయే యర్థమేని, ఇటనటంగూడ రెంటను దుష్టప్రయోగమే, మందత ప్రసిద్ధార్థముగాదు.

౨౩ - వ పుట.

మ॥ ప్రతిమార్గంబున సల్లతావరతనూవర్గంబు పుష్పౌఘము
[18] త్కృతమాధ్వీకరసంబు వర్షముగఁ బర్వింపంగఁ బూజింపఁగాఁ
526 జతురాళిప్రమదానుగీతపరమాస్తకంబునౌజింకనై
కిన్తగం ద్రిమ్మరుఁ దిన్నతిన్నఁగను బూనిన్బూవడిం గాడ్పులన్.

పాదపూరణారణ్యము.—మూలములోని పథిపథికి ప్రతిమార్గమని కుదిరినది గాన, ఆదిలోనే పథిపథినిబోలె ప్రతిమార్గముం బెట్టితిమి. ఇఁక తత్ప్రాసకు మూఁడు ప్రాసపూరణములు సంపాదింపలేమా? 1. ఉత్కృత, 2. చతుర, 3. తగన్,— 4. సత్—జీవగఱ్ఱి. 5. వర్గంబు—య. 6. పర్వింపంగ—య. 7. సు—రెండవజీవగఱ్ఱి. 8. పరమ—పా. 9. నౌ—ఇందలి సువర్ణము కొసరుఁ గఱ్ఱి. 10. బూనిన్—య. 11. ఇలన్—పా.

మూ.—పథిపథి లతాలోలాక్షీభిః ప్రసవన్మధుశీకరం
కుసుమనికరం వర్షన్తీభిః సహర్ష మివార్చితః
మధుకరవధూగీతాసక్తం కురఙ్గక మాస్థితః
ప్రసరతి వనే మన్దం మన్దం వసన్తసమీరణః.

12. లతావరతనూవర్గంబు—మూ. లతాలోలాక్షీభిః. లోలాక్షు లనుటచే దర్శనీయుఁడైన వసంతసమీరునిసొబగు గాంచఁగా వారికి కన్నులు శృంగారలజ్జాప్రయుక్తచాంచల్యమును పొందినవని భావము. అది ఎంత కృశాంగు లన్నను

రాదు, ఎంత స్థూలకాయ లన్నను రాదు. తన్నుఁజూచి శృంగారలజ్జాకమనీయలైన యాలతాతరుణులయొప్పిదమును తాఁ గాంచుచు విలంబితగమనుఁడాయెనని మాంద్యసమర్థనపరము. వరతనువు లనుటచే ఇతనిసోయగము సున్నయైనది. కాన పంతులవారి మార్పు యథావిధిగా మూలముం బాడుచేయుట యైనది.

13. వర్గంబు—వర్గము ఓఘమును చల్లినదనుటచే ఒక్కొక్కతెయు ఓఘము చల్లెనని నిశ్చయముగాదు. ఒక్కొక్కతెయు నికరము చల్లె ననవలయు.

“మరుత్ప్రయుక్తాశ్చ మరుత్సఖాభం తమర్చ్య మారాదభివర్తమానమ్
అవాకిర న్బాలలతాః ప్రసూనై రాచారలాజై రివ పౌరకన్యాః.”

ఆచారలాజై రివ యనునుపమానముచేత నీకాళిదాసీయ శ్లోకమందు నికరము గమ్యమైయున్నది. ఒక్కొక్కలతయు నిండారఁబూచి పువ్వులు రాలునపుడు విస్తారముగానే రాలునుగాన లోలాక్షీభిః అన్నట్లే వర్గశబ్దము లేకుండం బ్రయోగించుటయే సరి. 14. ఉత్కృత—స్రవత్తనుటకు ఎంత పనికిరానిపదము! 15. స్రవన్మధుశీకరం కుసుమనికరం వర్షన్తీభిః—మకరందంపుఁదుంపురులు ఓడుచున్న పువ్వుల మొత్తమును కురియుచున్నవైన [లతాలోలాక్షులచేత] అని మూలము. పంతులవారు వర్షన్తీభిః అనుపదము లతాలోలాక్షులకు విశేషణ మనుమాట మఱచి, వర్షన్తీభిః అనునది శత్రంతమనిమాత్రము జ్ఞప్తియుంచుకొని, కుసుమనికరం స్రవన్మధుశీకరం వర్షన్తీభిః = పుష్పౌఘము ఉత్కృత మాధ్వీకరసంబు వర్షింపంగ, అని గోకంబర్ధుతెనుఁగుగా వ్రాసిరా? మూలములో కుసుమనికరమును వర్షించినవి లతలుగావున, ఆవర్షించుటయే పూజించుటయని తెలియుచున్నది. ఇందు ‘ఉత్కృతమాధ్వీకరసంబు’ కర్మధారయమను పక్షమున లతలు పుష్పముల వర్షింపలేదు, పుష్పములు మకరందమును వర్షించినవి; మకరందవృష్టియే పూజయా? పూజకు పువ్వులవలె మకరందము ప్రసిద్ధప్రధానసాధనము గాదుగాన పువ్వులచే పూజ తోఁచినట్లు మకరందముచే తోఁపదు. మకరందరసవర్షణముచేతనే పుష్పవర్షణము స్ఫురింపదు. ఉత్కృతమాధ్వీకరసంబు బహువ్రీహిగా పుష్పౌఘమునకు విశేషణముగాఁ గొని, పుష్పౌఘమును ద్వితీయార్థప్రథమగాను వర్షించుటకు కర్మగాను జేసినయెడల మూలార్థము వచ్చునుగాని పూజింపఁగా ననుట పౌనరుక్త్యమగును. పుష్పవర్షణముచే పూజయే తెల్పఁబడును. తన్నివారణార్థమై “వర్షింపంగఁబూజార్థమై” అని మార్చుకొన్న సరిపడును. పూజింపంగ నను తుమున్నర్థమునకే ఆ యర్థముకలదు, అందురేని, కలదు వాస్తవమే, స్ఫురించుట కష్టము. వర్షించుటకై పూజించినపుడు అని యభిప్రాయమో, పూజించుటకై వర్షించినప్పుడు అని యభిప్రాయమో,

ఇత్యాది సమాలోచనాపరంపర సంభవించును. 'ఆయభిప్రాయముననే ఆప్రయోగమే వలయునేని, సందేహబాధ లేకుండుటకై ...'వర తనూవర్గంబు పూజింపను త్కృతమాధ్వీకరసంబు వర్షముగఁ బర్వింపంగఁ బుష్పౌఘముల్' అని వ్రాసికొనియున్న నింతకన్న మేలుగానుండును. మూల మెంతసులువుగా సుఖాన్వయముగా నున్నదో, వీరి తెనుఁగున మూలాభిప్రాయముం బడయుట కెంతభగీరథ ప్రయత్నము వలసియున్నదో యరయుఁడు. ఇట్టివ్రాఁతను కవన మననేల? వన మనరాదా? చతురాళి...ఈ పాదములో కడుం బంతులవారిపక్షపాత మగపడుచున్నది. అళికి చతుర, గీతమునకు సు, ఆసక్తమునకు పరమ, [ఎక్కికి తగ్గ], వేసినవారు ప్రమదకు లసత్, నౌకు గా, జింకకు లే, వేసినం గదా నిష్పక్షపాతతా కీర్తి గలుగును! **16.** సక్తంబునౌజింక = సక్తంబుల్ + ఔజింక; నలువదియేండ్లనుండి ఆంధ్రవ్యాకరణము పాఠము చెప్పుదురఁట, భవత్యర్థ వ్యవహిత విశేషణమునకు ప్రథమయగు నని తెలియరైరి. [బాలవ్యాకరణము, కారకపరిచ్ఛేదము, 28-వ సూత్రము]. సక్తంబౌజింక ననవలసినది. పాదపూరణముల యాకృతిగణములో ఒకసువర్ణమును చేర్చుకొమ్మందురా? ఏదో నూతనవ్యాకరణరచన చేయుఁడు మఱి. "సక్తాత్మమౌజింక" నన్న నీబాధ యుండదు. **17.** తిన్నతిన్నఁగ—తిన్నశబ్దమునకు ఆంధ్రదేశములో మందార్థ మప్రసిద్ధము. మదరాసు తెలుఁగులో ప్రసిద్ధము. **18.** ఈపద్యములో పూజింపఁగా అను ధాతువునకు కర్మ మేదో తెలియక విద్యార్థులు కడుంబ్రయాసపడుదురు. మూలములో, అర్చితః అని గాలికి క్తాంతవిశేషణముగా నుండుటం జేసి గాలియే కర్మయని ఆపూజావాచకపదముచేతనే తెలియును. ఇందును మూలమెఱిఁగిన వారికిం దెలియును.

రాముఁడు.—అబ్బాయీ! ఇంతతోఁ జాలు. ఇప్పుడు గద భగవంతుఁడైన విశ్వా
[1] మిత్రుఁడు పూజనీయుఁడైన యాజ్ఞవల్క్యుని సమాగమసుఖ మెంతతడ
527 వనుభవించుచుండునో, యంతతడ వాయనయొక్క సాయంతన దేవ
తార్చనమునకుచితములైన కుసుమములను గోయుము.

ఇప్పుడుగద.—**1.** ఈగదయిటనేల? ఓయిలక్ష్మణుఁడా, మీయన్నగారియాజ్ఞను పిమ్మట నేయుదువుగాని, ముందుగా ఈగద నెత్తుకొనిపోయి ఆయుధాగారమున వేసిరమ్ము.

ఎట్లెక్కడచండికగుడి? ఇది గోకంబర్తు తెలుఁగు, లేదా హాటెంటాటుభాష.
528 మూ.—కథ మత్ర చణ్డికాయతనమ్. ఏమి! ఇచట చండికాలయ మొ
కటియున్నది! అనిన మన తెలుఁగగును.

ఇటు రామభాషితము గద్యమొకటికలదు. అందలివిషయము.— అచటగుడికడనొ
529 కపుష్కరిణికలదు. దాన నొకయంచకొదమ ఆకస్మికముగా సహచరినివదలి
యవలిమావిగుబురునకు పోయినది. అంత రామునికి జికర్ఝుళంఝుళధ్వని వినఁబడిన
ది. అంత రాముఁడు ఆధ్వనియే ఆయంచకొదమను ఆకర్షించినదనియు, అందుచేత
నది అందెలరొదగానుండుననియు, ఎవతెయో యంగన గుడికివచ్చుచున్నదనియు,
నూహించినాఁడు.—— "నిజముగనిదియందెలరొద ఈరాయంచపిల్ల తిగిచికొనఁబడి
నందున".— ఇటు మూలములో 'ఈరాయంచపిల్ల తిగిచికొనఁబడినందున' అనుట
కు—'రాజహంస శింజితహారి'— అని నాగరముద్రణములో నున్నది. అందు హంసయ
నుట హంసీయనుటకు అచ్చుతప్పని నాయెన్నిక. దిద్దఁగా—రాజహంసీరుతమువలె మ
నోహరముగానున్నది, అని యర్థము; అట్లనుటచే అందెలరొదను వేఱుహంసి కూఁత
యని భ్రమసి యుత్కంఠితమై ఆరాయంచకొదమ ఆరొదవైపు పోయెనని భావము.
హంసీశింజితమనుటచే హంసమునందు ధృష్టనాయకత్వము సూచితమైనది. ఇట్టిభ్ర
మయే కవిహృదయముగాన 'సహచరింబాసి' [సహచరీ మపి విహాయ=సహచరినిఁ
గూడవదలి]అన్నాఁడు. ఒండుచో సహచరీహానకథన మప్రస్తుతము, అప్రయోజనము.
అపిశబ్దస్వారస్య మేమనఁగా, ఆసహచరికన్న ఈకూఁతయొక్క సౌకుమార్యముచేతనే
(అందెరొదచేతనే) ఈకూఁతకూసినహంసి సౌందర్యాదిగుణభూయిష్ఠతర యని హంస త
లంచినది.—అందుచేత అయ్యంగనయందియలరొద సామాన్యహంసీరుతమునకన్న నె
న్నియోమడుంగులు మధురతరముగా నుండెనని భావము; దానంజేసి యాయంగన
యలోకసామాన్యలక్ష్మీసమంచిత యనియు రాజాంగనయైనను గానోపునని యూ
హనీయ యనియు, భావము. శ్రీరాముఁడు అందెలరొద యని శ్రవణముచే తా నె
ఱుంగనేరమియు, హంసను తివియుటంబట్టి తా నెఱుంగుటయు వింతగానున్నది. హం
సను తివియుటచే హంసియో, హంసాంతరమో, యని యూహింపనగుంగాని యందె
లరొద యెట్లూహ్యమగును? హంసరుతమును అందెలరొదను తత్సామ్యమును ఎఱుఁ
గనివానికి, అందెలరొద సజాతిపక్షిరుతభ్రాంతి గొలిపి హంస నాకర్షించునని, యెట్లు తె
లియును? కవులవర్ణనలచే తెలియునందురా? ఆహాహా! ఏమిసమాధానము! అట్లును
మూఁట నిది యొకవికల్పమేగదా కాఁదగును; ఈయొకటియే యనియు, ఆరెండుం
గావనియు, రామునికి తెలియుటెట్లు? కాన నిట ఆంధ్రముద్రణమును ఆంధ్రీకర
ణంబును రెండును అంధబలీవర్దన్యాయముం బొందియున్నవి.

ఏదోఒకసుందరి—'ఏదోఒకపిశాచి' అన్నట్లున్నది. ఇది ఏదోశబ్దస్వారస్య
530 ము. ఎవరో ఒకసుందరి, లేక ఏవతెయోయొకసుందరి, ఒకానొకసుం
దరి—యన్న మేలు.

అంగములన్నిడుక్ — సంశ్లేషము.

ఉ॥ ఏయదియిద్దిఱాతిపయి నేర్పడఁగీచిన పైఁడిగీఁత గాం
[2] గేయపరంటిలోనిజిగిఁ గేరెడు నంగములన్నిడుక్ హారి
532 ద్రాయతనీరపూరరుచి దర్పకుక్రీడలగీము వాకిటన్
శ్రీయుతమైనదివ్వవలెఁ జెల్వుగ వెల్వడుచున్న దెన్నఁగన్.

ఇప్పద్యములో 1. ఏయదియిద్ది—ఈభాగము పిశాచోచ్చాటనార్థమైన యథర్వమంత్రపారాయణముగా నున్నది. ఏర్పడఁగీచిన పైఁడిగీఁత—తదర్థమై యిదువన్నియల ముగ్గులు వెట్టుటగా నున్నది. గాంగేయపరంటిలోనిజిగిఁ గేరెడునంగములు.—ఆస్థాపనార్థమై చేసినబొమ్మ యని నమ్మవచ్చును. అంగములన్నిడుక్—అనుసీ సంశ్లేషమే ఆవేశాద్యుచితమైన పటపట పండ్లుకొఱుకుటగా నెన్నం జెన్నగు. హారిద్రాయతనీరపూరరుచి—బల్యర్థమై పసుపుకలిపినయన్నము రక్తాదికమును! దర్పకుక్రీడలగీము వాకిటన్—ఎవరివాకిటనే నిడుటకు, శ్రీయుతమైన దివ్వవలె—దివ్వతోఁ గూడ, చెల్వుగ వెల్వడుచున్న దెన్నఁగన్— ఇదియే ఆబొమ్మగలమూఁకుడు చేతఁగొని యిలువెలువడుట.— ఈపద్యము ఇంత యద్భుతముగా కుదురుటకు కారణమేమన, ఇది ప్రథమదర్శనంబున శ్రీరాములు సీతను వర్ణించుపద్యము. ఆమె భూమిత్రవ్వఁగా బైలువెడలిన భూతమేగదా, ఇంతకాలము జనకునియింటనుండినది. ఆయన ఉచ్చాటనచేయించికొనఁగా రామునిమీఁదికి వచ్చుచున్నది. దీనిమూలము.—

కేయం శ్యామోపలవిరచితోల్లేఖహేమైకరేఖా
రక్తై రక్తైః కనకకదళీకన్దళీగర్భగౌరైః
హారిద్రామ్బుప్లవసహచరం కాన్తిపూరం వమద్భిః
కామక్రీడాభవనవలభీదీపికే వావిరస్తి.

ఎవరీసుందరి! నల్లనియొరగంటిమీఁద నొత్తియొరసిన బంగారపుగీఱవలె నాట్యరంగంబులును, పసిఁడియరఁటిమోకలోపలిభాగమువోలె పసుపువన్నెగలవియు, పసుపునీటిముంపునకు చెలియైనకాంతిజాలును వెడలఁగ్రక్కునవియు, నైన యవయవములతో నొప్పారుచు మదనుని కేళీగృహవలభీదీపికవోలె పొడతెంచుచున్నది.— అనియర్థము. పద్యమునకు మూలముతో సామ్యమేపాటిదియో చూచికొనుఁడు. దీపికాసామ్యముకై సీతయందు (రేఖా) కిరణములు, (గౌరైః) పసుపువన్నె, [కాన్తిపూరమ్] వెలుతురును, వర్ణింపఁబడినవి.—ఇది కడునందమైన శ్లోకములలో నొకటి, శాకుంతలములోని 'చిత్రే నివేశ్య', మృచ్ఛకటియందలి 'అపద్మాశ్రీరేషా', ఇత్యాదులవంటిది. పంతులవారితెనుఁగులో గందరగోళముగా భీష్మముఖముగా నున్న

ది. 2. అంగములన్నిడున్—“లుక్సంశ్లేషోనాచి” యను నన్నయభట్టీయసూత్రముచే నిది గ్రామ్యము. పంతులవారు ఈసూత్రనిషిద్ధములైన లుక్సంశ్లేషములలో సంశ్లేషమును తాము యథేష్టముగా చేసి తద్రక్షణార్థము ఆసూత్రమే నన్నయాచార్యులది గాదని తొలుత వాదించి, ఆసూత్రముగల శ్లోకమే ఆయనదిగాదని ద్వితీయవారము వాదించి, నన్నయభట్టీయమె నన్నయ్యభట్టుదిగాదని తృతీయవారము వాదించి, లుక్కుచేసినవారి లుక్కును ఆసూత్రమునే ప్రమాణముగాఁ జూపి దూషించి, ఆత్మను భూషించుకొనియున్నారు.

౨౮ - వ పుట.

తే॥ మోవిబంధూకబంధువు మొగలిరేకు । వన్నెగన్నిప్పపూమొగ్గవలెనుబుగ్గ
పలువరుస దాడిమీబీజపరిభవకర।మగును మొగమన్నఁదమ్మికొసఁగునుగొలువు.

మూ. బన్ధూకబన్ధు రధరః సితకేతకాభం । చక్షు ర్మధూకకలికామధురః కపోలః
దన్తావళీ విజితదాడిమబీజరాజి । రాస్యం పున ర్వికచపఙ్కజదత్తదాస్యమ్.

1. మొగలిరేకువన్నె కన్ను—పసుపువన్నెదియు తెల్లవన్నెదియు రెండువిధములమొగలులు గలవు. పసుపుదానికి తెనుఁగులో గేదంగియనియు పేరు. కామలావ్యాధి బలమైనచో కన్నులు పసుపువన్నె మొగలివలె ఉండును. ఆవన్నెను వ్యావర్తించుటకే గదా జయదేవుఁడు సితకేతక [తెల్లమొగలి] యని సితవిశే
[4] 536 షణము వేసినాఁడు. దానిని పద్యములో మానకున్న మేలుగానుండును.

2. ఇప్పపూమొగ్గవలెను బుగ్గలు — మూలములో మధుర అని ధర్మము చెప్పఁబడినది. దానిని మానుట బాగుగాదు. 3. “శుకవాణిబుగ్గలు ముకురంబు లన రాదు” అని బుగ్గలు ఇట్లు ప్రయోగింపరాదని యప్పకవి చెప్పినాఁడు. పలువరుస యని యిటు వరుసం జెప్పినారు గావున దాడిమీబీజరాజి యని మూలములోనున్న రీతిగా అటనుంగూడ వరుసను తెలుపవలయును. 4. తమ్మికి—మూ. వికచపఙ్కజ, వికచశబ్ద ప్రయోజన మరయుఁడు.

చ॥ అడుగులచేతనంచదరు తాంబుజకాంతినధఃకరించెడున్
గడుకొనికేలఁగైకొనెడుఁ గ్రముకిసాలసుశోణశోభలన్
[9] 545 విడుపకవిద్రుమద్యుతిని వే పలుకప్పనఁగ్రోలులీలనె
ప్పడరెడునవ్వువెన్నెలసుధాంశురుచిన్నగువన్నెమిన్నగన్.

ఈపద్యమునందును ప్రాసముకై ౨౩ - వ పుటయందలి ‘ప్రతిమార్గ’ పద్యమందు చేసినజిత్తులే చేయఁబడినవి. ఎట్లన, ప్రథమపాదాదిపదము ఇందును శ్లోకార్థము వలనం గుదిరినదే, కడమ మూఁడు ప్రాసములును పాదపూరణ సంఘటనమే. 1. కడు

కొని, **2**. విడువక, **3**.ఒప్పదరెడు—ప్రా. **4**.అంచత్—పా. **5**.క్రమ—య. **6**.సు—జీవగల్లి. **7**. వే—య. **8**. లీల—పా.

మూ.—పదాభ్యా ముస్నిద్రా మధరయతి శోణాబ్జరుచిం
కరాభ్యా మాదత్తే నవకిసలయానా మరుణతామ్
ప్రవాళస్య చ్ఛాయాం దశనవసనాగ్రేణ పిబతి
స్మితజ్యోత్స్నాపూరై రుపహసతి కాన్తిం హిమరుచేః.

ఇందు చతుర్థపాదము సరిగాలేదు. పద కర రదనచ్ఛదములకు ఉపమితసమాసము పెట్టక స్మితమునకుమాత్రము పెట్టుట సరసముగాదు. మఱియు స్మితజ్యోత్స్నాపూర అనునది రూపకసమాసమేని,జ్యోత్స్నయే జ్యోత్స్నను నవ్వుచున్నదని యన్నది. జ్యోత్స్నకు నవ్వు స్వాభావికము గాదు, కడమ మూఁడు పాదములందు ఆయా యవయవములు తమతమ స్వాభావిక కర్మ చేసినవి. పదకరరదనచ్ఛదములు వరుసగా మెట్టుట, పట్టుకొనుట, త్రాగుటయు చేసినవి. అటులే ఇందు నుండవలయును. జ్యోత్స్నవంటిదే జ్యోత్స్నను నవ్వినదనుటయు సరసముగాదు. **9**. ఆ పాద మిట్లుండెనని తలంచెద.

స్మితైః జ్యోత్స్నాపూర్ణా నుపహసతి కాన్తా హిమరుచేః.

ఈకాంత చిఱునగవులచే చంద్రుని చంద్రికాపూరములను పరిహసించుచున్నది,—అనియర్థము. నాగరముద్రణములో ఏతదీయావతారికలో వీరి తెలుఁగులో నున్నట్లు 'అంగములచేతనే' యని కరణము లేదు.

ఖొల్లుప్రల్లదముచేఁ జాలు—ఇది హాస్యెంటూటు భాష. చాలింపు నీప్రల్ల
546 దములను, అనిన తెలుఁగగును.

మూలమునకుదిగఁదుడుపు.

[5] క॥ఇందుశిరోమణిరమణీ!యిందుశిరోమణిమదీయహితసఖియానీ
551 యిందుముఖియిందుసుందరు!పొందుతమగనిందొరదొరఁబురుషోత్తమునికా.

మూ.—కాన్త మిన్దుమణిదామకోమలే । కోమలేన్దుముకుటాఙ్కశాయిని
ఇన్దుచారు రుచిరేణ విన్దతా । మిన్దుసున్దరముఖీ సఖీ మమ.

చంద్రకాంతిమణిసరమువోలె కోమలమైన (యోగౌరీ) దానా, బాలచంద్రకిరీటుని యంకమందు శయనించుదానా, చంద్రసుందరముఖి నాసఖి చంద్రసుందరుఁ నిం గాంతుని శీఘ్రంబుగం బడయుఁగాక— అని యర్థము. ఇందలి విశేషణములు సాభిప్రాయములు. **1**. ఇందుమణిదామకోమలత్వము శివునిచే దేహమందు ధరింపఁబడి

నందులకుఁ గారణము. 2. కోమలేందుముకుటాంకశాయిని యనుటచే నీవలెనే యీషద్వి రహామేని యీ ధ్వని యీయామెకు నీ కాంతునివలెనే యీషద్విరహామేని యీ ధ్వని కాంతుని దయసేయుమని యాకూతము. ఇందుచారు ననుటచే గుణాతిశయములవలన నెల్లవారి కిని యీ చంద్రుఁడు మీకుంబోలె శిరసావహింపఁదగినవానిని అని యాశయము. ఇందు ముఖి యిందుచారుంబడయుత మనుటలో సదృశోత్కృష్టదాంపత్యముగా కూర్పు మని ప్రార్థన. కాంతుననుటచే, ఈసీత మనఃపూర్తిగా నెవనిం గామించినదో వానిని అనిభావము. నాలుగుపాదములందును ఇందుని చెప్పటచేత—హరధనుస్సును హర చూడాబాలశశాంకాకారముగా ఎక్కుపెట్టుటయు, క్రమక్రమముగా టంకారము చేసి ఆకర్షించి పూర్ణశశాంకాకారముగాఁ జేయుటయు, సూచితములైనవి. ఈమె కోరువాఁడు ఇందుమణిదామమువోలె [అశ్రమముగాలీలగా] ధనుస్సునుగ్రహించి [అనమితధనుస్సు వ్రేలుచున్నదామమువలె వంపులేకయుండును], తనచెంత హర ముకుటేందునివలె నుండునట్లెక్కుపెట్టి [రెండవపాదమున ఇందునికి కోమలవిశేషణ మున్నది] క్రమక్రమముగా పూర్ణేందునివలెఁ జేయుచు [ఇందుచారు—కోమలవిశే షణమిట నభిలషితముగాదు], పూర్ణేందునివలెఁ జేసి [ఇందుసుందరముఖి] ముఖము నకుసరిగాతెచ్చి ఆకర్ణాంతము లాగునట్లుగా ననుగ్రహింపుమనియు ప్రార్థనాశయము. పద్యములో 3. కాంతుఁడనుటకుమాఱుగా మగఁడనుట శృంగార మేదినవృద్ధవక్తకు ఉచితముగానుండును. కాంతశబ్దస్వారస్యము “భార్యావిరహగురుణా” అనక “కాన్తా విరహగురుణా” అన్న కాళిదాసునకును, “భర్తయవజ్ఞ చేసినను” అనక “కాంతుఁడవజ్ఞ చేసినను అన్న యలసాని పెద్దనగారికిని, దెలియును. ఈ మార్పుచే పద్యములోని శృంగారము పోయినది. ఈ తెనుఁగుపద్యమునెల్ల పాడుచేసినది ద్వితీ యపాదమందలి 4. హితశబ్దము. పద్యము మగనిచే శృంగారమును కోలుపోయి హిత ముచే ప్రహ్లాద మైనది. ఎట్లన—హితసఖియని హితవిశేషణము పెట్టుటచేత ఈ వక్త్రికిని గౌరికిని దీనిహితసఖుల [ఉత్తసఖుల గాదు] మనోరథమును దీనినిపారను చేత గౌరినెఱవేర్చునట్లుగా ఒకయొడంబడిక యున్నట్లును ఆయొడంబడికప్రకారము ఇపుడిది నిపారనుచేయుచున్నట్లును భావమగుచున్నది. కేవల సఖీశబ్దమయినచో నిర్దేశమాత్రఫలకమై నామోచ్చారణముకన్న కోమలముగాను ఆమెకై యిది ప్రార్థించు టకు కారణమును [అనఁగా చెలిమిని] దెలుపునదిగాను, ఆమెమనోరథ మదియే యని తానెఱుంగుటకును కారణముచెప్పటగాను, ఆమె వాగ్రూపముగా తన మనో రథమును చెప్పకొన లజ్జించునుగాన దానిని తాను చెప్పటగాను, ఉత్కృష్టుఁడే భర్తగావలయునని ఆమెకు ఎంతకోరికయో, అట్టిభర్త ఆమెకు కావలయునని దీనికిని నిజమనోరథమని సూచించుచును, ఉపయోగపడును. కేవలసఖీశబ్ద మిట్టిఫలము

నిచ్చుచు కల్పవృక్షముం బురణించుచుండఁగా వీరి కీ హితశబ్దము సర్వనాశక మేల కావలసివచ్చినది? రహస్యమెఱుంగుఁడు. ఈ దోషము వీరిది గాదు. జగద్గురువని పేరిడుకొన్న శ్రీశంకరాచార్యులవారిది.* 5. కలియుగములో యతిని పురాణములు నిషేధించి లోకరక్షణచేసియుండఁగా, భగవత్పాదులవా రేల యతి నుద్ధరింపవలయును? వారట్లుచేయకున్న వీరి కీపద మక్కఱయుండదుగదా, పద్య మింత పాడుగాదుగదా.

రాముఁడు—ఎట్టీమె పెండ్లిగోరునది చెలికత్తె? [ఆలోచించి] ఇదియుచితమే. వయస్సంధియం దీపె యున్నదిగదా? అట్లే.

[అప్రాయశ్చిత్తీయపద్యము]

చ॥ కడవఁగ బాల్యమీడుగడఁ కన్మనమారఁగ రాఁగ మౌగ్ధ్యమె
[19] క్కడనెచనంగఁ గౌఁగిలిడు కాంక్షపొసంగఁగ మిక్కుటంబుగాఁ
570 దొడరకయున్న నెవ్వఁడును దొయ్యలిదైనది మేనుమానుగా
నడరెడుఁగామదేవత మహాకవచంబుగ నిజ్జగంబునన్.

పాదపూరణ మహార్ణవ కల్లోలపరంపర—1. కడఁకన్—య. 2. మనమారఁగ—పా. 3. ఎక్కడనె—ప్రా. 4. మిక్కుటంబుగాన్—పా. 5. దైనది—పా. 6. మానుగా—పా. 7. అడరెడు—[మానగున్ అన్నంజాలును]ప్రా. 8. మహత్—య. 9. ఇజ్జగంబునన్—పా. 10. పాసంపుజిత్తు—తొలిపాదమున ప్రాసశబ్దము శ్లోకార్థముచేతఁ గుదిరినదే, కడమమూటిలో నొకటి 'తొడరక' శ్లోకార్థాపరిజ్ఞానముచే కుదిరినది, రెండు పాదపూరణాకృతిగణమునుండి కైకొనంబడినవి.

దీనియర్థము:—మూలాభిప్రాయ మీపద్యమున లేనేలేదు. ఈ పద్యార్థము నెఱుంగునట్టి యాస్తికహిందువులు దీనిని పఠించుటచేతను వినుటచేతను తమ కేమి నరకము గలుగునోయని గడగడ వణంకుదురు. ఈ పద్యము ఉండఁదగదు.—11. ఈడు రాఁగన్—బాల్యము కడవఁగన్, అన్నట్లే ఇదియు తుమున్నంతముగా నున్నది; దానికి బాల్యముపోయెనని భూతమర్థమైనట్లే దీనికి ఈడు [యౌవనము] వచ్చెనని యర్థమగుచున్నది. అపచ్చుటయందును కడఁక న్మనమారఁగ అనుటచే సంపూర్ణముగానే నెక్కొన్నదనియు నర్థమగుచున్నది. ఇంకను రాలేదని, మూలమందు జయదేవుఁడు ఘోషించుచున్నాఁడు. 12. కౌఁగిలిడుకాంక్షపొసంగఁగ మిక్కుటంబుగా—వర్ణన ముదుగుగానున్నది. లోకమాతయైన సీతకు రామాలంబనమునం గాక కౌఁగిలిపై [కామకేళీవిజృంభణముకై] మిక్కుటముగా కోర్కెపొడమెననుట చక్కఁగాలేదు. ఇటు పద్యార్థముచే వయస్సంధి సమర్థనీయమూ,వయస్సంధిచే పద్యార్థము సమర్థనీయ

మా ? పద్యార్థముచేతనే వయస్సంధియని సహృదయు లెఱుంగుదురు. రాముఁడు సీత యందు తనకగపడిన లక్షణములనుబట్టి వయస్సంధి నూహించుచున్నాఁడు. సీతా కునూఁగతమైన యతివేలపరిరంభణకాంక్ష రామునికిం దెలియుటెట్లు ? చేష్టలచేతఁ గదా తెలియవలయు. అట్టిచేష్టలు చూపినదేని సీత ధీరోదాత్తునినాయిక గాఁదగునా? చేటి యగును.

> తామ్బూలాక్తం దశనమసకృ ద్దర్శయన్తీహ చేటీ
> ఘోటీహ్రేషావికృతవిరుతం హేతుహీనం హసన్తీ
> స్థానస్థానస్ఖలితపదవిన్యాస మాభాసమానా
> యానా మర్గే వసతి కుటిలం నర్తితోచ్చైర్నితమ్బమ్.

ఇట్లే చరించినదా సీత రామునియెదుటను? అట్టియెడల రాముఁడు సీతకై స్వయం వరమునకుం బోవునా ? పులిమీఁద పుట్ర ! —13. తోడరకయున్న నెవ్వఁడును— శివశివా ! సీత యేమేని, యెమ్మకాండ్రనెల్ల తన్నుఁగవయరమ్మని దండోరా వేయించి నదా ? నిజాకౌశలముచేతనా, పృథ్వీరాజునకు వెఱచియా, ఎవ్వఁడుం దొడరమి ? 14. మఱియు పంతులవారి మిక్కుటము వెనుకకన్వయమో ముందటికన్వయమో నిశ్చ యము లేదుగానను, వీరికి కాకాక్ష్యాది న్యాయంబులును తెలిసియుండును గానను [అందులకు గమకము 'కవిపండితసంఘము వసంతమందు జరుగవలయు' ననువాక్యము నకు వసంతేతరర్తువునందును జరుగవచ్చునని యర్థము చెప్పుటకై ఇష్టార్థాసాధకమైన "కాకేభ్యోదధిరక్ష్యతా" మనున్యాయము నుపన్యసించుటయే], మిక్కుటంబునకు తొ డరుటతో నన్వయమేని హా! హా ! చాటుచాటుల కొంచెకొంచెము తొడరిరా ? దానికి తోడు ఆమెమేను 15. కవచమువలెనైనదఁట! అందును 16. మహాకవచమఁట ! ఏమివ ర్ణన ! కవచము శత్రునారాచాదులనుండి కవచిని రక్షించును. కామునిపై యాయుధ మెత్తువాఁ డెవఁడు ? కాముఁడేగదా ఒండ్లపై ప్రయోగించునుగాని. కాముని కీమె యపూర్వాస్త్రమన్న సొంపుగలదు, కవచమన్న నేమిరసము ? అందును, మహాకవ చ మేమి? శ్రీరామా, సీకాంతమానము గావ నీవేని యీయనకు 'వర్మ' గాదు 'మర్మ' అని తోఁపింపవైతివేమి ? జఘన్యమతములు మనపంతులవారి కత్యంతోపాదేయ ములు గావున, "కానలఁ ముసలిమాను ల్గా వితర్కింపఁగాఁ" ఇత్యాదిప్రయో గంబులబడి యిట సీతాదేహము మానయ్యెను, కొయ్యయయ్యెను, అని పంతులవారు ఒకస్వారస్యమును మనంబునం దాఁచికొని యున్నారు గావలయును. మూలము లో "కేనాపి వయసా న స్పృష్టమ్" అనివపువునకుంగలవిశేషణమునకు, 'ఏవయస్సుచే తనుం బాఁకఁబడనిది' అనియు నర్థమగునుగావున ఎదిరినరుని లోకులు, "పోరా పక్షీ" యని పక్షిశబ్దప్రయోగముచే ధిక్కరింతురుగావునను, ఆ 'పోరాపక్షీ' న్యా

యంబున నిట పక్షిశబ్దద్వారా తన్మూలమైన వయశ్శబ్దమునకు నీచమానవుఁడని యర్థముగా నెవ్వఁడుం దొడరమి యని తెన్గించినారు గావలయు. 17. లేక,వయశ్శబ్దమునకు వయసువాఁడని యర్థము కల్పించియుందురు. ఇప్పద్యము చదివినపరితాప మాఱ నేతన్మూలశ్లోక సుధార్ణవలహరి నోలలాడుఁడు.

అపక్రాన్తే బాల్యే తరుణిమని చాగన్తుమనసి
ప్రయాతే ముగ్ధత్వే చతురిమణి చాశ్లేషరసికే
న కేనాపిస్పృష్టం యదిహ వయసా మర్మ పరమం
తదేతత్పఞ్చేషోర్జయతి వపురిన్దీవరదృశః.

బాల్యము పోఁగా [పోయినదని యర్థము], తారుణ్యము రాఁగోరుచుండఁగా [తాను ఈమెడకు రావలయునని తారుణ్య మపేక్షించుచుండఁగా, తారుణ్యము నీమె కోరుటగాదుసుమా, తారుణ్యమే (కర్త) ఈమెయందు వచ్చి తాను నివసింపవలయునని కోరుట, తారుణ్య మింక రాలేదని భావము.] పేలతనము తరలిపోఁగా, చాతుర్యము ఆశ్లేషరసజ్ఞ మగుచుండఁగా [చాతుర్యము ఈమెను తా వచ్చి కౌఁగిలించుకొనవలయునని ఉవ్విలూరుచుండఁగానని యర్థముగాని, ఈమె ఎవనినేని దిట్టని కౌఁగిలించుకొనుటకై యిల్లువిడిచి లేచిపోనుండఁగానని యర్థము కాదుసుమా], ఏవయస్సుగాని [బాల్యమేనియు యౌవనమేనియు] తాఁకనట్టిది ఈనీలోత్పలనేత్రయొక్క దేహము పంచబాణునియొక్క (విజయ) రహస్యముగా సర్వోత్కృష్టము పొందుచున్నది [అనఁగా అత్యంతమదనోద్దీపకముగానున్నది అనిభావము]. 18. ఇందీవరదృశః అనుటకు తొయ్యలి యనుట సవత్ససురభికి బదులు ఈచుకొని పోయినగొడ్డును తోలుటగానున్నది. ఇందీవరసాదృశ్యకథనముచే నక్షులకు ఒకక్రొత్తసిరి బాల్యాపగమప్రయుక్తము వచ్చుచున్నదని భావము. "అక్షులు నిరులు రా నరచూడ్కిఁ గనుగొనె" ఆముక్త. "భ్రువోః కాచి ల్లీలా, పరిణతి రపూర్వా నయనయోః," శాఙ్గధర. "దూరం యాత్యుదరం చ రోమలతికా నేత్రార్జవం ధావతి." ఇందీవరదృక్త్వస్వారస్యము "ఇందీవరంబులనీను క్రొన్గన్నులశరదిందుముఖులు చామరము లిడఁగ" అని చెప్పినయల్లసానిపెద్దనగారికి తెలియును. రసమంజర్యుద్ధృతములయిన యీ క్రిందిశ్లోకములచే 'తరుణిమని చాగన్తు మనసి' వర్ణనకు సదృశవర్ణనయు యౌవనప్రాదుర్భావముచేత నేత్రములందు నీలోత్పలకాంతి కలుగుననియు విశదమగును. కావున ఇందీవరదృక్క బాల్యాపగమ (వయస్సంధి) లింగముగా జయదేవునిచే న్యస్తమైనది. దానిని మాని తొయ్యలి యనుటకన్న వేఱుపాడుకలదా?

సామాన్యస్థో ముగ్ధా ముదాహరతి.

అజ్ఞప్తం కిల కామదేవధరణీపాలేన కాలే శుభే
వస్తుం వాస్తువిధిం విధాస్యతి తనౌ తారుణ్య ఏణీదృశః
దృష్ట్యా ఖఞ్జనచాతురీ ముఖరుచా సౌధాకరీ మాధురీ
వాచా కించ సుధాసముద్రలహరీలావణ్యమామన్త్ర్యతే.

అజ్ఞాతయౌవనా యథా.

నీరాన్తీర ముపాగతా శ్రవణయో స్సీమ్ని స్ఫురన్నేత్రయోః
శ్యామం లగ్న మిదం కి ముత్పల మితి జ్ఞాతుం కరం న్యస్యతి
శైవాలాఙ్కురశఙ్కయా శశిముఖీ రోమావళీం ప్రోఞ్ఛతి
శ్రాన్తా స్మీతి ముహు స్సఖీ మవిదితశ్రోణీభరా పృచ్ఛతి.

ఇట్టియీయిందీవరదృక్కునకు తెలుఁగు తొయ్యలి యఁట! ఇంతకన్న తొయ్యనిది అనిన గ్రామ్యమైనను చెన్నపట్టణపుఁ దెనుఁగులో లేవలేని ముసలిదియని యర్థమై యది యొకస్వారస్యముగా నుండును. దానిని స్థాపించుటకు వృద్ధగౌతమ్యుపాఖ్యానమును తేవచ్చును. **19**. పంచేషువనుటకు కామదేవత యఁట!—మదనునిప్రసిద్ధేషువులచే నజయ్యమైనది ఈమెవలన సుజయమగునని పంచేషుశబ్దస్వారస్యము. కామదేవత యనుటచే నది లవణసముద్రమునం గలసినది.

౨౮ - వ పుట

[2] క॥ నలుపైనయరఁటియాకుల । నడుమఁగనంబడెడునంగనామణిజలదం
572 బులనడుమఁగానఁబడుశశి।కలవలెఁదనిపెడుఁజకోరకమునువలెననున్.

**1**. చకోరకమునువలె—వలెశబ్దముతో సమాసమేగాని వ్యస్తప్రయోగము లేదు. **2**. ఇప్పద్యంబున రెండువలెలున్నవి, అందు ఒకటి యెక్కువ. “శశికలచకోరకమునుంబోలె ననుంపని పెడు” అనియుండవలయును.—మూలములో రెండున్నను, ఇందు అంపగింపవు. ఈజీర్ణవసమును కవనము చేయుదము:—

క॥ నలుపులగునరఁటియాకుల । నడుమం గనఁబడెడుబాల నన్నుం దనుపున్
జలదములనడుమఁ గననగు । కలువలచెలికళ చకోరకంబునుబోలెన్.

౨౯ - వ పుట.

[4] క॥ ఇదెనామదియనుకవలుకు । ముదంబునిడుశారదమగుపున్నమ రేయై
576 పొదలెడు వెండియునీయెడ । నిదియెజగన్మోహినియన నెసఁగెడునాహా.

మూ. మన్మనసికుముదానన్ద శరత్పార్వణశర్వరీ
అహో ఇయ మితో నూనం పునరప్యభివర్తతే.

నామనః కుముదమునకు ముదమిడుశారదపూర్ణిమారాత్రి యగు నీమె అహో! నిజముగా నిటకే మఱల వచ్చుచున్నది,—అని యర్థము. మూలములో ఇది యెల్ల నొకటియే వాక్యము. మన్మ...ర్వరీ అను సమాసమెల్ల అనువాదపరముగాని విధాన పరముగాదు, కావున దానిని విధాన భంగిగా నట్లు వేఱువాక్యముచేయుట సరిగాదు. 1. ఐపొదలెడు—ఈపదము లెత్తివేయవలయును. 2. ఈయెడ నెసఁగెడు— ఇది 'ఇతోభివర్తతే' అనుటకు తెలుఁగు. అభిపూర్వమయినపుడు వృతుధాతువు గమనార్థమును దెలుపుననియు ఈవాక్యమునకు 'ఇచటికి వచ్చుచున్నది' అని యర్థమనియు ౫౭-వ పుటలో తెలిపియున్నాఁడను. మూలములో సీత రామునిదెసకు వచ్చుట వివక్షితము. పంతులవారు అభివర్తతేపదమునకు ఉండుట యర్థముచేసికొన్నారుగావున, వారిలెనుఁగున ఎసఁగుటయే వివక్షితము గావలయునుగాని ఎసఁగిన ప్రకారముగాదుగావున 3. "ఇదియెజగన్మోహినియన" అని క్రియావిశేషణతాపరముగా వ్రాయుటసరిగాదు. పాదము పూర్తిగావలయునుగాన దీనిని అనువాదముగా ఈజగన్మోహిని యని వ్రాసికొనియుండిన బాగుగానుండును. 4. ఇదె, ఇదియె, యని సీతకు రాముఁడు ప్రయోగించుట కడువిరసముగానున్నది; వృద్ధపత్న్యుచితము.

ఉ॥ ఒందుతదీనిచూడ్కి యసితోత్పలమాలికమాడ్కి వేడ్కమైఁ
[22] బొందుతఁబూర్ణచంద్రరుచిఁబోల్పగుదీనిదినెమ్మొగమ్మిఁగం
598 బొందుగదీనిచన్నుగవపోలెడుఁదామరమొగ్గలందమున్
బెందముమున్ సృజించుఁగడువింతగదీనిదిగొప్పకొప్పగిన్.

మూ.—వహత్యస్యా దృష్టి ర్వికచనవనీలోత్పలతులా
మఖణ్డాం స్వాభిఖ్యాం వదన మిద మిన్దోః కలయతి
కుచౌ కిఞ్చిన్మీలత్కమలతులనాం కన్దళయత
స్తమఃశోభాం చిత్రాం చికురనికురుమ్బం హి కురుతే.

పాదపూరణములు.—1. మాలిక—పా. 2. వేడ్కమై—పా. 3. పోల్పగు—య. 4. దీనిది—ది—పా. 5. ఇఁగన్—పా. 6. పొందుగన్—ప్రా. పెన్—ప్రా. 7. కడున్—పా. 8. దీనిది—ది—పా. 9. ఒగిన్—అన్నిటిలోను అసహ్యమైన పా. 10. వింతగ—య. ప్రాసంపుజిత్తు—తొలిపాదమునం ప్రాసము అర్థావశ్యకపదమే. తృతీయచతుర్థపాదముల ప్రాసములు పూరణములేగదా. ఈయాచారము ఇంతకుముందే కొన్నిపద్యములలో చూపియుంటినిగదా. ద్వితీయ

పాదమునను 11. అనవీకృతతాదోషమునకుం బాల్పడుటచే అర్థావశ్యకపదమే లభిం చినది. అటని కవి చింతిల్లవలదు; అందులకు పరిహారముగా అర్థానవశ్యకమయిన యతిపూరణము పడినదిగదా.

"సదా చరతి ఖే భానుః సదా వహతి మారుతః
సదా ధత్తే భువం శేషః సదా ధీరోఽవికత్థనః.

అత్ర సదేత్యనవీకృతమ్... నవీకృతత్వం యథా —

భాను స్సకృద్యుక్తతురఙ్గ ఏవ రాత్రిందివం గన్ధవహః ప్రయాతి
శేష స్సదైవాహితభూమిభార ష్షష్ఠాంశవృత్తే రపి ధర్మ ఏషః."

అనుదర్పణోక్తిచే ననవీకృతతాదోషస్వరూపము విశదమగును.

పరిపతతి పయోనిధౌ పతఙ్గః సరసిరుహా ముదరేషు మత్తభృఙ్గః
ఉపవనతరుకోటరే విహఙ్గో యువతిజనేషు శనైశ్శనై రనఙ్గః.

అనునీశ్లోకమున పరిపతతిక్రియనే మఱలచెప్పనొల్లక గదా మానియే వేసినారు. అధ్యాహరించుకోవచ్చునుగాని నవీకరింపకుండుటసరిగాదు. జయదేవుఁడు పహాత్యర్థకముగానేగదా కడమమూఁడుపాదములందును కలయతి, కన్దళయతి, కురుతే అని మార్చిమార్చి పదప్రయోగము చేసినాఁడు? 12. మఱియు నిటమూలకారుఁడు తుల గాన పహతి యనియు, ఇందువు [కళావంతుఁడు] గాన కలయతి యనియు, కుచములు గాన [మొలకెత్తిన వని యర్థముగా] కన్దళయతః అనియు, అట్లే తమస్సునకు కురుతే, లేక, తనుతే, అనియు, శబ్దప్రయోగములు చేసి యొకానొకస్వారస్యమును నిబంధించినాఁడు. అది పంతులవారు గ్రహింపక ఒందుత ఒందుత యని దంచినారు. 13. ఇందలి క్రియాపదములలో ఒందుతక్, పొందుతక్, పోలెదుక్, అని మూఁడు లూట్టులును, 'సృజించు' నని నాలవది లాట్టును అగుట అర్థభేదాభావంబుచే ప్రక్రమభంగదోషము నాపాదించుచున్నది. 'సృజించెదును వింతగ' అని పఠించిన ఆదోషముండదు. 14. ఈక్రియాపదములెల్ల ఆశీరర్థంబులుగానున్నవి. దీనం బ్రయోజనమేమి? ఆమెకీసౌందర్య మిప్పుడులేదా? ఉన్నచో, ఆశీస్సేల? ఉన్నట్లు వర్తమానార్థకముగానే క్రియాప్రయోగముచేసిన బాగుగానుండును, సుందరాంగి యని తెలియును. కురూపయొక్కపతియు నది సురూపగావలయునని కోరును! అందుచే దానికి సౌందర్యము కలదనియర్థమా? అనితోత్పలమాలికమాడ్కి—మా. వికచనవనీలోత్పలతులామ్—వికసించిన నూతననీలోత్పలముల సామ్యమును,—మూలములో 15. మాలికలేదు, తెనుఁగులో 16,17. వికచ నవలు లేవు. మూలములో నాలుగుపాదములలోను నైసర్గికపదార్థములే యుపమానములుగా నిబంధింపఁబడినవిగాని కృత్రి

ము ఒకటి నయినను లేదు. అందలస్వారస్యమేమనఁగా కలువలును కమలములను సరసియందున్నట్లే ఈమెయందును యౌగపద్యముగా అన్నియు ఒకటనె దృగ్గోచరములగుచున్నవి. చంద్రతమస్సులు నింగియందుంబోలె ఈమెయందును ఒకదాని వీఁపున ఒకటిగా నొప్పుచున్నవి. పూర్ణిమయందు మనకభిముఖమైన చంద్రపార్శ్వము ప్రకాశమానమైయుండునప్పుడు మనకుగోచరింపనిపార్శ్వము తమోమయముగాఁగదా యుండును. అట్లే యీమెముఖకేశభారములు నని కవిహృదయము. కాన నిందు మాలికను జెప్పుట మూలకవిహృదయానుగుణము గాదు. **18.** వేడ్కమై—ఈపూరణము దొరకినందులకు పంతులవారికి వేడ్కయే గాని అచేతనమయినచూడ్కికి వేడ్కయేమి? **19.** తామరమొగ్గలందము౯— మూ. కించిన్మీలత్కమలతులనామ్—ఇంచుకంత వికసించుచున్న యనువిశేషణ మేలకో, తత్త్యాగము సరియో, బుద్ధిమంతులూహింపుఁడు. **20.** వింతగ౯—చిత్రామ్ అనువిశేషణము మూలములో తమశ్శోభకు; వీరు దానిని క్రియావిశేషణముగా పాడుచేసినారు. ఎట్లైన మాతా మాకువచ్చిన సరి. **21.** గొప్పకొప్పు—గొప్పకొప్పు మందోదరీపతితోనే పోయినదనుకొంటిమి. "మామందోదరిగొప్పకొప్పున" ఈవిమర్శ—౬౮-వ పుట చూడుఁడు.—మూలములో చికురనికురుంబము చెప్పఁబడినది. కొప్పు చెప్పఁబడలేదు. వీరే సీతనే [ఈప్రసాధనము మాఱకముందే ఈయంకముందే] ౭౯-వ పుటలో "నాతినీయదిజడ" యని వేణి ధరించియున్నట్లు వర్ణించినారు. అప్పుడేని యీవిరోధము జ్ఞప్తికి రాలేదుగాఁబోలు. **22** పొల్పగుదీనిది నెమ్మొగమ్ము—'పొల్పగు' నెమ్మొగమ్మునకు విశేషణమేని వ్యవధానము అందముగాదు, 'దీని' కి విశేషణమేని ఈపద్యమెల్ల అపొలుపునే వర్ణించుచున్నది, మఱల పొలుపనుట కడు విరసము. ఇదియునుంగాక దీనిచూడ్కికడ నక్కఱలేని పొలుపు ఇటమాత్రమేల? ఈపొలుపు సన్న్యాసిది, సీతది గాదు.

**1.** తనమదికదలికఁదలరినతుంటవింటిదంటచేతనే—ఇది సీతావాక్యము. ఒకసహకారశాఖయాకులపై శ్రీరాముఁడు గీచినకొనగోటిగీఱలం గాంచి ఆయన
[2]
600 గీచినవని యెఱుంగక మదనుఁడే గీచెనని తలంచి సీత యిట్లుపలికినది. మూ. నిజచాపలతాశఙ్కినా స్వయం మన్మథేనైవ—తనతీఁగవిల్లని తలంచి మన్మథుఁడే స్వయముగా.—చాపలత యనఁగా మదికదలికగాదు. తా లేక చాపలమన్నను, తాతో చపలత యన్నను అయర్థముకలుగును. **2.** చాపలత యని భావార్థప్రత్యయముపై మఱల భావార్థప్రత్యయము రాదు. సాహిత్య మగపడుచున్నదా?

వబప్రాసము.

ఉ॥ పూవిలుకాఁడునీతనువెపోతనవిల్లనిమధ్యదేశముం
[18] దాఁబిడికింటఁబట్టెభువనత్రితయైకవశీకరోరుము
618 ద్రావిభవత్రిరేఖలనరాజిలురేఖలసందుగీరలం
దోవరవర్ణినీమణియొప్పుత్రివళీకపటంబుడంబునన్.

మూ.—మత్వా చాపం శశిముఖి నిజం ముష్టినా పుష్పధన్వా
తన్వీ మేతాం తవతనులతాం మధ్యదేశే బభార
యస్మా దత్ర త్రిభువనవశీకారముద్రానుకారా
స్తిస్రో భాన్తి త్రివళికపటా దఙ్గుళీసన్ధిరేఖాః.

చూపుడుప్రాసము—పూవిలుకాఁడు. కృత్రిమప్రాసములు— 1. తాఁబిడికింటు, 2. ముద్రావిభవ. పాదపూరణములు.—3. పో—య. 4 త్రా—ప్రాసార్థము. 5. ఉరు—పా. విభవ—ప్రా.

ఛందస్సు— 6. తాఁబిడికింట.—వీరు "తావలికె" నని వప్రాసముకై ప్రిన్సాఫ్ వెల్సుచరిత్రములో ప్రయోగించినారఁట. ఏను నేను తానుశబ్దములు ద్రుతప్రకృతికములే గాని కళలుగావని చర్చాపూర్వకంబుగా నముద్రితగ్రంథచింతామణీ మయూఖములో నేను సిద్ధాంతీకరించియున్నాఁడ, దానింగనుఁడు. ఆప్రయోగములో వాదేశముతప్పు, ఈప్రయోగములో వబప్రాసముతప్పు. వబప్రాసమునుం గూడ నామయూఖములోనే చర్చించియున్నాఁడ. వీరు రెంటనువ్యాకరణమునుమాత్రమే ధ్వంసించి తనియరాదా? 'తాపహింయించె ముష్టి' ననరాదా?

సంస్కృతవ్యాకరణజ్ఞానము.—7. త్రిరేఖలు—త్రిరేఖము, లేక, త్రిరేఖి, అనవలయును. "సహస్రకరశాఖల్" 'దశదిక్కులు' చతుర్దశభువనము లిత్యాద్యాంధ్రవ్యవహారమర్యాదచేతను రక్షణీయముగాదు. ఎట్లన నిటుముందుగానే త్రి+రేఖా శబ్దములకు తిస్సృణాం రేఖాణాం సమాహారః త్రిరేఖమ్, త్రిరేఖీ, అని ద్విగు వేర్పడి, తర్వాత అది భువన...విభవ అనుదానితో సమసించినది. ఈదశదిగాదిసమాసములు ద్విగుత్వముంబడిసినపిమ్మట మఱల సమసించి యైనట్టివి గావు. 8. త్రివళీకపటంబు— ఇందు త్రివళీశబ్దము అపప్రయోగము. త్రివళి యని హ్రస్వముగా నుండవలయును. త్ర్యవయవా వళీ ఇత్యాదికల్పన, అయిదువటముల మొత్తమును పఞ్చవటః అని పేర్కొని పఞ్చావయవో వటః అని వివరించిన నెంత సరిగానుండునో అంతసరిగా నుండును. సప్తర్షయః అన్నట్లు సంజ్ఞాత్వకల్పన సరిగాదు. అనభిధానము బాధించును. కానిచో త్రిలోకనాథః అనుచోట తత్త్వబోధినీకారులు సంజ్ఞాత్వకల్పన

చేసికోరాదా; మూలమందున్న హ్రస్వరూపము ఈపొరఁబాటును తప్పించియుం డఁడగును. ఘాటిలోఁదాఁటినది.

అన్వయము.—9. మధ్యదేశముక—దేనియొక్క—మధ్యదేశమో? తనువుయొక్క—యని ప్రయాసపడి గ్రహింతురుగాక. 'పూవిలుకాఁడు తనవిల్లని తలంచి, సీత నులతను మధ్యదేశమున పిడికిటంబట్టుకొనెను.' అనియిట్లున్న సుఖాన్వయముగా నుండును. మూలములో నిట్లేయున్నది. పంతులవారు చెఱిపినారు. మధ్యసీమలో ననిన సరిపడును, తనువును కర్మగా నాక్షేపించును.

10. సీతనువెపో—యతి బాధింపనిచో మూలమునంబలె తనులత ననియే పడియుండుంగదా. 11. తన్వీమ్—అని(తను)లతకు విశేషణమున్నది. ఇందు రెండును అదృశ్యములైనవి. లతాశబ్దము సప్రయోజనము, లత మదనునికి విల్లుగాఁదగునుగదా. అయినను తన్వీలతాశబ్దములు పోయినందులకు తద్విరుద్ధార్థ మొసంగ 12. ఉరు శబ్దమువచ్చినది. ఉరుముద్రయనుటచే గొప్పరేఖలనియు, అట్లనుటచే నడుము కడుంబెద్దదియనియు, మేరుమన్దరసమానమధ్య యనియు శృంగారరసము వెల్లివాఁడుచున్నది.

"త్రిస్త్రి నీదళవిశాలలోచనా। మేరుమన్దరసమానమధ్యమా
అర్కశుష్కఫలకోమలస్తనీ। పెద్దిభట్టవనితావిరాజతే."

13. విభవత్రిరేఖలు—అమూలకము, అనావశ్యకము, అప్రయోజనము. 'ముద్రలన' అన్నంజాలును. ఉరువిశేషణ రక్షణార్థమై వీనిం బెట్టుకొని అవిశేషణమును ముద్రతో సరిపడమి, త్రిరేఖలతోను సరిపడమి, విభవముతో సరిపడుచుకోవలయును. 14. అటుపైన వళీకార మేది? అదియు ముద్రావిభవము గావలయును. ఎంతగుడుగుడుగుంచమో! విద్యార్థులను వేధించుటకు మంచియుపాయము. 15. త్రిరేఖలు—గీఱలని రానేవచ్చినది, ఇది మఱలనేల? 16. ఓహో—మూలకారుఁడు గూడ తనకవనమున కింతయాశ్చర్యపడలేదు! 17. కపటంబుడంబునక—పద శ్రుతి డంబుగానేయున్నది, గాని కపటమునకు డంబేమి? త్రివళిడంబుకపటంబునక— అన్న నర్థముండును.—18. ఇందు (పట్టైక) పట్టుటచేత నంగుళీసంధిరేఖలు సమర్థితములా, అంగుళీసంధిరేఖలచే పట్టుట సమర్థితమా?—పద్యముచే స్పష్టపడదు. ప్రకరణముచేతను ఈతెనుంగునం దెలియదు. అందులకు గమకమయిన చాపలతాశంకినేత్యాదివాక్యమును వీరు తప్పుగా తెనిఁగించినారు. పద్యంపుమూలములో ఈ ప్రయాస లేదు, యస్మాత్తని పదప్రయోగముచే పట్టుటయే గీఱలచే సమర్థితమైయున్నది.

౨౭ - వ పుట.

[4] క॥ ఇందున్వాసంతీరస । బిందువునిందిందిరములు పేర్మిం ద్రావున్
622 ముందెదిమందిరమయ్యర । విందమునతిమందముగని వేవిడనాడున్.

మూ.—వాసన్తీరసబిన్దుం । సున్దర మిన్దిన్దిరా ఇహ పిబన్తి
చిరమన్దిర మరవిన్దం । మన్దంమన్దం పరిహరన్తి.

ఈశ్లోకములో రామునిచూడ్కులు రామముఖారవిందమునుండి మెల్లమెల్లగా సీతావాసంతిమీఁదికిం బ్రసరించి తదీయప్రభూతలావణ్యమకరందమును గ్రోలుచున్నవని ధ్వనితమగుచున్నది. మూలమందు చిరమందిరమనుట సీతాలావణ్యముయొక్క యాకర్షణగుణాతిశయమునుం జెప్పుటకు, 1. ముందెది మందిరమనుటచే చిరనివాసమనునర్థము రాదు. రామునిచూడ్కులకు రామముఖము ఆజన్మము నివాసమేగదా. 2. మఱియు 'ముందు' అనుటచే ఇఁకను వాసంతి మందిరమగునని సూచితమైనది. రామునిచూడ్కులకు రామముఖమే మందిరముగాని సీత మందిరము గాదు. ఆచూడ్కులు సీతమీఁదఁబ్రసరించి మఱల రామముఖమునకే పోవుచుండును. అలసవలితవిలోకనములలక్షణముం బరిశీలింపుఁడు, జయదేవ వివక్షితార్థము తెలియును. పురుషునిచూపులకు తుమ్మెదలనుసాటిచెప్పుట సగిగాదని యడావడిచేయ శక్యముగాదు.

చ॥ వనతరువల్లికాకుసుమవాసన లుల్లకశైలకన్యకా
ఘనఘనవేణికాభరముకమ్మనితావికిఁ జిక్కి మ్రోయుచున్
వెనుచనియెన్ ద్విరేఫములు వేమఱు భావివియోగచింతచే
వనరుచు వెంటఁబోవు మహీవల్లభుచూపులప్రోవులో యనన్. వసు.

3. పంతులవా రీశ్లోకమున సీతారామసంబంధిధ్వనిని గ్రహింపమి ఈ 'ముందు' శబ్దప్రయోగముచేత విశదమగుచున్నది. జయదేవుఁడు లావణ్యమును సూచించుటకై రసబిందువునకు సుందరవిశేషణమును వేసినాఁడు, కాన, దానిని "పేఁకి" చేసి 4. పేర్మిన్—గౌరవముగా, లేక, అతిశయముగా, అని యతిపూజ చేయుటయు మూలహృదయాపరిజ్ఞానమునే తెలుపుచున్నది.

[8] క॥ వదలఁగ శైశవశిశిరము
630 పొదలఁగ యౌవనవసంతమునుగుచగుచ్ఛా
భ్యుదయమొదవుటను నవయువ
తిదితనులతముదమునిడుమదినిగడుమాకున్.

మూ.—నిర్ముక్తశైశవదశాశిశిరా నవీన । సంప్రాప్తయౌవనవసన్తమనోరమశ్రీః
ఉన్మీలితస్తననవస్తబకా నికామ । మేణీదృశస్తనులతా తనుతే ముదం నః.

1. యౌవన—మూ. నవీనసంప్రాప్తయౌవన. 2. వసంతమును—మూ. వసన్తమనోరమశ్రీః—శైశవమునకన్న యౌవనం బెంతయు మనోహరము భోగోచిత మని తెల్పుటకు మనోరమశ్రీః అనుట, పంతులవారు దానినే త్యజించుట! 3. పచగుచ్ఛాభ్యుదయము—మూ. ఉన్మీలితస్తననవస్తబకా. 4. ఇటనెల్ల నవీననవశబ్దములనుమాని యువతికిముందు దానినుంచుట తెనాలిరామలింగయ్య తల బోడిచేయించుకొని చంకలో జుట్టుంపించుకొన్నవిధముగా నున్నది. నవబాలా, నవలోలా, నవముగ్ధా, నవవృద్ధా, ఇత్యాదివర్ణనలు చక్కనగావు. నవయువతిది తనులత—5. దివర్ణము ప్రాసపూరణము. ఆశ్లీలార్థస్ఫోరకము. దానికి తోడు, తనులత, [తను—సూక్ష్మమైన] ఇత్యాది స్ఫురించును. 'యౌవనము పొదలఁగ' అనిముందు చెప్పి మఱలనిట 6. యువతి యనుటచే నైనయౌవనపౌనరుక్త్యముచేత నేమి ఫలము? 7. ఏణీదృశః అనిగదా మూలము? దానిచే నేత్రవర్ణనమైనది, చాంచల్యవైపుల్యాదికములు సూచితములైనవి. 8 ఇంతియగాక ఏణీదృక్త్వము బాల్యాపగమ యౌవనప్రాదుర్భావ లింగములలో నొకటి. ౮౯-వ పుటలో నుదాహృతమైన రసమంజరీ శ్లోకముం గనుఁడు.

[2] సీత—[పాలయలుకతో] ఇప్పుడు తప్పనుడువులఁ జెప్పనీయొక్క ప్రక్క
632 నెడలివేఱొక్క చక్కికరిగెద.—

1. ఇప్పుడు—ఇది దేనికి విశేషణము? చెప్పుటకా, ఎడలుటకా, అరుగుటకా? ఈపాటివాక్యమేనియు అసందిగ్ధార్థముగా నుండరాదా! మఱియు రాముఁడు సీతను తత్సౌందర్యమోహితుఁడై పెండ్లియాడలేదు, ఈమె పెట్టినయీ 1. ముప్పలలోఁబడి 2. యిక్కలం గని వలచి పెండ్లియాడినాఁడు. నీప్రక్క నన్నం జాలు.

అతివవి.

[12] తే॥ విమలబిసరోచులుకపోలవిభ్రమములు
644 చంచలసలీలనీలాంబుజములుకనులు
చారువికసదశోకకిసములుశయము
లతివవివిలాసములుమనోహరములవును.

మూ.— అమలమృణాళకాణ్డకమనీయకపోలరుచః
తరళసలీలనీలనళినప్రతిమల్లదృశః
వికసదశోకశోణకరకాన్తిభృత స్సుతనోః
మదలులితాని హన్త లలితాని హరన్తి మనః.

1. మూలమునంగల లలితవిశేషణము 'మదలుళితాని' యను నది పంతులవారికి నీరసముగానే తోఁచెనో అర్థమే తెలియలేదో, త్యజించినారు. ఈవిశేషణమే శ్లోకము లోని సారాంశ మని యెఱుంగునది. 2. సుతనో:— సుతనుత్వము లలితమనోహర త్వమునకు హేతువు. ఆసుతనుత్వమును సమర్థించుటకే తొలిమూఁడుపాదములయు పన్యాసము. కావున ఆవిశేషణ మెంతయావశ్యకమో ఊహించుకొనుఁడు.— దానిం ద్యజించి అతివవి యనుట [నీలోత్పలదృశః అనుటకు తొయ్యలిది అనుటయు, ఏణీదృశః అనుటకు యువతిది అనుటయుంబోలె] అరసికతం దెలుపుటయగాక [యువతిది అన్నట్లే] 3. పరిహాసనీయమైన యొకానొక యశ్లీలార్థముంగూడ ధ్వనించుచున్నది. 4. వీరు సుతనువునకు విశేషణములయిన మూఁడుబహువ్రీహులను ఫగులఁగొట్టి వాక్యములుగా తెనిగించినందున, మూలకవి యుద్దేశ్యములుగా నిబంధించినవియిందు విధేయములై, విధేయములుగా నిబంధించినవి ఇందు ఉద్దేశ్యములై మూలకారవివక్షితార్థము చెడిపోయినది. చతుర్థపాదము— "అతివవి విలాసములు మనోహరములవును"—ఇందు 5. అవునుపదము లేకున్న బాగుగానుండును. అవుననుటచేత సందేహము స్ఫురించుచున్నది; నిశ్చయము తగ్గినది. మూలచతుర్థపాదార్థము=ఆహా! ఈసుందరాంగియొక్క మదమిశ్రములైన లలితములు మనస్సును హరించుచున్నవి, అని. దీనియీ తెనుఁగుపాదము నీరసమై నిష్ప్రాణమై, ఎవ్వఁడేని సన్న్యాసి శిష్యనిర్బంధమునకు లోఁబడి గత్యంతరము లేక శృంగారకావ్యమును పాఠముచెప్పుచు సూత్రప్రాయముగా నీరభినివేశముగా నిరుత్సాహముగా "శుష్కం కాష్ఠ తిష్ఠత్యగ్రే" అనుశైలిగా తప్పుగా అర్థమేడ్చినట్లున్నది. మూలమందు రాముఁడు హర్షించినట్లును అతని హృదయము సీతాలలితములచేత నపుడు అపహృతమై పోయినట్లును [హంతాదిపద సూచితము] అర్థము కలుగుచున్నది. 6. ఇత్తెన్గులో రాముఁడు తనమాట చెప్పుకొనట్లును, లోకసామాన్యవృత్తాంతము చెప్పినట్లును, 7. ఇప్పుడాలలితములు మనోహరములు గానట్లును, ఇఁక నెప్పటికో కాఁగలవనియు, ఈమొదలయిన యపార్థములు నిబద్ధములై యున్నవి. మూలమందు తొలిమూఁడు పాదములను బహువ్రీహులం జేయుటచేత, కపోలకాంతిప్రభృతులు లలితములమనోహరత్వమునకు కారణములుగా నుపనిబద్ధములైనవి. ఇందు ఆభేదమును తప్పించి నాలుగువాక్యములను పరస్పరసంబంధము లేకుండ పరస్పరనిరపేక్షభంగిగా రచించినందున 8. పూర్వోక్తకార్యకారణభావము దాఁగిపోయినది. మఱియు నిందు అశోకకిసలయములు కరోపమానముగాఁ జెప్పఁబడినవి. మూలమునం జెప్పఁబడిన సామాన్యధర్మము 9. శోణత త్యక్తమైనది. మఱియు నిటఅశోకశబ్దమునకు మూలములో వికసత్ [=వికసిల్లుచున్న] అని విశేషణము ఉన్నది. దానింబట్టిచూడఁగా నిట నశోకకుసుమమేజియదేవోక్తముగాని తత్పల్లి

వముగాదని తెలియుచున్నది. అశోకము మామిడి ఇత్యాదులయాకులు పిమ్మట ముదిరిన కొలఁదియు ముణుఁతలుపడుగాని, పాటమరించునప్పుడు విస్తృతములు గానే పాటమరించును. కావున పుష్పమర్థముగాదేని, యీవిశేషణము విరోధించును. 10. పంతులవారు ఈవిశేషణము నుంచుకొనియే కిసలయమనుట వింతగానున్నది. మూలమందు చెప్పఁబడిన సాధారణధర్మము కడు నవశ్యమయినది. శోణత యశోకపుష్పములందు సుప్రసిద్ధము. పంతులవారు అశోకపుష్పము ఎఱుపని యెఱుంగరుగావలయు, ఎఱుపుగాదనియు తలంచిరిగావలయు, అందుచేతనే కాఁబోలు ఈ నాటకములోనే చతుర్థాంకము ౬-వ శ్లోకమున 'పుష్పితాశోకశాఖి' యను మూలమునకు తమపద్యములో అపుష్పితాశోకయని భేదమగునట్లుగా 'హర్షదాపుష్పితాశోకనగంబు' అని రచించికొన్నారు. అశోకపుష్పము రక్తమనుటకు ఆపద్యంపుమూలమే ప్రమాణము; తదీయవిమర్శనంగనుఁడు. మఱియు నిట వికసచ్ఛబ్దరక్షణార్థము—'అశోకకిసలయము పాటమఱించుతఱి చుట్టగానుండును, పిమ్మట విస్తరిల్లును' అని దుర్వాదముచేయుపక్షమందు నీచోపమాదోషము సంప్రాప్తించును; చే యెక్కడ గురిగింజయంత చిగురుచుట్టయెక్కడ? చండభానుండు మిడుంగురుంబురువువోలె తేజరిల్లుచున్నాఁడన్నట్లుండును.

చ॥ తనరుననశోకభూరుహలతాముకుళంబుల నంతరాంతరం
బుననిడి పొన్నక్రొన్ననలు భూపతి మాలికగా నొనర్చిచూ
పిన గరువంపుఁగెంపు లెడ వెట్టినమౌక్తికహారలీల నె
క్కొన్నఁ జనుదోయిపై నునిచెఁ గోమలిలేనగ వంకురింపఁగాఁ. విక్రమ.

ఇందు గరువంపు అనుశబ్దముంగనుఁడు, అశోకపుష్పము పెద్దదియని తెలియను. ఇందువలన నిట పుష్పమే అశోకశబ్దార్థముగాని పల్లవముగాదనియు విశదము. పల్లవమే వలయునేని జయదేవునిది విలసత్తుగాని వికసత్తుగాదని వాదింపుఁడు. "చిలుకలు రంజిల్లెన్, చివుళ్లు విలసిల్లెన్," అని యుండలేదా? 11. మఱియు వీరు శోణవిశేషణమును త్యజించుట శ్లోకధ్వనితమును ఎఱుంగమికి లింగముగానున్నది. ఎట్లన—మూలములో మూఁడుబహువ్రీహులయందును వరుసగా శుక్లనీలశోణవర్ణములు చెప్పఁబడినవి. తదుపన్యాసము చేత సీత ప్రకృత్యవతారమని సూచన చేయఁబడినది. చతుర్థపాదముచే భోగప్రదత్వము సూచితమైనది. ప్రకృతి లోహితశుక్లకృష్ణ యనియు భోగదాత్రి యనియు ప్రమాణము.

అజా మేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీః ప్రజాః సృజమానాం విచిత్రాః
అజో నిత్యో జుషమాణోఽనుశేతే జహాత్యేనాం భుక్తభోగా మజోఽన్యః.

సీత ప్రకృతియనుటకును రాముఁడు ఈశ్వరుఁడనుటకును ప్రమాణము "ఆ యీశ్వరుండ నేనా। మాయయ సీతాపధూటి" ఇత్యాదికము నెఱుంగవలయును. శోణ

శబ్దమును త్యజించుటచేత ఆ విశేషార్థముయొక్క స్ఫోరకము పోయినది. మఱియు, పద్యచతుర్థపాదములో విలాసములు వర్ణింపఁబడినవి. విలాసాదికములు స్త్రీలశృంగారచేష్టలు. ఇవి అమరునిచేఁ జెప్పఁబడినవి.

“ స్త్రీణాం విలాసబిబ్బోకవిభ్రమా లలితం తథా
హేలాలీలే త్యమీ హావాః క్రియాః శృఙ్గారభావజాః.”

“ స్త్రీలయొక్క శృంగారభావమైన రతివలనంబుట్టిన విలాసాదిక్రియలు హావములనఁబడును...ప్రియునియొక్క దర్శనముచేత నయిన కటాక్ష భ్రూవికారాదులు విలాసము,...లలితము సుకుమారాంగవిన్యాసరూపమై యొప్పునది;” అని గురుబా. ఈపద్యమూలములో జయదేవుఁడు లలితములను చెప్పఁగా పంతులవారు వానికి బదులు విలాసములను జెప్పినారు. ఈమార్పునకుం గారణమేమి? విలాసము ప్రియదర్శనజనితము గదా? ఇట సీతకు ప్రియదర్శన మెక్కడిది? ఇప్పటికి సీత యింక రామునిం జూడనైనఁ జూడలేదు. రాముఁడు వక్తగదా? తాను ఆమెకు ప్రియుఁడనియు తనదర్శనముచే నామెకు భ్రూవికారాదివిలాసములు గలిగినవనియు నతని భావము కాఁదగునా? ఇది కేవల మసంబద్ధము. కావున నిట విలాసములను జెప్పుట సరిగాదు. మూలకారుఁడు అంగసౌందర్యమును మూఁడుబహుప్రీహుల వర్ణించి తదీయ సుకుమారవిన్యాసరూపమయిన లలితములను తత్పోషితములనుగా వర్ణించినాఁడు. సుకుమారాంగవిన్యాసమునకు ప్రియదర్శనము కారణముగా లక్షణములలోఁ జెప్పఁబడలేదు. కావున నది యిట పొసంగియున్నది. ఆసుకుమారవిన్యాసమునకుం గారణముగా “మదలులితాని” అని మూలకవి మదమును చెప్పినాఁడు. 12. పంతులవారికి శరణమైన “మదలలితాని మే విలసితాని హరన్తిమనః” అను ననాగరలిపిపాఠమునకును, విలసించిన మదప్రయుక్తలలితమనియే యర్థము సేయఁదగును. ఉపపత్తిపూర్వోక్తమే విలాసలలితములకుం గలభేదము తెలియమిచే తెలుంగుకవిగారు ఏచేర్పైన నేమని పుష్టిచేయి చూపినారు. మార్పున కిప్పుడు కారణము తెలిసినదా? ఈపద్యమెందులకేని పనికివచ్చునా!!!

[5] క॥ ఈముగ్ధాకృతిచేతన్ । శ్రీమహితునిచేఁ గుమారవృషభునిచేనా
649 రామంబియ్యదిసలతము । సోమాప్తిఁగపర్దమువలె సొబగొందుఁగదున్.

సీతాసఖి ఆరామములో రామునిఁగూర్చి చేసినవర్ణన యిది.

మూ.—అనేనముగ్ధాకృతినా సనాథం । నిన్తాన్తకాన్తేన కుమారకేణ
లతావనం కామ మిదం చకాస్తి । జటావనం శీతరుచేవ శమ్భోః.

సుందరాకారుఁడును అత్యంతకాంతుఁడును అగునట్టి యిక్కుమారునిచేత సీతలతావనము, సుందరాకారుఁడును అత్యంతకాంతుఁడును అగు జాబిల్లిచేత శివుని జటావనమువలె ప్రకాశించుచున్నది—అని యర్థము.

మూలములో 1,2. విశేషణములు కుమారశీతరుచులకు సామాన్యములై యున్నవి. ఇందు సోమాప్తియని శీతరోచి సమాసములో పడినందున అతనికి స్ఫురింపకున్నవి. 3, 4. మఱియు ఉపమానోపమేయవాచకములైన లతావన జటావన శబ్దములను రెంటిని వనశబ్దాంతములనుగాఁ జేయుటచేతను రెంటను ప్రథమావయవములుగా లతాజటా యని రెండేసియక్షరముల యాకారాంత స్త్రీలింగశబ్దములను పెట్టుటచేతను, ఒకానొకసొంపు గలుగుచున్నది. మఱియు నారామ కపర్దసామ్యము లతావన జటావన శబ్దస్వరూపవిశేషముచేతనే సూచితమై యొకానొకశోభను పొందుచున్నది. అది ఆ రామ కపర్దశబ్దములచేఁ గలుగదు. అరామమనక లతావనమనుటచేతను కపర్ద మనక జటావనమనుటచేతను లతాజటలకు సామ్యము స్ఫురించుచున్నది. 5. జటావనమనుటచే జటలమొత్తము గొప్పయరణ్యమంతదియని ధ్వనించుచున్నది. ఇది యెల్లపద్యమును త్రవ్వినను కానరాదుగదా?

౭౮-వ పుట.

కనుంగొనన్—అంతర్గడువు.

క॥ కనవే కురంగనయనన । యనములఁగమలస్మయాపహారములనుగన్నుం
650 గొననగుఁగళిందనందిని । ఘనతుంగతరంగశోభ ఖతలంబెల్లన్.

మూ.—ఉత్తరఙ్గయకురఙ్గలోచనే । లోచనే కమలగర్వమోచనే
అస్తు సున్దరి కళిన్దనన్దినీ । వీచిడమ్బరగభీర మమ్బరమ్.

కనవే—[కర్మ లేదు. ఈ పద్యము 'అతనియాలు నేలుతన్' అను నెడ ఏలు ధాతువునకుఁ గర్మలేమి నాక్షేపించినవాని మొగంబున వేసికొట్టుటకు పనికివచ్చును.] 1. కనుంగొననగు—కనుంగొనునది యేది? కళిందనందినియా కర్మ? అన్వయ మాతీరున భ్రమపెట్టుచున్నది. మఱియొకతీరున, ఆకాశమంతట యమునాతరంగము లగపడుచున్నవి చూడుమని యీపద్యమునకుం దాత్పర్యముగా భ్రమ గలుగును. కనుంగొననగున్—ఈ లోట్టున కర్థమేమి? ప్రార్థనార్థమా? ఆయర్థము దీనఁ గ్రహించుటకు గమకములేదు. కనుంగొననగున్ = అగపడుచున్నది, లేక అగపడఁగలదు, లేక అగపడుంగాక, చూడఁదగును, ఇన్నియర్థములలో ఇదే యని నిశ్చయమెట్లు? తాత్పర్య బాధ యెఱింగి పిమ్మటఁగదా నిశ్చయము చేసికోవలయును. ఆమె చూచెనేని తన్నేత్ర కాంతివ్యాప్తి ఆకాశమందు, యమునావీచిడంబరమువలె నుండునుగాన, అదియే

ఆకాశమున నున్నది చూడుమని చమత్కారమా? కనుంగొనన్—(నీవు) చూడఁగా, ఖతలమెల్ల కళింద...శోభ అగున్ అని యన్వయమా? ఆపక్షమందును, అగున్—కాఁగలదు, అగుంగాక ఇత్యాద్యములలో నిటనేది? నానయనములం జూడుమని పూర్వార్ధమందు అర్థమా? కనుంగొనన్ అనుమాటలేకున్న ఈకష్టముండదు. పాదపూరణప్రభావము తెలిసినదా? మూలములో కనవే అనుటకు ఉత్తరజ్ఞయ అని సకర్మకధాతువుగాను, లోచనములు దానికి కర్మగాను ఉన్నందున నిస్సందేహము. దాన, నీ దృష్టులను పైకి ప్రసరింపఁజేయుము, అని యర్థము సులువుగా వచ్చుచున్నది. మూలములో అస్తు అని ప్రార్థనగానున్నది. పైగా అగుధాతువుగానున్నది. కాన పైసందేహములు మూలమందు లేవు. పద్య మిట్లున్న నసందిగ్ధముగా నుండునని తలంచెద.

క॥ కనవే కురంగనయనన । యనములతో నీరజాస్త్రయాపనాములతో
వినువీథి యవుత యమునా । ఘనతుంగతరంగసంఘుగంభీరము గాన్.

651 సీత.— చెలీ, నీయెడ నేలకనలుదు? వేకొందో డెందముంచుటచే నట్లు తలఁపఁబడితివి.— 1. ఇట వేకొందో డెందముంచిన వారెవరు? సీతయా సఖియా? అసందిగ్ధముగా వ్రాయవలదా. సీత యనియే మూలము. ‘వేకొందో డెందముంచితిని, అందుచేత నట్లు తలంచితిని.’—అనునది.

[1] సఖి—నమ్మికకిమ్మయిన నావంటిదానియందును, మనస్సుదాఁచుటచేఁ
652 జాలును.— 1. ‘మనస్సు దాఁపకుము’ అనిన తెలుఁగగును.

[అని సీతసలిలంబుగ రాము నాలోకించుచున్నది.]

రాముఁడు—[నిర్వర్ణించి]

మ॥ అగుసర్వస్వము యౌవనంబునకు గీమా సర్వభోగాళికిన్
[33] దృగుపాత్రంబగు భాగ్యమున్మదజయశ్రీకన్న సౌభాగ్యమా
685 జగదేకంబగు సారమాజనికి మెచ్చంగన్ ఫలంబంగజా
ధ్వగశృంగారరహస్యమీరమణియా బాగించు కేఁగాంచితిన్.

ఈశ్లోకము మూలముతో సంబంధపడలేదు. 1. మూలమున సీతచూపు వర్ణింపఁబడినది, పద్యములో సీతయే వర్ణితమైనది.

మూ.— సర్వస్వం నవయౌవనస్య భవనం భోగస్య భాగ్యం దృశోః
సౌభాగ్యం మదవిభ్రమస్య జగత స్సారం ఫలం జన్మనః
ఆకూతం కుసుమాయుధస్య హృదయం రాగస్య తత్త్వం రతేః
శృఙ్గారస్య రహస్య ముత్పలదృశ స్తత్కించి దాలోకితమ్.

ఈయుత్పలాక్షియొక్క అరవంతచూపు నూతనయౌవనముయొక్క సర్వధనము, భోగముయొక్క యిల్లు, (నా) నేత్రములయొక్క భాగ్యము, మదయుక్తవిభ్రమముయొక్క సౌభాగ్యము, జగత్తుయొక్క సారాంశము, (నా) జన్మకు ఫలము, కుసుమాయుధునియొక్క యభిప్రాయము, రాగముయొక్క రహస్యము, రీతియొక్క తత్త్వము, శృంగారముయొక్క రహస్యము. —అని శ్లోకాక్షరార్థము.

తత్కిఞ్చిదాలోకితమ్— అరవంతచూపు అనియర్థము. ఆలోకితమ్మను పదమునకు చూడఁబడినది అని యర్థమను పక్షమున 'మయా' యని కర్త లేమి కొంత లోపముగానున్నది. పైగా కించిత్ అనఁగా కొంచెము అని చూడఁబడుటకు విశేషణము గావలయు. ఇతఁడు కొంచమే చూడనేల? [నిర్వర్ణించి] అనియున్నది, సంహృతదృష్టులతోఁ జూచి యని యుండలేదు; పూర్తిగానే చూచెను. కావున నీయర్థము సరిగాదు. పైగా మూలమందు తత్ అని యున్నదిగాని బాగు అనియుండలేదు. కావున ఈజఘన్యమతముం బట్టియు తత్ అనఁగా సీతచూడ్కియే యర్థముగాఁదగును. ఇంతవఱకు ఆమెయొక్క బాగును అతఁడు వర్ణించియే యున్నాఁడు, ఇప్పుడు సలీలావలోకనమును వర్ణించినాఁడు, అందులకు [సలీలంబుగ నాలోకించుచున్నది] అను కవివాక్యమే గమకము. ఆలోకించినది, ఆలోకముం గాంచినాఁడు, ఆలోకనమును వర్ణించినాఁడు, ఆలోకన మెంతమదనోద్దీపకమో! రసజ్ఞులెఱుఁగుదురు.

జయదేవకవి యీశ్లోకమును శాకుంతలములోని షట్పదాభిభూతశకుంతలానేత్రవిభ్రమవర్ణనకు బదులుగా రచించికొన్నాఁడు.—మఱియు రాముఁడు కాంచితినని చెప్పుచున్నాఁడు, ఆమాట యిపుడు చెప్పనేల? బాగును గంటనేపునుండి కాంచుచు వర్ణించుచు ఉండలేదా? ఇప్పుడు కాంచుట ఆమెయొక్క చూపునేగదా? 2. ఉత్పలదృశః అను విశేషణము చూపువర్ణనలో సాభిప్రాయమై శోభిల్లుచున్నది. ఏయేవ్యాపారమందు ఏయే యవయవములశోభ బుద్ధీంద్రియగోచరమగునో తత్తద్వ్యాపారవర్ణనమందు తత్తదవయవవర్ణనాపూర్వకముగా సంబోధించుటయు నిర్దేశించుటయు మహాకవుల మార్గము.—

కిసలయమృదోర్విలాసిని కఠినే నిహితస్య పాదపస్కన్ధే
చరణస్య న తే బాధా సంప్రతి వామోరు వామస్య.

ఇట నశోకదోహదదానవ్యాపారమందు మాళవికయూరులావణ్యము అగ్నిమిత్రునికి వాయుదేవుని సాహాయ్యంబుచేతనో ఒండు విధముననో బుద్ధిగోచరమైనదని హృదయము.

కింశీతలైః క్లమవినోదిభి రార్ద్రవాతాన్
సంచారయామి నళినీదళతాలవృన్తైః
అఙ్కేనిధాయకరభోరుయథాసుఖంతే
సంవాహయామిచరణావుతపద్మతామ్రౌ.

ముహు రఙ్గులిసంవృతాధరోష్ఠం ప్రతిషేధాక్షర విక్లబాభిరామమ్
ముఖ మంసవివర్తి పక్ష్మలాక్ష్యాః కథమప్యున్నమితం నచుమ్బితం తు.

ఇందు కరభోరు పక్ష్మలాక్షీ శబ్దముల హృదయము నరయుఁడు. ఇట్లే ఈపద్యమందు జయదేవకవి చూపును వర్ణించినాఁడుగావున, తత్పృష్ట్యర్థమై ఉత్పలదృశః అని నిర్దేశించినాఁడు. దానిం గానక పంతులవారు ఆశబ్దమునే రూపుమాపి రమణి యని తెనిఁగించినారు. 3. మఱియు ఉత్పలదృశః అనుషష్ఠిని సర్వస్వాదులకు ప్రథమాంతములకు పదింటికి సమానాధికరణతా బోధకముగా ప్రథమగామార్చినారు. ఉత్పలదృశః—ఉత్పలనేత్రయైన సీతయొక్క. వీరుగ్రహించిన విధమననేనియు, ఉత్పలదృశః తత్—సీతయొక్క అది, అనఁగా, రమణియొక్కదానిని, అనవలయును. అట్లునుం జేయలేదు. ఇట్లు తచ్ఛబ్దమును అన్వయించుకొనుటలోఁ గలుగు సొకానొక యశ్లీలార్థమును వ్రాయవెఱచుచున్నాను. ఉక్తహేతువులచే సీతయొక్క అరవంతచూపును గంటి ననియే యర్థమనియు, పంతులవారు వ్రాసినది యర్థముగాదనియు, విశదమని యెంచి విరమించుచున్నాను. మూలములో పది యుల్లేఖములం జూపు వర్ణింపఁబడినది. 4, 5, 6. పద్యములో మూఁడు త్యజింపఁబడినవి. పాదపూరణములచే నర్థము నిహ్నుతమై యనర్థములు వెల్లువిరిల్లుచున్నవి. 7. అంగజాధ్వగశృంగార రహస్యము— ఇందు అనంగుని అధ్వగుఁడనుటచే లభించిన స్వారస్యమేమి ? మఱియు నీవిశేషణము ప్రకృతవిరోధి.— అధ్వగునికి శృంగార మేమి? ప్రియావిరహముచే వగచుచుండు వానికి? విప్రలంభశృంగారమా ? అదియేనా యిపుడు రామునికి ప్రియమైనది ? అంగజ + అధ్వ + గ = మదనుని మార్గముం బొందిన, యని శృంగారమునకువిశేషణ మనుపక్షమున 8. మూలమునలేని యీవిశేషణముంబెట్టి యింతశ్రమ పెట్టనేల? అధ్వగుఁడనఁగా తెరువరి యని యోగరూఢార్థమును త్యజించి యీ కేవలయోగార్థమును గ్రహించుక్లేశమిడుటకా యీనీరసవిశేషణము? పాదపూరణప్రభావముం గనుఁడు! 9. ఆబాగు ఈయధ్వగుఁడును ఈయిరువురును యతిప్రాసములకై వచ్చినద్రోహులు. మదవిభ్రమము మూలములో చెప్పఁబడినది. ఇందుదాని తెనుఁగు 10. మదజయశ్రీ— ఈపదమునకు మదించినజయశ్రీ యనునర్థము ప్రథమోపస్థితమగుచున్నది. మదజయముయొక్క శ్రీ యని స్ఫురించుటకు ప్రథమోపస్థితార్థానుపపన్నతాజ్ఞానాపేక్షచే విలంబము గలుగుచున్నది. మత్ + అజయ అనియు భేదము కలుగు

చున్నది. “ఎవ్వఁడుం, దొడరమి” అన్నందులకు సరిగా రాముఁడు తా నీమె కోడి పోవునట్లు తలంచెనని పంతులవారి యాశయమా? **11.** మెచ్చంగ౯—దీనికి ఏక్రియతో నన్వయము? **12.** శ్రీకన్న సౌభాగ్యము—శ్రీపొందిన యనియర్థమా? శ్రీకంటె ఎక్కుడని యర్థమా? **13.** సర్వభోగాళికి౯—సర్వశబ్ద ముండఁగా ఇంక ఆళిశబ్దమేల? **14, 15.** మూలశ్లోకము పంతులవారికి ఇంచుకేనియు నర్థముగామికి అగు౯, ఔ౯ అను నిందలి క్రియాపదములు నిదర్శనములు.

పద్యజరదరణ్యమందలి పాదపూరణ బేతాళములు.— **16.** అగు — ప్రా. **17.** ఔ—య. **18.** సర్వ—పా. **19.** అళి—పా. **20.** ఉపాత్తంబగు—ప్రా. [మూలవిరుద్ధము], **21.** జయ—పా. **22.** శ్రీ—య. **23.** కన్న—పా. **24.** ఔ—పా. **25.** ఏకంబగు—పా. **26.** ఔ—పా. **27.** మెచ్చంగ౯—య. **28.** అంగజ—పా. **29.** అధ్వగ—ప్రా. **30.** ఔ—పా.

వీనికై వేయఁబడిన బలులు.—**31.** నవ [యౌవనస్య], **32.** [మద] విభ్రమస్య, ఆకూతం కుసుమాయుధస్య, హృదయం రాగస్య, తత్త్వం రతేః, **33.** ఉత్పలదృశః,

౨౯ - వ పుట.

—చాటుపద్యము.

తే॥ బాలయమృతపయోధికల్లోలలోల
[9] 694 లోకనములమునింగించునీకడనను౯
గాదెయిది సుముహూర్తంబు గాకయున్న
బ్రహ్మనిర్మాణముల వెట్లు బాగుమీరు.

మూ.—అమృతమయపయోధిక్షీబకల్లోలలోలైః
స్నపయతి తరలాక్షీ యత్ర మాం నేత్రపాతైః
అపి భవతి సదాయం సన్ముహూర్తః కుతో వా
మధురవిధురమిశ్రాః సృష్టయో హా విధాతుః.

[స్నపయతి = స్నానమాడించుచున్నది, యత్ర = ఏముహూర్తమందు, సదా = ఎల్లప్పుడు.] శ్లోకార్థము—ఈతరలాక్షి అమృతసాగరముయొక్క బలిసినతరంగములవలె చంచలమయిన తనచూడ్కిపాతములచేత నన్ను స్నానమాడించిన యీముహూర్తము నాజన్మములో సదా సుముహూర్తము [ఇంతక్న సుముహూర్తము నాజన్మములో నింతకుమున్న లేదు, ఇఁక నుండదు; అనఁగా ఈ సుముహూర్తము నాకట్టిశాశ్వతసౌఖ్యమును గలుగఁజేసినది, అనిభావము]. అయ్యో! అట్లని యెట్లుసంతసింతును! బ్రహ్మసృష్టులు సుఖదుఃఖమిశ్రములుగదా? [ఈమె యిపుడే ననుఁబాసి

యేగినంతనే నాకు దుఃఖమేగదా ?] పద్యమునుండి యీయర్థమును త్రవ్వియెత్తుఁడు. పంతులవారు స్వారస్యవినాశనధ్వజప్రతిష్ఠాపనాచార్యులుగా 1. తరలాక్షిని ఎత్తి వేసి 2. బాలను పెట్టినారు. ఇదియు చూపువర్ణనము. కాన అక్షితారళ్యవర్ణనపరమైనశబ్దముచే మహాకవి నిర్దేశించినాఁడు, ఇట్లు తెనిఁగింతురని యెఱింగనేని కవనమే చేసియుండఁడు. తరళాక్షీస్వారస్యము ౧౦౭-వ పుటం గనుఁడు, తెలియును 3. వీరికి యత్రశబ్దార్థము తెలియక, ఏకడ నని యర్థముచేసికొని ఈకడ నని తెనిఁగించినారు; ఇటు ఏముహూర్తమందో అని దానియర్థము. 4. సదాశబ్దము లేక పద్యము పనికిరాదు. 5. మధురవిధురమిశ్రాః= బాగుమీఱు ... దీనిపేరే గోకంబర్దు తెలుఁగు. పెద్దలు శాంతాకారపురాణ మందురు. విధాతుః సృష్టయః=బ్రహ్మనిర్మాణములు, కుతో వా=ఎట్లు, మధురమధురమిశ్రాః [విధురయనుటకు మధుర అంధముద్రణము] = బాగుమీఱు. మహాకవి తరలాక్షీ శబ్దమువలెనే 6. విధాతృ[చేయువాఁడు]శబ్దమునుగూడ సాభిప్రాయముగా ప్రయోగించినాఁడు 7. మునింగించు—మునిఁగించుట యపాయకరమని స్నానమాడించినది, ముంపలేదు. 8. స్నపయతికి అనుగుణముగా నేత్రపాత్రైఃపదసారస్య మెఱుంగుఁడు. 9. హాశబ్దము భావివిరహాసహిష్ణుతాద్యోతకము, కాననే యిట దానిని పంతులవారు మానినారు.

చేటి—రాచకూఁతురా, రాణిగారిచేఁ బంపఁబడినదానను. ఎందువల్లననఁగా
[3] బిడ్డయగుసీతను దోడ్కొనివచ్చి యచ్చెర్వుగలిగించు మంచినగలచే నిం
697 గారింపవలెనని; అందువలన నాసీత మొగము దామరం గనుంగొని కన్నులు
చల్లగాఁగల వారముగాఁగలమని.—

ఇది తెలుఁగుముద్రణమునకు ఇంచుమించుగా నున్నది. 1. పంపఁబడినదానను.—మూ. ఆజ్ఞప్తాస్మి, ఆజ్ఞాపింపఁబడితిని అనవలయును. 2. ఎందువల్లననఁగా.—మూ. యత్కిల, ఏమని యనఁగా, అనవలయును. ఈవాక్యము మనతెనుంగుననిట్లుండును.—భర్తృదారికా అమ్మగార్లునన్నాజ్ఞాపించిరి, ఏమని యనఁగా, 'అమ్మాయిని సీతను తోడ్కొనివచ్చి వింతతొడవులతో సింగారింపుము, మాకన్నులు చల్లగా ఆసింగారముతోడి యామోము దామరం గాంచెదము'. అని.—పంతులవారి వాక్యము ఎంతశిరోవేష్టన ప్రాణాయామముగానున్నదో యరయుఁడు. 3. 'రాచకూఁతురా' అనియే పిలిచియున్నచో ఆచేటికి తత్క్షణమే మాంద్య కళాగూత నిర్వాసన మంగళము లైయే యుండును.

[4] ఆ॥ చెలియనీదుమొగముచెలఁగుఁజందురుఁడుగఁ। బందువెన్నెలనిడుఁబండ్లడాలు
701 నల్లగలువదండనాతినీయదిజడ। పాలపోఁతమాడ్కిఁబరఁగుఁజూడ్కి.

ఇందు ఉత్తరార్ధము తెలుఁగులిపిముద్రణము ననుసరించియున్నది. ఆ ముద్రణములో ‘కువలయదళశ్రేణీకన్ధరాబద్ధవేణీ । ధవళతరళమృష్టాదుగ్ధధారేవదృష్టిః’ అని యున్నది. అందు వేణి మెడకు కట్టఁబడియున్నదని యున్నది. ఆమాటను పంతులవారు చల్లఁగా వదలివేసినారు. మెడ కేమి యరిపోనికొన్నదా? నాగరలిపి చదువఁదెలియనందున మనోహరమైన తత్పాఠము నెఱుంగలేరైరి, నాగరపాఠము :—

అయి తవ ముఖలేఖా చన్ద్రబిమ్బేన సస్నేహా। దశనకిరణలక్ష్మీ రచ్ఛజ్యోత్స్నా సదృక్షీ
కువలయదళద్రోణీకన్దరాయా వహన్తీ। ధవళబహుళమిష్టా దుగ్ధధారేవ దృష్టిః.

ఇందుత్తరార్ధమున కర్థము.—కలువరేకనెడుదోనెపల్లముగుండ ప్రవహించుచున్న తెల్లనిగొప్పపాలప్రవాహము నీదృష్టి.—నాగరలిపిచదువఁ దెలియనిఫలముం గంటిరా! **2.** మఱియు వీరిచట జడనుచెప్పిరిగదా, ౭౬-పుటలో పద్యంబున గొప్పకొప్పను చెప్పుటయెట్లు సరిపడును! **3.** పండ్లఁట—“చెలిపండ్లుమల్లెమొగ్గలనరాదు...క్రమత వీనికి వీనులు కన్నుదోయి చెక్కులును బలువరుసయు...అనుచుమనువాడిరవియచేకొనఁగవలయు.” అని యప్పకవి. **4.** ‘నీయది’ యనికొంత నేఁపు నిలుపుదలచేసినచోఁ ది వర్ణస్వారస్యము తెలియును.

పనికిరానిపద్యము.

[3] తే॥ అగపడకయునాకనులకునగపడియెడి। నెంతయునువింతయింతిమేల్బంతియిద్ది
704 పగలురారేయిబోయినఁబలుదమిఁగను। సచ్చకోరకములకునుజంద్రికవలె.

ఇది కేవలము **1.** మూలవిరుద్ధము, కాలవిరుద్ధము, విరసము. **2.** పగలు చకోరములకుఁ జంద్రిక యగపడునఁట! ‘చంద్రిక చకోరయుగళమునకు పగలు అగపడక మఱల రాత్రిరాఁగానే అగపడెడుచందమున ఈచెల్వ నానేత్రములకు మఱల అగపడునా?’ అని మూలము, ప్రశ్నరూపముగా ఆశంసాసూచకము.

అప్యావిరస్తి భూయోఽపి మమ లోచనయో రియం
దివసేన్తర్హితా నక్తం చన్ద్రికేవ చకోరయోః.

**3.** సత్—య. సచ్చకోరకములఁట! దుశ్చకోరకములకు చంద్రిక యగపడదా? వీనికిమాత్రము పగలగపడదు గాఁబోలు. ఇట్టిపాదపూరణములతో ‘చీపరపాపర పుల్లలఁజేపలబుట్టల్లినట్లు’ అల్లుటకన్న కవనమును మానివేయుట శ్రేయము.

[2] లక్ష్మణుఁడు.—ఆర్యా ఇదియగపడుచున్నది.
706 రాముఁడు.—అదియెట్లుతిరిగివచ్చెను?

ఇందు ఇది యనుపదమును సీతాపరముగా రాముఁడు గ్రహించినట్లు ఉత్తర వాక్యమువలనం దెలియుచున్నది. లక్ష్మణునిచేత సీతను 1. ఇది యనిపించుట, 2. రాముని చేత అది యనిపించుటయు, రసాభాసముగానున్నది. వృద్ధపత్యుచితమని తెలిపియున్నాఁడ.

శా॥ లీలానిర్జితచిత్తసంభవధనుర్లేఖుండునై చూడఁగా
[7] బాలుండైన సుధామయూఖునికి నొప్పం గాంతి నెంతేనిడున్
713 జాలన్ రాగము చేత మించుచునుదంచత్తారకావాప్తియై
గ్రాలున్ సంధ్య స్వయంపరాంగనవలెన్ గావించు నామోదమున్.

1. ఒప్పన్—య. 2. అవాప్తి—పా. 3,4. కావించునామోదమున్—య.

5. ఎంతేనిడున్—దీనిని మూలమందుంబోలె అసమాపకముగాఁ బ్రయోగించిననే మేలు, 6. అట్లే పాదపూరణమైన కావించునుగూడ. అట్లు కాదని వాటిమూఁడ నిచ్చయున్నచో 'మించుసముదంచత్తారకావాప్తియా' ననియుం జెప్పకొని రసాభాసమున కానందింపుఁడు. ఇవన్నియు నొక్క తీరువిశేషణములే, ఇందు కొన్ని చేసి కొన్న పుణ్య మేమి? 'కాంతినిండించుచున్,' 'కావించుచున్ మోదమున్,' అని మార్చిన మేలు. అలరుంగ్రపుడబ్బివలె గ్రాలున్సంధ్యయు సమాసమా?

మూ.—ముగ్ధస్య కేళివిజితస్మరచాపయష్టే
రాతన్వతీ రుచి మతీవ సుధాకరస్య
రాగోద్ధురా స్ఫుట ముదఞ్చితతారకశ్రీ
స్సంధ్యావిరస్తి ననుకాపి పతింవరేవ.

7. బాలుండైన—మూ. ముగ్ధస్య - సుందరార్థము తెలుఁగులో రాలేదు.

౩౦ - వ పుట.

మ॥ పొనరం జేసికడుం బ్రబుద్ధకమలంబుల్గాఁ ద్రిలోకంబులన్
[13] దనరం జొచ్చుఁ బయోధిగర్భమును మార్తండుండితండిప్పుడ
726 వ్వనని ధ్యాశ్రయ నాభిపంకజము నొప్పన్ విప్పఁ జేయంగఁదా
ఘనకౌతూహలుఁడౌటనోయన హరిఖ్యాతుండు పద్మాప్తుఁడున్.

మూ.—కృత్వా ప్రబుద్ధకమలా మఖిలాం త్రిలోకీ
మమ్భోనిధే ర్విశతి గర్భ మసౌ విదానీమ్
అన్తః ప్రసుప్తహరినాభిసరోజబోధ
కౌతూహలీవ భగవా నరవిన్దబన్ధుః.

ప్రాసంపుజిత్తు— 1. పానరన్, 2. తనరన్, 3. ఘన. [వననిధి యొక్కటి యర్థలబ్ధము.] 4. మార్తండుండు—య. 5. ఒప్పన్—య. [దీని పూర్వపద్యమును 'లీలానిర్జిత' అనుదానినిగనుఁడు. అందలవడినయతిజిత్తు 'ఒప్పన్' పంతులవారికి ఇంక మఱపునకు రాలేదు.] 6. హరిఖ్యాతుండు—య. 7. (డు)న్—పా.

8. త్రిలోకంబులన్—మూ. త్రిలోకీమ్ - స్త్రీలింగస్వారస్యము త్రిలోకీరమణి యనియు, కమలములు తన్నేత్రము లనియు; అమహత్తుచే నాస్వారస్యము పోయినది. 9. హరినాభిపంకజము వికసితముగానే యుండదా యనుప్రశ్నకు ఉత్తరము మూలములో ప్రస్తుతవిశేషణముచే దత్తము. సుప్తియందు అవయవసంకోచము స్వాభావికముగదా. ఆవిశేషణముం ద్యజించుట చక్కఁగాలేదు. 10. ఒప్పన్విప్పఁ జేయంగ— యతిపూజానందములో మునుంగుటచేత, విప్పన్ అను పదము ప్రేరణార్థక రూపము యనువిషయము పరాకయ్యెఁ గావలయు. కాని చో చేయంగన్ అని ప్రయోగించుకొన నేల? వననిధ్యాశ్రయుఁడు విప్పనా? అనుప్రాసానందముం బోఁగొట్టుకొని విప్ప నని దిద్దికొనిన సరిగా నుండును. 11. ప్రబోధించుట, మేల్కొలుపుట యన్నస్వారస్యము విప్ప నన్నంగలుగునా? 12, 13. హరిఖ్యాతుండు పద్మాప్తుఁడున్—వీనిచే సమాప్తపునరాత్తతాదోషము కలుగుచున్నది. ఇందు,-ండు రవి క్రుంకినందులకు వేయు పిరంగిగుండు,-డు తత్ప్రతి శబ్దము,-న్ దాని కొసరుశబ్దము. ఇంతకన్న, "తనరం జొచ్చెఁ బయోధిగర్భమును బద్మప్రేయసుం డిప్పుడ," అని ద్వితీయపాదముం బఠించి చతుర్థపాదమును "ఘనకౌతూహలుఁడౌటనో యన" అని నిలిపివేసి పాదశేషమునకు బొట్లుపెట్టుట మేలు. 'భగవాను' నకు హరిఖ్యాతుండని తెలుఁగు రావలదా యనిన, సముద్రములో పడిపోయినవానికై యింత యాసక్తియేల? దేవతలయందలియాసక్తి కాక్షేపింపరాదు, కాననే పద్మాప్తశబ్దమున కుపరిగా మార్తండుఁ డంటి మని సంతసమేని, పద్యమును "అ।వ్వననిధ్యాశ్రయునాభిపంకజము విప్పం గౌతుకంబొప్పఁగా।దినరా జర్కుఁడు సూర్యుఁడున్ ద్యుమణి వ్యాధిస్థుండు పద్మాప్తుఁడున్." అని మార్తము.

శా॥ చాలంజక్కపదోయికీయదిమనశ్శల్యంబుజ్యోత్స్నాప్రియా
[15] 741 పాళీత్రోటికవాటయుగ్మమునుదెర్వంగుంచెకోల్గాంచఁగన్
శూలిప్లుష్టమనోజభూజముబడింజూపట్టుక్రొమ్మొల్కకా
మ్యాలీఢస్మయసామజాంకుశమునుద్యచ్చంద్రమోరేఖయా.

మూ.— ఏతత్కోకకుటుమ్బినీజనమనశ్శల్యం చకోరాఙ్గనా
చఞ్చూకోటికవాటయో ర్ఘటితయో రుద్ఘాటికా కుఞ్చికా
దగ్ధస్యాభినవాఙ్కురః స్మరతరో రార్ద్రాగసాం ప్రేయసీ
మానోద్దామగజాఙ్కుశో విజయతే ముగ్ధం సుధాంశోర్వపుః.

1. పాలక్, 2. పాళీ, 3. శూలి, 4. ఆలీఢ.—నాలుగు ప్రా. 5. కాంచనక్—పా. 6, 7. బడింజాపట్టు—య.

8. జక్కవదోయి—మూలములో కోకకుటుంబిని చెప్పఁబడినది. 9. కామ్యాలీఢస్మయ సామజాంకుశము—దీని కర్థమేమి? (౧) కాముక పురుషులనెడి యాలీఢస్మయ సామజములకు అంకుశము, (౨) కాముక పురుషులయొక్క ఆలీఢస్మయమనెడు సామజమునకు అంకుశము, (3) కామియు ఆలీఢస్మయమునైన సామజమునకు అంకుశము.—ఇందేది దీని కర్థము. తృతీయార్థము గ్రహించితి మేని జక్కవలకు, వెన్నెలపులుఁగులకు, ఏనుఁగులకును, చంద్రరేఖవలనఁగలుగు నవస్థను వర్ణించుట యగును. ద్వితీయార్థముఁగొన్నచో, జక్కవలకు వియోగము, వెన్నెలపులుఁగులకు భోజనము, కాముకులకు సంయోగముం గలిగించునది, యర్థమగును. ఆర్ద్రాగసాం ప్రేయసీమానోద్దామగజాంకుశో విజయతే...... ప్రియులు గోత్రస్ఖలనాదులచే సాపరాధులై యుండఁగా ఆయపరాధము ఇంక తడిగానే యుండుటచేత [అప్పుడే చేసినదగుటచేత], ఇంక క్షమింపశక్యము గాకయు నుండఁగా, కోపావిష్టలై యున్నకామినులు ఉద్దీపన విభావమైన యీచంద్ర దర్శనముచే మారుబారికి తాళఁజాలక కోపము మాని కామకేళికై ప్రియులకు వశవర్తినులై రని భావము. పైతెనుఁగుముక్కకు కాముకులగుపురుషులగర్వము ఈ చంద్రోదయమువలన నశించినది అని యర్థమగుచున్నది. పురుషులకోపమనుటచే స్త్రీలయందు గోత్రస్ఖలన పరపురుషాశ్రయణాది దోషము లుండిన వనియు, వానిని క్షమించి, 'నీవెట్లుతిరిగినను సరియే నన్నుంగూడ నంగీకరించినఁజాలు' నని పురుషులు అభ్రష్టలను ఉపసర్పింపఁదొడంగిరనియు వృద్ధవిటోచితార్థము లభించుచున్నది. కామినులును కాములును కాములు అని యేకశేషము చేయుదమన్న సమాధానము కాదు, పూర్వోక్తభ్రష్టా సముపసర్పణము పురుషులకు దుర్నివారము గాన. మంచిరసాభాసము! "స్త్రీణా మీర్ష్యాకృతః కోపో మాన ఇత్యభిధీయతే" అని శృంగారమానము స్త్రీలకే చెప్పుట సంప్రదాయము రసవంతమును గాని పురుషులకు విపరీతము. ప్రేయసామను ననాగరపాఠమును గైకొని, ఆర్ద్రాగసామ్ అను విశేషణమును తడి యేమిరా యని వదలివేసి, మానమునకో మానోద్దామమునకో [మానము—చిత్తస

మున్నతి, కొలత] స్మయ మని యర్థము కల్పించుకొని, టెంకాయ పిచ్చికొండ చేసి నారు. 10. కామ్యాలీఢ యనఁగా నేమి? కామి=కాముక పురుషులచేత, ఆ= అంతట, లీఢ=నాకఁబడిన, ఇదేమి యిది! ఆర్ద్రాగసామ్—అని నేరము చేసినవారు పురుషులని స్పష్టముగా నున్నందున, మానము స్త్రీలదే యగుట స్పష్టముగాదా? కావున 'ప్రేయసామ్' తప్పు, 'ప్రేయసీ' సరి. మఱియు పురుషులను మదనాతురులం జేయుట కష్టముగాదు. స్త్రీలను జేయుట కష్టము.

నశతేనాపి వర్షాణాం ముహ్యతి మదనాశయః
తత్రాశక్త్యా నివర్తన్తే నరా ధైర్యేణ యోషితః.

ఇంతియగాక రాముఁడు వక్త, అబలలని స్త్రీలయందు దయాతిరేకము గలవాఁడై యీచంద్రరేఖచేత చక్రవాక చకోర నర జాతులందు స్త్రీలకే యేమి కలుగునో దానినే వాక్రుచ్చినాఁడు. కోకకుటుమ్బినీ, చకోరాఙ్గనా, ప్రేయసీ. దగ్ధమదనతరునవాంకుర మనుట వీనిలో చేరినదిగాదు, అది మూఁడవదానికి హేతుకథనము. ఈ చంద్రరేఖ అత్యంతమదనోద్దీపక మని చెప్పుటయందు తాత్పర్యమేగాని, దీనివలన మదనునికిం గలుగునవస్థావిశేషమును వర్ణించుటగాదు. ఇది చంద్రరేఖా ప్రభావవర్ణనము, కడమమూఁడును తత్కార్యవర్ణనములు. 'కవిహృదయ మిట్లుండుటం బట్టి, జక్కవదోయి యనుట తప్పు, జక్కవనాతి యనవలయు. 11. శూలిప్రస్తావ మప్రసక్తము. 12. ఉద్యచ్చంద్రమోరేఖయఁట—ఉద్యత్=ఉదయించుచున్న, ఇది తప్పు. సూర్యాస్తమయకాలమందు చంద్రరేఖ యెన్నఁడును ఉదయింపదు. అట్లుదయించునని ఏ సాంఖ్యముచేత సాధింతురో చూచెదంగాక. ప్రకృత చంద్రరేఖ పడమటిదిక్కున నున్నదని దీనికి మూఁడవపద్యమందు కంఠోక్తముగా నున్నది. 13. ముగ్ధం [నవ్యం] సుధాంశోర్వపుః=లేఁత చంద్రునిమేను. ఈ పద్యమునకుఁ బూర్వవచనమునందు, రాత్రిమత్తకాశినీఫాల స్థలమునందలి గంధపుబొట్టువలె రేఁడు వెలుఁగుచున్నాఁడు, అనియున్నది. అందు నేలను దలపెట్టి పరున్న రాత్రి మత్తకాశిని యనలేదు. ఈ రాత్రి శుక్లాదిని తృతీయాది షష్ఠీపర్యంతముగా మంచివెన్నెల దినములలో నొకటిగా నుండ వలయును. తూర్పున అర్ధోదితుఁడైన చంద్రుని యూర్ధ్వభాగమని పంతులవారి యభిప్రాయముగాఁబోలు. స్వారస్యము చెప్పవలసినదేలేదు. 14. ఔ—ఇది తుదవిసరేగాని యిపుడు దీనితోపని యేమి? వీరు వేసికొన్నా రని దీనికొఱకు పద్యమెల్ల మఱల నిపు డొకఁడు ఔఘటిత ముగా విసరుకొనునా? ఇది యొకవిధమైనచదువునొఱకము. ఈప్రశ్నయే యసంగతము, ఇది పాదపూర్తికి తలవిసరుగావేసిన యాగాని అన్వయమునకు వేసినదిగాదు.

వ్యాకరణపాండిత్య ప్రభావము:—15. కుంచెకోల్—ఇందేమి కోలుశబ్దమా — కోలశబ్దమా? కోలకు అంతలోపమునకు శాస్త్రమేమి? లక్షణ నిర్వాహము :చు రేఁగుచున్నది. 'ప్రాప్తి' లోనగునవి పదమధ్యమునకే.

పద్యము రాక్షసప్రీతిగా నున్నది.

మ॥ అలలంబోయినపంకముంగలదిగంగాంచన్మృణాళంబునె
[24] 765 ప్పలరుంగ్రప్పుడబ్బిపుష్పశరభార్యాసీధుభృంగారనా
ళరుచిస్ఫీతమువార్ధివెన్నఖసరోలక్ష్మ్యబ్జపత్రాంబుబిం
దులసద్ధర్మ్యముచంద్రఖండమిదిసంతోషంబునీదేరికిన్.

మూ.— కల్లోలక్షిప్తపఙ్కం త్రిపురహరశిరఃస్వఃస్రవన్తీమృణాళం
కర్పూరక్షోదజాలం కుసుమశరవధూసీధుభృఙ్గారనాళమ్
ఏతద్దుగ్ధాబ్ధిబన్ధో ర్గగనకమలినీపత్త్రపానీయబిన్దో
రన్తస్తోమం న కేషాం కిసలయతి జగన్మణ్డనం ఖణ్డ మిన్దోః.

ప్రాసంపుజిత్తు—తొలిపాదమున అర్థలబ్ధపదమే [అలలన్]. కడమమూటం ౯రణములు— 1.ఒప్పలరున్, 2.రుచిస్ఫీతము, 3.లసద్ధర్మ్యము. 4.అంచత్—య. ఈప్రాసబాధకై రల మైత్రియు. దీనిం బ్రాసకడగం డ్లందము. 6. మూలమంద యనుప్రాససౌభాగ్యము ఇందు సున్నయైనది:—మృణాళమ్, జాలమ్, నాళమ్; న్దోః, బిన్దోః, ఇన్దోః.

7. అలలంబోయినపంకముంగలది—బహువ్రీహివిగ్రహవాక్యము,పద్యానర్హము; యినపంకము కలుగుటెట్లు? అలలనుండిపోయి దీనికి [మృణాళమునకు] అంటు న్నదా? విగ్రహవాక్యము ప్రయోగించుకొన్నందుల కీయర్థమే లాభము. 'అలలం కముపోయినట్టియది' అనిన ఆదోష ముండదు. అంచత్తను యతిపూరణమునకై త్రిపురహరశిరము త్యక్తము. మూలములో స్వఃస్రవన్తీ యనుటచే చంద్రరే యొక్క ఆకాశగతత్వముకూడ తెలుపఁబడినది; 9. గంగాపదముచే ఆకాశగతత్వము ూచితముగాదు. మందాకినీపదముచేనయిన సూచితమగును. త్రిపురహరశిరః అని తో ఘటితమైనను సూచితమగును. ఈభేదములచే పద్యపాదము మందగించినది. క్రప్పుడబ్బి—డబ్బిచే అనుప్రాసము పోయెఁగదా, మఱియిది మూలమునకు మైనతెనుఁగా? డబ్బి కర్పూరవికారమా, కర్పూరపూర్ణమా? రెండవపక్షంబునం రమగపడదుగాన నది పనికిరాదు, డబ్బియన్ననే చాలును, కప్పురమన్నప్రయో ము లేదు. ప్రథమపక్షమున డబ్బికి చంద్రరేఖాకృతి యెట్లు గలుగును? సాదృశ్యము

లేదు. కాన డబ్బిరయే పనికిరాదు. మూలమున, **11.** కర్పూరక్షోదజాలమని యున్నది. కపురపుముక్కలు నించినచిక్కము అర్థము. అది సరియైనయుపమానము. అది తుదల సన్నము నడుమ వెడల్పు; రెండే తుదలు; అచటిదారములంబట్టి యెత్తిన నది సరిగా చంద్రరేఖాకారముగానుండును. చిక్కముగాన లోనికర్పూరము వెలికి అగపడుచునే యుండును. ఇట్టిసంచికి జాలశబ్దభవములు 'జాలెము' 'జాలె' అనియుం బేరులు.

తే॥ తాను నిల్లాలు కొమ్మయుఁ దనయయుగము
మొలల దీనారములజాలెములు వహించి
సాతుఁ గూడి చనంగఁ దస్కరులు దాఁకి
నలుగురను బట్టి ధనమెల్ల నొలిచికొంద్రు. హంసి.

క॥ జాలెలఁ బట్టించుము పది
వేలు నయిదువేలు రెండువేలు నరయు సొ
న్నా లరి ఖంతలునకు మన
యేలిక తన్మంత్రి యతనియింటికిఁబనుపన్. జైమిని.

"ఒప్పలరుంగ్రపుజాలెముల్ మదనభార్యా" అనిన డబ్బితప్పను. **12.** భృంగార నాళరుచిస్ఫీతము— ఇందునడుమపదచ్ఛేదమెక్కడ? కలదా? లేదా? నాళరుచి యని నిలుపుదమన్న 'ళరుచి' నగణమగును. తెనుఁగువిభక్తివచ్చినపిదప సంయోగ ముచే గురుత్వమురాదు. అయినను వీరికవనములో ఎట్టి ఛందోభంగమేనియు అవర్జ నీయమేగాన ఇది వీరివిభాగము కాదన నేరకున్నాము. [౫౭-వ పుటలో దేనిదను నుత్పలమాలలో చతుర్థపాదము నగణముతో నారంభమైయున్నది, కనుఁడు.] ఇం కొకభేదమున నాళయని ప్రథమాంతపద మేర్పడును. అది నాళాశబ్దమునకు తత్సమ మా? నాళశబ్దమును పంతులవారు చరిత్రాదులలోఁ జేర్తురా? **13.** వార్ధి వెన్న—ముం దుగా నేవార్ధియో తెలియక ప్రసిద్ధిచే నుప్పుసముద్రమని గ్రహించి వెన్నయన్నపిమ్మట ఉప్పుసముద్రముగాదు పెరుగుసముద్రమని దిద్దుకొనవలయును. **14.** రుచిస్ఫీతము— వెన్నకు రుచిగలదనియా లేదనియా? ఒకవేళ నది రుచిస్ఫీతమై యుండెనేని అది యె ట్లుండునో అట్లు చంద్రరేఖ యున్నదని యభూతోపమయా? కలదానికే అనువాద మా? ఇది నాళకు విశేషణమా? **15.** వెన్నకు ఆకారమేమి? వెన్న యట్లే అర్థవల యాకారముగానే యుండునా? జయదేవకవి తాఁజెప్పినయన్నియుల్లేఖములందును చంద్రరేఖయాకారమునే ఉల్లేఖించినాఁడు. అనడుమ పాదపూరణార్థము పంతులు వారు చేయివెట్టి కవిహృదయవిపరీతముగా ప్రక్రమవిరుద్ధముగా అనాకారోల్లేఖ చేసి నారు. **16.** ఖసరోలత్స్యబ్జపత్రాంబు బిందులసద్ధర్మము— ఆకాశమనెడు సరస్సున

అగపడు తామరరేకునందలి నీటిబొట్టుయొక్క ఒప్పుచున్న ధర్మమువంటి ధర్మముకలది. మూ. గగనకమలినీపత్త్రపానీయబిన్దోః. పంతులవారు, ఇట మూలములో కమలిని యనఁగా సరస్సని యర్థముచేసికొన్నారు. కమలినీశబ్దమునకు కమలలతయు కమలసరస్సును రెండును అర్థములే, అయినను ఇట సరస్సుతప్ప, తీఁగయే యర్థము. కమలినీపత్త్రమనఁగా తామరాకు. గగనమనెడుతామరాకునందలి నీటిబొట్టు అని మూలార్థము. పంతులవారితెనుఁగులో గగనము సరస్సయినదిగదా. ఇఁక ఆకయినదేది? రూపకసిద్ధియెట్లు? మధ్యలో తోఁజ్జీవల్లా? 17. లక్ష్య—అబ్జపత్త్రమగపడుచున్నదా? 18. అబ్జపత్త్ర—అబ్జపత్త్రమనఁగా తామరరేకుగాని తామరాకుగాదు. ఆకునకు అబ్జినీపత్త్రమనవలయును. సంస్కృతము పేఁకులలో చెత్తతోట్లలో దొరకదు.

“కిం శీతలైః క్లమవినోదిభి రార్ద్రవాతాన్
సంచారయామి నళినీదళతాళవృన్తైః.”
“ఉత్సృజ్య కుసుమశయనం నళినీదళకల్పితస్తనావరణమ్.”
“స్నాన్తో మన్మథలేఖ ఏష నలినీపత్త్రే నఖైరర్పితః.” కాళి.
“నళినీదళగతజల మతితరళమ్.”

[19. లసత్, 20. ధర్మము—చీపర పావరపుల్లలు.] రేకు దొప్పగానుండును. దానియందలిజలబిందువు దూరమునకగపడదు. 21. దుగ్ధాబ్ధిబన్ధోః, 22. జగన్మణ్డనమ్—త్య.

23. పంకముంగలది—అకర్మకధాతువును అస్త్యర్థకమును సకర్మకముగాఁ జేయుట! ఇదేగావలయు కవితాతత్త్వముయొక్క విత్తు! 24. అలరుంగ్రపుడబ్బి—తద్ధర్మార్థక విశేషణమునకు హల్లు పరమైనప్పుడు నుగాగమ మెచట విహితము? క్రొత్తవ్యాకరణము త్వరగా చేసివేయుటము, అజ్ఞ పుచ్చుకొని యున్నారముగదా!

---

## తృతీయాంకము.

### 33 - వ పుట.

మ॥ శరసంతాడితతాటకుండువిలసత్స్వర్ణరత్నతాటంకుఁడున్
శరదంభోజదళాయతాక్షుఁడునునై జానొందుశ్రీరాముతో
[16] 781 వరలీలాత్తశిఖండమండితుఁడునై భాసిల్లుసౌమిత్రితోఁ
బరమామోదుఁడువచ్చునిచ్చటికివిశ్వామిత్రుఁడీతండహో.

మూ. తాటక్కానా విశిఖతాడితతాడకేన । రామేణపద్మరమణీయవిలోచనేన
క్రీడాశిఖణ్డకధరేణ సలక్ష్మణేన । సాకం మునిః కుశికసూను రితోయమేతి.

ప్రాసజిత్తు—[శర]—ప్రథమప్రాస మర్థలబ్ధము. కవమయూరుడను చీపర పాపరపుల్లలు. 1. శరత్, 2. పర, 3. ఆత్త, 4. పరమామోదుఁడు—కవితాత త్త్వవిచ్ఛురణమనుగ్రంథమునుండి తెచ్చుకొనఁబడినవి. 5. విలసత్సత్రత్న—నెం౧రు యతిగారు. 6. జానెందు—నెం౨రు యతిగారు. 7. భానిల్లు—నెం౩రు యతిగారు. 8. అహా! ఇందఱుయతు లొక్కటంగూడినందులకాశ్చర్యము! విశ్వామిత్రుండు ఉరవు పరమామోదుఁడు. ఈయూఱుగురికిని నుండిపుఁడునై ప్రయోగపుంటివి 9. నకారము గుహాకునకు నివ్వ. 10. ఒకటే సత్తు.

వరలీలాత్తశిఖండమండితుఁడునై భానిల్లు సౌమిత్రితో— ఈపాదము బొరఁబా టుగానున్నది. మూ.—11. క్రీడాశిఖణ్డకధరేణ సలక్ష్మణేన—12. ఇందు 'స' అనియొకపదమును విడఁదీసి దానినే పంతులవారు విశ్వామిత్రప్రసిద్ధిప్రయుక్త వక్తృ సంతోషవాచకముగా 'అహా' యని తెనిఁగించియుందురా? ఈపక్షమందు లక్ష్మణు నికిమాత్రము శిఖండకమును చెప్పుటకును రామునికిమానుటకునుం గారణమేమి? ఈ శిఖండాదికములు విశ్వామిత్రునికే యని పంతులవారిరహస్యాన్వయమా? రాముని చెంతనున్నప్పుడు విశ్వామిత్రుఁడు తాటకనుకొట్టించినవాఁడై, యజ్ఞము ముగించి పం డలములు ధరించి, పెద్దకన్నులు విచ్చిచూచుచు [రామునితోను], లక్ష్మణునిప్రక్క నున్నప్పుడు నెమలిపురి నెత్తినిచెక్కుకొని [లక్ష్మణునితోను], ఒకమాఱు అతనిప్రక్క ను, ఒకమాఱు ఇతనిప్రక్కను, నడచుచు, అతనిప్రక్కనొకవిధముగాను ఇతనిప్రక్క నింకొకవిధముగాను తన్నుఁదా నలంకరించుకొనుచు, ఆయిరువురితోను వచ్చెను: అని, 13. వికారములు విశ్వామిత్రునికే యన్వయించునట్లుగా నొకరహస్య మేటేసి యున్నదాయేమి? విశ్వామిత్రుని యూరామవేషప్రభావమునఁ గదా! అహా! అహా! పర మహంసజానెందుభానిల్లుల ప్రభావము!—౨౮-వ పుటలో 'నీలమేఘ' పద్యములో, రాముఁ డు 'శిఖండకాంచితుఁడ' ని యున్నది. ౨౭-వ పుటలో 'విరిసి' పద్యములో, రాముఁడు 'పంచెసొమ్ముల వాఁడు' అనియున్నది. ౨౯-వ పుటలో, 'పరువపు నెమలిపించెపుఁగనులచేఁ గై సేయఁబడినచెవులుగలవాఁడు' అని లక్ష్మణుఁడు వర్ణిం పఁబడినాఁడు. వీనికి వ్యత్క్రమముగా మూ.—తరుణశిఖిపిఞ్ఛమణ్డితకర్ణః [తెలుఁగు ముద్రణము], దానికే శిఖణ్డిపిచ్ఛమణ్డితకర్ణః [అని నాగరముద్రణము]; శిఖణ్డమణ్డనః; శిఖణ్డమణ్డనే; పంతులవారీతావుల నన్నిటను శిఖండమునఁగా నెమలిపురియనియే గ్రహించినట్లు విశదమగుచున్నది. నెమలిపురిని రామలక్ష్మణులు ధరించినట్లు ఎచట నుం ప్రమాణ మగపడదు. రాముఁడే ధరించియున్నచో "బర్హోత్తంసవిలాసకుణ్డలధరో గోప వేషస్యవిష్ణోః" అని బర్హమును గోపవేషముతో చెప్పనేల, రామవేషస్య అనరా

దా? ఇరువురికిం గలిగినచో గోపవేషమందు పక్షపాతమునకుం గారణమేమి? దాని కన్నం బూర్ణావతారమైన దీనినే చెప్పకోరాదా? కృష్ణుఁడు ధరించినట్లు ప్రసిద్ధము.

చన్ద్రకచారుమయూరశిఖణ్డకమణ్డలవలయితకేశమ్
ప్రచురపురన్దరధనురనురఞ్జితమేదురముదిరసువేశమ్. గీతగో.

మఱియు నీరాజకుమారులకు నెమలిపురి చెప్పినందున ప్రయోజనమేమి? అడవినుండివచ్చిరని సూచనయా? నగరోద్యానములందు మయూరము లుండవా? గొల్లలయాచారముచే కృష్ణునికి వచ్చినది. వీరికి రాఁబ్రసక్తియేమి? యాదృచ్ఛికమేని యిన్నిమాటలు తత్కథన మేల? కాన నెమలిపురిటీక సరిగాదు. పిచ్ఛశబ్దమునకు చూడయు నర్థమే. అట్లే శిఖండకశబ్దమునకును కాకపక్షము (జుల్ఫి)మాత్రమే గాక నెమలిపురియు నర్థమే. ఎవరో పండితమ్మన్యులు ఇచట తప్పుగా మూలమును మార్చినారు. తదనుసారి దుష్టముద్రణమును వీరు తెనిఁగించినారు. సంవాదము చూతము. ఈశిఖండమునే యుత్తరరామచరితలో చిత్రపటమందు సీత నిర్దేశించి పలికినది.

“ అమ్మహే అనాదరఖణ్డితశఙ్కరశరాసనః శిఖణ్డముగ్ధముఖమణ్డల ఆర్యపుత్ర ఆలిఖితః” — “ శిఖణ్డేతి కాకపక్షధర ఇత్యర్థః జుల్ఫీతి భాషా ” అని టీక.

జుల్ఫాలను చెప్పుటయందు ప్రయోజన మేమనఁగా, క్షత్త్రియబ్రహ్మచారికి అవి యుండును. ఆలక్షణముంబట్టియే ఉత్తరరామచరిత్రలో లవుని కంచుకి క్షత్త్రియబ్రహ్మచారినిగా నూహించి జనకునితోఁ జెప్పినాఁడు.

జనకః.—కువలయదళశ్యామస్నిగ్ధః శిఖణ్డకమణ్డనో
వటుపరిషదం పుణ్యశ్రీకః శ్రియైవ సభాజయన్
పునరపి శిశు ర్భూత్వా వత్సః స మే రఘునన్దనో
ఝటితి కురుతే దృష్టః కోఽయం దృశో రమృతాఞ్జనమ్.

కఞ్చుకీ.—నూనం క్షత్త్రియబ్రహ్మచారీ దారకోఽయ మితి మన్యే
“ శిఖణ్డకఏవ—కాకపక్షనామక కేశభాగవిశేష ఏవ ” అని టీక.

బాలుఁడైనయారాముని వలెనే యని జనకుఁడు చెప్పుటచే రాముఁడు ధరించినశిఖండకంబును కాకపక్షమేగాని నెమలిపురిగాదని తెలియవచ్చుచున్నది. 14. మఱియు శిఖండకములు రామలక్ష్మణులకు నిరువురికిని ద్వితీయాంకములో చెప్పఁబడి యుండఁగా నిట పంతులవారు లక్ష్మణునికిమాత్రము చెప్పి రామునికి చెప్పమికి నిమిత్తమేమి! 15. సలక్ష్మణేన అని బహువ్రీహిగాఁ గొన్నచో రామునికిమాత్రమే శిఖండకము చెప్పఁబడునుగదా, అది యాక్షేపణీయముగాదా యనిన, శిఖండకము నె

మలికుంచె గాదుగాన, జుల్పి గావున, అది బ్రహ్మచారిలక్షణముగాన రామునికే వివాహముకాకుండఁగా లక్ష్మణునికి కానేకాదుగావున అతనికిఁగలదని వేఱు చెప్ప నక్కఱలేదు. కావుననే బహువ్రీహియే సరి, తదనుగుణముగానే రామప్రాధాన్యమే వివక్షితమని యీపద్యముతర్వాతిగద్యములో రామశబ్దప్రయోగముచేయకయే ఇతఁ డని సర్వనామముచేతనే రామునే ప్రస్తావించుటచేత నెఱుకపడుచున్నది. ద్వితీయాంకములో సీత వీరిశిఖండకములను చెప్పుటలో తాత్పర్యము, వీరు అవివాహితులు, రామునిఁగూడి నేనును లక్ష్మణుంగూడి యూర్మిళయు సపత్నీవిచారములేక సుఖంబుండ నోఁచితిమా, అనియాశంసాసూచనము. పద్యములో శిఖండకప్రస్తావము శైశవసూచకము, ఇంతశిశుతనే తాటకం గొట్టినయీతఁడు మహావీరుఁడు, తప్పక శివధనురాకర్షణముచేయఁగలవాఁడు, అని భావము. ఈశిఖండకములు వీరికి అయోధ్యలో దశరథుని వీడ్కోనునప్పుడే కలవు.

౧ కౌశికేన స కిల క్షితీశ్వరో । రామ మధ్వరవిఘాతశాన్తయే
కాకపక్షధర మేత్య యాచిత । స్తేజసాంహి న వయస్సమీక్ష్యతే.

కాకపక్షధరః = బాలకోచితశిఖాధరః [రాజకుమారాణాం హి పఞ్చ శిఖా భవన్తి] యదుక్తం బాలరామాయణే "చూడాపఞ్చకమణ్డనౌ క్వచశిఖా చణ్డః క్వచాయం మునిః" "బాలానాం తు శిఖా ప్రోక్తా కాకపక్షః శిఖణ్డకః" ఇతి హలాయుధః. — అని వ్యాఖ్యానము....రఘుమహారాజుశైశవమును ఇట్లే వర్ణితము.

స వృత్తచూడ శ్చలకాకపక్షకై । రమాత్యపుత్రై స్సవయోభి రన్వితః
లిపే ర్యథావద్గ్రహణేన వాఙ్మయం । నదీముఖేనేవ సముద్ర మావిశత్.

చలకాకపక్షకై శ్చలశిఖణ్డకైః — మల్లి. టీక.......విశ్వామిత్రుని ప్రార్థనను దశరథుఁడు భాస్కరరామాయణములో చెప్పినయుత్తరమును గనుఁడు.

క॥ పదియాఱేఁడులబాలుని । సదములగుణుఁగాకపక్ష సంయుతునిట్లే
నదయతఁబుత్తేఁజాలను । సదయుఁడవగురామువలన సంయమివర్యా.

రామలక్ష్మణులు దశరథుని వీడ్కోనుఘట్టమందును ఈశిఖండకములు చెప్పఁబడినవి.

తౌ పితు ర్నయనజేన వారిణా । కించిదుక్షితశిఖణ్డకా వుభౌ
ధన్వినౌ తమృషి మన్వగచ్ఛతాం । పౌరదృష్టికృతమార్గతోరణౌ.

కించిదుక్షితశిఖణ్డకౌ=ఈషత్సిక్తచూడౌ. మల్లి....ఈశిఖండకమే విశ్వామిత్రయజ్ఞాంతమందును ప్రస్తావింపఁబడినది.

తో ప్రణామచలకాకపక్షకా | భ్రాతరా వపభృథాప్లుతో మునిః
ఆశిషా మనుపదం సమస్పృశ | ద్దర్భపాటితతలేన పాణినా.

ఈశిశువు శివధనుస్సునువంపఁగలఁడా యని జనకుఁడు సందేహపడఁగా—

ప్రత్యువాచ తమృషి ర్నిశమ్యతాం | సారతో యమఘవా కృతంగిరా
చాప ఏవ భవతో భవిష్యతి | వ్యక్తశక్తి రశని గ్గిరావివ.

అని విశ్వామిత్రుఁడు చెప్పఁగా,

ఏవ మాప్తవచనా త్స పౌరుషం | కాకపక్షకధరేపి రాఘవే
శ్రద్దధే త్రిదశగోపమాత్రకే | దాహశక్తి మివ కృష్ణవర్త్మని.

కాకపక్షకధరేపి—బాలేపి. మల్లి.

ప్రసన్నరాఘవశ్లోకమందును శిఖండకప్రస్తావము బాల్యముం దెల్పుటకని బోధ పడుచున్నదా? జనకుఁడు ప్రస్తావించిన యీ కాకపక్షములనే సుమా సీత చిత్రప ములో చూపినది, లవుని శిఖండకములం గాంచినప్పుడు వీనినే సుమా జనకుఁడు ప్తిచేసికొన్నాఁడు. అధరోత్తరములు విచారింపక పంతులవారు పాడుచేసినారు.

16. శరమొదలు డుసునై పఱకుంగలవాక్యమున జాబితాశైలి యని చెప్ప నె ్నను. ఇది సరసకావ్యానర్హము.

భాస్కరవిలసితవృత్తము. ఛందోభంగము.

జక్కవపులుఁగులకూఁటగల్గన్ జొనుగనొగినవికపగసుఖింపన్
[20] 801 జుక్కలగములనుసెక్కుటమెక్కన్ జుక్కలదొరఁబరిహాసనము నేయన్
దిక్కరిగమనలుకుంకుమపూఁత న్దెజరిలఁగఁగలువలువెగడొందన్
బక్కననగఁగనుబాగుగఁదమ్ముల్ భాస్కరుఁడిదెయుదయించెనుగనుమా.

ఈ పద్యములో నెనిమిది తుమున్నంతము లున్నవి. వానికెల్ల ఉదయించెనను యతో నన్వయము. అందాటింటికి కర్తలు అయావాక్యములంచే యున్నవి. 1. 'సె —', 'చేయన్', అను రెంటికిమాత్రము కర్తను 'భాస్కరు'ని—'కలువలువెగడొం —', 'దమ్ములుపక్కననగఁగను', 'దిక్కరిగమనలను' దాఁటి [సూర్యుఁడువాక్యములం ఁటి దురన్వయముచేసి] పోయితెచ్చుకోవలసియున్నది. 2. ప్రక్రమము చెడుటం ప్పనే అక్కఱలేదు. ఏతన్మూలసంస్కృతము పంతులవారికి అర్థముగాలేదు.

ఏత త్తర్కయ చక్రవాకహృదయాశ్వాసాయ తారాగణ
గ్రాసాయ స్థలదిన్దుమణ్డలపరీహాసాయ భాసాంనిధిః

దిక్కాన్తాకుచకుమ్భకుఙ్కుమరస న్యాసాయ పఙ్కేరుహో
ల్లాసాయస్ఫుటవైరికైరవవన త్రాసాయ విద్యోతతే.

ఇందు ఆశ్వాసోల్లాసత్రాసములు ణిజంతము లగుటచే సకర్మకములైనవి. గ్రాసాదులు సహజముగానే సకర్మకములు. అన్నియు సకర్మకధాతువుల భావవాచకములు. 3. మొదలు ఇదియే పంతులవారికి తెలియలేదు. వీనికి తుమర్థాచ్చభావవచనాత్తను సూత్రముచే చతుర్థి వచ్చినది. సంస్కృతములో, తుమున్ ప్రత్యయాంతము తాను ఏసమాపకక్రియతో నన్వయించునో దానితో సమానకర్తృకముగా నుండవలయును. కావున నీయాశ్వాసాదులకెల్ల భాస్కరుఁడే కర్త, హృదయాదికములు కర్మలు. కావున పద్యమునందు, 4. తుమున్నంతములకెల్ల భాస్కరుఁడే కర్త గావలయును. పంతులవారికి మూలస్వరూపము బోధపడనందున ఇట్లు నిర్వహింపరైరి.

ఇదె దీనిని పరికింపుము — జక్కవలహృదయములను ఊఱడిలఁజేయుటకును, చుక్కలమొత్తములను దిగమ్రింగుటకును, జాఱిపడుచున్న చంద్రమండలమును పరిహసించుటకును, దిక్కాంతలకుచకుంభములందు కుంకుమద్రవమును పూయుటకును, తామరలను విరియించుటకును, ప్రసిద్ధవైరులయిన కలువలతుటుములను బెదరించుటకును, భాస్కరుఁడు ప్రకాశించుచున్నాఁడు.— అని మూలార్థము.

వదలిన వానిని పిమ్మట చర్చించెద. చేర్చినదానిం గందము, 5. జాఱుగనొగినవి కవగానుఖింపక — ఇదియమూలకము, ఊఱట నేయక అనుటచే గతార్థము. మఱియు నీవాక్యమందలి వర్ణన [జాఱుగ...ఖింపక] 6. శృంగారరసపోషకుఁడైన వృద్ధలంపటుని బోని నోటికి ఉచితముగా నున్నది. గ్రామ్యోక్తి ప్రాయముగా నున్నది.

వదలినవి — పులుఁగులకు — జక్కవలహృదయమునకని మూలము. 7. హృదయశబ్దమునం బ్రయోజనమును ౩౦-వ పుటలోని "చాలంజక్కవ దోయికీయదిమన శ్శల్యంబు" పద్యముయొక్క మూలమునంగల "ఏవతోకకుటుంబినీజనమనశ్శల్యమ్" మనశ్శబ్దముంగని పరికింపుఁడు. 8. స్ఖలత్ [= జాఱుచున్న, ఓడిపోవుచున్న] — పరిహాసకారణమును తెలుపుచున్నది. 9. ఇందుమణ్డల — చంద్రుఁడు రాజుగాన మండలమనుటచే మండలాకారముగా వ్యూహింపఁబడిన యతనిసైన్యము సూచింపఁబడుచున్నది. బింబమనునర్థాంతర ముండనేయున్నది. 10. కాంతా 11. న్యాసములు త్య.

మార్పులు — దిక్కరిగమనలు — మూలములో వీరికి 12. కుచకుంభములున్నవి. 13. కరిగమనము లేదు సర్వకలాశలాధిపులకు [యూనివర్సిటీవారికి] వెఱచి, పంతులవారు వీరికుచకుంభములను హరించినందున బరువుతగ్గినపిమ్మట నింక కరిగమన మేమిసి హరిణప్లుతమే. జయదేవుఁడు వీరి కుచములకుమాత్రము కుంకుమద్రవము పూయింప

నెంచెనుగాని పంతులవారు వీరిని కుచహీనులనుగాఁ జేసినందులకు పూరణముగా 14. ఒడలెల్లం గుంకుమ పూయించినారు! మంచిస్వారస్యము! మూలకారుఁడు దిక్కులను భాస్కరునికి, 15. కాంతలన్నాఁడు, 16. కాంతాశబ్దముచే దిక్కులకు భాస్కరుఁడు నాయకుఁడని తెలిపినాఁడు, వారికుచకుంభములయందు కుంకుమరసప్రసాధనమును, 17. భాస్కరునిచేతనే చేయించినాఁడు. అది యెల్ల బూతని కాఁబోలు పంతులవా రిందువదలివేసినారు. ప్రబంధము సరసముగానున్న మడిగాదుగదా. 18. పులుఁగులని యెక్కువగా పెట్టుట వ్యావహారికశైలిగానున్నది. జక్కవ లన్నం జాలును.

ఇందు ఛందశ్చమత్కార మొకటికలదు.—ఏమన? 19. తుదిని పాదభంగము. 20. మూలమందలి యనుప్రాసస్వారస్యమును తేలేక దాని మఱపించుటకు పంతుల వారు వృత్తవిశేష మవలంబించినారు. భాస్కరోదయవర్ణన యని భాస్కరవిలసిత వృత్తము నల్లినారు. ఆయుబ్బులాటలో వృత్తలక్షణమును మఱచి తుదను ఛందోభంగము గావించి యభాస్కరవిలసితమును తాండవించినారు. భనజయభననసగ అని యప్పకవి దీనికి లక్షణముచెప్పినాఁడు. ఇందు తుదిని నసగకు మాఱు [దయించెను గనుమా]జనగ వచ్చినది. తప్పులు సేయువా రప్పకవి నెప్పుదురా? పద్యమునకు మూలమునకు సరిసేయఁగడంగనుగాని కొంత చక్కఁజేసెదను.

జక్కవలకవల కూఱటసేయన్ జియ్యనఁదొంగతుటుములఁబొగడింపన్
జుక్కలగములను నుక్కటమెక్కన్ జుక్కలదొరఁ బరిహాసనమొనర్పన్
దిక్కరిగమనలఁ గుంకుమ పూఁతన్ దేజమెసక మెసఁగఁగఁ గయి సేయన్
బక్కనఁ జలరుహపాళి నగింపన్ భాస్కరుఁడిదె యుదయ మొనసెఁగన్మా.

3౮ - వ పుట.

చ॥ చెలువుగఁ గుంకుమాంబువులచేఁ దడుపంబడుఁ గాత భృంగసం
[28] 829 కలిత సుమాళిచే నెరయుఁ గాతఁ గడుం బొలుపంతకంతకున్
సలలితమాత ముత్తైములచప్పరముల్ వెలయంగనల్వ్వగం
బురవనితాళిచేని పుడుప్రోలివి పెందెరువుల్ పొరింబొరిన్.

ఇందు నెరయుటకుఁ బొలుపు కర్త; 1. తడుపంబడుఁగాత—అభిప్రాయమేది? తెరువులనుటకు వలనుపడదు, 'పొలుపు నెరయుఁగాత' మనువాక్యము అస్పష్టమున్నది. మఱియు, 2. నెరయుఁగాత—ఎచట? ఇండ్లలోనా, వీథులలోనా, దేహములయందా? చతుర్థపాదమందలి తెరువులలో ననుటకు గమకము లేదు. 3. ఉత్తరార్ధములో సలలిత మగుటకు కర్త తెరువులా? చప్పరములా? 4. వెలయంగ, నల్వ్వగన్—ఈ రెంటిలో పాదపూరణమేది, కర్తతో అన్వయించునదేది? 5. వెలయుటకు చప్పరములు కర్త

యా, తెరువులు కర్తయా? 6. చప్పరములు వెలయఁగా తెరువులు లలితమాత అని యన్వయమా, తెరువులు వెలయఁగ చప్పరములు లలితమాత, అని యన్వయమా? ఏయన్వయము గ్రహించినను తెరువులు పూర్వార్ధమునకు పోఁజాలవు. మూలము.—

పయోభి స్సిచ్యన్తాం బహుళవిలసత్కుఙ్కుమరసైః
ప్రసూనైః కీర్యన్తాం పరిమళమిళల్లోలమధుపైః
చతుష్కైః పూర్యన్తా మవిరళలసన్మౌక్తికమయై
ర్ముదా పౌరస్త్రీభి ర్నగరపథరథ్యాఙ్గణభువః.

పౌరాంగనలు సంతోషపూర్వకముగా రాజవీథిలో తమయిండ్లముందటి ప్రదేశములను కుంకుమరసభూయిష్ఠములైన జలముతో తడుపుదురుగాక [...ప్రదేశములందు కుంకుమరసమిశ్రజలమును కలయంపిచల్లుదురుగాక], పరిమళాకృష్టములై వచ్చిమూఁగుచున్న సతృష్ణమధుపములుగల పువ్వులతో చల్లుదురుగాక [ప్రదేశములందు ... పువ్వులను చల్లుదురుగాక], దట్టముగాఁ గ్రుచ్చఁబడినముత్యాలమణులతోఁ జేయఁబడిన చప్పరములతో నిండింతురుగాక [...ప్రదేశములందు ... చప్పరములను నిర్మింతురుగాక].—అని శ్లోకార్థము.

పంతులవారు శ్లోకమున కర్థముగాక, 7. సిచ్యన్తామ్ 8. కీర్యన్తామ్ 9. పూర్యన్తామ్, అనుకర్మార్థక యగంతములను 10. భావార్థక యగంతమునకు ఏకవచనమే యను నియమము నెఱుంగక భావార్థకయగంతములనుగాఁగొని, చిత్తచాదారము చేర్చి గోకంబర్దు తెనుఁగు చేసినారు. ద్వితీయపాదములో కొంచెము మేల్కొని పాలువు ఎక్కువగా చేర్చికొన్నారు. తృతీయపాదములో అట్లే వెలయంగను చేర్చుకొన్నారు. తడుపంబడుటకు కర్త లేమియు, పాలువువెలయంగలను కల్పించుకొనుటయు, భావార్థకయగంతములనుగాఁ గొన్నందులకును, 11. నాలిగింటిని నాలుగు స్వతంత్ర వాక్యములనుగాఁ గొన్నందులకును సాక్షులు. ఈయక్కలకు మూఁటికిని కర్త పౌరస్త్రీలు. పయోభిః, ప్రసూనైః, చతుష్కైః, ఈమూఁడును కరణతృతీయలే గాని కర్తృతృతీయలు గావు.

12. చెలువుగ—ప్రా. 13. కడుఁ—పా. 14. అంతకంతకుఁ—పా. 15. నల్వఁగ—పా. 16. ఇవుడు—పా. 17. వి—పా. 18. బొరింబొరిఁ—పా.

భృంగసంకలిత— 19. మూలములో పరిమళాకృష్టములై తేంట్లు వచ్చి మూఁగినట్లున్నది. 20. ఇందు, తేంట్లున్న సరియే, లేనిచో చంపేయేని తెచ్చి పువ్వులతోఁ గలుపవలసినదని యభిప్రాయము స్ఫురించుచున్నది. 21. మూలమందలి మధుపశబ్ద

ముచే పువ్వులలో మధువుకూడ నుండవలయునని సూచితమైనది. **22.** పరిమళ **23.** మకరందవంతములనుటచే క్రొత్తవియు శ్రేష్ఠములునని యర్థము లభించుచున్నది. దానిచే పౌరస్త్రీలకు రథ్యాంగణాలంకారమం దుండవలసిన తాత్పర్యము సూచితమైనది. **24.** ప్రోలివి పెండెరువుల్ అనకపోయిన, ప్రోలిమహాపథముల్ అనరాదా? వికార ముండదుగదా! ఈసౌభాగ్యములో **25.** లరప్రాసకడగండ్లు కూడ. లరల కభేదము వీరు వాదింతురుగదా! పులవనితాలిచే నిపుడు ప్లోలివి పెందెలువుల్ పోలింబోలిక — అని అన్నిట లకారములే పెట్టిశ్రుతిరంజన చేసికొనరాదా! అచ్చతెలుఁగుపదములలోఁ గూడ లరల కభేదమా? అవును; పూర్వము అచ్చతెలుఁగులోఁ గూడ వబల కభేద మని సొంతపత్రికలో వాదము వీరు ప్రకటించియుండ లేదా? మూలములో పౌరస్త్రీలకు మోదము **26.** చెప్పఁబడినది. ఇందు త్యక్తము. ఇదే సరి. వారు నవ్వుచుంజేసిననేమి, యేడ్చుచుంజేసిన నేమి? ఎటయినను పురాలంకారమైనం జాలును. మఱియు భృంగములకై చెడఁదిగురుచు ఏడ్చుచున్నారఁట, వారికి మోద మెట్లుకలుగును? **27.** తెరువులు— మూలములో రథ్యాంగణము లనుటచే వారివారియింటిముందఱ వారువారు అలంకరింపవలయునని యర్థమగుచున్నది. అంగణమును వీరు మానినందున, వేఱే జాడుమాలీలు అక్కఱలేకుండ వీథులెల్ల పౌరస్త్రీలే చక్కఁజేయ వలసినదని యర్థమేర్పడినది. ఇది మంచి స్వారస్యము! **28.** నెరయు—ఇందు రాకు నా పెట్టిన తెరువులు అన్నిపాదములందును సంబంధపడును, అన్నిసమాపకక్రియలచేతను అవియే అభిహితము లగును.

దీనిమూలము పంతులవారికర్థమయినదా? కాలేదు.

[4] క॥ అంగుగ నాఱేడెనిమిది । యంగంబులనెవనియందు నంగీకృతము
833 య్యెంగనఁద్రయిరాజ్యశ్రీ।యుంగడుకొనియోగలక్ష్మియును రాజిల్లున్.

ఇందు **1.** అయ్యె ననుక్రియకు కర్తయేది? త్రయీరాజ్యశ్రీ యోగలక్ష్ము లేని రాజిల్లునకుఁ గర్తలేదు. ఈమూఁడును రాజిల్లునకు కర్తలేని అయ్యెననునకు కర్తలేదు. కడుకొనియనుగోడచే దాయవిభాగమేని, పూర్వవాక్యగతములగుటచే ఆఱేడెనిమిది యను మూఁడుసంఖ్యలును త్రయీరాజ్యశ్రీలకు రెంటికే యన్వయించును. యోగలక్ష్మికి అందొకటియు నన్వయింపదు. ఈమూఁటికిని ఆమూఁటికిని యథాక్రమ మన్వయ ముండునని బుద్ధిమంతులకు ఆశంకయేని గలుగదా? చదివినవారికి త్రయికి ఆఱంగములు శిక్షావ్యాకరణచ్ఛందోనిరుక్తజ్యోతిష కల్పములు, రాజ్యశ్రీకి ఏడంగములు స్వామ్యమాత్య సుహృత్కోశరాష్ట్ర దుర్గబలములు, యోగమునకు ఎనిమిదంగములు యమనియమాసనప్రాణాయామప్రత్యాహార ధ్యాన ధారణాసమాధులు, అనియు

యథాక్రమసంబంధము మూలకవిహృదయమై యుండుననియు, స్ఫురింపదా? ఇది పంతులవారు మూలమన్వయముగాక గోకంబర్ణుతెనుఁగు గావించినారు, విద్యార్థులు తన్ను కోసీ యని భావించినారు. గోకంబర్ణు మర్యాద యెట్లనఁగా,— 2. అంగుగ 3. కనఁగ అనుప్రాసబంధులను విడుదలచేయఁగా, నిట్లగును.—

అఙ్గై రఙ్గీకృతా యత్ర షడ్భి స్సప్తభి రష్టభిః
త్రయీ చ రాజ్యలక్ష్మీ శ్చ యోగవిద్యా చ దీవ్యతి.

షడ్భిస్సప్తభిరష్టభిరఙ్గైః = ఆఱేడెనిమిది యంగంబులఁ, యత్ర = ఎవనియందుఁ, అఙ్గీకృతా = అంగీకృతమయ్యేఁ, త్రయీ = త్రయి, చ రాజ్యలక్ష్మీః = రాజశ్రీయుఁ, చ యోగవిద్యా చ = కడుకొని యోగలక్ష్మి యును, దీవ్యతి = రాజిల్లుఁ.

గోకంబర్ణ న్వయముగాక సరియైనయన్వయ మేమనఁగా (వరుసగ) ఆఱు, ఏడు, ఎనిమిది యంగములతో స్వీకృతయై ఎవనియందు త్రయియు, రాజ్యలక్ష్మియు, యోగవిద్యయు రాజిల్లుచున్నవో [ఆరాజర్షి జనకుఁడు ఇతఁడు అని పూర్వమున కన్వయము.] పంతులవారు 4. అంగీకృతా యనుమాటకు అంగీకృతమయ్యేఁ అని సమాపకార్థము చేసికొని మూలార్థముం గోలుపోయిన పాడుపద్యమిది. దీనిని ఏసాంఖ్యముచే సాధింతురో చూచెదంగాక.

క॥ అంగుగ నా ఱేడెనిమిది । యంగంబుల నెవనియందు నంగీకృతమై
రంగుగఁ ద్రయి రాజ్యశ్రీ । యుం గడుకొని యోగవిద్యయును రాజిల్లుఁ.

అనిమార్చికొన్న సరిపడును; కనఁగ అనుప్రాసపూరణమునకు రంగుగ నని ప్రాసపూరణము వచ్చినదిగాన పంతులవారికి మార్చున నష్టి యేమియు లేదు. పంతులవారు ఈయాంధ్రీకరణము చేయుచున్నతఱి బి. యే. పరీక్షకు సంస్కృతము చదువుచున్న విద్యార్థుల నెవ్వరినేని దీనియర్థ మడిగియుండరాదా? పోనీ చేసినపిమ్మట నేని పండితుల కెవ్వరి కేని చూపుకొనియుండరాదా? తనకుం దెలియకున్న నెవ్వరికిం దెలియదా? ఎవ్వరును ఎన్నఁటికిని కనిపట్టరా?

3౮ - వ పుట.

తలవిసరు.

శా॥ తాఁకుఁ జ్యానినదంబుదిగ్గజకముఁ దారంబుకంఠంబునీ
[4] లోకంబందు వెలుంగుఁ దేజముకడుఁ లోబ్యోతియాత్మీయమై
837 మీకున్వాకొనుసింహపీఠిన్నృపతఁ మీశాంతిఁబద్మాసనం
బోకల్యాణులురాజులీరునిమివంశోత్పన్ను లేయౌదురా.

1. ఆత్మీయమే—ఈయేకారము తుదివిసరు 2. జేదురా—ఈయాకార ముతలవిసరు 3. మీకాంతి — పూర్వవాక్యమునుండి 'మీకుఁ' 'వాకొను' అనురెం టను అధ్యాహరింపఁదగి యుండఁగా అందొకదానిని మానక ఒకదానినిమాత్ర ము 'మీ' యని, మానుట సరిగాదు. ఈ 'మీకు' పూర్వార్ధమందలి నాలుగువాక్యము లందును అకృష్టము. మఱియు మీ వేసికొన్నను వాక్యభంగిచే వాకొనుతో మీకును రాకమానదు. 4. మీకు మీకాంతిఁ బద్మాసనంబు వాకొనునని రసాభాసము గలదు. ఈపద్యమును ముఖ్యముగా ఆతలవిసరుకొఱకు ఉదాహరించితిని.

శతానందుఁడు.— ఇట్లేయిది.

తే॥ సక్తిలేకయు సద్రాజ్యసరసునందుఁ
జారువారాంగనోద్ధూతచామరోర్మి
[8] 845 వెలిగొడుగుఁబట్టి రాజహంసులురహింద్రు
యోగిరాజపథంబున నున్నవారు.

దీనికి తెలుఁగుముద్రణములో మూలము :—

శతానన్దః— ఏవ మే వైతత్.

వారాఙ్గనాకరతరఙ్గితచామరోర్మ్యా । శ్వేతాతపత్రశతపత్త్రిణి రాజహంసాః
క్రీడన్తి రాజ్యసరసి స్వరసం పథి ర్వా॥ యోగీన్ద్రసిద్ధసుగమే పథి సంచరన్తః.

నాగరముద్రణములో మూలము :—

శతానన్దః— భగవన్ సత్య మేతత్ । ఏతే హి.

వారాఙ్గనాకరతరఙ్గితచామరోర్మి । శ్వేతాతపత్రశతపత్త్రి రాజహంసాః
క్రీడన్తి రాజ్యసరసి స్వరసంపథేరాః । యోగీన్ద్రసిద్ధసుగమే పథి సంచరన్తి.

పంతులవారు అవిచారితరమణీయముగా తెలుఁగుముద్రణమును తప్పుగా తెనిఁ గించుకొన్నారు. తెనుఁగుముద్రణములో...చామరోర్మ్యా,...పత్త్రిణి,...సరసి అను మూడుసప్తములలో తొలిది సరసున్నకు విశేషణములు. పంతులవారు రెంటిని అవి శేషణములనుగా తెనిఁగించినారు. తొలిది విశేషణవిశేష్యసామానాధికరణ్యమున నేయు న్నదిగాని, రెండవది విశేషణముగానిచో...శతపత్త్రి అని యుండవలయును. కను లవరముగానే శతపత్త్రిశబ్దమును సాధించుట 'సహస్రపత్త్రం కమలం శతపత్త్రం కుశేశయమ్" ఇత్యాదిప్రసిద్ధికి విరుద్ధముగా నున్నది. మఱి ద్విగుపక్షమైన ముఖ్యార్థయమును వెట్టవలయును. ద్విగుపు శతపత్త్రి అని జీవించనగును. అట్లయినను ప్రయోగము

రాదు. కాన శతపత్త్రిణీ అనుసమాసము శ్వేతాతపత్ర శతపత్త్రిశబ్దముపై ఇన్ ప్రత్యయము రాఁగా నైనదానిసప్తమ్యేకవచనాంతరూప మని యెఱుంగనగును. పంతులవారీభేదముం గనలేక 1. దీనినికూడ అవిశేషణముగానే తెనిఁగించినారు. చామరోర్మి, అనువ్యస్తతయు వీరిని చెఱిచినది...,అరసులకు చామరోర్మి, శ్వేతాతపత్ర... అను నాగరపాఠము మేలు. 2. మఱియు నీ తెలుఁగుపాఠములో శతానందుఁడు 'ఏతేహి' అని యారంభింపనందున పద్యములో ఎవరేని యోగిరాజులు నడచుకొనుతీరు వర్ణితమైనది. ఈజనకాదులు నట్టివారు అని భావమో 'వీ రంతటివారా, వీరిని తమ రట్లు పొగడుట న్యాయ్యము గాదు,' అనియే భావమో, సందిగ్ధముగా నున్నది. నాగరముద్రణములో శతానందభాషితము 'ఏతేహి' అని యారంభించుటచే ఈజనకాదులు రాజ్యమును యోగమును రెంటిని సాధించుమహాపురుషులు అని తదీయస్తుతిగా పరిణమించి ప్రకృతాన్వయియగును. మఱియు పంతులవారు 3. స్వరసమ్—సు+అరసమ్=సక్తిలేక అని తెనిఁగించినారు. కవిహృదయ మది యని నాకు తోఁపదు. స్వరసమ్=అసక్తితో అనియే అర్థము. సక్తిలేక చేసినరాజ్యము క్షేమమొందునా? విరుద్ధధర్మనిర్వాహకులని చెప్పుటయందే తాత్పర్యము. సక్తిలేకున్న రాజ్యము నెఱవేఱదు, సక్తియున్న యోగము నెఱవేఱదు, రాజ్యయోగములకు సక్త్యసక్తులచేతనే విరోధము, అవిరోధము చూపుటయే ప్రక్రాంతము, అవిరోధమే వీరిమహిమాతిశయమునకు కారణము. కావున సక్తిలేక యని రాజ్యపరముగాఁ గొనుట సరిగాదు. 4. మఱి పద్యములోనేమి తన్మూలాంధ్రముద్రణపాఠమందేమి చతుర్థపాదమెల్ల సమాప్తపునరాదానదోషదూషితముగా నున్నది. నాగరపాఠమందు క్రీడన్తి సంచరన్తి అని రెండును లట్టులే అగుటచేత ఒకటి కొకటి యుపసర్జనముగాక తుల్యబలములై రెండును విధేయములయ్యె పూర్వోక్తవైధర్మ్యమును స్ఫుటీకరించుచున్నవి. 'వీరు అసక్తితో రాజ్యమును ఏలుదురు, ధీరులై [అనఁగా నిస్పృహులై] యోగమును సాధింతురు,' అని తాత్పర్యము నిచ్చుచున్నవి. 5. మఱియు సంచరన్తి యనులట్టున కావశ్యకమయిన చకారము సంచరన్తః అను శత్రంతమునకు ప్రతిబంధక మగును. 6. మఱియు సరస్సులో అంతటను సంచరింపక ఊర్మిలోనేని యంతటను సంచరింపక 7. ఒకతమ్మియందు క్రీడింతురఁట? వీరిని తమ్మిలో గోడమర్చి కూర్చుండఁబెట్టినారా? 8. ఊర్ములు తమ్మియుఁగలసరస్సులో, చామరంబులును శ్వేతాతపత్త్రంబును గల రాజ్యములో, నంతతం గ్రీడించుచుందు రన్న కవనమగును. సహృదయులే కారణ మూహింతురు. ఈ తెనుఁగుముద్రణముచేతను, తదీయదోషార్థాపరిశీలనచేతను, ఆంధ్రీకరణము పాడైనది.

౩౬ - వ పుట.

మ॥ తనచూడ్కిం బొనరించికోపగుణరక్తచ్ఛాయముం జెన్నలా
[14] కనునాకంబనుభిత్తి వ్రాయమను వేడ్కం దేవతాచిత్రమో
859 యనఁగా నాయె సుధాకరారుణుల గేయంబైన బింబంబుల
స్ఫురణంగాంచ సుధాసులాక్షుల ద్రవంబుల్గల్గు నెజ్జిప్పలే.

మూ.—శలాకీకృత్య స్వాం దృశ మసమకోపారుణరుచిం
సురశ్రేణీచిత్రం గగనతలభిత్తౌ రచయతః
సుధాంశో ర్భానో శ్చ ప్రథమరచితం బిమ్బయుగళం
సుధాలాక్షాసాన్ద్రద్రవభరితపాత్రద్వయ మభూత్.

విశ్వామిత్రుని నూతనస్రష్టృతాప్రభావమును జనకరాజు వర్ణించుచున్నాఁడు. పంతులవారికీ మూల మర్థముగాలేదు. పద్యమున కిది యర్థముగానోపును.—"పూర్వము ఈవిశ్వామిత్రునికి ఆకాశభిత్తియందు దేవతాచిత్రము వ్రాయుటకై చంద్రసూర్యులు సుద్దనీళ్లను లత్తుకనీళ్లను గలచిప్పలైనారు." 1. ఇది బ్రహ్మకృతచంద్రసూర్యవిషయకముగా నిట నగపడుచున్నది. విశ్వామిత్రకృత చంద్రసూర్యపరముగా శ్లోకమందున్నది. ఇదే పంతులవారు మూలార్థము గ్రహింపనందులకు గుర్తు. శ్లోకములో, విశ్వామిత్రుఁడు సురశ్రేణీచిత్రము వ్రాయువాఁడై ముందుగా చంద్రసూర్యులను వ్రాయఁగా తద్బింబములు ఆయనకు కడమవారిని వ్రాయుటకుం బెట్టుకొన్న సుద్దనీళ్లపాత్రంబును లత్తుకనీళ్లపాత్రంబునో యన నొప్పారుచుండినవి, అనియుత్ప్రేక్ష.

కోపగుణరక్తచ్ఛాయముం 2. గుణశబ్దముం దీసివేయునది. ఇది పాదపూరణమేగాని స్వారస్యముం జెఱుచుచున్నది. కోపము గుణ మనియెవరికిఁ దెలియదు? దాని నిట చెప్పవలసినప్రసక్తి యేమి? చెప్పినఫల మేమి? ముఖావయవచంద్రుఁడు అన్నట్లున్నది. గుణశబ్దమునకు మఱుంగు లర్థముచెప్పి సాధింతురా? సందిగ్ధార్థతాదోషము. 3. నాకం బనుభిత్తిన్—స్వర్గమునుంగూడ చెప్పునదియైన నాకశబ్దముకంటె మూలమందలి గగనతలభిత్తిశబ్దము ఎంతయు శ్రేయము. 4. వేడ్కన్—విశ్వామిత్రుఁడు కోపముచే సృజించెనేగాని వేడుకచేతఁగాదు. 5. దేవతాచిత్రము—మూ. సురశ్రేణీచిత్రమ్ - శ్రేణీశబ్దముచేత చిత్తరు వనునర్థము సుఖముగా అసందిగ్ధముగా నగపడుచున్నది. దేవతాచిత్రమనుటలో దేవతానిర్మితమేని దేవతాసంబంధియేనియు నగునద్భుతమనియు నర్థమగుచున్నది. ఆలేఖ్యార్థము ఇంత సులువుగా స్ఫురింపదు. 6. గేయంబైన—ఈమాటయే పద్యమునెల్ల పాడుచేసినది. 7. ప్రథమరచి

తమ్ అని మూలములో బింబవిశేషణము. 8. అస్థున్—ప్రా. 9. ఉనకార మప్ర యోజకము. ఇట్లు సముచ్చయమునుగూడ పాదపూరణము నేసికొనుటకన్న హిత మరసి పద్యకవనము మానుట కడుంగడు శ్రేయము. 10. ఓయనఁగాన్—ప్రా. 11. ఒగిన్—ప్రా. 12. కాంచన్—పా. 13. ను (లాక్షు)—ప్రారబ్ధపూరణము. 14. ఏ—తలవిసరు.

సీకుమతాన్వయము.

చ॥ ఎవనిదినూతనత్రిదివసృష్టిసముద్యమసంభ్రమంబహో
యవనిఁబడంద్రిశంకువును నాకమునందుననుండి త్రోయ నా
[16] 875 కవిభుఁడు సాఁపఁబాదమును గాంచె వికాసముఁ జాలదేవతా
ప్రవరులు గేలుమోడ్పులిడ భక్తిఁగనెన్ ముకుళత్వమెంతయున్.

1. అవనిఁబడన్—ఈపదమువఱకు వినునప్పటికి అవనింబడినది సంభ్రమం బని యన్వయమైయుండును; త్రోయవఱకును వినఁగా పడినవాఁడు త్రిశంకువని దిద్దుపాటగును, 2. నాకవిభునివినఁగా, త్రోయననుపదమునకు త్రోసినపిమ్మట, త్రోసినయంతట నని యర్థమగును; పాదమువఱకు వచ్చినంతట, [త్రోయలేదు] త్రోయుటకై యని యర్థము దిద్దుపాటగును. 3. కాంచె ననఁగానే పాదమును గాంచె నని తోఁచును; వికాసమున్ అనుద్వితీయను వినఁగా పాదమునుగాదు వికాసము ను అని దిద్దుపాటగును. [కాంచుటకు సంభ్రమంబు కర్త యనియుం దెలియును.] 4. కనెన్ వఱకు వినఁగా, సంభ్రమము భక్తిఁబొందినదని యన్వయించును; ముకు ళత్వమును వినఁగా భక్తి ఇడుటకు విశేషణమని దిద్దుపాటగును. దక్షిణగతి హిందూ మతము, వామగతి మహమ్మదీయమతము, ఉభయమిశ్రము సీకుమతము, గాన దీని సీకుమతాన్వయ మనందగును. ఇట్టి దుష్టాన్వయవ్యాజంపుఁబరిత్యహింసనము మూ లమందున్న జయదేవుని సంస్కృతపండితులు కవియందురా! తారతమ్యముంగంటము.

త్రిశఙ్కౌ స్వర్లోకా దవనితలపాతం రచయితుం
శునాసీరే కోపా ద్వికసితపదాబ్జే వికసితః
యదీయో౽సౌ నవ్యత్రిదశనగరారమ్భరభసః
సురస్తోమే భక్త్యా ముకుళితకరాబ్జే ముకుళితః.

ఇందలి యన్వయసౌఖ్యముం గన్నపిమ్మట, 5. వికసిత—వికసిత యని, 6. ముకు ళిత—ముకుళిత యనియు, ఆపదమునే అనవీకృతముగాఁ బ్రయోగించిన స్వారస్య

ము నెఱింగి, పిదప తెనుఁగులో పదములు మార్చినయస్వారస్యమును గ్రహింపుఁడు. పైగా వికాస ముకుళనములతోఁగూడ 7. పదాబ్జే 8. కరాబ్జే యని ఉభయత్ర అబ్జశబ్దప్రయోగమున స్వారస్యమేమేనికలదో యరయుఁడు. ఈభ్రంశముల కెల్ల బదులుగా మనకు వచ్చినవేవియన— 9. నందున, 10. చాల, 11. ప్రవరులు— ప్రా. 12. ఎంతయుఁ.— ఇందులకై పోయిన వేవన 13. శునాసీరుని కోపము [కోపాత్], [రెండబ్జములు] 14. నగరము, — ఈమార్పులకును రసాభాసమునకు మూలవిరోధమునకును మనకుం గలిగినదేమన—15. అహా! అని యాశ్చర్యము. 16. ఎవనిది—ఇదేదో దీనిని మఱవఁగూడదు.

చ॥ కనలినవేల్పుఱేనిపదఘాతముచేత నధోగతుంద్రిశం
[9] ౪౪౪ కునిఁగనిదృష్టియీతనిది కోపవిపాటలకాంతి నెంతయుఁ
గనిముకుళీకృతోరుకరకంజ విరాజితమాచుసంజచా
డ్పునసమరాళ్యుపానితగఁబొల్చె మహాత్ముల క్రోధమల్పమే. •

1. ఈతనిది—అతనిదానిస్వారస్యము ఈతని కేతెలియును. 2. విరాజితమాచు సంజ—విరాజిత యాచుసంధ్య యన్నమేలు; ఉపానీత యను స్త్రీలింగమునకు సరిపోవును. 3. మహాత్ములక్రోధ మల్పమే—ఈమాట యనఁగూడదు, ప్రక్రాంత విరుద్ధము. విశ్వామిత్రునియంతమహాత్ములు మఱిలేరనుట ప్రక్రాంతము, ఇతరులుం గలరని తెల్పుచు ఇది విశ్వామిత్రుని కపకర్ష వెట్టుచున్నది 4. ఇది యమూలక మనుటకు ఈదోషములే నిదర్శనములు. 5. ఉరు—చేతులు ఎంతపెద్దవైన నేమి?—పా. 6, 7. నెంతయుఁ గని—పా. ప్రా—వి; 8, 9. గఁబొల్చె—అయ్యెఁ—య.

[4] ౪౪౮ క॥ సకలజనలోచనోత్సవ। నికరమునకునిరవుగనిటు నెగడు నెతండీ
సుకుమారుఁడుహరితమణి। ప్రకరము కల్పద్రుమమున భ్రాంతిఁగొలిపెడుఁ.

నాగరముద్రణపాఠము.

మూ.— సకలజనవిలోచనోత్సవానా।మయ మయనం కతరః పునః కుమారః
హరితమణిమయూఖహారిణో యః।కలయతి కల్పతరోః ప్రరోహలీలామ్.

పంతులవారు, [మయూఖ—]మయస్య, [ప్రరోహ—] ప్రమోహ అను తెనుఁగు ముద్రణమును అనుసరించినారు. నాగరముద్రణము నుత్తరార్థమున కర్థము:— పచ్చలకాంతి కిరణములచే మనోహరమైన కల్పవృక్షంపుమొలకయో యనసొప్పచున్నాఁడు.

1. రాముని కల్పవృక్షంపుమొక యనుటకును కల్పవృక్షమే యనుటకుం గల భేదమును సహృదయుల నడిగి తెలియంగవచ్చును. 2, 3. నికర ప్రకరములు—క

ప్రాసజ్ఞాతులు. 4. ఇటక్—ప్రదేశవాచకము, దీనితోఁగూడ ఇప్పుడు అని కాలవాచకము నొక పూరణమును వేసికొనియుండవచ్చును, పరాకుపడినారు.

శతానందుఁడు—ఇతఁడెవఁడు? ఇతనికే యీతఁడౌఁగదా.

[5] 893 ఆ॥ నల్లగలువరేకునాఁ డెంపుమేల్జిగి। చెంతఁబసిఁడివన్నెఁజెన్నుమీఱు
ఖంజరీటనయనకర్ణాగ్రముననున్న। చంపకస్తబకముచందమునను.

శతానన్దః.—(భగవన్) అయం చ కతరో యః ఖల్వస్యైవ।
నీలనీరజదళోజ్జ్వలకాన్తే। రన్తికే వసతి కాఞ్చనగౌరః
లోచనస్య సుదృశః శ్రవణాగ్రే। సన్నివిష్ట ఇవ చమ్పకగుచ్ఛః.

పంతులవారి కేతన్మూలము బొత్తుగా అర్థముగాలేదు. మూలార్థమిది:—(స్వామీ), ఇందీవరకాంతియైన సులోచనాలోచనముచెంత శ్రవణాగ్రమందు కాంచనగౌరమైన సంపెంగ పూగుత్తివోలె ఇందీవరవర్ణుఁడైన యీతని [రాముని] సమీపముననున్న కాంచనగౌరుఁ డితఁడెవఁడు? ఇందు, నీలనీరజసముజ్జ్వలకాన్తేః అనునది బహువ్రీహి, అస్య యను రామపరసర్వనామమునకును, లోచనమునకును, రెంటికిని విశేషణము. పంతులవారు దీనిని 1. కర్మధారయముగాను, 2. లోచనముతో సంబంధములేనిదానింగాను తగులఁబెట్టినారు. అట్లే కాంచనగౌరః అను కర్మధారయము లక్ష్మణపరమైన కతరశబ్దమునకును చంపకగుచ్ఛమునకును రెంటికిని విశేషణము. ఈవిశేషములు గనలేక పంతులవారు లోకులెట్లేని గ్రహింతురుగాక యని నిజాజ్ఞాననిహ్నవాభిలాషచే తత్ప్రకాశకముగా 3. ఇతనికే యీతఁ డని తొడంగినారు. ఇతనియొక్క—గాని ఇతనికేగాదు. పద్యంపుఁబ్రథమపాదమును రామ విశేషణ బహువ్రీహిగా చెప్పకొని కు షష్ఠ్యంతముగాఁ బ్రయోగించుకొనియుండినచో 'ఇతనికే' అన్నను సామానాధికరణ్యము స్ఫురించును. ఇప్పుడు ఈ కి షష్ఠిచేత జిగియెవరిదో తెలియదు. 4. మఱియు ఇతనికే యీతఁడౌగదా యనియిటనే ముగించుటచే ఈవాక్యంపుఁబదములకు పద్యముతో సంబంధము కలదని పంతులవారు తలంపమి సూచితమగుచున్నది. 'నల్లగలువ జిగిగలయితనిచెంత' నన్న మూలార్థానుగుణ మగును. ఖంజరీటనయన కర్ణాగ్రమున—(౧) ఖంజరీటమువంటి నయనములుగల చెలువయొక్క కర్ణాగ్రమున, (౨) ఖంజరీటపక్షియొక్క నేత్రకర్ణములతుదను, (౩) ఖంజరీటము యొక్క నేత్రముతోడి కర్ణముతుదను, (౪) ఖంజరీటమువంటి నయనముతోడి కర్ణముతుదను, అని నాలుగర్థములగుచున్నవి. ఇందు నాలవది ఉపమానపూర్వపదోపమేయోత్తరపద కర్మధారయసమాస పంతముగానున్నది. అట్టిసమాస మరుదు. పెద్దలు ప్రయోగించినబింబాధరాదికముల కొక కొన్నిటికి వామనాదులు గతి చెప్పి

యున్నారుగాని, ప్రచురప్రయోగానుగ్రహము చేయలేదు. కాన నది యిట దుష్టమే. అయినను పంతులవారికి ఆభేద మక్కఱలేదు. ఆతప్పుడుసమాసమును వీరు ప్రయోగించుకొనువారే. ఉ. “నీకమలాంఘ్రులకోసి జానకీ”. కాన నిటు నీనాల్గింటను అర్థములే. అయినను ఒకటియు మూలానుగుణము గాదు. 5. ఖంజరీటనయనయొక్క నయనమునకు చెంతను కర్ణాగ్రమునందు అని యర్థమగునట్లు వ్రాసికొనియున్నయెడల కొంతవఱకు సరిపడును.—విద్యార్థులు మేలుగదా, ఉపాధ్యాయులవలన ఏమిసమాసమో, ఏమన్వయమో నేర్చుకొందురు! కవి యఁట! సంస్కృతము తెలియునఁట! కటకట!

32 - వ పుట.

ఈపుటలో నేకప్రాసమహిమ కలదు. ఎట్లన, ఇందు వప్రాసవృత్తములు
[3] మూఁడు గలవు. మూఁటను తవుధాతువు ఒకప్రాసము. ‘తవునీ రాముని
896 యందు’ ‘తవంగనేత్రోత్సవ’ ‘తవఁజూడంబడుచేని కీర్తులు’.

అక్కటా!

[6] ఆ॥ మిగులరూపరులుసమిద్ధసహజసౌహృ। దులపువీరియందెదోమదీయు
902 లనెడితలఁపుఁగొందునలకౌస్తుభామృత।కరులయందువలెనుగరమరిదిగ.

మూ.—ఏతయో రహ ముదారరూపయో। రుల్లసత్సహజసౌహృదశ్రియోః
కామపి స్వజనతాం విభావయే। కౌస్తుభామృతమయూఖయోరివ.

ఇది రామలక్ష్మణులంగని వారెవ్వరో యెఱుంగఁగోరినవాఁడై వారింగూర్చి శతానందుఁడు విశ్వామిత్రునితో పలుకువచనము.

1. మదీయులు—ఇదితప్పు. వీరు పరస్పరము స్వజనము అనఁగా బంధువులు అని తలంచెదను—అని మూలము. ఈశతానందవచనమునకు విశ్వామిత్రులవారు ‘ఈ యిరువురిస్వజనభావమందు మేము సాక్షులము’ అని యుత్తరము చెప్పినారు. తదనుగుణముగానే ఆమాటపై జనకమహారాజు ‘వీరు సోదరులా’ యని విశ్వామిత్రులవారిని ప్రశ్న వేసినాఁడు. విశ్వామిత్రులవారు అవునన్నారు. ఇందువలన రామలక్ష్మణులు ఒకరికొకరు బంధువులని శతానందుఁడు తలఁచెనని విశదమేగాని, తనకు రామలక్ష్మణులు బంధువులని తలంచినాఁడనుట పరిహసనీయము. 2. మదీయులను నడుమను కౌస్తుభామృతకరోపమానము వెక్కిరించుచున్నది. కౌస్తుభామృతకరులు శతానందునికి బంధువులా? ఈమదీయశబ్దముచే పంతులవారికి స్వజనశబ్దార్థము తెలియలేదనియు మూలశ్లోకము ఇంచుకేని బోధపడలేదనియు, విశదముగదా. శ్లోకతాత్పర్యము.—కౌస్తుభామృతకి

రణుల కెట్లు ఎట్టియన్యోన్యబంధుత్వము గలదో అట్లే ఈయిరువురికిని ఒకరితో నొకరికి అట్టిబంధుత్వముకలదని వీరి యుదారరూపసహజసౌహృదశ్రీలచేత నూహించుచున్నాను;—అని. 3. ఇట రామలక్ష్మణులు అన్నదమ్ములగుదురని శతానందునియూహ గాని తనకుబంధువులని కాదు. కౌస్తుభచంద్రోపమానముచే ఆభ్రాతృభావము లభించుచున్నది. కౌస్తుభచంద్రులిరువురును సముద్రపుత్త్రులేగదా, అందుచేభ్రాతలే గదా? ఉదారరూపసహజసౌహృదశ్రీలు కౌస్తుభామృతకరులందునుం గలవు. రూపమున సంశయము లేదు, సౌహృదము ఇరువురును ఒండొరుం బాయనోపక హరియెడనే (ఒకచోటనే) ఒకఁడు వక్షంబునను ఒకఁడు వామనేత్రంబునను నెక్కొనుటచే తెలియుచున్నది. —4. పద్యములో రూపసౌహృదములు రామలక్ష్మణులకుమాత్రమేచెప్పఁబడినవి. కౌస్తుభామృతకరులకు లేవు. 5. అలకౌస్తుభామృతకరులయందుప లెను—వ లెశబ్దయోగము దు సమాసముగదా? విభక్తిలోపముగదా? 6. కరమరిదిగ—పద్యము పాడుచేసినవిధము కరమరిదిగ! మూలమును ఇట్లు నాశనముచేసినవారికి సంస్కృతము తెలియుననియు తెలివిగలదనియు ఒట్టుపెట్టిచెప్పినను నమ్మఁదరమా?

[3] స్వవర్ణకాంతిన్ జితచంపకోత్పలుల్ । సువర్ణనీలోత్పలసుందరచ్ఛవుల్
905 తవంగనేత్రోత్సవదానదక్షిణుల్ । ప్రవీణులీలక్ష్మణలక్ష్మణాగ్రజుల్

1. స్వవర్ణకాంతిన్ జితచంపక—[తనవర్ణశోభచేత జయింపఁబడిన...] ఇట్టి యన్వయము తెలుఁగుభాషలో కలదా? 2. ప్రవీణులు—వీరు ఆగంతుకులు అపరిచితులు, వీరిప్రావీణ్యము శతానందుని కేమియగపడినది? 3. సులక్షణౌ అను మూలమునకీచొప్ప, మూలమునకు ద్వాత్రింశన్మహాపురుషలక్షణములు గలవారని తాత్పర్యము. ఈ యతిప్రాసలబాధ నెట్లుతప్పించుకొందుము? 'సులక్షణుల్లక్ష్మణలక్ష్మణాగ్రజుల్' అని వీరేల లవప్రాసము సులయతియు వేయరు? ముద్రణములు దొరకవా వీనిని సాధించుటకు? లవప్రాసమునకు,—

క॥ నావుడునందమహీపతి । కేవెరవునబ్రహ్మహత్య యేతెంచెఁదుదిన్
శ్రీలలితుండుబహుశ్రుతుఁ । డేవెరవునఁబరిహరించె నెఱిఁగింపుఁడగన్.

విక్రమార్కచరిత్ర 62 (34).

ఇఁక సులయతిలో ఉకారాకారమైత్రికి,—

తే॥ అబ్ధిమథియింపనెక్కటనవతరిల్లు । నాఁటనిసిరిపొందుచాడ్పుననవనపర్తు
లక్ష్మిఁదిలకింపమదికినుల్లసన మొసఁగు। మందరంబునమున్నె సుసుమయుఁగూడి.

పాండురంగమాహాత్మ్యము 67 (208).

చతుర్థపాదము గనుఁడు. మఱి సలలయతిమైత్రికి,—పారిజాతాపహరణములో తుది

సాగమున ఒకశార్దూలములో శ్వర్వలకు ప్రాసమైత్రి పడియున్నది కనుఁడు. శరలకు ప్రాసమైత్రియే యంగీకార్యమైనపిమ్మట యతిమైత్రి కాక్షేప మేమి? శరలసామ్యముచే సలలకు మైత్రిసిద్ధము. లరమైత్రికి ప్రవీణు లీలక్ష్మణలక్ష్మణాగ్రజులే ప్రమాణము.

రాముఁడు.—[జనాంతికముగ] వత్సా యుక్తము. ఇతఁడు సకలగుణవిశదుం
906 డు తండ్రివలె వినఁబడుచున్నాఁడు.

ఈ హాలెంటాటు వాక్యమునకు తెలుఁగు—“వత్సా, నిజముగా సకలగుణవిశదుని నాయనను గావలయు కొనియాడుచున్నారు.”

౩౮ - వ పుట.

లక్ష్మణుఁడు—ఔను. మఱి తఱుచుగఁ బొగడఁబడియెడు.

907 ఈలూట్టు ఆశీరర్థకమయగుంగాక. అయినను అర్థనిశ్చయము లేదు. ‘ఆహా! మఱలం బొగడుదురుగాక!” అనిన వివక్షితార్థమువచ్చును.

విశ్వామిత్రుఁడు దశరథునిప్రభావమును జనకునిమ్రోల నుతించుట.

శా॥ వ్యాళోద్యద్భుజ దండఖండితఘను ర్వ్యాపారమేవానికిన్
[11] 918 లీలామాత్రముగా నఱంగనసురీలీలావతీభ్రూలతల్
పౌలోమీకరజక్షతాంకితమునా వాస్త్రోష్పతిక్షేత్రమా
కాలంబందు నసృగ్విపాటలరుచిం గాంచున్నిరిం గ్రచ్ఛఱన్.

మూ.—యస్యోద్యద్భుజ దణ్డచణ్డిమలస త్కోదణ్డ లీలాయితైః
నిష్పీతే దనుజేన్ద్రచన్ద్రవదనాభ్రూవల్లరీవిభ్రమే
లక్ష్మీమస్రవిపాటలద్యుతిమయీ మాలమ్బతే కేవలం
పౌలోమీకర జాఙ్కురవ్యతికరా దాఖణ్డలీయం వపుః.

దీనియర్థము—(దశరథుని) బాణలీలలచే నసురేంద్రస్త్రీల భ్రూవిభ్రమములు నిశ్శేషముగాఁ ద్రాగఁబడఁగా [ఇతనిబాణలీలలు అసురేంద్రస్త్రీలకు వైధవ్యము కలిగింపఁగా, అనఁగా అసురాధిపులనెల్లం జంపఁగా] దేవేంద్రునిమేన యుద్ధలబ్ధములయిన నెత్తురుగంట్లకు బదులుగా శచీనఖలబ్ధములయిన యొట్టిగీఱలు శోభిల్లుచుండును. [అనఁగా, ఇంద్రుఁడు తనశత్రుల నీరాజు సంహరించుటచే తాను యుద్ధప్రసక్తి లేకుండఁగ తనభార్యతోఁ గ్రీడించుచు సుఖముండును. అట్టిమహావీరుఁడు ఈదశరథుం డహారాజు అనితాత్పర్యము]. ఈయర్థమేమయినం బద్యములోఁ గలదేమో చూతము. ౧. సురీ లీలావతీభ్రూలతల్—మూ. దనుజేన్ద్రచన్ద్రవదనాభ్రూవల్లరీ విభ్రమే—1. అ

సురసామాన్యముం జెప్పుటచే పరాక్రమాతిశయము కథితము గాదని జయదేవుఁడు అసురేంద్రులం జెప్పినాఁడు. **2.** భ్రూవల్లరులం జెప్పుతటి చంద్రవదనా శబ్దముచే నిర్దేశమందుంగల సొబగు ౧౦౩-వ పు. చూడుఁడు, తెలియును. **3.** చంద్రవదనాశబ్దముచే సౌందర్యాతిశయంబును, దానిచే భర్తృవిభవాతిశయంబును, సూచితములు. **4.** మూలమందలి భ్రూవిభ్రమముం జెప్పక భ్రూలతలను నాశముచేసినాఁడనుటచే, దశరథమహారాజు యుద్ధవీరుఁడను నర్థముపోయి నాపితవీరుఁడనునర్థము వచ్చినది. మేలే గదా? ఉత్తరార్థమున కిది యర్థముగానున్నది,—శచీనఖక్షతచిహ్నితమైన యాఖండలు దేహము **5.** రుధిరారుణ ద్యుతిచేతఁగూడ శోభిల్లుచున్నది, అని. ఇది కేవలము మూలవిరుద్ధముగదా. పౌలోమీకరజక్షతాంకములచే నని దిద్దదము. **6.** క్షేత్రము—ఇంతకన్న మూలములోని వపుః పదము కడుశ్రేయము. వపు వనఁగా, శ్రేష్ఠాకృతి, “ వపుః క్లీబం తనౌ శస్తాకృతావపి ” అని మేదిని. **7.** అంకితమునా—ఈ సముచ్చయ మేల? కాల్పనా? లేక, ఇది యొకతమాషా ద్వితీయయా? **8.** ఆకాలంబందు—ఈ యర్థము అఱంగనను తుమున్ప్రత్యయముచే రాలేదా? ఎక్కడియతిప్రాసలు సంభవించినది! **9.** అసృగ్విపాటలరుచిన్—ఇదేమి కర్మధారయమా, బహువ్రీహియా? మైన ననుకొండి యని చమత్కారమా? బహువ్రీహియేని సిరికి విశేషణము గావలయు, కర్మధారయమేని తృతీయార్థద్వితీయ గావలయును. **10.** క్రచ్చఱన్—పా.

లక్షణజ్ఞత.—**11.** అసురీలీలావతీ భ్రూలతల్— అసురలీలావతీ అనవలయును. అసురీశబ్దము భాషితపుంస్కము గాన నిట పుంవద్భావము రావలయును.

[1] క॥ ఇనకులకిరీటకోటీ। కనదరుణోపలముకుళముగఁదగునతనికిన్
919 జనపతికిదశరథునికీ।సనయులుతనయులుసుధాంశుసమసమవదనుల్.

**1.** సుధాంశుసమసమవదనుల్—సమాప్తపునరాదానదోషము,—పా.

తొడరిన—మోతుబరిసాటి.

చ॥ వడిగలవేనిబాహువులువైరిసతీతతికజ్జలంబునం
[13] దొడరినకాళిమంబనఁగఁదోఁచునుదాల్చిధనుఃకిణచ్ఛవిన్
932 గడిమిని నేనిజ్యానినదకాండముచేతనిపీతమయ్యెనా
నడఁగెనుసూడుచేడియలయంచితకాంచనకాంచికాధ్వనుల్.

మూ— యద్బాహూ వహతః పరాక్రమహృతాం ప్రత్యర్థిసీమన్తినీ
చక్షుఃకజ్జలకాళికా మివ ధనుర్మౌర్వీకిణశ్యామికామ్

యద్దోర్దుర్దమకర్మకార్ముకగుణప్రోద్దామకోలాహలైః
వైరిస్త్రీకలమేఖలాకలకలాః పీతా ఇవాస్తం గతాః.

**1.** బాహువులే కజ్జలకాళిమంబుగాఁ దోఁచుచున్నవని యర్థమగుచున్నది. అందుచేత ప్రత్యర్థిసీమంతినీకజ్జలహరణమునకు ముందితనికి బాహువులు లేవనియు సిద్ధించుచున్నది. ఇదియనర్థము. ధనుర్గుణకిణ శ్యామికను కజ్జలకాళికగా నధ్యవసించుట శోభనముగానుండును. అట్లే మూలము. **2.** కాళిమంబనఁగ అనుట సొబగుగాదు. 'కాళిమంబునన' అని దిద్దఁడు **3.** ధనుఃకిణచ్ఛవి—ధనుఃకిణములు కరతలమందుండును, తద్గుణకిణములు బాహువులందుండును. బాహువులు చెప్పఁబడినవిగాని కరములుగావు గావున **4.** గుణమును చెప్పమి సరిగాదు. మూ. ధనుర్జ్యాకిణశ్యామికామ్ **5.** ఛవి యనుటకన్న శ్యామిక యెంతమేలో యూహించుకొనుఁడు. అట్లే **6.** చక్షుః శబ్దప్రయోజనమునూహింపుఁడు. "నయనాఞ్జనమార్జితాయాః." చక్షువులందు కాటుకనుధరించుట మానిరని యభిప్రాయము. **7.** సీమన్తినీ యనుట సీమంతసిందూరాదికము పోయిన ధని స్ఫోరకము **8.** శ్యామిక యనుటచే రెండును శ్యామికలేగావున ఈశ్యామికంగన నాశ్యామికగా తోఁచుచున్న దని భావము. 'కజ్జలంబునందొడరిన' యని **9.** హృతా మనువిశేషణము మానినందున,—అభిప్రాయ మేమనఁగా— ఈరాజు పురుషులకడ ప్రచండింపలేక స్త్రీలమీఁద గందరగోళింపఁగా వారికజ్జలము ఇతనికి అంటె ననియు, ఇతఁడు అవీరుఁడనియు. ఇందుచే, వారికజ్జలము పోయినదని, అనఁగా వారుధరించుటమానిరని, అనఁగావారిభర్తల నీతఁడుచంపెనని, యర్థముకానేరదు. వడిగలచేత నేమేని సాధింతమన్న, దానిని దిగమ్రింగునది యీ 'తొడరిన.' కాన **10.** పరాక్రమహృతమయినది కజ్జలకాళిమయని చెప్పక తప్పదు. అట్లనుటచే తద్భర్తలనుచంపఁగా వారు కాటుకమానిరి, అందుచే వారికనులందు కాటుక నలుపు పోయినది. అపోకయు ఇతనికి యుద్ధముచే ధనుర్గుణశ్యామిక రాకయు సమకాలికములుగాన అనలుపే యిదాయను నట్లుండెనని యుత్ప్రేక్ష. **11.** పంతులవారి కీయుత్ప్రేక్షయర్థముగామికి 'తొడరిన' మంచిమోతుబరిసాక్షి. **12.** పంతులవారు హృతా మను వ్యస్తపదము తెనుఁగుముద్రణములో భృతా అనిముద్రితమైయుండుటచే నిట్లుపాడుచేసినారు. పరాక్రమభృతా = వడిగలవి, అని బాహువులకు విశేషణము. నాగరలిపి తెలిసినను మేలన శక్యముగాదు, లిపితెలిసినను అర్థము తెలియవలదా? **13.** కాంచనకాంచికా—మూలములో కాంచనము లేదు. రాజభార్యలుగాన రత్నకాంచికలని యెన్నుట కవకాశమున్నది. 'అంచితమేఖలికా కల ధ్వనులో' అన్న కాంచన కలకలహీనముగా మూలమునకు సరిపడును. విశ్లేషణ స్ఫురింపదు.

ఈపద్యము పనికిరాదు.

మ॥ చెలఁగంగానెవఁడింద్రశత్రువిజయశ్రీతోడనేయీడ్చిమౌ
[20] ర్వీతలన్ భూవలయంబుతోడనెధనుర్బింబంబుదోర్మండలిన్
952 నలిఁదాల్చున్నదివేల్పుఱేఁడువిపచంటంగన్నగోర్వంకనే
లలితంబున్నవముల్ శరాసనముఁగేలంగాదుపోలుంగదా.

ఇదియు దశరథపరాక్రమవర్ణనమే. పూర్వభాగ మనన్వితము.—ఎవఁడు ఇంద్రశత్రువిజయశ్రీతోడనే మౌర్వీలత నీడ్చి చెలఁగంగా—అని యన్వయక్రమము. ద్వితీయపాదమున నన్వయము లేదు. ‘ధనుర్బింబంబును ఈడ్చి చెలఁగంగా’ అని యన్వయమేని భూవలయంబు నీడ్చి యనియు లభించును. **1.** భూవలయము నీడ్చు ననుట యసంబద్ధము. [భూవలయ ధనుర్వలయములను] **2.** బిభ్రతి — ధరింపఁగా నని యున్నది; అత్యంతావశ్యకమైన ధరణమును త్యజించుట వింతగానున్నది. ఉత్తరార్థము మూలవిరుద్ధము.— ఇంద్రుఁడు తన **3.** మదిలో నఖక్షతమును దాల్చునేగాని చేత శరాసనముం దాల్పఁడు, అని యిట నుత్తరార్థము. మూలములో, శచీకుచకుంభములయందుం దాఁ జేసిననఖక్షతముం గాంచినవాఁడై మనస్సులో [సాదృశ్యోపస్థాపితమైన] **4.** ధనుస్సును దాల్చునేగాని కేల [ధనుస్సుం] దాల్పఁడు;—అని భావము.

మూ.— యస్యేన్ద్రారిజయశ్రియా సహ ఝటిత్యాకృష్య మౌర్వీలతాం
సాకం భూవలయేన చాపవలయం దోర్మణ్డలే బిభ్రతి
పౌలోమీకుచకుమ్భసీమని రహః పశ్య న్నఖాఙ్కం నవం
ధత్తే చేతసి కేవలం న తు కరే కోదణ్డ మాఖణ్డలః.

ఎవనిదోర్మండలము ఇంద్రారిజయశ్రీతోఁగూడ అల్లెత్రాటిని లాగి, భూవలయముతోఁగూడ ధనుర్వలయమును ధరించియుండఁగా, ఇంద్రుఁడు ఏకాంతమందు శచీకుచకుంభ సీమయందలి తననూతననఖాంకమును గని మనస్సులో ధనుస్సును దాల్చెనే [నఖాంకసాదృశ్యముచే ధనుస్సును స్మరించెనే]గాని చేత ధనుస్సును దాల్పఁడాయెను; అనియర్థము.— పంతులవారు బిభ్రతియనుటకు **5.** చెలఁగంగా అని, యస్య అనుటకు **6.** ఎవఁడు అని, వ్రాసికొన్నారు. **7.** ఆకర్షణాభరణములకు దోర్మండలము కర్త యని యెఱుంగలేకపోయినారు. వానికి దశరథుని కర్తగా చెప్పుటకన్న **8.** తద్బాహువును కర్తగా చెప్పుటయందుఁ గలస్వారస్యము మహాకవులకే తెలియును.

అనవేమ మహీపాల స్వస్త్యస్తు తవ బాహవే
ఆహవే రిపుదోర్దణ్డచన్ద్రమణ్డలరాహవే. శ్రీనాథుఁడు.

పంతులవారు దోర్మండలేపదమును 9. అధికరణసప్తమిగాఁగొని, తప్పుపై తప్పుగా యస్యషష్ఠిని [యశ్చేద్రాత్రి] ఎవఁడని ప్రథమగా మార్చుకొని 10. బిభ్రతి పదమున కర్థము తెలియక పూర్వార్ధమును తగులఁబెట్టినారు. పంతులవారిపుడు మేలుగాని 'ధనుర్బింబంబుదోర్మండలి' నొకటియే సమాసముగా వాదించి ధనుర్బింబము తోడిదోర్మండలి యని టీకించి మఱియుమఱియు రసాభాసము చేయుదురో చూతము! 11. ఇతని బాహువు ధనుస్సుం దాల్పఁగానే భూవలయము ఆబాహువు నాశ్రయించినది, మౌర్వి నాకర్షింపఁగానే అనురజయశ్రీ వచ్చి సేవింపందొడంగినది, యనుకార్యకారణబోధనాస్వారస్యము పద్యమునం దెందు చూతము!—పద్యమును దిద్ది పెట్టెదను.

చెలఁగన్ వేనిభుజంబు లింద్రవిమతశ్రీతోడనే యీడ్చి మౌ
ర్విలతన్ భూవలయంబుతోడనె ధనుర్బింబంబునుం దాల్చుచున్
నలిఁ దాల్చు న్మది వేల్పుఱేఁ డువిదచంటం గన్నగోర్వంకచే
లలితంబు న్నవమున్ శరాసనముఁ గేలం గాదు పోలుంగదా. *

12. ఝటితి—త్యక్తము. 13. భూవలయ చాపవలయ అని రెంటను వలయశబ్దప్రయోగము చేసినస్వారస్యము నరయుఁడు; అనుప్రాసమాత్రముగాదుసుమా? 14. ఉవిదయే మేలో పొలఁతియే మేలో ఊహింపుఁడు. 15. చంటన్ మేలో కుచకుమ్భసీమని మేలో! 16. పోలుంగదా—ఊకపనము దీనికి కర్త.

* మౌర్విలతన్—ఇట్టిసమాసము తెనుఁగునం గుదురదు. తెనుఁగునం గర్మధారయంబు త్రిక(స్త్రీ)ముముగంత ధాతుజవిశేషణపూర్వపదంబయియుండును. పంతులవారు దీనిని ఆర్షమందురో, పార్వతివామభాగముపలె సాధింతురో! 17. కష్టములలో కష్టముగా వ్యస్తపదములనుగానే కొంపము, సామానాధికరణ్య ముద్భావింతము, దానికి సాంపృశ్యమును టీకింతము. 18. లతన్—పంతులవారు లలిన్ అన్న మేలుగానుండును, నలికి ఉద్ది కుదురును.—19. రహిః—త్యక్తము. 20. నవమున్—దీనిని గోర్వంకకే విశేషణముచేయవలయు, శరాసనమునకుఁజేసి ప్రయోజనము లేదు. ఆయుద్ధకాలములో నిశ్చింతగా క్రీడాపరుఁడై యుండుటను తెలుపును. ప్రాంతనఖాంకము దానిం దెలుపదు. పంతులవారికవనములో అదృష్టవశమున నవము గోడమీఁదిపిల్లిగానేని కుదిరినది. ఆపిల్లిని ఇట్లు గోడమీఁద నుంపఁగూడదు. దానిని పంకపైకి దుమికింపవలయును. గోర్వంకనే అనఁగా గోర్వంకచేతనే అని యర్థమని యిపుడు వాదింపరా? అట్లేని ఆతృతీయార్థము నిట్లు పందిటిపై దాఁపనేల? అదియే యుద్దిష్టమేని గోర్వంకచే అనియే చెప్పుకొనియుందురు. గీర్వాణవాణీపరిచయ కవితాతత్త్వవేదనములు ఏపాటియో బోధపడుచున్నవా?

జనకుఁడు.—పుత్త్రావలోకనశీతలములు రెండు దశరథునికి దృక్కులా? ఈ
953 మాటెంటాటుభాషను తెనిఁగింతము. ఆహా! దశరథుని రెండుకనులును పు
త్త్రావలోకనశీతలములు!

౩౯ - వ పుట.

రెండవదానివలెనుండు ఖండపరశుకోదండముచే—ఇది జనకుఁడు విశ్వామిత్త్రు
954 నితో తదీయ వక్రభాషితమునుగూర్చి చెప్పినమాటలోనిది. మూ. [భగ
వన్ అనేన భవతో వక్రకమనీయేన వాగ్విలాసేన] ద్వితీయేనేవ హరకార్ముకేణ [కిమపి కౌతుకితోఽస్మి.]—రెండవహరకార్ముకమో యన నొప్పుచున్న [మీవక్రభాషితముచే]...అన్నం దెలుఁగగును.

1. దడబిడప్రాసము.

[16] 970 మ॥ ఇదదేయెద్దిసురాద్రిగంబరఁగ విల్లెత్తంగదుస్సాధమెం
దొదవెన్నారిగఁబన్నగేంద్రుఁడిషువై యొప్పెందెగోవిందుఁడున్
మృడుచేవంపుగవంపఁబడ్డదియునై యిష్వాసతత్త్వన్నరిన్
గదిరెం గ్రాలెఁబురాంగనాశ్రువుల వానన్ శాక్రమైశంబునై.

2, 3. కదిరెన్,—గ్రాలెన్—ఈరెండుక్రియలకుం గర్త లేదు, 4. వంపఁబడ్డదికి విశేష్యము లేదు. మధ్యలో ఎందుశబ్దపరామృష్టమగుటచే, దానిని దాఁటి, ఎద్ది శబ్దము దీనికడకు రాఁజాలదు. విభక్తివిపరిణామ మని యొకటి వినియుందురుగాన, ఇట విభక్తివిపరిణామముచేసి ఎందుశబ్దమునే ఎది యని యన్వయించుకొనరాదా యందురు. ఉపాయమే; దానినే యాశ్రయింపక ఎందున్ అంటిరేల? ‹ఎత్తంగదుస్సాధమౌ నెదవెన్› అన్నం జాలునుగదా? ఈయుక్తి వలదు. 5. ‹ఇది ఆదుర్విగాహకార్ముకము ఎద్ది సురాద్రిగంబరఁగ...› అనియిట్లు అన్వయక్రమము వాక్యక్రమమును రావలయును. అదితో చేరవలసినది దుర్విగాహకార్ముక మనుమాట, దానిని ఎద్దితోడివాక్యముకడపులో వేయుట సరిగాదు. ఇదిశబ్దమే దిగివచ్చి కదిరె గ్రాలెలతో నన్వయించునన్న, ఆపక్షమున అది యెద్దులను ఎందును ఎత్తివేయనది. అన్వయసారళ్యముం గోరుదురేని మూలముం గనుఁడు.—

మూ.—ఏతత్తద్దుర్విగాహం తుహినగిరిమయం కార్ముకం యత్ర జజ్ఞే
మౌర్వీ దర్వీకరాణాం పతి రుదధిసుతానాయక స్సాయక శ్చ
దోర్దణ్డై శ్చణ్డిమాశే ర్నత మపి య దభూ దున్నతం కార్ముకాణామ్
బాష్పామ్భఃప్లుష్టయే చ త్రిపురమృగదృశాం మైశ మప్యైన్ద్రిమాసీత్.

6. వంపఁబడ్డది—నతశబ్దమునే ప్రయోగించి యున్నచో నత మత్యున్నత మను విరోధాభాసార్థవిరోధము స్ఫుటముగాఁ దెలియును. ఇప్పుడు స్ఫురించుట సులువుగాదు. 7. శాక్ర మైశంబునై—ఐశత యనూక్తము శాక్రత విహితము. విరోధాభాసమందు తాత్పర్యము. మూఁడును ఇట ప్రమందినవి. పురాంగనాశ్రువులవానచే నైశమయినట్లు ఇటం జెప్పఁబడినది. ఇది యబద్ధము. ముందే అది ఐశము, వానకై శాక్రమైనది. ఐశమయ్యును పురాంగనాశ్రువులవానన్ శాక్రమైనది అని యుండవలయును. ఐశత్వము పురాంగనాశ్రువులవానకొఱకే కలిగినదని వాదమేని మూలమున ఐశం చైన్ద్రం చాసీత్తని జయదేవుని దిద్దఁడు. విరోధాభాసకు సున్న పెట్టఁడు. 8. అపిశబ్దమునకు సున్నచుట్టి పంతులవారు విరోధాభాసమునకు సున్న పెట్టనే పెట్టినారు. ఒకరియుపదేశమునకు వారేల వేతురు? మఱియు వానకై శాక్రమైనదనిమూలము; 9. వానన్ అనుటచే ఆయర్థము ధ్వంసితము. 10. ఇష్వాసతత్యున్నతిన్—మూలోక్తనిర్ధారణార్థ మడుగునంబడుటయు, తతి యొకటి ఎక్కువగా చేరుటయు రెండువిశేషములు. 11. సురాద్రిగం బరఁగె — తుహినగిరిమయ మని మూలము. జయదేవుఁడు ఈనాటకంబున ఈవిల్లు హిమాలయమనియే పల్మాఱు చెప్పినాఁడుగాని మేరువన లేదు. వీరేల మార్చిరి? మార్చినవారు అంతటను మార్చి కారణమేని చెప్పిరా? లేదు. దీనితర్వాతిపద్యములో తుహినాద్రియే యనిరి. “తుహినవ్రాతాప్తి”. 12. మయమనుటచే నిప్పుడును ఈవిల్లు తుహినగిరియే యని దీని దుర్విగాహత సమర్థింపఁబడుచున్నది. 13. పరఁగె—పూర్వము తుహినగిరిగా నుండినది యనుటచే నిప్పుడు నిస్సారమైనదని యర్థము లభించుచున్నది. మొన్న సీమె పతివ్రత యన్నయెడల, నిన్నటివిశేషము వేఱే చెప్పనక్కఱలేదు. కాన పరఁగె ననుభూతము నుచ్చాటనచేయవలసినది. 14. దోర్దండములకు బదులు చే పంపుగ ననుట బాగుగాదు. 15. చంద్రమౌళినిగుఱించి మఱియొకచో వ్రాసెద. 16. బాష్పప్రస్తావమందు మృగదృక్పద నిర్దేశ స్వారస్యమునకు ౧౦౨ - వ పుటం గనుఁడు. పద్యము నిట్లు మార్చిన కొన్నిదోషములు తొలంగును, ప్రాతిస్వికచిహ్నములు మాత్ర మట్లే యుండును.

ఇదె యావిల్లు హిమావనీధరమయం బెత్తంగ శక్యేతరం
బౌదవెన్నారిగ నౌదహీంద్రుఁడిషువై యొప్పెన్ రమానాథుఁడున్
ఎది చాపంబుల నున్నతంబె నతమై యీశానుదోశ్శాఖలం
దెది యైశానమ యైంద్ర మయ్యెఁబురలోలేక్షాశ్రువార్వృష్టికై.

ఇదదేయెద్ది ’ యను బాలబిభీషికయుం దొలంగినది.

971 విశ్వా:—ఎఱుఁగుచున్నానుగదా—ఎఱుఁగుదునుగదా యనిన తెలుఁగగును. సందర్భము నెఱింగి గ్రహింపుఁడు. "భగవానుఁడా యెఱుఁగవేమి?" యని జనకుఁడు పైపద్యము చెప్పఁగా దానికి విశ్వామిత్రుఁడు చెప్పినయుత్తర మిది.

౮౦-వ పుట.

972 "శైలేంద్రసారంబిదా"—పద్యముతుద; ఔ—తలవిసరు.

[8] క॥ మారీచమారిచతురము । క్రూరసుబాహునికిదుష్ట ఘోట్టాణంబుక్
980 ఘోరము తాటకకుంగొ । ట్టౌరావిలులక్ష్మణుకర మందును పుముముక్.

1. ఘోరము—ప్రా. 2. ఏమిసమయజ్ఞానము! ఇట దానిఘోరతం బేర్కొన నేల? రామప్రభావవర్ణనపరమేని జయదేవోక్తవిశేషణములలో నీయభిప్రాయము లేదా? అంతకన్న నిందు స్వారస్యముగలదా? 3. ఔరా—ప్రా. ఈమాట యిట అత్యంతగర్హ్యము. దీనివలన ఈపద్యమెల్ల పాడయినది. ఏమిప్రాసదారిద్ర్యము! 4. ఇది యాశ్చర్యపడు సందర్భముగాదు, ఆవిల్లు ఆశ్మనమనుటకుం బ్రమాణము లేదు. 5. ముక్—పనికిమాలినమాట, అప్రసక్తము.

మారీచమారీ చతురం । సుబాహోరపవాహనమ్
న్యస్యతాం లక్ష్మణకరే । తాటకాతాడనం ధనుః.

మూలపుస్తకములందలి యీపాఠములోనే తప్పున్నది. 6. రామధనుస్సు మారీచుని విశ్వామిత్రాశ్రమములో చంపలేదు. 7. సుబాహువును [అపవాహనమ్] ఆవలికి విసరివేయనులేదు. మారీచుని సముద్రములోనికి విసరివేసినది, సుబాహువును చంపినది. లేఖకులును పాఠకులును మూలము నట్లు మాపినారు. ఇట్లుండనగు.

సుబాహుమారీ చతురం । మారీచస్యాపవాహనమ్
న్యస్యతాం లక్ష్మణకరే । తాటకా తాడనం ధనుః.

సుబాహువును చంపనేర్చినదియు, మారీచుని పాఱవేసినదియు, తాటకంగొట్టినదియునగు ధనువును లక్ష్మణునిచేత నుంపుము. ఈనాటకమందు సుబాహువు మఱల రాలేదు, మారీచుఁడు పంచమాంకమందు వచ్చినాఁడు, కాన సుబాహునికే మారి, మారీచునికే అపవాహనము. 8. అపవాహనమునఁగా పంతులవారు దుష్టఘోట్టాణమని వ్రాసినారు. అట్లే అపహయము, అపమనుష్యుఁడు, అపకన్య, ఇట్టివ్యవహారము దుష్టహయాదికములకుం గలదా? యమసదనమున వైచినదని స్వారస్యము కల్పింతురు గావలయు. అబ్బ! ఏమి సాహిత్యము!

వాయవ్యాస్త్రవ్యతికరనిరాలమ్బన స్తాటకేయః
ప్రాప్తో జీవ న్మరణ మసుభి ర్విప్రయుక్త స్సుబాహుః
కృత్తోన్మత్తా భువి చకరుణా శ్చర్యబీభత్సహాస
త్రాసక్రోధో త్తరళమృషిభి ర్దృశ్యతే తాటకేయమ్. మురారి.

దూరార్ధవీయో ధరణీధరాభం యస్తాటకేయం తృణవద్వ్యధూనోత్
హన్తా సుబాహో రపి తాటకారి స్సరాజపుత్రో హృది బాధతే మామ్.
[భవభూతి.

మారీచనీచమతి రాహవ మారచయ్య
క్షిప్తః క్షణేన రఘునాయక సాయకేన
మధ్యేపయోనిధి భయేన నిమగ్నమూర్తి
ర్వేపంపుపోష జలమానుష నిర్విశేషమ్.
సుబాహు రాహవోన్మత్తః కృత్తః కాకుత్థ్సపత్త్రిణా
మునీనా మనభిప్రేతః ప్రేతనాథాతిథిర్యయా. భోజ.

విశ్వామిత్రుఁడు.— ఎట్లిది మీకవిదితము ? ఎందువలన ననఁగా, సీతనిచేత.

[5] క॥ పొందిధనుర్నిగమములాగి । ద్రుందించినిశాచరులశరంబులచేతన్
985 బొందుగమఖరక్షయెనా । కుందగఁగావింపఁబడియెగురుదక్షిణగాన్.

1. పొందుగన్—ప్రా. 2. తగన్—ప్రా.

మూ.— ప్రాప్య చాపనిగమా నితః క్రమాత్ । సంప్రతాప్య విశిఖై ర్నిశాచరాన్
అస్మదీయమఖరక్షణక్రియా । దక్షిణేన గురుదక్షిణీకృతా.

**3.** ఇతః = నావలన, త్యక్తము. **4.** అస్మదీయ (మఖ) = నాదైన (యజ్ఞము), త్యక్తము **5.** దక్షిణేన = ఉదారునిచేత, త్యక్తము.— ఇది రామునిగూర్చి విశ్వామిత్రులవారు జనకునితో పల్కుట. పొంది, ద్రుందించి, కావింపఁబడియె.— ఈమూఁటిని కర్మార్థకములం జేసికొనినను మూఁటిని కర్త్రర్థకములంగాఁ జేసికొన్నను ఇంతకన్న బాగుగానుండును. కర్మార్థక ప్రయోగ మంత బొల్లమేని,

పొందఁబడె ధనుర్నిగమము । ద్రుందింపంబడి రలుగుల మానిసిదిండుల్
పొందుగ మఖరక్షయెనా । కుందగఁ గావింపఁబడియె గురుదక్షిణగాన్.

అని మార్చుకొనవచ్చును, కర్మార్థక మంత బెల్లముగాదేని పద్యమంతయు నున్నట్లేయుంచి "కావింపఁబడియె" ననుపదమును "కావించినాఁడు" అని మార్చుకోవచ్చును.

జనకుఁడు.—ఎట్లు వీఁడు వీరావతారుండు కుమారుండు ?—రాముని గూర్చి
986 జనకుఁడు విశ్వామిత్రునితోఁ జెప్పుట.—కథయందున్ని విషయము లట్లుండ 'వీఁడు' అన్నందులకు రాముఁడు విశ్వామిత్రులవారు లేకున్న జనకరాజును ఏగతి పొందించి యుండునో ? ఏమి పంతులవారి యౌచిత్యజ్ఞానము ? 'ఇతఁడు' నియేని వ్రాయరాదా ? మఱి యీవాక్యమును ఇట్లు ప్రశ్నగా తగులఁబెట్టుక, ఎట్లు ! వీరావతారుఁ డీకుమారుండు ! అని యాశ్చర్యపడిన నెంతబాగుగా నుండును. శివశివా! సర్వనామములను పృథక్కరించి వీరు ఈగ్రంథమునెల్ల నేమి యసహ్యముచేసినారు !

జనకుఁడు.—ఇది యనువృత్తము. వత్స రామభద్ర గుర్వాజ్ఞ యనుష్ఠింపఁబడుఁ
987 గాత.—ఇది యనువృత్తము.—మూ. ఇద మనువృత్తమ్. 'ఇదె యనువృత్తము' అనిన నేగానిదీనియర్థము తెనుఁగున రాదు. మంచితెనుఁగు గావలయునేని "ఇదెయనువర్తించితిని" అనుఁడు.

౪౧ - వ పుట.

ప్రతీహారి—[ప్రవేశించి] ఒడయఁడిటువిన్నవింపఁబడుచున్నాఁడు, సాజారము
[2] మొగదలఁబబువుఁ జూఁడవేఁడియేఁడో యొక పాఱుఁడున్నాఁడు. అం
989 దువలన రావచ్చునా ?

జనకుఁడు.—ప్రవేశింపవచ్చును.

ప్రతీహారి—[బయలువెడలి బాడబునితోడఁ బ్రవేశించుచున్నాఁడు.]

1. అందువలనరావచ్చునా?—మూ. తత్కిం ప్రవేశ్యతామ్?=అతనిం బ్రవేశపెట్టుమని యాజ్ఞయా? ఇది పంతులవారిభాషలో "అందువలనం బ్రవేశపెట్టఁబడవలసినవాఁడా ?" అగును. ఇవు డున్నదియున్నట్లు ఏమర్థ మనఁగా,— నేను లేనియెడల అతఁడు అచట నేమేనితస్కరించునో, కాన, అతనిని సాజారములోనుంచి నేనిచటివచ్చుట తమకు సమ్మతమా, లేక, అచటనేయుండు మందురా ?— అని. ఇది ముఖ్యముగా అందువలనయొక్క స్వారస్యము. పంతులవారికి అంతట ప్రాణప్రదమైన కర్మార్థకప్రయోగము ఇచట నేలపనికిరాకపోయినది ? ఇట దానిని సరిగా నాశ్రయించియుండిన నీయపార్థము స్ఫురింపదు. 2. ప్రవేశింపవచ్చును—మూ. ప్రవేశ్యతామ్, ప్రవేశపెట్టఁబడుఁగాక. ఇటనుంగూడ కర్మార్థకమును మానుట అపార్థమునకే. కర్మార్థకప్రయోగముచే "నతనిని నీవు తోడితెమ్ము." అని భావమేర్పడుచున్నది. కర్త్రర్థకముగాఁ బ్రవేశింపవచ్చుననుటలో తోడ్కొనిరమ్మనునర్థము లేదు. మూలములో ప్రశ్నోత్తరముల రెంటను తోడ్కొనివచ్చుట యర్థమగుచున్నది. రాచనగరులోఁ బ్రతీహార్యాదులు తోడ్కొనిపోయి దర్శనముచేయింప

నిచో ఆగంతుకుఁడు ఎట్లు సన్నివేశ మెఱిఁగిపోయి రాజు నెఱింగి కాంచును. ప్రతీహారితోపాటు అనావశ్యక మని పంతులవారికి తోఁచినందోఁచెఁగాక జయదేవుఁడు తదావశ్యకతను "బాడబునితోడఁ బ్రవేశించుచున్నాఁడు" అను సీతర్వాతి వాక్యమునం దెలుపుకొన్నాఁడు. రసికు లెఱుంగుఁదురు.

బ్రాహ్మణుఁడు.—ఆసనమేల నేనుసందేశహారుఁడను గదా, దాని వినుము.

[3] 992 1. దాని నన దేనిని? సందేశమునఁజనదు. ఇట్టిసమాసగతమును సర్వనామము పరామర్శించుటసరిగాదు. మూ. అల మాసనేన సందేశహారః ఖల్వహం త దాకర్ణయ. పంతులవారికి 2. 'తత్' అనఁగా అర్థము తెలియలేదు. 'కాన' అని యర్థము; 'దాని' అని గాదు. 3. సందేశము పుంలింగము, తత్తు నపుంసకము; ఆభేదమేనియుం దెలియలేదు. జౌరా సాహిత్యము!

శా॥ క్షత్రస్త్రీకులకజ్జలోరువిషము న్గాలంగముస్గ్రోలితా
[15] 1007 నీత్రైలోక్యముఁ జేసి తెల్లఁగను గీర్తిద్ధాట్టహాసద్యుతిన్
గోత్రేష్వాసునిఁ గొల్చునిష్ఠ నెదినిక్కున్సామ్యధర్మాప్తిసూ
ధాత్రీంద్రాభృగురాముగొడ్డలియదే తాఁదెల్పునీక్రియన్.

మూ.—పీత్వా కజ్జలకాలకూట మఖిలక్ష్మాపాలనారీదృశాం
నీత్వా కిం చ యశోట్టహాసమహసా లోకత్రయం శుభ్రతామ్
చణ్డీశం చరితైకదేశకలనా దద్యాపి య స్సేవతే
హే వైదేహ స జామదగ్న్యపరశు స్త్వా మేవ మాభాషతే.

కొల్చున్, నిక్కున్, అనుసమాపకక్రియాద్వయముచేత వాక్యద్వయమైనది. సామ్యధర్మాప్తినను విశేషణము నిక్కుటకుమాత్రమే చెల్లుచున్నది. 1. దేనితో సామ్యమో 2. ఏధర్మములో సామ్యమో తెలియరాదు. కాన పద్య మసంగతార్థమైనది. విషపానాట్టహాసములు సామ్యధర్మ మని టీకనేయుదురేని, అందులకు గమకమేది? శివసామ్యధర్మాప్తి ననియేని చెప్పినచో అధర్మములు స్ఫురించును, అట్లు చెప్పమిచే ధర్మోపమానములు లేవు. కేవల వాచకోపమేయములు కలవు. వాక్యార్థమగునా? "రాముఁడుపోలె" అనుమాత్రాన నుపమ యేర్పడునా? నిక్కుట సామాన్యధర్మము గాదు, పాదపూరణపిశాచము. "నిక్కుందత్సదృశాప్తి" నన్నఁగొంత బాగుపడును. ఇట దీనికొలుపన నేమి? సామ్యధర్మమును బొందుటయే, అనఁగా శివకృత్యము తాను జేయుటయే, అనఁగా శివునికిం దాను పనిచేసిపెట్టుటయే. 3. కావున నిట కొలుపువేఱుగాను సామ్యధర్మాప్తి వేఱుగాను చెప్పుట సరిగాదు.

ఇటు నిట్లు సమాధానము చెప్పుదురుగాఁబోలును :—‘ క్షత్ర...కొల్చెన్’ అనువాక్యములో శివకృత్యకరణము చెప్పఁబడినది, దాన నాసామ్యమే కొలువని తెలియుచున్నది, ‘ నిక్క...ర్మాప్తి’ ననువాక్యముచేత నది యనూక్తమైనది యని. ఈసమాధానమునందు పరశువునకు తాను శివునికి సాటి యనునహంకారము ప్రాప్తించును. ఆయహంకారము సేవ్యసేవకభావమునకు కేవలవిరుద్ధముగా నున్నది. కాన రెండు వాక్యములు చేయుట సరిగాదు. 4. మఱియు మూలములో చరిత్రైకదేశకలనాత్తని ఏకదేశమాత్రసామ్యము చెప్పఁబడియున్నది. మఱియు కలనాత్తనుట తత్కృత్యకరణరూపసేవాకథనపరముగాని సామ్యోక్తిపరము గాదు. ఆయేకదేశతను చెప్పమియు 5. అవివక్షితమయినసామ్యమును చెప్పుటయు పాడుచేయుటగాదా? “కవి గాననిచో రవిగాననేర్చునే” అని పెద్ద లందురు. కన్నులయెదుట నున్నయేకదేశముం గానమి కవితయగునా? “గోత్రేష్వాసుఁ జరిత్రలేశసమత గ్గెల్చు న్నదా యేదో”–అని మార్చిన మఱికొంత సరిపడును.— 6. క్షత్రస్త్రీ)—మూ. క్ష్మాపాలనారీ, తారతమ్య మరయుఁడు— 7. కుల—మూ. అఖిల. 8 మూలములో దృశామని యున్నది. అదియిందు త్యక్తము. “ప్రత్యర్థిసీమన్తినీ చక్షుఃకజ్జల,” “నయనాఞ్జన మూర్తిశాయాః” ఇత్యాదిరీతిగా చక్షుర్వాచకపద సమేతముగా జయదేవకవిప్రయోగించిన యభిప్రాయ మెఱుంగుఁడు. 9. మున్—పా. వివక్షితాననుకూలము. 10. మూలములో జనకుఁడు స్వల్పదేశాధిపతి యని సామంతమాత్రుఁ డని తిరస్కారమును దెల్పువైదేహశబ్ద ముండఁగా దానికి బదు లిందు ఉత్కర్షవ్యంజకమైన ధాత్రీంద్రశబ్దముం బెట్టుట మతిగాదు. 11. నీకిక్రియన్—ఈ క్రియ ననఁగా ఉక్తకజ్జలపాన త్రైలోక్యధవళీకరణములచేఁ గొలుచుటను, సామ్యధర్మాప్తిచేనిక్కుటను, అనియర్థము లభించుచున్నది. అది వివక్షణీయముగాదు. ఈ వక్ష్యమాణమును చెప్పుచున్నది, అని వివక్షితార్థము. “ తాఁ బల్కునీ కిట్లుగాన్ ” అని మార్చిన నయ్యర్థము వచ్చును. 12. అదే అనుచో ఏకారమువధారణార్థక ము ప్రసక్తము. దానిరూపుమాపుటకిట్లు మార్పవచ్చును, “గోత్రేంద్రా భృగురాట్కుఠార మది నీకుం బల్కుఁ దా నిట్లుగాన్.” 13. కాలకూట మనుటకు ఉరువిషమనుట చక్కఁగ లేదు. 14. ఇద్ధ—యి. 15. తా, తా,—రెండేల? తడగిడలో మనియు చెప్పకోలేదేమి?

[4] 1011 జనకుఁడు—[జనాంతికముగ] అంతవఱకు జామదగ్న్యునిచేత నిజకోపాగ్నియొక్క విస్ఫులింగముతొలంగెను.

శతానందుఁడు.—ఇంతవఱ కేమి? గంభీరభుజసారక్షైరవారాముఁడుగదా, రాముఁడు.

[తెలుఁగుముద్రణములో మూలము.]

జనక.—[జనాన్తికమ్] అఙ్గిరస ఉపక్షిప్తప్రస్తావమయం జామదగ్న్యేన నిజకోపానలస్య విస్ఫులిఙ్గః.

శతానన్దః. — కిమేతావతా, గమ్భీర భుజసారక్షైరవారామః ఖలురామః.

1. జనకవాక్యములో జామదగ్న్యేన అనునది కర్తృతృతీయ, పంతులవారు హేతుతృతీయం జేసినారు. 2. ఉపక్షిప్తః అనునది కర్మార్థక క్తప్రత్యయాంతము, దానిని తొలంగెనని కర్త్రర్థకముగా తెనిఁగించినారు. 3. దానికి తొలఁగించుట యర్థముగాదు, వేయుట యర్థము. "వపుషివధాయ తత్రతవశస్త్రముపక్షిపతః" మాలతి. 'జామదగ్న్యుఁడు ఇప్పటికి మనమీఁద తనకోపాగ్నినెరసును వేసినాఁడు' అని యర్థము. జామదగ్న్యునికోపాగ్ని జామదగ్న్యునిచేతనే తొలంగుట యెట్లు? క్షమించితి నని తెల్పినాఁడా? 4. కిమేతావతా అనఁగా ఇంతవఱకేమి యని యర్థముగాదు. ఇంతమాత్రాన నేమిభయము? అని తాత్పర్యము.

౭౨ - వ పుట.

జనకుఁడు.—ఆంగిరసా! నీచేతనైతము పరిశీలింపఁబడని సన్నివేశముఁగల
[5] 1016 రామునికిఁ గర్తవ్యము గలుగుఁగాత. తమ్మివృందంతోఁగూడిన కేలుదామరగల సీతయొక్క స్వయంవరాంగణావతరణమునకుఁ గంచుకి పంపఁబడుఁగాత.

1. ఇట 'నీచేతనైతము — గలుగుఁగాత' అనువాక్యమునకు శతానందుఁడు కూడ రామునిసన్నివేశమును బరిశీలింపలేదని యర్థమగుచున్నది. గోకంబర్లు తెనుఁగనిట్టిదే. ఏతన్మూలము,—"అఙ్గిరస భవతాప్యపరిశీలిత సన్నివేశస్య రామస్య ప్రత్యనన్తరీ భూయతామ్" దీనికర్థము,—ఆంగిరసుఁడా రాముఁ డిచటిసన్నివేశము నెఱుఁగఁడుగావున, నీవును అతనితోఁగూడ పొమ్ము, అని. 2. సన్నివేశ మిట రామునితలదెటునున్నదో కాలెటునున్నదో, అదిగాదు. ఆయుధాగారమెటునున్నదో, శివధను స్సెటునున్నదో అది. 3. "కౌశికస్య ప్రత్యనన్తరీభవావః —" మూరారి. "ప్రత్యనన్తరః సన్నిహితః" అని రుచిపతి. పంతులవారు ప్రత్యనంతరశబ్దమున కర్థము తెలియక, కర్తవ్యము గలుగుఁగాక అని యేదో ఒకటి వ్రాసి, 4. పరిశీలనకు ఆంగిరసుని యుష్మచ్ఛబ్దము ద్వారముగా కర్తను జేసినారు. 5. ప్రత్యన్తరీ భూయ

తాత్—ఇది యగంతము గాదా? దీనికి కర్తృర్థకత గలుగునా? అది యేని యాలో-
చింపవలదా?

రసాభాస మాలిని.

కరకిసలయలీలంగాంచుముక్కంటివిల్లుం
[26] శరథియుఅకయాకర్షంబుఁగావింపవంపన్
1042 సరభసరసయుక్తింజాలఁగాఁగ్రాలుసీతా
తరుణికువలయాంచద్దామదృష్టుల్నిగిడ్చెన్

మూ.— కరకిసలయలీలాచారు చణ్డీశచాపే
దశరథతనయేన స్వైరమాకృష్యమాణే
రభసరసవికాసీ సీతయా పుఞ్జితోఽసౌ
కువలయదళదామశ్యామకాన్తిః కటాక్షః.

రాముఁడు శివచాపమును ఆకర్షించుచుండఁగా (అనఁగా అల్లె త్రాటిని లాగుచుండఁగా), సీత [ఆ చాపమున] కలువదండవంటి శ్యామకాంతియైన తనకటాక్షమును దొడిగినది, అని సారాంశము. 1. ధనుస్సు వంచినవాఁడు రాముఁడు, అమ్ము గూర్చినది సీతయు, నని చమత్కారము. రాముని ధనురాకర్షణమును సీత సాభిలాషముగాఁ జూచుచుండె నని తాత్పర్యము. కువలయదళదామ 2. శ్యామకాన్తిః 3 పుఞ్జితః అనువిశేషణములు బాణత్వస్ఫూర్తి కొఱకు. 4. ఆమెచూడ్కి ఆధనుస్సుమీఁదప్రసరించి అందు బాణమువలె నొప్పుచుండె నని భావము. 5. నీలోత్పల శరమును సూచించుటచే రాముఁడు ఆకృష్టచాపుఁడు మదనుఁడుగాను, 6. సీత అతనికి ధనువున నీలోత్పలబాణముఁ గూర్చుచున్న రతీదేవిగాను, అగపడి రని భావము. 7. రాముఁడు ఒకచే విల్లెత్తి రెండవచేత నాకర్షించుచుండఁగా సీత, 'ఎంతటి బాహుశాలులును కదల్పలేని యీధనువును ఈ ముద్దుచేతు లెత్తి యాకర్షించుచున్నవిగదా,' యని హర్షోత్ఫుల్లలోచనయై యాచేతులం జూచుచూడ్కి ఆచేతులలో అరినుండి లస్తకముబడి ఇందీవరబాణము వోలె నిగిడియుండె నని హృదయ మెఱుంగవలయును. "చూడు వేడుక, సీతారాములచే ముక్కంటి విల్లెక్కువెట్టుట తుద ముట్టింపఁబడుచున్నది." అని ప్రతీహారి పలుకుటయు, కంచుకి విమర్శించి విహసించి "ఓరి! తెలిసెను. ఇం దిదిగదా!" అనుటయు [ఈ పద్యమునకు అవ్యవహితపూర్వభాషితములు] ఇందు అనుసంధానము చేసికొన్నయెడల, రాముఁడు విల్లు చేఁదినవాఁడును సీత కోలం దొడిగినదియు నని, ఆ యిరువురిచే ధనుస్సంధానకృత్యము పూర్తి యాయెననియు ఈ పద్యముభావముగా తేటపడును. ఈ యభిప్రాయ మెల్ల

దృష్టు లనుపదముయొక్క- 8. లింగ 9. వచనములచేతను 10. పుంఖితశబ్దమునకు తో డిగె ననక నిగిడ్చె ననుటచేతను ధ్వంసితమైనది. నిగుడ్చుట పుంఖితశబ్దమువలె బాణతాస్ఫోరకము గాదు. 11. కువలయాంచద్దామ దృష్టుల్—దృష్టులు వ్యస్తమూ, అంతయు నొకటియే సమాసమూ. మూలములో శ్యామవిశేషణము కటాక్షమునకు బాణసామ్యమును సమర్థించుటకు. 12. కటాక్షశబ్ద పుల్లింగము శరసామ్య పరిస్ఫురణమునకు అత్యంతోపకారకము. దృష్టిః అను స్త్రీలింగము తదీయస్ఫూర్తి ప్రతిబంధక మైనదని చెప్పినాఁడఁగదా. 13. కువలయాం చద్దామ దృష్టుల్—ఈ సమాసము తప్పు. దామవంటి దృష్టు లనియుపమానపూర్వ పదోపమేయోత్తర పదసమాసము శాస్త్రీయము గాదు. "కమలాంఘ్రుల" వంటిది. 14. పాదపూరణార్థమై అంచచ్ఛబ్దమును వేసికొనుటకన్న సమాససౌష్ఠవమునకై కువలయదామాంచద్దృష్టులు అని వ్రాసికొనుట మేలు. 15. గాంచు—గ్రాల అనవలయును. లీలాచారు అని మూ. లీలచేమనోహర మగునట్లుగా అని ఆకృష్యమాణే పదమునకు విశేషణము. 16. దానిని వీరు చండీశచాపమునకు విశేషణముచేసి చెఱిచినారు. ఇందులఫల మేమనఁగా ఆవిశేషణము నిష్ప్రయోజన మగుటయే గాక కరకిసలయ మెవరిదో 17. సందేహముకూడఁ గలిగినది. బహుశః ముక్కంటి దని స్ఫురించును. మూలముబడి ఆకర్షణక్రియకు విశేషణముగా నిబంధించుకొన్నచో తత్క్రియాకర్త యగురామునిదే యని స్పష్టపడును. 18. వింపవంపక—వించుచుండఁగ—ఆకృష్యమాణే అని మూ. రాముఁడు వింటిని లాగుచుండఁగా సీతబాణము గూర్చెననిగదా హృదయము. వంచునప్పుడు కూర్చుట సరిపడదు, లాగుచున్నప్పుడైననూ రామునియొక్కయేచేత అల్లెత్రాడున్నదో ఆచేత సంధానార్థము బాణ ముంపవచ్చును. 19. ఆకర్షంబు గావింపవంపక—ఆకర్షించుటకై వంచుటయూ, వంచుటకై యాకర్షించుటయూ? ఈ తగవు తీరుట యెట్లు? 20. మూలములో వంచుట లేదు. అహో పాదపూరణవంపకొంపచెఱుచుచున్నది! 21. సరభసరసయుక్తిం జాలఁగాఁగ్రాలు—ఈరవంతవృత్తములో ఇంత యింకొండపీటినీమ చేఁత్రాటిచుట్టు రభసరసవికాసీ యనుటకుం దెలుఁగు. 22. మూలములో ఇది కటాక్షమునకు విశేషణము. తదనుగుణముగా నిట ఈత్రాడు దృష్టులకువిశేషమేని "సీతాతరుణి కువలయాంచద్దామదృష్టుల్" అను మొత్తమెల్ల నేకసమాసము గావలయును. 23. అపక్షమున నిగిడ్చెక అను సకర్మకక్రియకు అకర్మకతాప్రయోగప్రాప్తి యగును. వ్యాకరణము చెఱుచుటగాని భాషాసంజీవనమా యిది? దృష్టులకు విశేషణముగా నిందు ప్రయుక్తము గాఁజేని మూలానుగుణము గాదు. రభసరసవికాసీ—హర్షరసముచే [వేగముచే] వికసిల్లుచున్న

కడమతావుల నన్వయించి సంభరితంబయ్యెతో మాత్రము ధ్వానమే యన్వయించు ననుకొన్నారా?

మూ.—భిన్ద న్నిద్రా మ్మురారేః సకలభుజభృతాం చాలయ చ్ఛౌర్యదర్పం
భిన్దన్ దిక్కుమ్భికర్ణాఞ్చలచలనకళాం కమ్పయ న్కూర్మరాజమ్
ఆర్యశ్లాఘాగభీరః ప్రళయజలధరధ్వానధిక్కారధీర
ష్టంకారః కృష్యమాణ త్రిపురహరధను ర్భఙ్గభూ రావిరస్తి.

మురారియొక్క నిద్రను భంగపఱుచుచు అన్న స్తుతిచే లోఁతై [అన్న పరాక్రమమును మిగులఁ బొగడుచున్నదై], ప్రళయకాలమేఘముల గర్జితమును ధిక్కరించుట చేత ప్రచండమై, కృష్యమాణ శివ ధనుర్భంగమువలనఁబుట్టిన ధ్వని ఆవిర్భవించుచున్నది.—అని యర్థము.

పద్యము—బాహుశాలు లనుటకు నృప యని, (కర్ణాంచల) చలనకళయనుటకు పొత్తని, కూర్మరాజును గంపిల్లఁజేసి యనుటకు రహిన్నొంచి యని, కృష్యమాణ [లాగఁబడుచున్న] యనుటకు వికర్షిత [లాగఁబడిన, లేక, లాగింపఁబడిన] యని, త్రిపురహార అనుటకు ఈశ్వర యనియు—ధ్వంసితము.

5. బాహుశాలుల శౌర్యగర్వమని మూలములో బాహుబలము చెప్పఁబడినది. ధనుస్సును వంచు నీప్రసంగమున బాహుబలకథనస్వారస్యమును గ్రహింపలేక వీరు బాహుబల మర్థముగానీయకుండ నృపశౌర్యగర్వంబని యల్లినారు. జనకుఁడు అసురసుర నిశాచరోరగ నరకిన్నరసిద్ధచారణులలో నెవఁడు శివధనుస్సును వంచినను సీతను వాని కిచ్చెదనని ప్రతిజ్ఞ చేసెను గావునను, బాణరావణాదులుగూడ వంపలేక యోడిరి గావునను, వారికన్నను రాముఁడు బాహుబలాఢ్యుఁడని యర్థముగావలయునని జయదేవుఁడు భుజభృతా మని ప్రయోగించినాఁడు. దానిని వారిలో నేకదేశమునకు నరపాలకమాత్రులకు నియమించుట రసముచెఱుచుటగాదా? బాణరావణులకన్న బాహుబలాఢ్యులా నరపాలకమాత్రులు? ఈప్రకరణములో ఈ తెలుఁగుకవివలె ఉత్తశౌర్యగర్వమనక భోజరాజు బాహుశౌర్యమే చెప్పిన స్వారస్యముం గనుండు.

రామే బాహుబలం వివృణ్వతి ధనుర్వంశే గుణారోపణం
మా భూత్కేవల మాత్మనా తిలకితే వంశేపి వైకర్తనే
ఆకృష్టం నితరాం తదేవ న పరం సీతామనోపి ద్రుతం
భఙ్గ స్తస్య న కేవలం క్షితిభుజాం దోస్తమ్భదమ్భస్యచ.

బాహుబలం వివృణ్వతి—ఈమాటంగనుఁడు. దోస్తమ్భదమ్భస్య చ—ఈమాటం గనుఁడు. “భగ్నం ధను ర్దృష్ట్వా రాజానో నిర్వాపితనిజభుజగర్వాబభూవు రిత్యర్థః”

[ధనుర్భంగము గని రాజులు తమ బాహుబలము అఱిపోయిన వారైరి]. భోజరామాయణమందు క్షత్త్రియులే నరపాలురై వచ్చినారు గాన క్షితిభుజామనుట విరుద్ధము గాదు. మహాకవివాక్కుల భావము నెఱుంగ జన్మాంతరపుణ్యము వలయును.

6. ఈకవి యేమో పొత్తుచెఱిపెనుగదా—మూలములో దిగ్గజములు తమ చెవుల యంచులను కదలింపక నిలిచినవని యున్నదిగదా? అనఁగా నిర్ఘాతపోయిన యని యర్థమగుచున్నది. పొత్తుచెడుట యెట్లు? ఈ చెవి కదలక నిలువఁగానే ఆ చెవియు కదలక నిలిచిపోయెనుగదా? ఇది పొత్తేగాని పొత్తుచెడుట గాదు. పొత్తు చెడెననుటచే నిర్ఘాతపోయి జడత్వము దాల్చెననునర్థము రాలేదు. భోజరాజు ఈజడత్వమునే ఇంకొకప్రకారముగాఁ జెప్పినాఁడు. దిగ్గజములు (ఒడలెఱుఁగక) వెఱ్ఱిఘీంకారము చేసినవని చెప్పినాఁడు. అందును ఈస్వారస్యము వచ్చియున్నది; కనుఁడు.

నవః కఠినకర్షణ త్రుటిత చాపజన్మా క్షణా
ద్దిశాం ద్విరద ఘీంకృతైః కృతహరిత్పతి స్వాగతః
జగద్భ్రమణ కౌతుకోచ్చలిత రామ కీర్త్యఙ్గనా
ప్రయాణ పటహధ్వనిం ప్రథయతి స్మ తారధ్వనిః.

ఇంత స్వారస్యముగా మహాకవు లెంచినవర్ణను వీరెంత నీరసముగా గ్రహించిరో!

7. కూర్మజాతి స్థైర్యమునకు ప్రసిద్ధికెక్కినది. అట్లుండ మందరమును మోచినది భూమిని మోచుచున్నదియు నగు నాదికూర్మముమాట చెప్పవలయునా? దానిని మూలమందుంబోలె [కమ్పయన్] కంపిల్లఁజేసి యనుటలోనే స్వారస్యమో, దానిని రహిస్నొంచి యనిగాని, దానిరహిని నొంచి యనిగాని చెప్పుటలోనే స్వారస్యమో, సహృదయు లరయుఁడు.

8. మూలములో త్రిపురహరధను వని యుండఁగా నిట నీశ్వరధను వనుటలో భేదము లేదా? త్రిపురహరశబ్దముచేత సూచితమైన యీచాపప్రభావము, త్రిపురదాహరూపము, ఐశ్వర్యప్రస్తావముచే లభించునా? ఈశ్వరశబ్దముచే దీనిప్రభావము మీలితమైపోయినది. మహానుభావుని వెంట్రుక యన్నట్లయినది. మఱియు నిట త్రిపురహరుని ధనువనుటకంటె త్రిపురహరమైన ధనువనియే జయదేవునిచే వివక్షితమనియుఁ జెప్పందగు. ఇట ధనుఃప్రభావము కథనీయముగాని ధనుర్ధరప్రభావముగాదు. అట్టి మహానుభావునికి దుర్బలసాధనముచేతనుంగూడ జయముకలుగును. రామక్షిప్తమైన యిషీకమాత్రము కాకాసురుని మూఁడులోకములుం ద్రిప్పలేదా? మూర్ఖుఁడు కొండయెక్కి కొలిచికొలిచి యెఱుంగుదూరములను గణకుఁడు పిడికెడు యష్టియంత్రముచేత కనిపట్టఁడా?

9. పంతులవారు ప్రకారాంతరముగా నేనియు చెప్పక కేవలనీరస మని త్యజించినది, ఆర్యాశ్లాఘాగభీరః అనువిశేషణము ఎండుకట్టియలు గానియట్టి భోజభవభూతులకు ఎంతసరసముగాఁ దోఁచినదో కనుండు:—

"ఆర్యశ్లాఘాగభీరః".—జయదేవుఁడు.

"టంకారధ్వని రార్యబాలచరిత ప్రస్తావనాడిణ్డిమః".—భవభూతి.

"నవః కఠినకైరవః... ప్రథయతిస్మ తారధ్వనిః".—భోజరాజు.

ఈవిషయమున భవభూతి భోజరాజుల హృదయంగమవర్ణన మెల్ల జయదేవకవి సంగ్రహముగా "అర్యశ్లాఘాగభీరః" అని సూచించినాఁడు. లక్ష్మణుఁడు వక్త గదా? అన్నప్రభావమును చెప్పకొనఁడా? ఈపద్యమునవతారిక 10. "అత్యాహితమత్యాహిత" మనునది యొకయసంగత పాఠమునకు తెలుఁగని "ఆర్యశ్లాఘాగభీరః" అను నుత్సాహసూచక పదముచేతనే తెలియుచున్నది. "అత్యద్భుతమత్యద్భుతమ్" నుపాఠమును తెనిఁగించి యుండవలసినది. లక్ష్మణునికి భయమేమి? ఆఁడుపిల్లయా? ధనుర్భంగధ్వనివర్ణన కిదే యారంభముగదా. ఇందు రామప్రస్తావము లేనిచో ఈభంజనకృత్యమహిమ యాతనిదిగా వివక్షోస్ఫూర్తి యగునా? మఱి యిందలివికర్షితశబ్దము అపశబ్దముగాక ప్రేరణార్థకమా? ఈప్రభావమెల్ల ఈధనుస్సును "పీడించిన" విశ్వామిత్ర జనక శతానంద కంచుకి ప్రతీహారుల దని ఈతెనుఁగుకవి హృదయమా? ఇందు కార్యమయిన భంగధ్వానముయొక్క వర్ణనచే కారణమైన రామమహిమను వర్ణించుటయందు తాత్పర్యము. ఆధ్వనియే రామశ్లాఘాధ్వనిగా నున్నదని లక్ష్మణుని యభిప్రాయము. "ఇది ధనుర్భంగధ్వని గాదు, ఒక్కమడి నెల్లెడల నుప్పతిల్లినయార్యభుజస్తుతిధ్వని, ఆధ్వని హరినిద్రాభంగాదికమునకుఁ గారణమైనది. దాన నాలోచించుకొనుఁడు, ఎంతధ్వనియో? అంతధ్వని యెంతస్తుతియో? అంతస్తుతికి కర్మమైన యన్నభుజబల మెంతయో యూహించుకొనుఁడు, అది లోకాతీతము సుమా." అని లక్ష్మణభావము; గాని, ధనుస్సు విఱిచినందులకు అన్నను అతనితమ్ముఁడైనందులకు తన్నును, కంచుకి కఱ్ఱతోఁ గొట్టునేమో యనియు ప్రతీహారి తిట్టునేమో యనియు భయపడి దాఁగుటకు విశ్వామిత్రులవారిని గడ్డములో చోటడుగుట గాదు. మఱియు లక్ష్మణుఁడు పోయి చూచి వచ్చినాఁడా హరి మేల్కొన్నాఁడో లేదో? ఈవర్ణన యలంకారమాత్రమేగదా? అలంకారము ధ్వన్యతిశయపరమై, తదతిశయము రామమహిమాతిశయ ధ్వననపర్యవసితము గాదేని, రచ్చసోమరిభాషితమా? జానసుచో దీనికి కథానుప్రవేశప్రసక్తి యెట్లు? ఆదినము జనకులవారిచాకలి కడుముందెల్లగా వస్త్రము లుదికినాఁడనికూడ నేల యిట వర్ణింపరాదు? బోనీసూటి

జనక మహారాజు ఆదినము గంటకు అరవడి పొగాకుపొడుము ముక్కున బొక్కినాఁడనియు నేల యిటు వర్ణింపరాదు? “ఆర్యశ్లాఘాగభీరః” అనునదియె ఈశ్లోకమునకెల్లకిరీటభూతమైన విశేషణము, శ్లోకమునకెల్ల దీనియందె తాత్పర్యము. కావున, ఈమహిమానువర్ణనమెల్ల రామార్పణ మగునట్లు తాత్పర్యస్ఫోరకముగా వక్తృత్వాపాగమకముగా మహాకవి ప్రయోగించిన యార్యశ్లాఘను త్యజించుట రసైకవిద్వేషముగానున్నది.

11. మఱియు నిందు భంగధ్వని పుట్టియుంబుట్టకముందే యీవర్ణన చేయఁబడినదిగదా [కథాసందర్భమును గ్రహింపఁగలవారి కిందు సందేహ ముండదు]. ఇటు తొలఁగించి, పొందించి, త్రుంచి, నొంచి యిత్యాది భూతవాచకములను క్త్వార్థకములం బెట్టి [సంభరితంబయ్యె] నిండెను అని భూతముగా వర్ణించుటయే సొంపో, మూలమునందుంబోలె, భిన్దన్, చాలయన్, భిన్దన్, కమ్పయన్ [తొలఁగించుచు, పొందించుచు, త్రుంచుచు, నొంచుచు,] ఏవంప్రకారముగా వర్తమానవాచకములను శతృంతములను ప్రయోగించి ఆవిరస్తి [ఉప్పతిల్లుచున్నది] అని వర్తమానముగా వర్ణించుటవే సొంపో, రసజ్ఞులకు నేనుజెప్పవలయునా? 12. అష్లేకర్షిత (లాగింపఁబడిన) యని క్రియాసమాప్తిద్యోతకమయిన పంతులవారి క్తాంతమునకును తదపరిసమాప్తిద్యోతకమయిన కృష్యమాణ [లాగఁబడుచున్న] అనుజయదేవుని మానప్రత్యయాంతమునకును గల జంబుకదేవలోకముల యంతరము నరయుఁడు.

13. కవి యిటు మూలములో ప్రసిద్ధావస్థలను స్వభావోక్త్యలంకారముగా వర్ణింపఁదగినవానిని ఉద్దేశించినాఁడు. ఎట్లన, హరికి నిద్ర, భుజబలదర్పితునికి బట్టబిగిసి కొనియుని కి [అవష్టంభము], దిగ్గజములకు గజస్వభావసులభమైన చెవితుదలకదలిక, కూర్మమునకు స్వభావసిద్ధమయిన స్థైర్యము. స్వభావము దురతిక్రమముగదా? అట్టియీస్వాభావికావస్థలను రామభగ్నధనుష్టంకారము హరిభుజబలదర్పిత దిగ్గజకూర్మరాజులకు తొలంగించి తద్విరుద్ధావస్థల నాపాదించిన దని కవి,—నిద్రాం భిన్దన్, దర్పం చాలయన్, చలనకళాం భిన్దన్, కూర్మరాజం కమ్పయన్, అని, వర్ణించినాఁడు. ప్రకృతిసిద్ధావస్థనే విపర్యాసించిన దనుటచే ధ్వని కృత్యాంతాతిశయము స్ఫురించుచున్నది. తెలుఁగుకవి యీస్వారస్యము గ్రహింపమి తదస్ఫోరకముగా, ‘పొత్తుఁ ద్రుంచి’ ‘రహిన్నొంచి’ యనుటచే తెలియుచున్నది.

14. జయదేవమహాకవి మూలములో లక్ష్మణభాషణ కాలమందు వర్తమానములయిన హరినిద్రా, బాహుశాలిగర్వ, దిగ్గజకర్ణచలన, కూర్మరాజస్థైర్యములను, నా

లిగింటిని, ఛిన్దన్, చాలయన్, భిన్దన్, కమ్పయన్, అని శత్రంతధాతుకర్మలనుగాఁ జెప్పి, అప్పుడు అవర్తమాన మయిన ప్రళయజలధరధ్వానమును ఆరీతిగా అనఁగా శత్రంతధాతు కర్మనుగాఁ జెప్పక యొక విచ్ఛిత్తి విశేషమును చూపినాఁడు. ప్రకారాంతరముచేతనుంగూడ నీభేదము రూఢికెక్కుచున్నది. 15. ఎట్లన ఈనాలిగింటిలో నిద్రాగర్వ చలనస్థైర్యములు నాలుగు పూర్వావస్థలు, మేల్కనుట, ఊఁగుట, నిశ్చలత, కంపము, ఈనాలుగు ధనుర్భంగధ్వనివలన వచ్చిన యిప్పటియవస్థలు. ఈపూర్వావస్థలుగాని ఈయిదానీంతనావస్థలుగాని భంగధ్వని కుపమానములు గావు. కనుక కవి వీనిని నాలిగింటిని ఒకవిధముగా అనఁగా శత్రంతధాతుకర్మలనుగాఁ జెప్పి, ఇట్టిదిగాక యుపమానతం బొరసినదైన ప్రళయజలధరధ్వానమును ఆభేదము తెలియునట్లుగా సమాసఘటితముగా వేఱువిధముగాఁ జెప్పినాఁడు. తెనుఁగుకవి యీస్వారస్యము నెఱుంగక ఈభేదమును స్ఫురింపనీక [అయిదవది అవర్తమానమనియు, ఉపమానమనియు తెలియనీక] కడమనాలిగింటివలెనే ఏనవదానింగూడ [తొలఁగించి, పొందించి, త్రుంచి, నిర్జించి] భంగధ్వనికర్తృకక్త్వార్థకసకర్మకధాతుకర్మగా రచియించెను గదా. ఇది సర్వము ప్రసన్నరాఘవాంధ్రీకరణానధికారితావధారకము గాదా.

నణప్రాసభాగ్యము.

మ॥ కను మాకర్ణముగాఁగజ్యాలతనులాగన్ వ్రేల్చిగుళ్లారయం
[14] 1071 గనుభ్రూభంగము లేదు రామునికిభగ్నంబయ్యెనీశానువిల్
ఘనకంఠధ్వని లేదహంకృతిజహుంకారంబుదీర్యద్ధను
ర్గుణటంకారముతద్విభంగరవమొక్కండెల్లెడన్నిండెడున్.

మూ.—జ్యావల్లీం లలితాఙ్గుళీ కిసలయై రాకర్ణ మాకర్షతో
న భ్రూ ర్భఙ్గురతాం గతా రఘుశిశో ర్భగ్నం ధను ర్ధూర్జటేః
నాహంకార తరఙ్గితో ధ్వని రభూ త్కణ్ఠేఽస్య దీర్య ద్ధను
ష్టఙ్కార స్తు చకార తారతరళ శ్శబ్దాద్వితీయం జగత్.

ముద్దువచ్చుచున్న వ్రేలుచిగుళ్లతో అల్లెతీవియను లాగుచున్న రఘుశిశువుయొక్క బొమలు భంగురములు గాలేదుగాని ధూర్జటిధనుస్సు భగ్నమైనది. అతని కంఠమున అహంకార హుంకారము కలుగలేదు గాని విఱుగుచున్న ధనుస్సుయొక్క టంకారముమాత్రము తారతరళము లోకమును శబ్దమాత్రమయముగాఁ జేసినది.—

1. ఆకర్షతః [లాగుచున్న, ఇంకను పూర్తిగా లాగలేదు]—ఈమాటకు లాగన్ [లాగియామెను] అనియు, 2. రఘుశిశోః—[రఘుశిశువునకు] అనుటకు మాఱుగా రా

మునకు అనియు [ఇట శిశుతం జెప్పుట శిశుతలోనే ఇంత వీర్యవంతుఁడే యితఁడు, ఇఁక యువయైన నెంతటివాఁడగునో యని బాహుబలోత్కర్షను ధ్వనించుటకొఱకు], 3. తారతరళః అనుటకు తెనుఁగు మానివేసియు, నీరసీకరించినారు. రసము తగ్గించి నందులకు పూర్తికై పునరుక్తులను మిక్కుటముగా పెట్టినారు. 4. ధ్వని=హుంకారంబు, 'ఘనకంఠధ్వని లేవహుంకృతిజ హుంకారంబు'. 5. దీర్యత్=భంగ [మొందుచున్న] 'దీర్యద్ధనుర్గుణటంకారము, తద్విభంగరవము'; 6. ఆరయంగను=ప్రత్యక్షముగాఁ జూచుచు వర్ణించుచు "ఆలోచింపఁగా రాముముఖమున బొమముడి లేద" నుట యన్వాదము కాదా? 7. ఇచట మూలమందు టంకారశబ్దముచే గుణధ్వని కథితమని వీరుశబ్దార్థ జ్ఞానహీనులై తడఁబడినారు. గుణటంకారం బొకటియు భంగరవమొకటియు మొత్తము రెండగునుగాని వీరు చెప్పినట్లు ఒక్కండ యెట్లగును? సంఖ్యానము తెలియని సాంఖ్యముగా నున్నది. రెండు నొక్కటిగా కలసిపోయెనని వాదింతురేని, మంచిది, కలసినవి రెండని శతానందునని కెట్లు తెలిసినది? మూలమందలి టంకారము ధనుర్భంగధ్వనిగాని గుణధ్వని గాదు. "దీర్యద్ధనుష్టఙ్కారః" అని యేతన్మూలమందే కలదుగదా? "శిశువపు రాముని" "ఆయెంబూర్ణములే" "శ్రీరామా" అను మూఁడు పద్యములందును గుణధ్వని వర్ణితమైనది. "కరకిసలయలీల" యందు ఆకర్షణము వర్ణింపఁబడినది. "హరినిద్ర" "కొండగవి" "కనుమాకర్ణము" "తనరంగంతుక" అను పద్యములందు వరుసగా "ధనుర్భంగోద్భవధ్వానమే" "విల్లుండసులుగాఁగఁబుట్టిన బిట్టులివు" "దీర్యద్ధనుర్గుణటంకారము" [ఇదితప్పు, ధనుష్టంకారమనియే యుండవలయును], "విదళద్భూతేశచాపోల్లసత్స్వనవారాశి" అను పదములచే భంగధ్వానము వర్ణితమైనది. టంకారశబ్దము భంగధ్వానపరముగా ఈగ్రంథములోనే ఈ "హరినిద్ర" పద్యముయొక్క మూలములో [ధనుర్భంగోద్భవధ్వానమనుటకు] "టఙ్కారః కృష్యమాణ త్రిపురహర ధనుర్భఙ్గభూః" అని ప్రయుక్తమైయున్నది. భవభూతియు ధనుర్భంగధ్వానమునకు టంకారశబ్దమును ప్రయోగించినాఁడు.

> దోర్లీలాఇఞ్చిత చన్ద్రశేఖరధను ర్దణ్డావ భఙ్గోత్థిత
> ష్టఙ్కారధ్వని రార్యబాలచరిత ప్రస్తావనా డిణ్డిమః
> ద్రాక్పర్యస్త కపాలసంపుటగళ ద్బ్రహ్మాణ్డ భాణ్డోదర
> భ్రామ్యత్పిణ్డిత చణ్డిమా కథ మహో నాద్యాపి విశ్రామ్యతి.

8. మఱియు భంగధ్వానముతోఁగూడ గుణటంకారముం జెప్పుటయం దొకవింత యేమనఁగా, విల్లు విఱుగకున్ననేగాని గుణధ్వని పుట్టదు. కాన విఱుగుచున్నదాని గుణటంకార మనుట కేవల మవిచారితరమణీయమైనమాట. స్వోక్తివ్యాఘాత మేనియు

వారించుకోవలదా? 9. అహంకృతిజహుంకారంబు—దీని కన్వయ మెట్లు? ఇదియు, గుణధ్వనియు, భంగధ్వనియు, ననిమూఁటియొత్తమా ఒక్కఁడు? మంచి సాంఖ్యము! "ఘనకంఠంబున లేదు" అనిమాఱుతమా యనిన 10. బాలునికి ఘనకంఠ మేమి? ఏల వాఁచినది? తన పెండ్లికి తానేసన్నాయి యూఁదుచున్నాఁడా? విల్లు 'పీఁకు' టను ధం పట్టినాఁడా? కంఠధ్వనిన్ అనిసప్తమ్యర్థద్వితీయగాఁ గొందమన్న ధ్వని గల దని యర్థమగును. 11. ఆధ్వని హుంకారముగాక మఱి యేమి? రోదనధ్వని యా? మూల శ్లోకమునకెల్ల రాముఁడు అత్యంతాక్లేశముగా ఆమహాకార్ముకమును ఎక్కుపెట్టి లాగె ననియు అది యతనిబలమునకు ఆఁగలేక విఱిగె ననియు తాత్పర్యము. 12. మూలములో "అక్లేశేనైవ నాకర్షించుచున్న రామునికి" అని, రామునే కర్తనుగాఁ జెప్పుటచే శ్రమపడినవానికి భ్రూభంగము గాలేదను వర్ణనమునవిచ్ఛిత్తి గలిగినది. 13. ఈతెనుఁగున వ్రేళ్లు లాగినవి, రామునికి భ్రూభంగము లేదు, అని యున్నది. ఇది విధ్యుక్తముగా పాడుచేయుట; పృష్ఠతాడనంబుచే దంతభంగప్రసంగముగా నున్నది. కవనము గాదా, రస మక్కఱ లేదా? మూలకవి యేల రామునే కర్తనుగాఁ జెప్పెనో దానిని గ్రహింపవలదా? ఒజ్జలు లేరా? 14. నఖప్రాసవైభవము.

౨౨ - వ పుట.

అశ్లీలము.

[2] క॥ జనకునితనయలఁ బైకొను । ననుజులతోఁగూడ రాముఁడనువాఁడంగన్
1073 మనుసీతాకల్యాణం । బును గావించుకొనుఁగాతముదముదలిర్పన్.

రాముఁడును అతనితమ్ములును ఉమ్మడిగా జనకతనయల నందఱిని బైకొందురు, అని ఈపద్యమునకు—అర్థమగుచున్నది. 1. అశ్లీలార్థతాదోషము. ఉత్తరార్థమున సీత రామునికిమాత్రమే భార్య యగు ననియు, ఉమ్మడి గాదనియు, తెలియుచున్నది. సీతను కల్యాణముచేసికొనుట యనఁగా వ్యావహారికభాషలో సీతను పెండ్లియాడుట, సీతకు మగఁడగుట. 2. సీతాకల్యాణముచేసికొనుట యనఁగా ఆయర్థము గానేరదు, సీతకు పెండ్లిజరిగించుకొనుట, వరుని సంపాదించి అతనికి సీతనిచ్చి వారి పెండ్లికార్యమును నెఱవేర్చుట. కల్యాణశబ్దమునకు అగ్రాంథికము యైన వివాహార్థము నాశ్రయించినను ప్రయోగము సరిగానందున సీతను రాముఁడు పెండ్లియాడును గాత మనువివక్షితార్థము రాలేదు.

## చతుర్థాంకము.

౪౫-వ పుట.

[7] క॥ మణిమయమంగళదీపము। జనకనృపునిమండపమునజ్వలియించులలిన్
1080 జనుదెంచెంజండానిల । మునువిఫలాగమముగనగు మొగినెటనటకున్.

ఛా.—మణిమయమఙ్గళదీపో । జనకనరేన్ద్రస్య మణ్డపే జ్వలతి
చణ్డానిలోఽపి ప్రాప్తో । యస్మిన్ విఫలాగమో భవతి.

ఇందుత్తరార్ధము సరిగా ఆంధ్రీకరింపఁబడలేదు. 1. చనుదెంచెన్—మూలములో నిది సమాపకము గాదు. దీనిని సమాపకముచేసినదోషమున మణిదీపముతో సంబంధించిన "ఎట" పదమునకు ఆసంబంధము వదలి దానికై (ఎటకై) దీపముతో సంబంధములేని 2. "అట" పదముం గల్పించుకోవలసివచ్చినది. "ప్రాప్తించినదైనచండానిలముగూడ ఏమణిమయమంగళదీపమునందు నిష్ఫలాగమమగునో (ఆ) మణిమయమంగళదీపము జనకరాజుమండపమున జ్వలియించుచున్నది," అని సరియయిన తెనుఁగు. "చనుదెంచినచండానిలము విఫలాగమము గానెముగియును దేనన్" అనిన మూలమునకు సరిపోవును. యచ్ఛబ్ద మిష్టము గాదేని "చనుదెంచెం జంఢానిలమును విఫలాగమముగాఁగ ముగియును దానన్" అన్నచో మూలమందలి యచ్ఛబ్దమునకు మణిమయమంగళదీపముతోఁ గలసంబంధము విశదమగును. ఆసంబంధము వదలించుట శ్లోకతాత్పర్యవిరుద్ధము. "జనకరాజుమంటపమున రాముఁడు వెలుఁగుచున్నాఁడు, వచ్చినపరశురాముఁడుగూడ ఇతని నోర్వఁజాలఁడు," అని సూచన. "ఏదీపమందు" అని సిద్ధముగానున్నసంబంధమును మాని 'ఎటనిష్ఫలమగునో అటకువచ్చెను'—ఏవస్తువునందు నిష్ఫలమగునో ఆవస్తువుకడకు, లేక, ఏచోట నిష్ఫలమగునో ఆచోటికి, అని, ఏదాచోటు? లేక, ఏదావస్తువు? ఆకాశమా? పర్వతమా? అని, యూహించి యూహించి చివరకు శిరోవేష్టప్రాణాయామభంగిగా మణియమంగళదీపముకడకు వచ్చిన రావచ్చును, రాకపోయినం బోవచ్చును. మనగ్రంథముచదువవచ్చినందులకై విద్యార్థులంజంపఁగూడదు. ఈపద్యమున కలంకారములు: 3. లలిన్, 4. మొగిన్. 5. విఫలాగమమునగు—ఇందలిసముచ్చయము పా. 6. దీనిచే 'మొగినెటనటకున్' ఈభాగము అనావశ్యకమైనది. 7. అద్భుతాన్వయము.—ఎటతో చనుదెంచుటకు సంబంధములేదు, అటకుతో అగునకు సంబంధములేదు. 'అటకు' పల్లటీగొట్టి చనుదెంచుమీఁదపడవలయు.

పరశురాముఁడు.—ఇతఁడు ముక్కంటి విల్లెక్కిడుటచేత కన్యాదానము నే
1081 యఁబూనినాఁడు.—ఈవాక్యము మూలమునకు సరియేగాని దీనికి అర్థము లేదు. 'ఎక్కిడుటచేత' అనక 'ఎక్కిడువానికి' అనిన అర్థము గలుగును.

క॥ మహీపతితతిగళపాళీ
[4] 1085 బహుళగళద్రుధిరధూతబహుధారమిదే
యహిభూషణశిష్యునియది
మహితముపరశువజనకముమహినినెనర్చఁగ.

మూ.—అవనిపతిసహస్రకణ్ఠమాలా । బహుళగళద్రుధిరౌఘధౌతధారః
తదిద మజనకం జగద్విధత్తే । పరశురయం జమదగ్నినన్దనస్య.

1. ధూత—విదుల్పఁబడిన, కంపింపఁబడిన. రక్తము ధారను [గండ్రగొడ్డటివాదరను] కంపించుట యెట్లు? ధౌత అని యుండవలయును. ధౌత—కడుగఁబడిన. ఏతదనుగుణముగానే మూలములో, రుధిరౌఘ—రక్తప్రవాహము చెప్పఁబడినది. పంతులవారికి ఓఘశబ్దస్వారస్యము చేతనేనియు, తెనుఁగుముద్రణములోని "ధూత" శబ్దము ధౌత యనుటకు అచ్చుపొరఁబాటని తోఁపకపోయినది! అటు గాదు, తత్స్వారస్యమే తెలిసియుండదు, కాననే ఆశబ్దమునే త్యజించివేసినారు. ఇటనే గాక ఇంకొకపద్యములోఁగూడ నీగ్రంథములో తెలుఁగుముద్రణమందలి యచ్చుతప్పుచేత వీరు ధౌతకు బదులు ధూత పెట్టి స్వారస్యముం జెఱిపియున్నారు. [౫౨ - వ పుట.] 'ఓరుద్రాక్ష' పద్యమును తద్విమర్శమును గనుఁడు. 2 అహిభూషణశిష్యునియది—ప్రాసకై జమదగ్నినందనశబ్దము నిట్లు తెనిఁగించుకోవలసి వచ్చినది. జమదగ్నినందనశబ్దమందిది యభిప్రాయము.—జమదగ్నిని (నాతండ్రిని) చంపినందులకు క్షత్త్రియుల నింతవఱకు చంపుట యైనది. [మదీయగురుహరధనురాకర్షణ పరిభవనదోషముకై] ఇప్పుడు జనకుని చంపవచ్చితిని. ఆతప్పునకు అంతదండన చేసితిని, ఈతప్పునకు వదలుదునా? [సామర్థ్యమున కదియే తార్కాణ]. అని యభిప్రాయము. మార్పులో నది రాదు. కాన మార్పు సరిగాదు. 3. మహితము—ఏది మహితము? పరశువుకాదు, ప్రాసము. 4. బహుధారము—పరశువునకెన్నివాదరలుండును? ఒకటి కెచ్చున్ననుండుఁగాక రెంటికెచ్చుండునా? అనౌచిత్య మెఱిఁగి, పిమ్మట ప్రచురార్థమైన సంఖ్యార్థమును మాని, పృథుత్వాద్యర్థకల్పన చేసికోవలయునా? పంతులవారియతులు విద్యార్థులకు గుండెతల్లడముగా నున్నవి.

౪౭ - వ పుట.

స్రగ్ధర. కళ్మలపద్యము.

తనరంగన్ దేనిధారన్ దళితపరిపత ద్బాహుశాఖాసహస్రం
[11] బున నుద్యద్రక్తధారల్ పొలిచె జితనవాంభోజమిత్రాంశుజాలం
1096 దనఁ గందత్కార్తవీర్యుం డమరపుర సుదృగ్వర్గదాపుష్పితాశో
కనగంబయ్యెన్ స్వపౌరాంగనలకధికశోకప్రదాశోకమయ్యెన్.

మూ.—యస్యోద్యద్ఘోరధారాఞ్చలదళితపతద్బాహుశాఖాసహస్ర
ప్రోద్గచ్ఛద్రక్తధారానివహజితనవోన్మీలదర్కాంశుజాలః
క్ష్మాపాలః కార్తవీర్య స్సురపురసుదృశాం పుష్పితాశోకశాఖి
భ్రాన్తిం దత్వాపి చిత్తే నిజపురసుదృశాం శోకశాఖీ బభూవ.

ఇందుత్తరార్ధమున అర్జునుఁడు సురపురస్త్రీలకు అశోకశాఖిగా నగపడినను, నిజపురస్త్రీలకు శోకశాఖిగా నగపడెనని తాత్పర్యము. దానికి తెనుఁగుపద్యమందుఁ గలగందరగోళమును గనుఁడు 1. ధారా దళిత=ధారచేత చీల్పఁబడిన=ధారన్ దళిత [తృతీయార్థద్వితీయ], 2. సహస్ర ప్రోద్గచ్ఛత్=సహస్రమునుండి వెడలుచున్న=సహస్రంబున నుద్యత్ [పంచమ్యర్థసప్తమి]; సిద్ధసమాసావ్యవయవముతో నీరీతిగా వ్యస్తపదము అన్వయించుట తెలుఁగుమర్యాద గాదు. ఇది రామునిచే హత వాలితల, నేను క్రీడత్కందుకము [నే నాడుచున్న బంతి], నేను క్రీత కేదారము [నేను కొన్న పొలము] అన్నట్లున్నది. ఇది ఆంధ్రభాష గాదు, ఆంధ్రభాషాసంజీవనమైన నగునేమో? ఇట్టిదే 'బాహాసహస్రంబున నుద్యద్రక్తధారల్' [సహస్రశబ్దమునకు ఉద్యచ్ఛబ్దముతో నన్వయము కవి కపేక్షితమైయున్నది]. 3. ఈదోషములు తొలంగుటకై ధారన్=ధారయందు, అని సప్తమ్యర్థముచేసి [భిన్నవిభక్తితాదోషము ఈ గ్రంథమందు దృష్టచరమే], దళిత—సహస్రంబునన్ అనుసమాసమును పరశుధారావిశేషణముగా బహువ్రీహిగా బలిమిచేసి, రక్తధారల్ తనరఁగా అని యన్వయింతమన్న, రక్తధార లొకచోట అశోకభ్రాంతి యొండొకచోట నని 'పృష్ఠతాడనాద్దన్తభఙ్గః' అనున్యాయము సంభవించును. కాన ఆకల్పన పనికిరాదు. 4. జిత, అనఁగన్—ఇందు జితయనునది యుపమావాచకము, అనఁగన్ అనునది యుత్ప్రేక్షావాచకము, రెంటినిం బెట్టిదంచుట చిత్తవిక్షేపసూచకము. 5. పొలిచెన్—దీనికి కర్త కార్తవీర్యుఁ డనవలయును; రక్తధార లందమన్న, తనరంగన్ పాదపూరణముగావలయును. ఇష్టాపత్తి యన్నచో, బాహువులు కార్తవీర్యుని వనుటకు గమక ముండదు. మఱియు, దేనన్ = ఆకార్తవీర్యుండు, అని పరశుకార్తవీర్యులకు ఐక్యము సంభవించును. కాన రక్తధారలు కర్తగానేరవు. కార్తవీర్యుఁడే గతి. 6. ఆపక్షమున, అయ్యెన్ అని క్రియాంతరమున్నది గదా, పొలిచెను పూర్వకాలికంబునకు క్త్వార్థకప్రత్యయ మేలపెట్టలేదు, పూర్వకాలికము గాదని వాదమేని సముచ్చయ మేల పెట్టలేదు. వాక్యభంగియం దేనియు ఏకకర్తృకతాస్ఫోరణము లేదు. పొలిచె నని పొలియించుటకన్న పొలిచి యని క్త్వార్థకముచేసిన నెంతయు మేలు. 7. హర్షదాపుష్పిత—హర్షద+అపుష్పిత అని ఛేదమో? హర్షద+ఆపుష్పిత అనియే ఛేదమో? ఆసందేహముతీఱ పలుమాఱు పద్యమెల్లం బర్యాలోచించుకోవలయుం గదా?

అప్పటికేని తీఱునా? నిశ్చయమా లేదు. మూలమునం దీఱును. హర్షకృత్ప్రపిష్ఠిత అనరాదా? ఇం దేసందేహబాధయు నుండదుగదా? 8. అమరపురసుదృక్షర్షదా శోక యని యచట సుదృక్కులను సమాసములోఁ బెట్టి, పౌరాంగనల కని పౌరాంగనలను వెలిఁబెట్టుటయు 9. మొదట అశోకనగంబయ్యె నని, నగశబ్దము వేసి, యిట అశోకము అని నగశబ్దము మానుటయుం బ్రక్రమభంగము లనిపించుకొనును; ఇంకనుంగవనము కుదురమిని దెల్పును. 'మూలములో నీదోషము లేదా? అట మొదట అశోకమును చెప్పి తర్వాత శోకమును చెప్పుట బ్రక్రమభంగముగాదా?' అని గంభ్రగోద్ఘటివంటి ప్రశ్న. ఇదియే పూర్ణముగా పద్యములో పాదుచేయఁబడిన భాగము. 10. మూలములో అశోకశబ్దమున కవి శ్లేష పెట్టినాఁడు. సురస్త్రీలకు శోకము తీర్చుచెట్టు అని శ్లేషించి, ఆశ్లేషచే అంతఃపురస్త్రీలకు శోకమిడు చెట్టాయె నని విరోధమును సూచించి, చమత్కారము చేసినాఁడు. ఈతెల్గుకవి సమాసమున దూర్చి వెలిఁబెట్టినందులకు జయదేవుఁడు ఎట్లు నిర్వహించినాఁడో కనుఁడు. 11. సురపురసుదృశాం—నిజపురసుదృశామ్.—సరికి సరిగా తూఁచికొలిచి ప్రయోగించినాఁడు, ఆవిచ్ఛిత్తి కాహ్లాదింపుఁడు. పద్యమును కొంచెము చక్కఁజేయుదము.

తనరక్తాయద్ఘోరధారాదళితపరిపతద్బాహుశాఖాసహస్రా
స్థనవోద్యద్రక్తధారాప్రకరజితనవాఙ్కురాతమిత్రాంశుజాలుం
డనినై యాకార్తవీర్యుండమరపురసుదృగ్హర్షకృత్పుష్పితాశో
కనగంబై క్రాలియుక్తాశోకనగమునిజపూరికామినీపాళికయ్యెక్.

ఆప్త—పాదపూరణమే, పంతులవారికి ప్రాయికమే.

పంతులవారికి దీనిమూల మన్వయింపలేదు.

శా॥ రేవావాహినిఁగట్టెఁగట్టువటిచెక్రేకెత్తునారావణుక్
[8] దేవారాతినదద్దియర్జునభుజానీకంబెటన్నన్నైరా
1104 ద్దేపీదృగ్జలపూరమున్నెపమునందీపించునెద్దానిక్రీ
డావారంబదెయిద్దినాపరశుపీడన్విడ్చుధారాంబుపుక్.

1. కట్టెక్, కట్టువటిచెక్,—ఏకకర్తృకములు, కర్తయుందురామిచే సమున్వయము లేమి సరిగాదు. 2. అదెద్ది—అదిశబ్దము ముందు ప్రయుక్తముగుటచే వాక్యాలంకారమాత్రమైనది. ఎద్ది యర్జునభుజానీకంబు—ఏ యర్జునభుజానీకంబు. కట్టుటను కట్టువడుచుటను భుజానీకంబు కర్తయైనది. కాన మున్నటను కర్త లేదు. అదెద్ది యనుట సరిగాదు. 3. ఎదద్ది యన్న సరి. అట్లు దిద్దిన, కట్టుటకు, కట్టువడిచుటకును ఎది కర్తయగును; అద్ది భుజానీకంబు—[ఆభుజానీకంబు] మున్నగును. 4. అదె యిద్ది నాప

రశువు అనుటచే. ఎటఁ ఎద్దాని అనునవి పరశువును చెప్పిన వైనవి. పరుశువునందు మున్గినది, పరశుక్రీడ బాష్పజలరూపమున నున్నది, అని యన్వయ మైనది. ఇది సరి గాదు. ధారాజలమందు మున్గినది, ధారాజలక్రీడ బాష్పజలరూపమున నున్నది, యని యర్థము గావలయును. మున్గుటం జెప్పుటయు, జలముగా నుత్ప్రేక్షించుట యు [ధారా] జలమనుటకు గమకములు గావా. పైగా, జనకుఁడు పరశువునకు ‘నీధారాజలమున్ను విడువుము’ అని చెప్పిపంపినాఁడు. పరశురాముఁడు పరశువును పితపూర్వపద్యమందును, తద్ధారాజలమును ఈపద్యమందును వర్ణించి, “అట్టియీ పరశువు అట్టియాధారాజలమును ఇపుడు విడుచును,” అని సోత్ప్రాసముగా నిట నుపసంహరించుచున్నాఁడు. కాన “అదె దాని నాపరశు వీడ న్విడ్చు” నని దిద్దు కొన్న సరిపడును. ధారాజలమునకు చెప్పినవర్ణనను పంతులవారు పరశువున కన్వ యించుటచే వింతగాదు. వారుచేయు నన్వయమెల్ల నట్టిదిగానే గదాయున్నది.

మూ.— యే నాబధ్యత నర్మదామ్బుని వహాః సంఖ్యే చ లఙ్కేశ్వర
స్తద్వ్యస్య న్నిరమజ్జ దర్జునభుజక్షోణీరుహాం మణ్డలమ్
క్షత్త్రస్త్రీనయనామ్బుపూరమిషతః ఖేలన్తి యత్కేళయః
తత్తాదృక్పరశు ర్మమాయ మధునా ధారాజలం ముఞ్చతి.

5. కట్టువడిచెఁ—సంఖ్యే—యుద్ధములోఁ గట్టెనని మూలము. 6. చ— కట్టెఁ కట్టువడిచెఁ అనురెంటికిని తెనుఁగులో సముచ్చయలోప మగపడుచున్నది. ఇందులకుపూర్తికై 7. రేకెత్తు—య. 8. దేవారాతిఁ.—ప్రా. “రేవావాహి నిఁ గట్టెఁ గట్టె ననిలో” అన్న సరిపడును. మూలార్థము.—ఏ యర్జున భుజ శాఖిమండలము నర్మదాజలమందు వంతెనను, యుద్ధములో రావణునిని, గట్టె నో, ఆయర్జున భుజశాఖిమండలము ఏధారాజలమందు [జలమువంటి యే వాదరయం దు] మునిఁగిపోయెనో, ఏధారాజలముయొక్క కేళులు క్షత్త్రస్త్రీబాష్పప్రవాహమి షచే క్రీడించుచున్నవో, అట్టి యాధారాజలమును ఇదె యీనాపరశువు ఇప్పుడు విడుచుచున్నది.—ఆ గ్రుడ్డికీమెల్ల.

రేవన్వంతెనఁగట్టెఁగట్టెను దశగ్రీవుఁ రణాగ్రంబునఁ
దేవారాతి నెదద్దియర్జునభుజానీకం బెట న్మగ్నె రా
డ్దేవీపృగ్జలపూరకైతవమునఁ దీపించునెద్దాని క్రీ
డావారం బదె దాని నాపరశు వీడ న్విడు ధారాంబువుఁ.

౪౭ - వ పుట.

మూలవిరుద్ధము. పంతులవారికి మూలమర్థముగా లేదు.

ఉ॥ కొండలకొమ్ములంజిదిమిగొప్పతనంబును గాంచిమించు నా
[11] ఖండలువాలు సిగ్గెనయఁగం గడు నర్జునబాహుశాఖలం
1115 జెండిప రేతరాజపురిఁ జేరఁగ వాకిలియైన దిద్దినా
చండపరశ్వధంబున కుశ్లాఘయె రావణకంఠఖండనన్.

మూ.—. యః కృత్వార్జునభూరుహోద్ధృతభుజాశాఖాసహస్రచ్ఛిదాం
దమ్భోళే ర్గిరికూటపాటనపటో శ్శౌణ్డీర్యతో లజ్జతే
తస్యైతస్య పరేతరాజసదనద్వారః కుఠారస్య మే
కా శ్లాఘా దశకణ్ఠకణ్ఠకదళీకాణ్డావళీఖణ్డనే.

కార్తవీర్యార్జునుఁడను వృక్షముయొక్క యుద్ధృత భుజములనియెడు వేయి కొమ్మలను ఛేదించినదయ్యును, ఏనాకుఠారము కొండల కొమ్ములను అగల్చుటయందు సమర్థమైన వజ్రాయుధమువలన, తన పరువుచేత తాను లజ్జపడుచున్నదో [నేనెంతయేని కొయ్యలు నఱికితినేగాని కొండలనఱుకనైతినిఁగదా యని తనయందు న్యూనతను భావించుకొని తనలో తానే అవమానపడుచున్నదో] అట్టియీనాకుఠారమునకు యమధర్మరాజునింటి ద్వారమునకు పదిమొదలవాని మెడయరఁటిబోదెలను కోయుటయందు దొకకీర్తియా!—అని యర్థము.

1. పద్యములో పరశువు వజ్రాయుధమునకు సిగ్గుకలిగించినట్లున్నది. అది సమర్థితము కాదు. వజ్రము చేయనేరనిపని యిదియేమి చేసినది? మూలములో వజ్రాయుధమునకు పరశువే అవమానపడినట్లున్నది. కొండలుకొట్టుదానికన్న కొయ్యలుగొట్టునది యల్పసారమేగదా? పంతులవారు శబ్దమూర్ప్పన కనుగుణముగా 2. రావణకంఠఖండన యన్నారు. దశకంఠ యనలేదు, 3. కంఠకదళీకాండావళీ యనునర్థమును రానీయలేదు. వేయిశాఖలు కొట్టిలజ్జించుచున్నయట్టిది పది యరఁటిబోదెలు కొట్టఁగడంగునా?—అని చమత్కారము. సారాంశము కొండకొమ్ములు కొట్టనైతిఁగదా యని చింతిల్లుచున్నదానికి అరఁటిబోదెలు కొట్టుటచే నుశ్లాఘయా యని. 4. శాఖలన్—మూలములో శాఖాసహస్రము చెప్పఁబడినది. 5. అర్జున— మూ. అర్జునభూరుహ. 6. చెండి, ఐనది యని సమానాశ్రయతయు పూర్వాపరవిరోధమును పెట్టుటచే అర్జునునికి ప్రేతరాజపురీప్రవేశమునకు వాకిలి యని విశేష మర్థమగునే గాని ఎంతటివానికేని యమసదనప్రవేశిక యని సామాన్య మర్థముగాదు. [illegible]

సామాన్యమందు రసముగాని విశేషమందు లేదు. 7. మూలములో సామాన్య ముక్త మేగాని విశేషముగాదు. 8. లజ్జతేయను సమాపకమును సిగ్గైనయంగ నని అసమాపకముగా మార్చుట రసము చెఱుచుట. 9. చేరంగ—దీనికి కర్త ఏది? ఏపందిరి మీఁదనెక్కియున్నది? 10. ఇద్ది—దీనికి విశేష్యమేది? ఇద్ది నాచండపరశ్వథంబునకు అనఁగా ఈనాచండపరశ్వథంబునకు అని రహస్యార్థమా? భిన్నవిభక్తితాదోషము—షష్ఠీవిశేషణములకు ప్రథమయగుట గలదు అని వాదమా? సర్వనామముల కట్టి ప్రథమ పరమాసహ్యముగా నుండును. 11. మఱియు ఈభిన్నవిభక్తికతచేత పరశ్వథము వాకిలిగాదని యర్థ మసందిగ్ధముగా లభించుచున్నది. పరశ్వథమే వాకిలిగావలయు నేని ఐనదియని సమాపకముగానే వ్యస్తముగానే ఉండవలయునేని, 'వాకిలియైనది ఈనాపరశ్వథము, అట్టిదీనికి శ్లాఘయె' అని ముందుగా పరశ్వథమును చెప్పి తర్వాత సర్వనామమును. చెప్పవలయును 'ఐనది' వ్యస్తముగా నుండనక్కఱలేదేని వాకిలియైన యిట్టి నాచండపరశ్వథంబునకు...అన్నంజాలును. ఈపద్యమునే కొంచెము బాగు చేయుదము.

కొండల కొమ్మ గల్చి శతకోటికి నెయ్యది లజ్జఁ గూరుఁడాఁ
జెండియు నర్జునద్రుమ విచిత్రభుజాలతికాసహస్రముల్
జండకుఠార మంతకుని సద్మకుద్వార మదేమికీర్తికై
ఖండన సేయఁ బంక్తిగళకంఠనళీకదళీప్రరోహముల్.

లక్షణజ్ఞానము.

[2] తే॥ దక్షిణాంభోధిమధ్యమస్థానమునను।గొంకణము నెన్మిదవదానిఁగొఱలఁజేసి
1117 లంకకాలంకమునుమిగులంగఁజేయ। నస్మదంబకభూతాగ్ని యడరుఁగాక.

1. చేసి—ఈ పదమువలన పరశురాముఁడు ఇప్పటి కింక కొంకణమును సముద్రమునుండి సాధింపనట్లును, ఇఁకమీఁద పోయి సాధించునట్లును అర్థమగుచున్నది. ఇంతకు పూర్వమే సాధించియున్నట్లు ఈయంకమందే భూరిప్రమాణ మున్నది. మఱియు ఇప్పటి కింక సాధింపకయే యున్నచో కొంకణమనుపే రెట్లేర్పడును? పరశురాముఁడు మిథిలకిపుడు కొంకణమునుండియే వచ్చినాఁడు. కాన ఈపద్యము సరిగాదు.

దక్షిణ స్యామ్బుధే ర్మధ్యే కృత్వా కోఙ్కణ మష్టమమ్
మద్బాణ జన్మా దహనో లఙ్కాతఙ్కాయ జాయతామ్.

దక్షిణసముద్రమునడుమ కొంకణమని యెనిమిదవద్వీపమును (కృత్వా), కల్పించినదైన నాబాణాగ్ని (యిపుడు) లంకాద్వీపనాశనమునకుం గడంగుఁగాక;—అని

నేని ముగింపలేదు. [భగ్నమయ్యేనేని] ఏనిశబ్దముయొక్క పూర్వాక్షరము 'ఏ' ఈపాదము తుదిని, ఉత్తరాక్షరము 'ని' చతుర్థపాదము తొలిని ఉన్నవి. ఏనిశబ్దమును విన్ననేగాని తాండ్యాయనుఁడు "ఇతఁడేమిచెప్పనో" అని పలుకం బ్రసక్తిలేదు. అట్టిచో ఈ తెలుఁగుకవి పదమధ్యముండే పద మిది యని తెలియక ముందే తాండ్యాయనునిచే అప్రసక్తము భాషింపించినాఁడు. మఱియు రంగభూమియందు జామదగ్న్యనటుఁడు 'నే' యని ముక్కతెఱచుకొని, నేకారమును తాండ్యాయనభాషితము ముగియువఱకును ముక్కుతో ఊఁచ్చునే యుండవలయును. ముక్కుతో నేల యని కినియవలదు, నకార మనునాసికముగదా? అట్లుచేయనిచో ఏనియను రెండక్షరములకును ఏకపదత్వము అభిప్రేత మని తెలియదు. నే యని కొంత నేవు ముక్కుస్వరము నీడ్చుచుండనిచో అనఁగా అవిలంబితముగాఁ బై పద్యభాగముతో ని గలిపిచెప్పినచో తాండ్యాయననటుని భాషితమున కవకాశము కలుగదు. వీని కవకాశము ఇచ్చుటకై నేయని నిలిపి, వీనిమాట యైనపిమ్మట, ని అని యెత్తికొనిన, ఏనిపదముకథ దొంగ ఇంట దూఱుచున్నప్పుడు గృహస్థునిప్రశ్నకు 'చో' యనియు, పిమ్మట చౌర్యము ముగించి వెడలిపోవుతఱిని 'రః' అనియు నివేదించి విజయంచేసిన కథగా నుండును. ఏమి యీచేయఁగలవిన్నపముల కవనము! తృతీయపాదమున పదమును ముగించుకోరాదా? "భంగమొందినఁ । విదితకుఠారధారను మునింగెను రాఘవవంశమిప్పుడే" అనరాదా? పాదమధ్యములోనే నిలుపఁదగువయున్నచో జామదగ్న్య నటభాషితమును "భగ్నమయ్యేనే। ని"...అని నిలిపి...పిమ్మట "దలఁపు" అని యందుకోరాదా? ఈ యరణ్యమునకు మూలమయిన యుద్యానవనము:—

జామ.—దుర్ధర్షాస్సుర సిద్ధకిన్నరనరై స్త్యక్తక్రమం వక్రతాం
ప్రాప్తే యత్ర విధాత రీవ తరసా తిస్రోపి దగ్ధాః పురః
తద్భగ్నం యది రాఘవేణ శిశునా చణ్డీపతేః కార్ముకమ్

తాణ్డ్యా.—[సభయకౌతుకం, స్వగతమ్] కి మధునా వక్ష్యతి!

జామ.—త స్మగ్నం కుల మేవ తర్కయ మనా క్ష్మచ్ఛస్త్రి ధారామ్భసి.

దీనికి లోకసామాన్యమైన తెలుఁగు:—

జామ.— సురసిద్ధకిన్నరనరులకు అజయ్యములయిన మూఁడుపురములును ఏది విధివోలె వక్రము కాఁగా ఒక్కుమ్మడి [త్యక్తక్రమమ్] హఠాత్తుగా [తరసా] దగ్ధములై పోయినవో, ఆచండీశకార్ముకము రాఘవునిచే శిశువుచే భగ్నమాయనేని,

తాండ్యా.— [భయకౌతుకములతో స్వగతము] ఇప్పు డేమనునో?

జామ.— దానివలన నెఱుంగుము రఘువుయొక్క కులమే మదీయశస్త్రధారాజలమందు మగ్నమాయెనని.

ఇట శ్లోకములో పూర్వార్థమున పద్యమందలి సందేహారణ్యాని లేదు. ఉత్తరార్థమున పాదసంధిలో సగముపదమటు సగముపదమిటును లేదు. ఏని వాచకమైన యది శబ్దము తృతీయపాదమందే యున్నది. పంతులవారు తృతీయపాదమందలి యదికిని, చతుర్థపాదమందలి తత్తునకును, రెంటికిని ఒకటియే మొత్తముగా ఏని యని తెనిఁగించి, యది తచ్ఛబ్దములకు ఏనిపదమును దాయభాగములు సాంఖ్యసమ్మతముగా పంచి తృతీయపాదమందలి యదికి తృతీయపాదాంతమున ఏ యనియు, చతుర్థపాదాదితత్తునకు చతుర్థపాదాదిని ని యనియు కొంతవఱకు స్థానముంగూడ తప్పింపక ప్రయోగించినారు. 7. మూలములో— జయదేవుఁడు [భగ్నమ్ మగ్నమ్,] అది భగ్నమైననిది మగ్నమగును అని శబ్దశ్రవణమాత్రముచేఁ గలిగించిన ప్రతియోగిభావస్ఫూర్తిని ఇందు 'మునింగెను' అని తేలఁబలికి ముంచివేయుటయు, 8. "సురసిద్ధకిన్నరనరైః" అని, వారివారిప్రభావాతిశయములు స్మృత్యారూఢము లగునట్లుగాను, 9. అందువలనన ట్టిమహిమాన్వితుల కేనియు దుర్ధర్షములని పురములప్రభావాతిశయము తోఁచునట్లుగాను చేసినప్రయోగమును, త్రిలోకవసజ్జనాళికి అని తున్పు చేయుటయు, 10. మహోగ్రునిదనియు, కావున 11. మహాపటువనియు స్ఫురించునట్లుగా చణ్డీపతేః కార్ముకమ్మని— ప్రయోగించినపదములకు ఉగ్రతాపటుతలం బొడయడంచి విభూతి పెండెకట్లును లింగకాయలును స్ఫురించునట్లుగా 12. శివధర్మమనుటయు, 13. "రాఘవేణ శిశునా" శిశువు ఇంతపని చేసినాఁడని చెప్పినచో తెనుఁగుసామాజికులు భయపడుదు రని ఆమాటను మానివేయుటయు, కార్యకారణసంబంధము స్ఫుటోపస్థితము గునట్లుగా, రాఘవుఁడట్లు చేసినందులకు రఘుకులమును నాశముచేసెదనని ఉభయత్రరఘుసంబద్ధముగా చెప్పినసొంపును, 14. దశరథాత్మజుఁ డిట్లు చేసినందున రాఘువవంశమును నాశముచేసెదనని, [దశరథుఁడు రఘువంశ్యుఁ డనియెఱుంగనివారికి నిశ్చయముగాను, ఎఱింగినవారికి తత్పర్యాలోచనావధికముగాను, "దశాననోహరత్సీతాం బన్ధనం తు మహోదధేః" అనుసామెతను స్ఫూర్తికి తెచ్చుటకై] నిర్మూలించుటయు, 15. "మచ్ఛస్త్ర" అస్మచ్ఛబ్దముచే మూలకారుఁడు శస్త్రము వక్తయైనజామదగ్న్యని దని తెలుపఁగా, నాదని జామదగ్న్యుఁడు పల్కుట అహంకారము, విరుద్ధము, అప్రసక్తము ననియు, తన దన్నచో రాముఁడు భయపడి జ్వరాక్రాంతుఁ డగుననియు పిమ్మటవిభూతి మంత్రించి పెట్టవలసివచ్చు ననియు, ఇట్టిది సంభవింపకుఁడుటకై జామదగ్న్యనిచే నా యనిపింపక మాన్పుటయు,— ఇంక, 16. వ్యక్తక్రమమ్, 17. తరసా, 18. అపి, 19. ఏవ, 20. మనాక్, 21. అప్పుని— ఏనిం

టికిని ధారోజ్జ్వలమని యొకటియే విశేషణము చెప్పఁబడియున్నది. వాఃపరచే ప్రకాశమానము గొడ్డలి, జలధారచే వెలుఁగుచున్నది కుండి యనిశ్లేష. తెనిఁగింపులో విద్యోత = ఉజ్జ్వల, ఈపునరుక్తి యేల? రెండువిశేషణముల మొత్తమే ఒక్కొక్క-విశేష్యమునకుం జెల్లునేని పునరుక్తిదోషము దుర్నివారము. ఒకటి గొడ్డటికి ఒకటి కుండికి నని దాయవిభాగమా? అపక్షమున యథాక్రమమా? అట్లైని జలాభావము చేయుట అధర్మము; వాఃపర జలము రెండుంగల ధారను జయదేవుఁడు గొడ్డటికి కుండికి రెంటికిని ఆస్తిపట్టిపోఁగా, దాయవిభాగముచేయ నధికరణకులుగా వచ్చిన వారు, వాఃపరను గొడ్డటి కిచ్చి, కుండికి సూజ్జ్వలమని బూటకమిచ్చి దాని భాగమయిన జలమును మాయము సేఁత న్యాయముగాదు. విద్యోతధారాంబు సూజ్జ్వలమున్న కొన్నిదోషములు తొలఁగును. “ముకుళద్దర్భలునుం గరంబునఁ గడుం బొల్పొందు ధారాంబుసూజ్జ్వలమా” అని మార్చిన నీదోషములు తొలఁగును. ఈకవనమునకు ఈపాటిసౌష్ఠవమే యెక్కువ. ఈవ్యాఖ్యానిలో, 4. సదాప్తి——ఒక ఘుదియలుగు——యు. 5. ఇచ్చ, లేక, నిచ్చ——ఒకగుంటనక్క——యు. 6. జూఁజనిట్టులోఁకఁడున్నే యబ్రహ్మెందేనియుఁ——ఒకదాసరిపాము—యు. పా. 7, 8. సుపస్త్రులు రెండు కొండజెట్టులు. ఇవిపాదపూరణజీవాతువులని మిము గట్టిపాఠమైనదిగదా.

రాముఁడు.——విస్మయనీయశీలురకు భిక్షామణియని చెప్పనొప్పు. ఇతఁడుగదా!

ఉ॥ బంగరుకొండయొండెగలపంటపలంతినిదీనిహైమమౌ
[4] శృంగమొకండెయుండుపనిచెల్వునఁగశ్యపమౌనికిచ్చెదా
1151 నాంగముగంగిరీశతనయాధికశక్తియుఁదూఁటువేయలే
మింగనికొంచగుబ్బలినిమించిసురంధ్రముఁజేనెముఖ్యుఁడేఁ.

మూ.——ఏకస్వర్ణమహీధరాం క్షితి మిమాం స్వర్ణైకశృఙ్గాం యథా
గా మేకాం ప్రతిపాద్య కశ్యపమునౌ నస్వాత్మనే శ్లాఘతే
కిఞ్చ క్రౌఞ్చగిరిం గిరీశతనయవ్యావిద్ధశక్తిక్షతం
విద్ధ్వా బాణగణై రుదాత్తపృథయోః వైలక్ష్య మాలమ్బతే.

అర్థము:——ఒంటిపైఁడికొండగల యీభూమిని ఒంటిపైఁడికొమ్ముగలగోవుంబోలె దానమిచ్చి తనియకున్నాఁడు, అనఁగా దీయమానమైన గోవునకు రెండవకొమ్ముగూడ బంగారముగానున్న బాగుగానుండునట్లుగా, దీయమానమైన యీభూమికిం గూడ రెండవస్వర్ణపర్వతము ఉన్న బాగుగానుండును, అట్లు లేకపోయెనుగదా యని చింతిల్లుచున్నాఁడు. మఱియు, క్రౌంచగిరిని బాణగణములచే ప్రక్కలించినను తృప్తిచెందమే అది కుమారునిచేఁ బొడువఁబడి యుండుటఁ జేసి ఒకఁడుకొట్టినదానిం గొట్టు-

యొకపరాక్రమమూ, అందును ఒకఁడు ఒకయాయుధముతోఁ గొట్టినదానిని పెక్కులాయుధములతోఁగొట్టుటయు నైకపరాక్రమమూ, యని లజ్జించుచున్నాఁడు. అట్టియుదాత్తహృదయుఁ డీపరశురాముఁడు.—ఇందు సారభూతమైనవిషయములు రెండు, —1. తనియమియు 2. లజ్జించుటయు ; అవియే విస్మయనీయశీలతాసమర్థకములు. శ్లోకార్థతాత్పర్యము తెలియంగక యీరెండుసారాంశములను పంతులవారు లోలఁగించినందున వారికవిత ఈచుకొనిపోయినది. 3. అధికశక్తి యని అధిక విశేషణము చూడఁగా వీరు ఈఁటె యని యర్థముచేసికొలేదేమో యనిసందేహ మగుచున్నది. 4. అక్షతమ్మను నీరసపాఠమును అవలంబించినట్లున్నది. అది తప్పుపాఠమని వైలక్ష్యప్రస్తావముచేతనే యెఱుంగవచ్చును.

అద్భుతమైనతప్పులు.

జామ.—[విలోకించి] వీఁడర్థముగ్ధుఁడుగదా? ఎందువలననన్ వీనిఁగామించుచున్నాఁడు. చెప్పుటయందు రాముఁడనిపలుకుచున్నాఁడు.

[ఇట, 'ఎందువలననన్' 'గామించుచున్నాఁడు'—అనుటను అచ్చుతప్పు
[5] 1156 లు పడినవని తలంచి వ్రాయుచున్నాఁడ]. 1. వీఁడు—ఎవఁడు వీఁడు? 2. ఎవఁ డెవనిఁ గామించుచున్నాఁడు? ఎవఁడబ్బా అంతటివాఁడు! పురుషుఁడు పురుషునే యేల కామింపవలయును? స్త్రీని కామింపరాదా? 3. ఒకవేళ, నన్ వీనిన్, అనఁగా, ఈ నన్ను, అని పంతులవారిహృదయమూ? వాఁ డెవఁడో. జామదగ్న్యునే కామించినాఁడా? ఆహాహా! ఎంత యుద్రేకము! వహవ్వా ఏమి స్వారస్యము! ఈవాక్యార్థమునుమాత్రమే చెన్నపురీనగరసౌధములలో నాడించినంజాలును, కడమయీనాటక మెల్ల నేల? మూలము :—

జామ. [విలోక్య] అర్థముగ్ధః ఖల్వయం జనః యదేనం కామ ఇతి వక్తవ్యే రామ ఇతిజల్పతి.

దీనికర్థము.—జామ. [విలోకించి] ఈమనుష్యుఁడు (తాండ్యాయనుఁడు) సగముమూఢుఁడు గదా, ఏలన ఇతనిని కాముఁ డనిపేర్కొనవలసియుండ రాముఁ డని ప్రేలుచున్నాఁడు.—4. కామశబ్దములో కాకార మొక యర్థము, మకార మొకయర్థము, రామ యనుటచే కాకారము తప్పినాఁడు; మకారము సరిగానే చెప్పినాఁడు; అనఁగా సగములో తప్పినాఁడు, సగము సరిగానే చెప్పినాఁడు. కావున అర్థముగ్ధుఁడు అని పరశురామాభిప్రాయము. ఇదియెల్లం బంతులవారు వెల్లింగవిపినారుగదా? తాండ్యాయనుని యుద్రేకమునకన్న, పంతులవారు మూలమును ఈ తెనుగువాక్యముచే చేసినపాడుకన్న, వారు ఏపారఁబాటులచే నీతప్పు చేసినారో అపా

రంబాటులు స్వారస్యముగలవై యున్నవి.—వారికి నాగరము చదువ తెలియనందున “నీకన్న భ్రష్టలేదు, నిన్ను విడిచిన నాకు గతిలేదు” అన్నసామెతగా తెలుఁగుముద్రణమే శరణ మయినది. అందులో రెండక్షరములలో అచ్చుతప్పు పడినది. 5. కామ ఇతి అనుటకు కామయత అని ముద్రితమైనది. అంతటితో పంతులవారు బుద్ధి వినియోగించి, కామయతే అని యుండవలయునని భ్రమసి, అట్లుమార్చుకొని, జామదగ్న్యునికొంపమాపినారు. వీరును తాండ్యాయనునంతవారే నాలుగు అక్షరములలో రెండే తప్పినారు. కడమతప్పులు దీని నాశ్రయించినవి. ‘అర్ధముగ్ధశిఖల్వాయంజనః యదేనం కామయతే।వక్తవ్యేరామఇతిజల్పతి.’ అనిభేదించుకొని తగులఁబెట్టినారు. సాంఖ్యాచార్య పర్యవిత కవితాతత్త్వవిత్త్వ)కాండమఁట ? తిలకాష్ఠమహిషబంధనము కాదా ?

చ॥ చక్కఁదనంబుమిక్కిలిగఁజాటునుకామునికన్నమిన్నయం
[2] చెక్కువయైనకై బలిమియాశ్వరుశ్రీశ్వరుఁజేయుఁగ్రిందుగన్
1158 మిక్కిలికంటిమాళిశశిమేలిమిఁగాంచునుమాగ్ధ్యమన్ననీ
చక్కనిమూర్తియెట్టులురసత్రయినిర్మితమయ్యెనియ్యెడన్.

1. రసత్రయిన్—ఏవి యామూఁడురసములు? చెప్పమిచే ధ్వనిపుష్టి యేమేని గలిగినదా? వృథాగా పర్యాలోచనక్లేశ మేల యిడవలయును? మూలములో “మూర్తిస్త్రిక మసౌ రసై ర్విరచితా శృఙ్గారవీరాద్భుతైః” అని శృంగారవీరాద్భుతరసములు కంఠోక్తముగా చెప్పఁబడినవి. వానిని వీరు మఱుఁగుసేయ నేల? వానితో పద్యము కుదురమికన్న వేఱేమి కారణము? 2. “ఎట్లురసత్రయి నిర్మితుఁడాయెను”—అనుట సరిగాదు. “రసత్రయిచే నిర్మితుఁడా యేమి?” అనవలయును.

౪౯ - వ పుట.

జామదగ్న్యుఁడు [విమర్శించిస్వగతంబుగ].

[2] శా॥ ఏలాసద్వినయాప్తుఁడున్ శిశువునానీరామునందీరసం । బు
1160 [స్మరించి సక్రోధంబుగ]
బాలేశూలిశరాసమించుకడగాహావీఁడెఖండించెఁగా।
[విచారించి సకరుణంబుగ]
బాలారత్నమునీతనాశరమునన్ వైధవ్యముంబొందరా । దు
[మఱియు సదర్పంబుగ]
ఏలాశాంతమవుంబరశ్వధమునాదీరేఁబుకానైరియున్.

ఇటు సీపరశురామభాషితములు నాల్గును మూలములో నాల్గుపూర్ణ పాదములు గా నున్నవి. ఎక్కడనెక్కడను లేవు. వీరికట్లు కుదురక వీరు, 2. పదచ్ఛేదములు పెట్టినారు. ఇది ప్రయోగమంతయు సహృదయహృదయోద్వేజకము. ఇట్లు మార్పుఁడు. —పాదాంతమున వాక్యము ముగియును, పంతులవారికవసరమునకుం దీనిపోదు.

ఏలా యీను వినీతుఁడున్ శిశువనా సీరాముపై నింతగా(న్)
జాలే శూలిశరాస మించుగదగా హా వీఁడు ఖండింపఁడే
బాలన్ సీతను గూల్పరామమదిషుల్ వైషమ్యదీర్ఘాబ్ధిలో(న్)
ఏలా నైఁచును రేణుకాగళహరం బీనాకుతారంబిటున్.

క॥ ముక్కంటివిల్లువిఱుచుట । మిక్కుటమగుగర్వముగని మెఱనైదుఁగడునీ
1161 యొక్కభుజంబులువీనియ । స్రుక్కనఁబరశువున కేనుదృప్తియొనర్తున్.

దీనిమూలములో అస్పృక్కులకు మధునాసమానై — మధువుతో సమానములైన, అని విశేషణమున్నది, అది పంతులవారికి పద్యములో కుదిరినదిగాదు.

ముక్కంటివింటివిఱుచుట । నిక్కెడినీబాహువులివ్వి నే మధునిభమై
మిక్కిలి నెక్కొనువీనియు । స్రుక్కఁ బరశువున కిపుడె తృప్తి యొనర్తున్.

అనిమార్చిన నాయుపమయు వచ్చును.

అబ్రవీత్తుపురాణము.

[5] క॥ ఎదియిపుడున్ద్రిపురాసుర । సుదతీవిరహవ్రతంబుచొప్పడఁజెప్పన్
1166 విదితముగాకున్నదియది । విదితముశివధర్మమయ్యెవిదితమునీచేన్.

మూ.— యే నోపదిష్ట మద్యాపి పుర స్త్రీ విరహవ్రతమ్
న భగ్నం భవతా భగ్నం జగద్గురుశరాసనమ్.

పద్యార్థము.— ఎది [=ఏశివధర్మము] ఇప్పటికిని త్రిపురాసుర స్త్రీలు విరహవ్రత మాచరించుచున్నారని చక్కఁగాఁ జెప్పుచున్నదో, అది [=ఆశివధర్మము] [ఇంత వఱకు] విదితము [=భగ్నము] కాకయుండినది; విదితము [=తెలిసినది], ఆశివ ధర్మము నీచేత విదితము [= భగ్నము] అయినది. పద్యతాత్పర్యము :— ఏ శివ చాపము [ధర్మమనఁగాచాపంబు] త్రిపురాసురులను సంహరించినది, ఇంతవఱకు భగ్నముగానిది, ఇపుడు నీచే భగ్నమైనది.—

1. ఇటు శివధనుస్సునకు ఇంతవఱకు భగ్నముగానిది యను వర్ణనము ఉండఁగా, శివధనుస్సు భంగము నొంద దగినదని గాని, భంగమునొంద వలసినదనిగాని ఎవరు తలంతురు! వీరు మూలములోని భగ్నములను రెంటిని 2. శరాసనమునకే విశేషణ

ముగా గ్రహించినారు; 3. ఉపదిష్ట మ్మనుపదమును కారకక్రియఁగాఁ గొన్నారు. ఇందులకారణము ప్రథమాంకములో ౪ - వ పుటలో దేనికిసచ్చరిత్ర మను పద్యముందు చెప్పఁబడియున్నది. శ్లోకమునకు అన్వయ మేమనిన;—యేన [జగద్గురుశరాసనేన] ఉపదిష్టం పురస్త్రీవిరహవ్రత మద్యాపి న భగ్నం (తత్) జగద్గురుశరాసనం భవతా భగ్నమ్.—దీనియర్థము :—ఏ జగద్గురుశరాసనముచేత నుపదేశింపఁబడిన త్రిపురస్త్రీవిరహవ్రతము ఇప్పటికిని భగ్నముగాక యున్నదో [ఇప్పటికిని ఆచరింపఁబడుచున్నదో], ఆ జగద్గురు శరాసనము నీచే భగ్నమైనది.—తాత్పర్యము.—ఈ శివధనుస్సుచే త్రిపురాసురులు దోరిరి. అట్టిమహిమగల యీధనుస్సును నీవు విఱిచినాఁడవు.—ఇట, దేనియుపదేశమునే భంగింపఁగూడదో దానినే నీవు భంగించితివి;—అని దోషారోపణము. ఈ శరాసన మహిమకు ప్రత్యక్షనిదర్శనము పురస్త్రీవైధవ్యవ్రత మున్నది చూచుకొమ్మని మహిమాస్థాపనము. దాని యుపదేశమునే భంగింపఁగూడకుండఁగా దానినే భంగించుట దోషాతిశయ మని యాశయము. దానికపచార మొనర్చినవానికి మరణదండన తద్భార్యావైధవ్యమును తప్పవు అని చెవరింపు. ఇట, ఉపదేశ వ్రత జగద్గురు పదములు ఎట్లన్యోన్యార్థ పోషకములో అరయుఁడు. శరాసనమే జగద్గురు వని కవిహృదయము. గురువుగానిచో ఉపదేశ మెట్లుచేయును? ఇదియునుంగాక జగత్తెంతగురువో [భారమో], ఇదియు [ఈశరాసనంబును] అంతగురువు [భారమైనది], జగత్తంతయు నెంతయో ఇదియు నంతమహిమగలది, యనియు నాకూతము. మఱియు జగద్గురువనుటచే లోకములకెల్లగురువు, నీకుం గురువు, గురుభంజనపాతక మొనర్చితివి, వధ్యుండ వని యభిప్రాయము. చెప్పక అనురీతిగా ఉపదిష్టమనునది సమాపకమే అగునేని, ఉపదిశ్యతే అని, లడంతముగానే యుండును, భూతార్థక్తాంతముగా నుండ నేల? 4. ఉపదిష్ట 5. జగద్గురుపదముల స్వారస్యమును ‘చెప్పక శివధన్వము’ అనుపదములు చెఱిచినవి. తెనుఁగుకవికి మూలార్థము విదితముగానందున నిట్లయినదిగాని, శివధనుస్సు విదితమైనందునంగాదు. ఇది ఉత్తవిత్తుసాహిత్యము గాదు, అబ్రవీత్తుసాహిత్యముగానున్నది.

జను.—నీ వెట్లు నిరపరాధుఁడ వవుచున్నావు?—నీ వెట్లు నిరపరాధుఁడవు?
1167 అన్నం దెలుఁగగును.

౫౦ - వ పుట.

జాను.—గంధ దిగ్ధముఖంబగు శిలీముఖంబునునాటి నాయుల్లమునుఁ జల్ల
1168 జేయుచున్నావు.—

గంధమనఁగా పరిమళము, వాసన, పరిమళద్రవ్యము. ఇట ద్రవ్యమే అయినను కస్తూరి, జవ్వాది, అత్తరు, లోనగునవియెల్ల గంధములే గాని వానివలనశైత్యము

గలుగదు; చందనమువలనం గలుగును. మూలములో చందనదిగ్ధమ్మని యున్నది. దాని నిట్లు చెఱచినారు. తెన్గులో చందనమునకు గందమని పేరుగాన, తత్ప్రకృతియైన గంధశబ్దంబును చందనవాచకము యని భ్రమసి వీరిట్లు ప్రయోగించినారు. సాహిత్యము మిఱుమిట్లు గొలుపుచున్నది.

ఆ॥ ఓరి రామ కామవైరికార్ముకమర్శ। ఘాతజాతపాతకాకఠోర
1169 ధారమికు తారమారసీతాకర। గ్రహణమఱఁగనీదు గళముఁ ద్రెంచు.

మూలములోని యను ప్రాసలాలిత్యము మూలపదగ్రహణముచే ఈ తెన్గున వచ్చినది. ‘ఠోర’ యని యాశ్చర్య పడుట అన్యాయ్యము.

హేరామ కామరిపుకార్ముకమర్శఘాత। సంజాతపాతకతవైషకఠోరధారః
సీతాకరవ్యతికరప్రతిబద్ధబన్ధః। కణ్ఠం పురా విశతినిష్కరుణః కృపాణః.

చ॥ ఎఱుఁగుదె జామదగ్ని గుహుఁడే పునఁ జేసినియుద్ధమూని నా
[4] నెఱకయి బల్మిఁ బోకడఁప నేరక క్రోధముతోడఁ జూచెను
1173 క్కఱియను గాలకంధరకరాంచితకాంచనగర్భమస్తకం
బుఱునని యాస్యవైఖరి నెఱుంగక నెదె బలము న్మదీయముల్.

మూ.— జానీషే న హి జామదగ్న్యమపి రే యద్దీర్ఘదోఃకన్దళ
ద్వన్ద్వాస్కన్దితబాహునా రణభువి స్కన్దేన మన్దాజసా
నాస్రాక్షీ ద్భుజసంపదం మమ కథం వక్త్రానుసారా దితి
క్రుద్ధే నోద్ధత మైక్షి శఙ్కరకరన్యస్తం విధాతుః శిరః.

ఇందుల తాత్పర్యము.—కుమారస్వామి జామదగ్న్యునితో బాహుయుద్ధము చేసి అందు తన బాహువులను జామదగ్న్యుఁడు కదలనీక అతని రెండుబాహువులతో పట్టుకొనఁగా తాను ఓడిపోయి, నిర్వీర్యుఁడై తనకు తలలసంఖ్యకు సరిగా చేతులను [౧౨ చేతులను] బ్రహ్మ యేల సృజింపఁ డాయెనని శంకరకరగత బ్రహ్మకపాలమును క్రోధముతో చూడసాగెను.—దీనికి అర్థము తెలియక, ఈ చమత్కారమెల్ల నీ తెనుఁగున నేలఁగలిపినారు. పంతులవారు పద్యమును పాడుచేసిన విధమున మహావినోదమున్నది. 1. నాస్రాక్షీత్—ఇది సృజ [సృష్టిచేయుట] ధాతువుయొక్క లుఙ్ని ఎఱుంగలేక, అచ్చుతప్పని తలంచి, నాద్రాక్షీః అని దృశధాతువుయొక్క లుఙ్మధ్యమపురుషైకవచనముగా దిద్దుకొని, యిట్లు తెనిఁగించినారు. 2. వక్త్రానుసారాత్ = ఆస్యవైఖరిన్, నాద్రాక్షీః = చూచితివిగావా. = కనెదే. 3. మమ భుజసంపదమ్ = బలము న్మదీయముల్, ఇతి = అని.—4. ఈఱుల్—ఏమి యఱు ననఁగా

బ్రహ్మకు శిరశ్ఛేదము ఊఱును. ఏలయనఁగా కుమారస్వామికి అపజయ మగునట్లుగా లలాటలిపి లిఖించినందువలన;—అని యూహింపఁగలనీ యున్నది. పంతులవారు అప్పటి బి. ఎ. సంస్కృతవిద్యార్థులతో నేని గలిసి యీగ్రంథమును పఠించియుండిన నిట్టిపొరఁబాట్లు తప్పియుండును. ఇట్లు మార్చిన మూలార్థము వచ్చును.

ఎఱుఁగవె జామదగ్న్య నని నెవ్వఁడు దోర్యుగి నాత్మ బాహులు
క్కుఱ బిగఁబట్టి షడ్వదనుఁ డైశకరస్థము ఘాతమస్తముక్
చుఱచుఱఁ జూచె మూర్ధములచొప్పున లెక్కఁగ బాహుసంపదన్
బఱపమి యేమి నా కనుచుఁ బాయక రోషకషాయితాక్షుఁడై.

రాము.— ఔచుందుము !

శా॥ నీతోఁబోటునుమాటయంటయనుజన్నే మాకువిప్రోత్తమా
[6] ఖ్యాతుల్మీరలుసద్బలాఢ్యులరుమేమాచుందుమద్యున్నతే.
179 లక్ష్మ.—సత్యమేయిది.

నీతంబేకగుణంబుమాకువిలుపూన్కిన్ జెండ్లకున్ మీకనన్
ఖ్యాతంబౌనవమాగుణంబుబలమైయజ్ఞోపవీతంబిలన్.

రామ.— భో బ్రహ్మన్ భవతా సమం నఘటతే సంగ్రామవార్తాపినః
సర్వేహీనబలా వయం బలవతాం యూయం స్థితా మూర్ధని.

లక్ష్మ.— జామదగ్న్య ఏవ మేతత్.

యస్మా దేకగుణం శరాసన మిదం సువ్యక్త ముర్వీభుజా
మస్మాకం భవతాం పున ర్నవగుణం యజ్ఞోపవీతం బలమ్.

మూలోత్తరభాగము—మాకు రాజులకు ఏకగుణమైనవిల్లు బలము, మీకు నవగుణమైన యజ్ఞోపవీతము బలము;—అని. మాబల మేకగుణము మీబలము నవగుణము, అనఁగా, మాబలమునకు మీబలము తొమ్మిదిమడుంగులు, అని పరశురాముని బలాధిక్యత నంగీకరించిన ట్లభినయంబును, మావింటికి ఒకదారమే మీయజ్ఞోపవీతమునకు తొమ్మిది దారములు అని యర్థాంతరముచేత హేళనంబును నిబద్ధములు. ఉర్వీభుజులకు మాకు బ్రాహ్మణులకు మీకు అని విప్రక్షత్త్రియజాతి సామాన్యాన్వయిగా పల్కినమాట. అర్థాంతరమందు నూతనమైనగుణము [దారము] గలది యని నవగుణ శబ్దమునకు చెప్పకొండి, జీర్ణత్వాదికారణములచే తఱుచుగా నూతనయజ్ఞోపవీతముం దాల్తుఱగదా.—ఇందువలన ఏకగుణనవగుణశబ్దములు బహువ్రీహిసమాసములు. అందొక

దానిని ఏకగుణమును గ్రహించి వానిచేతి రాతి సామెతగా పంతులవా
ప్రయోగించినందున వారి కర్థమైనను గాకపోయినను విద్యార్థు
అర్థముచేసికొవచ్చును. 1. నవగుణమును వారు యథావిధిగా ష
ధారయముగా గ్రహించిన ట్లగపడుచున్నది. కర్మధారయమైన
ల్లింగముగా నుండవలదా? ఏమిసాహిత్యమిది? మఱి తొమ్మిదిమం
ద్వి, త్రి, చతుర్, పంచము, షట్టు, సప్తము, అష్టము, నవము,
సంఖ్యావాచకములను తత్సమీకరింప మహాసంకల్పముచేసినారా?
చేయరాదు!

2. సద్బలాఢ్యులరు—ఈసత్తేలని గిన్నెలకు. 3. ఔచుంద
పున్న ఒకవ్యాధి లేకున్నట్లుగదా? 4. పూనిక—పాదమును చెఱచి

5. పంతులవారు నాలవపాదమందలిబలశబ్దమును మూడవపా
మునకు విధేయముగా గ్రహించిన ట్లగపడదు. 6. సువ్యక్తమును పు
మందు శరాసనమునకు విధేయమునుగా గ్రహించినట్లు తోఁచుచు
న్నట్లు అగపడుచున్నది: సువ్యక్తమునునది క్రియావిశేషణము
యర్థము. పూనిక లేకున్న బలిమిగానైన విల్లును బలముతో న

౫౧-వ పుట.

జామ.—అహా! ఈరాచకొమరునిమాటనేర్పు! . . .

ఈరాచకొమరుని—మూ. క్షత్త్రియవటోః. పంతులవారి
[1] తెలియలేదు. సంస్కృతనాటకాపరిజ్ఞానము తెల్లముగు
1180 తిరస్కారముం దెలుపును. నిందయందుఁ బ్రయోగిం
మూలములలో ప్రయుక్తము. 'రాచకుఱ్ఱని' అనిన నాస్వారస్యము
మహావీరచరిత్రలో జనకుఁడు పరశురామునిగుఱించి "కన్తే ర
వటు ర్విషహ్యః" అని వటుశబ్దప్రయోగము చేసినందుల
"ఆః దురాత్మన్ క్షత్త్రియాపసద, మా మేవం వటు రి త్యధిక్షే
తిట్టిన ఘట్టముంగనుఁడు. ప్రయోగాంతరములు పెక్కులుగలవు

లడప్రాసభాగ్యము.

మ॥ తొడరన్ సంగర మందు దేనిదియయా దుర్వారధారా
[12] గడుసీరేణుక మయ్యెక్షత్త్రశిశు రక్తవ్యాప్తి చేధా
1192 క్కుడఁదద్బాల కులస్వరించుసుమనః కన్యాళి లీలా
జ్జ్వలదామంబుల దౌవరాగమున నాస్వర్గంబు చే

మూ.—యత్ర క్రామతి సంగరాఙ్గణభువం దుర్వార ధారాఞ్చల
క్షుణ్ణక్షత్త్రకిశోరకణ్ఠ రుధిరై ర్నీరేణుకా భూరభూత్
తాదృగ్బాలవర స్వయంవర పర స్వర్లోక కన్యాకర
క్రీడాపుష్కరదామ రేణుభి రభూ ద్ద్యౌ రేవ రేణూత్కటా.

ఏకుతారము రణాంగణమందు చరించుచుండఁగా, దుర్వారమైనవాఁడియొక్క అంచుచేత నఱుకఁబడిన క్షత్త్రియశిశువుల కంఠముల రక్తములచేత భూమి నీరేణుక యైనదో, (మఱియు) అట్టిబాలవరులను తామే వరించుటయందు ఆసక్తలైన స్వర్లోక కన్యలయొక్క కరములందలి క్రీడాపద్మమాల్యములయొక్క రేణువులచేత ఆకాశమే రేణుభూయిష్ఠ మాయెనో, [అట్టికుతారము లక్ష్మణుని బాలుఁడని క్షమింపదు, అని పూర్వమున కన్వయము].

పద్యములో నాలుగుప్రాసములును బాదపూరణములే. 1. తోడరఁ, 2. కడుఁ, 3. అక్కడఁ, 4. ఉజ్జ్వల. 5. దేనిదియయా = దేని. 6. దామంబులదో = దామంబుల.

7. తోడరఁ—ఇది క్రామతికి తెనుఁగని వాదింతురు. ఆపక్షమున దీని కర్త యేది? మూలములో నేది యనిన, యత్ర కర్త. యస్మిన్ క్రామతియని యర్థము. ఏకుతారము చరించుచుండ నని భావము. పంతులవారియన్వయ మెఱుంగక వాట్సూకమ్ తర్జిమాగా క్రామతికి తోడరనని మొదటవేసి, 8. యత్రకు అక్కడనని తుదను [పూర్వ వాక్యముతుదను] వేసినారు. యత్రకు ఏకుతారమనియర్థమేగాని, ఎక్కడ నని గాదు. 9. దేనిదియయా—అవధారణార్థకమయిన [అ] కారమేల? అక్కడ ననఁగా స్వర్గ మందు అని వాదింతురు గాఁబోలు. ఆపక్షమున నప్రసక్తము. సంగరమందనివాదించుచో, యత్ర కిది తెన్గుగాదు., ప్రాసపూరణమాత్రమే, 10. సంగరమందని నియమించుటచే వారిశవముల నని యేర్పడును. 11. స్వర్గంబుఁ—ఆకాశమని చెప్పవలయును. పరాగమున "నభ్రంబెల్ల" అన్న సరిపడును. 12. రేణూత్కముఁ—మూ. రేణూత్కటా. ఇట పంతులవారు, ఏకదేశవికృతస్యానన్యత్వాత్తనున్యాయము, నవలంబించి నట్లున్నది. ఒకటువర్ణమేగచా మానినారు. ఉత్కశబ్దమునకు కోరికగలది యర్థము. "ఉత్క ఉన్మనాః"—అమరము. అదే పాణినీయసూత్రంబును. "తచ్ఛ్రుత్వా తే శ్రవణసుభగం గర్జితం మానసోత్కాః" మేఘసందేశము. ఇష్టమైనశబ్దము వేసికొని దానికిష్టమైనయర్థము చెప్పుకొనెదమని ప్రతిజ్ఞయా?

౫౨-వ పుట.

ఓరాజ్ఞా ఓరుద్రాక్షధారివగుము!

శా॥ ఓరుద్రాక్ష సరోజ్జ్వలద్గళులు గండోశ్రోత్రి యక్షత్త్రియుల్
ఘోరాజింబొనరింపశక్తియెదిమీకుంగోర్కి వమ్మేయవుఁ
[8] 1209 వారస్యల్గద పంచశాఖకలితప్రాంచత్కృపాణోరుధా
రారాద్ధూత రిపుద్విపాత్తమదపంకాళుల్ప్రవీరుల్ వరుల్.

మూ.—యుష్మాకం భో ఽస్ఫుఘటితబహు న్యస్తపద్మాక్ష కణ్ఠా
మిథ్యోత్కణ్ఠా కి మితి సమితి క్షత్త్రియ శ్రోత్రియాణామ్
తేఽన్యే చఞ్చత్కరతల చలచ్చణ్డ నిస్త్రింశ ధారా
ధౌతారాతి ద్విపమదమషీ పఙ్కపూరాః ప్రవీరాః.

మీరు రాజన్యశ్రోత్రియులరు తాపసవృత్తి నున్నవారు, మీకేల యుద్ధాసక్తి? కరకలితచండకృపాణధారలచే శత్రుగజమదమషీపంకమును కడుగునట్టిప్రవీరులు మీబోంట్లు కారుగదా?—అనఁగా ఆప్రవీరులు కత్తి కేలఁ బూని రణాంగణమున నగపడినమాత్రాన తద్దర్శనముచే శత్రుద్విపములు తమ్ము వారు చంపివేయుదురని భయాకులములగుటచేత వానిగండతలములందలి నల్లనిమదజలము లింకిపోవునని యుత్తరార్ధమున భావము.—పద్యములో, 1. ఓశబ్దముచేత పూర్వార్ధము, 2. ధూతశబ్దముచేత నుత్తరార్ధమును చెడిపోయినవి. సంబుద్ధమునకుం ముం దోకారముసరి, విధేయము మునకుముం దోకారము పెట్టుట యెట్టిది? ఓశ్రోత్రియక్షత్త్రియులారా రుద్రాక్ష సరోజ్జ్వలద్గళులు గండు అనవచ్చును. 'ఓరుద్రాక్షధారులారా శ్రోత్రియక్షత్త్రియులరుగండు' అనవచ్చును. రెంటను ఓకార ముంచుట భాషగాదు. సంబుద్ధ మేదో విహితమేదో సందిగ్ధము. శ్రోత్రియులను రుద్రాక్షలు ధరింపుఁడనుట సిద్ధసాధనము. రుద్రాక్షధారి క్షత్త్రియులను శ్రోత్రియులు గండనుటయు సిద్ధసాధనమే. కాన నిందేదియు రెండవదానికి విధేయము గాఁదగదు. 3. మూలములో ఇవి రెండును [యుష్మాకమ్]జనకాదులకు అనువాద విశేషణములుగానే యున్నవి. 4. ఈగండును గుండువేసికొట్టిన పూర్వార్ధమున కర్థముకల్గును. ఉత్తరార్ధములో 5. ఆత్తశబ్దముచే నొకస్వారస్యము కలిగినది. ఏమన కృపాణధారచే ధూతమై మదపంకము రిపుద్విపములచేత పొందఁబడినదని. మూలకారునిహృదయ మేమనఁగా—రిపుద్విపములమదపంకము పోయినదని. దానికి కేవలమువిరుద్ధ మర్థమగునట్లు రచించుట కౌశలవిశేషము గదా? ఈపాడుపాదపూరణము లేకపోయిననేమి? ద్విపేంద్ర అనిప్రాసికోరాదా? —ధూత— 6. ధారాశబ్దమందు జలధారయని శ్లేషయభిప్రేతముగాన ధౌతయన

వలయును. మదమషీపంకమని యుండ 7. మషిని త్యజించుట సరిగాదు. ఏనుఁగుమద మునల్లగా కాటుకవలెనుండును. వీరు ధాతయనుటకు ధూతయనుట యిది రెండవ మాఱు ఈవిమర్శ ౧౫౫-వ పుటచూడుఁడు. 8. కోర్కి-వమ్మె యగున్—అశ్లే అయినది.

౫౩ - వ పుట.

పరశురాముఁడువక్త.

[2] అయ్యై యుద్ధంబులందున్ హతనృపతిశిరోవాప్తిఁగా పాలికంబై
1202 తియ్యంబౌ నక్షమాలన్ దివిరి యిడుదు వందింతుఁ దక్షేత్రపాలున్.

1. ఇడుదున్—నేను ధరింతునని యర్థమా? లేక, క్షేత్రపాలుని కొసంగుదు నని యర్థమా? ద్వితీయపక్షమున క్షేత్రపాలున్ అని ద్వితీయ సంప్రదానము నెట్లు తెలుపును? అదిమాన్వయమందే విభక్తివిపరిణామము అన్యాయ్యము. "తివిరి యొసఁగి వందింతు" నన్న ఇంతకన్న మేలు. ఇట వందించుట ప్రధానముగా వివక్షితము గాదు, ఇడుటయే ప్రధానముగా వివక్షితము. కావున ఏకవాక్యకరణముచే నేకప్రాధాన్యమును సూచింపవలయును. 2. శిరోవాప్తి—అన్యత్రచర్చితము. "హతనృపతిశిరఃప్రాప్తి" అన్న నప్రయుక్తతాదోష ముండదు.

" వినాయకం ప్రకుర్వాణో రచయామాస వానరమ్."

మ॥ కొనుచున్నీవు ప్రసన్నభావమును వాగ్దోషంబు నాదెన్నకిం
1203 కెనయించెన్మదిఁ గిన్కనుం బలుమఱున్ హోరాళముంగా యశం
బను విత్తంబును జిత్తముం గితవునట్లత్యంతముం బాపునీ
ఘనతన్మిన్నక పల్కకుండుము జగత్ఖ్యాతుండవో భార్గవా.

దీనికిపంతులవారికి దొరికిన తెలుఁగుముద్రణమందలి మూలము:—

ప్రసీద న్వాగ్దోషా ద్విరమ కురు మే చేతసి గిరం
చిరం యత్సాయానై ర్బహుభి రిహ వారై శ్చిత మభూత్
యశో విత్తం చిత్తం కితవ ఇవ విక్షోభ్య తరళ
స్తదేకస్మిన్ వారే భృగుతిలక మా హారయ ముధా.

ఈపద్యమున కర్థము చెప్పుట దుర్ఘటము సరియేగదా మూలమునకు సరిపెట్టుట యంతకన్న దుర్ఘటముగనున్నది. ఈతీరున నుండునని తోఁచెడిని:—

ప్రసీదన్—కొనుచున్నీవు ప్రసన్నభావమును, మేవాగ్దోషాద్విరమ—వాగ్దోషంబు నాదెన్నక, చిరమ్—ఇంక, కురు చేతసి—ఎనయించె న్మదిన్, గిరమ్—కిన్కనున్, బహుభిరిహ వారైః—పలుమఱున్, సాయానైః—హోరాళముంగా, యశో విత్తమ్—

యశంబనువిత్తంబును, చిత్తమ్=చిత్తముకా, కితవఇవ=కితవునట్లు, విక్షోభ్యతరళః= అత్యంతము న్యాపునీఘనతకా, [తదేతస్మిన్ వారే,దీనిని వదలి వేయుదము], భృగు= ఓభార్గవా, తిలక=జగత్ఖ్యాతుండ, ముధా=మిన్నక, మాహారయ=పల్కకుం డుము.

కర్త యేది కర్మ యేది యని ఇత్యాదితుచ్ఛప్రశ్నలు వేయవలదు. ఈరీతిగా తెనిఁ గించుట తప్పుగాదు. ఇట్లు వ్యాఖ్యచేయు సంప్రదాయము కగిలినదేగాని లేనిదిగాదు.

చెప్పులోనిరాయిచెవిలోనిజోరీఁగ । కంటిలోనినలుసుకాలిముల్లు
ఇంటిలోనిపోరునింతింతగాదయా । విశ్వదాభిరామవినరవేమ.

చెప్పు=గురూపదేశమును, లోని=హృదయములో, రాయి=వ్రాసికొను ము; చెవి=దుర్మార్గులుచెప్పుమాటను, లోని=హృదయములోనికి, జోరీఁగ=చొర నీయకు. కంటి=చూచితివా? లోనినలుసు=లోపలినలుసును, హృదయములో నినరసింహస్వామిని; కాలిముల్లు=యమునిదండము [నరసింహభక్తులను] ఏమియుం జేయఁజాలదు. ఇంటి=వింటివా? లోనిపోరు=లోపలియరిషడ్వర్గము యొక్క పోరాటము. ఇంతింతగాదయా=ఇంతవింతకాదయ్యా, అది యెంతవింతయో! విశ్వ.

పంతులవారికి కొంచెము నాగరలిపి పరిచయమున్న నీపద్య మింతపాడై యుండదు.

ప్రసీద త్వం రోషా ద్విరమ కురు మే చేతసి గిరం
చిరం య త్సాయాసై ర్బహుభి రిహ వారై శ్చిత ముభూత్
యశో వృత్తం విత్తం కితవ ఇవ విక్షోభతరళ
స్తదేతస్మిన్ వారే భృగుతిలక మా హారయ ముధా.

దయసేయుము, కోపము మానుము, నామాటమనస్సున కెక్కనిమ్ము; ఓయి భృగువంశాభరణా, చిరకాలము క్లేశపూర్వకముగా నీవార్జించినయశశ్చరితమును, కలఁకఁబాఱిన జూదరి ధనమునుం బోలె ఈమాఱు వృథాగా ఓడిపోకుము.—అని యర్థము. పద్యమునకు దీనికిని తారతమ్య మారయుఁడు.

[1] 1204 ఆ॥ వాగ్విడంబనైకవైదుష్యులైనమీ । యెడనుబ్రచురవాణియేమిటికిటఁ
బరులయనురుగొనెడుశరములనావాని । నైఁపుడీరలెల్లనైరణమెయి.

దీనిమూలములో చతుర్థపాదము " సర్వేపి యూయం సహితా స్స్వహంభ్వవ్,"—మీరలెల్ల కలసినైఁపుఁడు—అనియర్థము. 1. సహితాః అనఁగా నైరణకలవా రైయనుట సమంజసముగాదు. నైఁపుఁడు అనుటచేతనే అయర్థము వచ్చినది. అం

పటిని యోగపద్యముగా నాశముచేసెద ననియు, అందఱుం గలసివచ్చినను నన్నో ర్వఁజాల రనియు భావము.

౫౮ - వ పుట.

చ॥ కులిశకఠోరమైనవిలుకోలది భగ్నమె భగ్నమయ్యెనా
వలననునీహృదిన్ శరము వైఖరి మగ్నమె మగ్నమయ్యెనే
మొలయును శైవమైన మఱియున్ విలు వైష్ణవమైన నేమి నా
బలుపగుదోర్విలాసము ధ్రువంబు గణింపదు దేని నేనియున్.

మూ.—— తతోఽర్ధం కులిశకఠినం భగ్న మేతేన భగ్నం
మగ్నం శల్యం తవ హృది మహా న్మగ్న మాస్తావతా కిమ్
త్రైయక్షం వా భవతు యది వా నామ నారాయణీయమ్
నైత త్కించి ద్విగణతి మే దుర్మదో దోర్విలాసః.

**1.** ఏతేన — నావలన, ఇది భగ్నమునకు కర్త, పద్యములో భగ్నమునకు కర్తయో మగ్నమునకు కారణమో, సందిగ్ధముగా నున్నది. రెంటి నర్థము వేఱగుట చేత రెండు నవసరము. మగ్నంశల్యం తవహృది—నీహృదయములో శల్యముగ్రుచ్చుకొన్నది. ఇట **2.** వైఖరి నని యుపమావాచకము ప్రయోగించుటచే మూలము మందీకృతమైనది. **3.** ఆస్తావతాకిమ్ — ఏమొలయు ననుట నసుగటు. **4.** నాబలుపగుదోర్విలాసము—బలుపగు ననురచన అసహ్యముగా నున్నది. బలితపు అన్న బాగుగా నుండును. శైవమైన మఱియున్ వైష్ణవమైన నేమి? **5.** మఱియున్ -ఈయతిపూరణము లేకున్న నెంతయు బాగుగానుండును. ఇదితప్పదుగాన, విలు శైవమైనను మఱియును వైష్ణవమైనను, అనియేని శైవమైనను విలు మఱియును వైష్ణవమైనను, అనియేని యున్న సరిగా నుండును.

జాము.——...ఏమిరా! ఏరా! [కులిశకఠోరమైనయనుపద్యమును చదువుచున్నాఁడు].
రాము.——ఇది పలుమాఱు చెప్పఁబడుచున్నదే? [అదేపఠించుచున్నాఁడు]
జాము.——బాగు. ఇందుచేతనే నేను స్మరింపఁబడుచున్నాను?
రాము.——అదేమి?

తెనుఁగులిపిముద్రణములో మూలము.

జాము.——...కిమర్థ రే [తతోఽర్ధమిత్యాది పఠతి.]
రాము.——నన్విదం భూయో పృచ్ఛ్యతే. [త దేవ పఠతి].

జాము.—సాధు, కిమనేన స్మారితోఽస్మి.

రాము.—కింతత్. ?

నాగరముద్రణములో మూలము.

జాము.—కిమాత్థ గే! కిమాత్థ । త దేవ పఠతి ।

రాము.—సన్విదం భూయోఽభ్యుచ్యతే । పున స్తదేవ పఠతి ।

జాము.—సాధు స్మారితోఽస్మి.

రాము.—కింతత్

జాము.—ఏమంటివిరా, ఏమంటివి! [అనియదేపఠించుచున్నాఁడు.]

రాము.—ఓయి, ఇదె మఱల చెప్పెదను. [మఱల అదే పఠించుచున్నాఁడు].

జాము.—చక్కఁగా జ్ఞప్తియైనది,

రాము.—ఏమది?

తెలుఁగుముద్రణమందలివాక్యముల కభిప్రాయమును క్లేశముచే నెఱుంగవలసి యున్నది. **1.** "భూయస్—అవ్యయమ్. భువే భావాయ యస్యతి యస భావే క్విప్ । పునరర్థే" శబ్దస్తోమమహానిధి. కాన పలుమా ఱనుటకన్న మఱలననుట మేలని తలంచెద. **2.** స్మరింపఁబడుచున్నాను— స్మారితః అనుపదము ణిచ్చుపై క్తాంతమైనది. కాన ప్రేరణార్థము కలదు. కాన స్మరింపింపఁబడితిని అనవలయును. పంతులవారు ప్రేరణాప్రేరణములభేదమును కనిపట్టలేమి శోచనీయముగా నున్నది. **3.** నేను స్మరింపఁబడుచున్నాను అనఁగా నన్ను జ్ఞప్తిచేసికొనుచున్నా రని యర్థము, కేవల మూలవిరుద్ధము. **4.** ఇందుచేతనే— ఇట మిపర్ణము అచ్చులోపొరఁబాటుననష్టమైనదా లేక వీరు చేసిన తెలుఁగే యిదా? వీరిమూలములో **5.** కింశబ్దమున్నది. వీరి తెలుఁగులో అవధారణార్థకము ఏకారమున్నది. అవధారణమే ఆంధ్రీకర్తకు సమ్మతమేని ఇందుచేతఁగాదని యాప్రశ్న కుత్తరమగును, అసంబద్ధము. ఏమిశబ్దమేయేని ప్రశ్న చేయుట యసంగతము,...తా నింక ఆశ్చర్యపడవచ్చును, అదేమని రాముఁ డడుగవచ్చును.

3 పాదములు ఉత్పలమాల. ౧ పాదముచంపకమాల.

ఉ॥ దేనిదినారిప్రోఁతహరిదివ్యకరాహతిఁగల్గియంతటన్—
[11] 1225 వానినుదామభృంగములధ్వానముచేద్విగుణంబయానుర
క్తోనళినేక్షణాక్షయనుశోకరవప్రుతిపాంథకాళికిన్—
బ్రణవముభంగినానదిదివైష్ణవకార్ముకరత్నమేనుమీ,

1. వాని [=హరియొక్క] పూజ్యోచితము గాదు. 2. సుదాము, 3. సుశ్లోక—ఈపాదపూరణ సువర్ణము పంతులవారికి కడుం బ్రియముగానున్నదిగాని, ఇందులో ముఖ్యముగా రెండవపదములో నూ పెట్టుకొనుటకన్న కవనమును పేరెత్తకుంట మేలు. అట్లుచేయ నిష్టముగాదేని యీకవమునకు ఆపేరు పెట్టుకొనఁదగును. ఇట్టిపాడుకవన మేలచేయవలయు? 4. ద్విగుణంబ—అకారము పాదపూరణము. 5. అవధారణ మసంగతము. 6 రత్నమేనుమీ—ఈయేకారమును ఇదిశబ్దముతో చేర్చి ఇదే అన్నను బాగుగానుండును, అది శబ్దమును ఆయనిమార్చి ఆవైష్ణవాచార్యకరత్నమే అన్నను సరిగా నుండును. ఇప్పుడున్నవిధము హృదయంగమము గాదు. ఆ రాముఁడే వచ్చె ననుటకు, వాఁడు రాముఁడే వచ్చె ననునంతటి తెలివి ఆంధ్రుల కంటకికిని ఇంకను రాలేదు. 7. అదిది వైష్ణవాచార్యకరత్న మనుటకంటె, ఇదదివైష్ణవాచార్యకరత్నమనుట తెలుఁగువలె నుండును. 8. దేనిదినారి—ఈపాదపూరణదినర్ణమునకు అలవాటు అయినారము. 9. పాతరాళికి—పాతకశబ్దమునకు వచించువారు ప్రథమోపస్థితార్థము. పాతమే యిట వివక్షిత మని యెటింగి స్వార్థకప్రత్యయకల్పనను గ్రహింపవలయును. 10. అదిది—పిశాచోచ్చాటనకు పనికి వచ్చును.

11. ఈపద్యములో ఛందస్సు శ్రుతి ముదిరి రాగానఁ బడ్డది. కవిగఘనవాది ప్రాసములు దుష్టసంధులు చాలక, ఆత్మస్తుతికి నన్యనిందకును ఆంధ్రభాషాసంజీవని కలవనునీరతచేత వీరు ఈయద్భుతపద్యమును రచించినారు. ప్రాస మొకపాదమున గురుపూర్వక మయిన నన్నిపాదములందును అట్లే యుండవలయు ననునియమము ఎగిరినది. ఉత్పలమాలలో తొలిగణము భగణమను నియమంబును ఎగిరి పోయినది. ఇంకను భగణమున నన్నియు లఘువులే యనియు, లఘువులు రెండె ననియు, ఇత్యాదివాదములు ఆంధ్రభాషాసంజీవనిలో నుప్పతిల్లవా? ఇట్టివారిచేతఁబడి భాషాదేవత యెన్నికడగండ్లపాలయినది! ఆమెకు స్వర్గమం దేమయిన శాపము తగిలియుండునా?

[3] 1228 ఆ॥ శార్ఙ్గి కేలువమ్మిఁబలుపులీలలనేది । శార్ఙ్గమద్దియిద్ది చాపరత్న
మిడుకొనంగవలఁతి వేని కైకొనుమిడు|కొనఁగఁజాలవేనియును విడువుము.

మూ.—కరపద్మేరుహక్రోడే క్రీడితం యేన శార్ఙ్గిణః
తదేతద్యది శక్నోషి గృహాణ విగృహాణ వా.

1. చాపరత్నము—పాదపూరణము. శార్ఙ్గిచేతిశార్ఙ్గమనుటకన్న చాపరత్నమనుటచే విశేషణమేమి? 2. ఇడుకొనంగ—సాధింప ననవలయును. 3. విడువుము—ఇదితప్పు, పోరుము [నాతో] అనియర్థము. విగృహాణ అనుమాట కర్థము తెలియ

కయే నీతిచంద్రిక విగ్రహతంత్రము వ్రాసినారఁట! "యత్కృతేరిన్ విగృహ్ణీయు" భట్టి. "భగ్ననా విగృహీతోఽస్త్రం భూయాసం జీవకః కథమ్" భట్టి. "విగృహ్య చక్రే నముచిద్విషా బలీ" మాఘ. ఇత్యాదులం గనునది. ఇక్కడిసాహిత్యమున కాశ్చర్యపడునది!

ఉ॥ పొందదు శైవమైనవిలుపోలికనీయదిభంగసంగతిన్
[15] 1243 మందచలద్భుజుండయినమారఘురాముని చేతనీతఱిన్
బొందుగఁజక్రమట్లొనరెఁబూర్ణముగాఁగనువంపఁబడ్డదై
యందమునైనవైష్ణవశరాసనమియ్యదివింతయెంతయున్.

1. మారఘురాముని చేత—అని పేరుగూర్చితమ్ముఁడు అన్నను పలుకుట యనుచితము. మూలములో అన్న యనియర్థముగా ఆర్యేణ యనియున్నది, "ఆర్యేతి చాగ్రజః" సాహిత్యదర్పణము. 2. మఱియు నితఁడు "రఘు" అనుటచేత తాను అనఁగా లక్ష్మణుఁడు రఘువంశ్యుఁడు గాఁడని యర్థమగుచున్నది, అది యొకస్వారస్యము! మఱియు రఘువంశ్యమహిమాతిశయధ్వననమా యనిన, వాక్యములో నట్టిదేమియు లేదు. విల్లు విఱుగకుంట దానిసారమేగాని రాముని మహిమ గాదు.

మాశామ్భవం ధనురివేదమపి ప్రయాతు । భఙ్గప్రసఙ్గమితి మన్దచలద్భుజేన
ఆర్యేణ కార్ముకమపీదమహో సహేలం । చక్రీకృతం భగవతో గరుడధ్వజస్య.

శివునివిల్లువోలె నిదియు విఱిగిపోవునేమోయని వెఱచుచు మెల్లమెల్లనే కేలఁబూని, ఆహా! అన్న అవలీలగా ఈ హరిధనుస్సునుగూడ చక్రాకారముగా వంచినాఁడు.—అని యర్థము. దీనింబట్టి పంతులవారి పూర్వార్ధ మెంతపాడయినదో యెఱుంగవచ్చును. 3. "పొందును శైవమైన విలుపోలిక నిద్దియు భంగ 4. మన్మతిన్" అని మార్చిన సరిపడును. 5. "నప్రయాతి" అనఁగా "పొందదు" గాని, "మాప్రయాతు" అనఁగా "పొందదు" గాదు, "పొందకుండుఁగాక" అని యర్థము. 6. మూలములో రాముని తలంపుగా నున్నది. ఇందులో కవనము కుదురక ఆవిశేషము త్యజింపఁబడినది.

ఒకటి రెండు పాదపూరణంపుఁబులకండంపుఖండములం జూపెద.— 7. ఈ తఱిన్—పా. 8. పొందుగ—ప్రా. 9, 10, 11. పూర్ణముగాఁగను వంపఁబడ్డదై—య. పా. [ఈయరణ్యరోదన మెల్ల చక్రమట్లొనరె ననుటలో గతార్థము.]

12. అందమునైన—ప్రా. [ఇది సహేలమునకు తెనుఁగందురు. 13. సహేలము చక్రీకృతమునకుం గ్రియావిశేషణముగాని కార్ముకమునకు విశేషణము

గాదు.] **14, 15.** వింత యెంతయుఁ—పా. [అహో అనుదానివలె, ఆశ్చర్య ద్యోతకశబ్ద ముండవలయునుగాని, ఈటీక యేల ?. పాఠముచెప్పువారు దానికర్థము గా నీమాట చెప్పుకోవచ్చును.]

౫౫ - వ పుట.

సుయవతీ! లడప్రాసము.

మ॥ స్ర॥ పాడమెఁ శ్రీరామబాణంబు మొదటవిలసత్పూర్ణ బాణాసనానన్
[18] గడిమిన్మిన్నంటెనంతంగలఁచెభృగుసుతఖ్యాతనాకాధ్వమున్వే
1261 తెలిపుట్గా నాఁగనెప్పింద్రిదివసుయవతీదివ్యపుష్పాంచితంబై
గడుఁగీర్తింగాంచివచ్చెంగదినిపాదికలంకారముం జేయఁజాలన్

మూ.— ఉద్భిన్నశ్చాపచక్రాదమరపరిహృతవ్యోమరథ్యావగాహీ
బాణోయంరాఘవస్య త్రిదశపురగతిచ్ఛేదకృద్భార్గవస్య
హంసీభూతస్సురస్త్రీకరకమలగళత్పుష్పసౌరభ్యలుభ్య
ద్భృఙ్గీసంగీతభఙ్గీపరిచలితయశాస్తూణపర్యఙ్కమేతి.

రామబాణము చక్రీకృతమైన ధనుస్సునుండి ఁడున్సి, దేవతలు తనకు దారితొలఁగి యేగ, ఆకాశావకాశమునంబోయి, భార్గవుని స్వర్గగతిని ఛేదించినదై, అమరాంగనలు గురిసిన పువ్వుల పరిమళమునందు లుబ్ధములై తదనుసారముగా చేరినతుమ్మెదల గానములచేత వ్యాపించిన తన యశస్సుచేత తాను హంసమై, వచ్చి తూణమనెడుమంచమును చేరుచున్నది. శ్లోకమునకుం బద్యమునకుంగల యంతరముం గనుఁడు. **1.** చక్రీకృత మనుటచే ఆకర్ణాంతము లాగఁబడిన దనిభావము. **2.** చక్ర మనుటకు బదులు పూర్ణ మనుట నప్పుటకు బదులు ఏడ్చుటగానున్నది. **3.** అమరపరిహృతవ్యోమరథ్యావగాహీ — స్వర్గమువైపు బహుదూరముపోయిన దనియు, అమరులకుంగూడ భయప్రద మనియు భా. ఈ విశేషణముచేతనే తెలియుచున్నది, అట్లు స్వర్గమువైపు పోవుట భార్గవుఁడు స్వర్గమునకుఁ గట్టుకొన్నమార్గమును కూల్చివేయుట కని. ఉత్తరార్ధమునకుం దెలివిడి.—రామజయోత్సవాభినందనముగా సురాంగనలు పూలవాన గురిసిరి. ఆపువ్వులవెంట తత్పరిమళాకృష్టములై తుమ్మెదలు వచ్చి విశేషించి సంగీతము పాడుచుండినవి. ఆపాటయే రామమహిమను లోకమెల్లం జాటుట యైనది. దానిచే రామయశస్సు వ్యాపించినది. యశస్సు తెలుపుగాన, ఆయశస్సుచే ఆబాణము తెలుపై హంసవలె నైనది. అట్లు యశస్వంతమై వచ్చి యాబాణము పటల పొదియందు మంచముమీఁదనుం బోలె పవ్వళించినది. పంతులవా

రు పులిమీఁదపుట్రగా స్రగ్ధరకు మహాస్రగ్ధర పెట్టుకొనియు మూలార్థమును పెంటా యపిచ్చికొండ చేయుటకు కారణ మూహింపుఁడు. తుపానుచే తోఁట భగ్నమైనం దులకు లాభమేమనఁగా సమృద్ధిగా [పచ్చి] వంటచెఱకు:— 4. పాదమెక్—[బాణ పనమునుండి వెలువడెనేగాని పుట్టలేదు]. 5. మొదట—పా. 6. విలసత్—పా. 7. కడిమిక్—ప్రా. 8. అంతక్—పా. 9. ఖ్యాత—య. 10. పే—పా. 11. ఔ —పా. 12. ను—పా. [దీనికై కవనము మానివేయ వలసినది.] 13. దివ్య—య. 14. కడుక్—ప్రా. 15. కలంకారముక్ 16. జేయుఁ 17. జాలక్ — య. 18. భృగుకులము వానిని రఘుకులమువాఁడే జయించెనని సూచించుటకు భార్గవస్య అన్నందులకు సరిగా రాఘవస్యఅన్నాఁడు. ఈ కాలములో ఇంతవాఁడు మఱి లేఁ డఁటగదా! ఈశ్వరా యని మూలశ్లోక మెవరియొద్దనేని చదువుకొని తదర్థమెల్లను సరిగా వచ్చునట్లు నాలుగుసీసములుగాని అయిదుపుంజీలగీతములుగాని, ఒకసా రెగాని చెప్పకోరాదా?

ఉ॥ కోకిత్రిలోకియుద్ధియెసఁగున్నని మోదము నేదితోఁచినక్
[15] ప్రాకటమావికాసమునభానిలుమానిమనోంబుజౌఘముక్
1276 శ్రీకువలాభుఁడేఁడితఁడు చెల్వగుబాలుఁడుసన్మనోహరుం
డేకరణిందదుజ్జ్వలమతీద్యముజ్యోతిజనించెనిట్లహో.

1. ఎసఁగుక్—య. [ 2. ఎసఁగున్నని యనుట కనుననుటకు భేదంకరు గుడు]. 3. ప్రాకటమా—ప్రా. 4. భానిలు—య. [ 5. వికాసమున భానిలు—వి కసిలు]. 6. శ్రీ [కువల]—ఇది కుదిరినకవనమేనా? శ్రీకువలాభుఁడఁట! 7. ఎందు లో సామ్యము? కువలయ దళశ్యామలతనుః—కలువ రేకువలె శ్యామలమైన దేహము కలవాఁడు, అని మూలము. మూలము టీకయు తెలుఁగు మూలమునుగా, నున్నవి. 8. శ్యామతలోనని చెప్పక యెట్లు తెలియును? వివక్షితము కుదురనిచో పద్యమేలచే యవలయు? ఎటుకతవలె గద్దె చెప్పకోరాదా?] 9. చెల్వగు—య. 10. సన్మనో హరుండు—పాదపూరణ మనోహరుండు, కేవలము పదముల దంపుడుగాఁడు. 11, 12. ఉజ్జ్వలమతీద్యము—పా. య.

తత్—ఈతత్తు ఏది తోఁచినక్ అనుచోటియేది కుత్తరము. ఇట 13. ఉజ్జ్వలము + అతీద్యము అని భేదమా? ఏల్లనొకటియే సమాసమా? సమాసమున ఉజ్జ్వలమతులచే ఈద్యమని యర్థవిశేషమున్నది. 14. తత్తుతోఁజేరఁగా ఉజ్జ్వలమతులచే అని యర్థమా? ఉజ్జ్వలమతీద్యమైనట్టి యల్లదియని యర్థము.? మొదటిది కాదని తలఁచినవాఁడు ధన్యుఁడు. ఏపక్షమందైనను తత్తు జ్యోతికి సంబ

వలసినది. 15. దానిని ఈ సమాసములో వేయుట యన్యాయ్యము. ఆసుందర పురుషుని, సుందరుఁ డగు నా పురుషుని, అనుటకు తత్సుందరం పురుషమ్మనుట కవి తాత్పర్య వైత్త్వ మనిపించుకొనును గావలయు! అస్థానపతితమైన యీతత్పురుష చతుర్థపాదము చెత్తయనది. "ఏకరణిం జనించె నది యీవ్యతము బగుజ్యోతి యుల్లిప్తః" అని దిద్దునది.

[2] క॥ పురవైరిశరాసనమున । శరముగ నేఁ డయ్యెవాఁ డెసఁగ బాలుండై
1278 యరిదిగనీవిల్లెక్కెడ । నరుదెంచెఁబు రాణపురుషుఁడనిమదిఁదలఁతుఁ.

మూ.— ఆపూరణాయ పురవైరిశరాసనస్య
బాణాత్మనా పరిణతః కిల లీలయా యః
ఆరోపణాయ పునరస్య స ఏవ శక్త్యా
బాలాత్మనా పరిణతః పురుషః పురాణః.

ఇందు, ఆపూరణాయ, ఆరోపణాయ,— బాణాత్మనాపరిణతః, బాలాత్మనా పరిణతః— అను పదప్రయోగములచే స్ఫురించు 1. సాధర్మ్య 2. వైధర్మ్యవిపక్షము పద్యములో సర్వముం గళంకమైనది.— పంతులవారు స్వారస్యము గ్రహింతురా?

మూలమునను తలక్రిందు.

[2] తే॥ కమలలోచన నీచేతఁ గన్నవాఁడ । నధరభావంబు నీముఖామోదితయము
1280 చేతనిఁక నీవు దేవతాశ్రేణిమౌళి । మణులనధరీకృతములఁ గాము నుపలేవె.

మూ. కమలబన్ధువిలోచన యస్త్వయా । స్వముఖామోన్నతై రధరీకృతః
న కిమసా వధరీకురుతే నర । స్త్రిదశకోటికిరీటమణీ నపి.

ఓయి కమలబంధువైన [కమలము వంటి, సూర్యుఁడనెడు] నేత్రము గలవాఁడా, ఏపురుషుని నీవు నీముఖమును చూపించినవాఁడవై యధఃకరించితివో, [నీవు ఆపాటి సరకుగొన్న] యా పురుషుఁడు దేవోత్తమోత్తములం గూడ నధఃకరింపఁడా?— అనియర్థము.

నీచే నధఃకరింపఁబడిన భాగ్యమువలననే నేను సర్వదేవతలకన్న నుత్కృష్టుఁడ నైతినని రామోత్కర్ష భావము. రాముఁడు మనుష్యమాత్రుఁడని తలంచినవాఁడేని పరశురాముఁ డిట్లు చెప్పుట కేవల మసంగతము. తదధరీకృతుఁడు తానే సర్వ త్రిదశోత్కృష్టుఁడగునెడల రాముఁడు సాక్షాత్పరబ్రహ్మస్వరూపుఁడు గావలయును. అందులకు స్ఫోరకము కమలబంధు [సూర్య] విలోచన యనుట. ఇదే రామాధరీకృతు

నను తనకు ఉత్కర్ష యనుటకు సమర్థకము. కమలబంధువునకు సూర్యునికి లోచనమువలెప్రియుఁడా అనియును అర్థము. తనవంశములో నింతమహిమగలవాఁడని సూర్యునికి ఇంతప్రేమ. కావున ఈశ్లోకమునకెల్ల ఈ 1. బంధుశబ్దమే ప్రాణభూతము. పంతులవారు దానినే తీసివేసినారు. కమలలోచనముచేతనే హరిని సాధించెదమందురు. అయినను స్ఫోరకము నెత్తివేసికొనుట కుశలముగాదు. సూర్యునిసాధించు టెట్లు? క=శిరమున, మల=మలముగలవాఁడు; ఏవంరీతిగా కమలమును హింసించి సూర్యుని సాధించెదమందురు గాని, "అహింసాపరమోధర్మః" అందఱికిని హింసారుచి యుండదు. మఱియొకవిశేషము. పంతులవారిపద్యములో, 2. మూలభావమును మూలఁద్రోయఁగానది "రామానన్నుజయించినందున నీవు సురలకన్న నెక్కువవాఁడవైతివి" అని తలక్రిందుగాఁబడినది. హా! ఏమిపాండిత్యమిది!

కవిరా॥ వెలయఁగఁజేయుముదప్పుగఁగీర్తిని వేడ్కనుగంగయనంగఁగడుఁ
[18] 1298 లలనలకన్నులనిద్దురచీఁకటు లంచెడఁబాపెడువెన్నెలనా
నలరుతమిద్ధిజగత్త్రయి త్వద్విశిఖార్దితరావణమూర్ధచయ
ప్రలసనహృష్టభుజంగనరామరరాజివిరాజితమాజిభవా.

మూ.—యశఃపూరం దూరం తను సుతనునేత్రోత్పలవనీ
తమస్తన్ద్రాచన్ద్రాతప తప సహస్రాణి శరదామ్
ఇయం చాస్తాం యుష్మచ్ఛరశమితలఙ్కేశ్వరశిరః
శ్రితోత్సఙ్గా నన్దత్సురనరభుజఙ్గా త్రిజగతీ.

యశఃప్రవాహమును దూరముగా వ్యాపింపఁజేయుము; అందగత్తియలకన్నుఁగలువలవనముయొక్క నిదురమంపునకు వెన్నెలవైన యోరాముఁడా, వేలకొలఁది యేండ్లు తేజరిల్లుము. ఈత్రిలోకీకాంత యొడిలో రావణశిరంబులు నీబాణములకు తెగిపడునుగాక, దానికి సురనరభుజంగులు సంతసింతురుగాక.—అని యర్థము.

ఈశ్లోకమునకును పద్యమునకును సంబంధము స్వల్పముగనేయున్నది. 1. వెన్నెల—వెన్నెల నిద్రను పోఁగొట్టునా? కలుగఁజేయు నని చెప్పఁదగును. 2. పోఁగొట్టునట్లే తెలుఁగున వర్ణితమై యున్నదిగదా? మఱియు నిద్రను జెప్పినంజాలదా, 3. కన్నుల నిద్దుర యననేల? కన్నులనిద్దుర, ముక్కునిద్దుర, అని యిన్నినిద్దుర లున్నవా? మఱియు 4. కీర్తిగదా వెన్నెలగానుత్ప్రేక్షింపఁబడినది? కీర్తి నిద్రను పోఁగొట్టునా? మఱియు 5. లలనలకన్నులం జెప్పుటలో విశేషణమేమి? పురుషులకన్నులకు వెన్నెల పనికిరాదా? 6. పురుషులకు రామునికీర్తి పనికిరాదా? 7 అతనికీర్తి ముఖ్యముగా స్త్రీలలోనేనా ప్రచురము? ఇట నాంధ్రీకరణము కడురసాభాసముగా నున్నది. 8 "అందగత్తి

యల కన్నుఁగలువలకు వెన్నెలవంటివాఁడా" యని రామునికి విశేషణముగా నున్న మూలభాగమును సరిగా అన్వయించుకో లేక, 9. సంబుద్ధివిశేషణమును అసంబుద్ధికి విశేషణముగా గ్రహించి చేసిన పాడు ఇది. 10. చన్ద్రాతపయను సంబుద్ధి యశఃపూరమునకుఁగాని, త్రిజగతికిఁగాని విశేషణ మగుటెట్లు? శారదాదేవత కేమికడగండ్లు వచ్చినవి! దానికి ఓయిచంద్రాతపమా యని యర్థము. 11. అర్దిత=పీడింపఁబడిన. దీనిని హింసించి దీనివలన నఱుకఁబడినయనునర్థమును "పీఁకి" నారు. 12. ప్రలసన మననేమి? లసశ్లేషే, క్రీడాయాం దీప్తౌచ—ఇందేయర్థముగాని యిటం బొసంగదు. 13. ప్రలుఠన అన్న మేలు, దొరలుట యర్థమగును, పొసంగును.

"శివశిరసిరాంసియానిరేజుః । శివశివ తానిలుఠన్తిగృధ్రపాదైః."

14. ఉత్తరార్థమునకు రావణసంహార మింతకుముందే అయియున్నట్టు లర్థమగుచున్నది. ఆయర్థమును నివారించుటకు, 15. "విరాజితమై యలరుత" అనవలయును.

ఆచారలోపము రాకుండఁబ్రయోగించిన పాదపూరణములు.—16. వేడ్క—ఞ—య. 17. గడుఞ—పా. 18. రాజి—య.

పంతులవారు మూలార్థముం గనమి, వివక్షితార్థము వచ్చునట్లు పద్యము ల్లిలేమి, సంస్కృతము నెఱుంగమియు, నిందు విశదమగుచున్నవి.

---

## పంచమాంకము.

### ౫౭ - వ పుట.

యమున.—నాసైదోడు సుగ్రీవుఁడనువాఁడు గలఁడు.—

[1] ఇటం బ్రకరణమేమనఁగా—యమున దుఃఖాక్రాంతయై యుంటం గని
1299 గంగ కారణ మడిగినది. యమున ఈయుత్తరము చెప్పినది. ఈయుత్తర వాక్యమునకు ఆరంభములో నాగరముద్రణములో. 1. "ఎక్కాందావ" అనఁగా ఒకకారణ మేమనఁగా, అని యున్నది. అది తెనుఁగుముద్రణములో లేనందున వీరి యీయాంధ్రీకరణములో లేకపోయినది. ఈ ముక్క లేనిదోషము దీనితర్వాత నైదవ వాక్యములో గంగ "రెండవకారణమంతయుండెలుపుము" అని ప్రశ్న వేయుటచేత స్పష్టపడుచున్నది. ఇటు యమున ఒకకారణ మేదనఁగా అని యారంభింపనిచో నింకొకకారణంబునుంగలదని గంగ కెట్లు తెలియును? దివ్యజ్ఞానమయినచో ప్రశ్నోత్తరసంభాషణ యేల? పంతులవారికి నాగరలిపి తెలిసినను, పూర్వోత్తర సందర్భాసందర్భములను గ్రహించుపాటి తెలివియున్నను, బాగుగానుండును.

యమునావాక్యములో "నీవంగదమునకు" అనియున్నది. ౫౯-వ పుట
[1] 1300 లో గంగ "హా రఘుకులకుటుంబకంబా! చెడితివి," అన్నది. అందు
లకు యమున "ఒకరగువు వంగడమెగాదు..." అని యుత్తర మిచ్చి
నది. ఈ మూఁడుతావులను మూలములో 1. కుటుంబశబ్దమే ప్రయుక్తమై యున్నది. పంతులవారు వంశకుటుంబములను అభేదముగా వ్యవహరించినారు. "కుల కుటుంబ" మను పైప్రయోగమందే వంశకుటుంబములు భిన్నపదార్థములని యిటనే విశదమగుచున్నది. కన్నుదెఱచి చూచినంగదా అగపడును? నిజకుటుంబమందుఁ గలుగునను రాగము నిజవంశజమాత్రులయందుండదు. తెలిసిచేసినను తెలియకచేసినను మార్పు రసమును చెఱిచినది.

౫౭-వ పుట.

యమున.—[గంగచెవిలో] నీతెఱంగున నే.

[7] 1307 గంగ.—ఇది యూహింపఁగూడనిది.

యమున.—[సుడివడువునఁ దిరుగురుపడిన మదిగలది యగుచున్నది.]

గంగ.—[మనస్సులో] ఏమీ? నిజముగానిదే యేమో పూని యలమరుచున్నది. [విమర్శించి] అటుగాకయే యుండుఁగాక, దైవముయొక్క సంవిధానచాతుర్యము నెవఁడెఱుఁగును?—

1. యమునవేసము వేసికొన్నపాత్రము సుడివడువునఁ దిరుగుడువడిన మది గలదగుట నభినయించుట యెట్లు? అసంబద్ధముగానున్నది. దీనిచేతనే యెఱుఁగవచ్చు నిట నేదో పొరఁబాటు గలదని. 2. తెనుఁగుముద్రణములో భవతీ అనుదీర్ఘమునకు భవతి అని హ్రస్వముపడినది. ఆపొరఁబాటును దిద్దుకోలేక, దానికై, 3. "యమున" అని యొకకర్తను నిర్మించుకొని, 4. గంగావాక్యమును కవివాక్యముగా మార్చి, మూలములో లేనిదానిని, 5. "గంగ [మనస్సులో]" అని ఒకటికల్పించుకొని, 6. 'ఏమీ?' అని యొకటి సృజించి, 7. అలమరుచున్నావు అను సర్థముగల మధ్యమపురుషక్రియను, అలమరుచున్నది అని ప్రథమపురుషముచేసి ప్రసన్నరాఘవమును రసాభాసము చేసినారు. మూలము తెనుఁగుముద్రణముబడి :—

గఙ్గా.—అసంభావనీయ మేతత్—ఆవర్తభ్రమితహృదయా భవతీ నూనమలీకమేవ కిమ ప్యనుభూతవతీ. [విమృశ్య] అథవా కో జానాతి విధేః సంవిధానవైదగ్ధ్యమ్.

గంగ—ఇది తలంపరానిది. సుడులచే కలఁగుండువడిన హృదయముగల దానవై నిశ్చయముగా నీవేమో లేనిదానినే యనుభవించితివి. [విమర్శించి] అట్లుగాదు. దైవముయొక్క సంవిధానవైదగ్ధ్యము నెవ్వ రెఱుంగుదురు.

ఇట్లిదియెల్ల గంగావాక్యమే. దీనిని తివర్ణదోషముచే పంతులవారును గంగలోనే కలిపినారు. కాన సంతోషింప వలసినదే.

సరయువు—...ఇదిగదా, లజ్జాపంకమున మునిఁగియున్న దానికి సగ మవ
[4] లంబనముగలది నాశరీరసంతాపము.
1311 1. మునిఁగియున్న దెవరు? మునిఁగియున్న దేది? 2. మునిఁగియున్నందులకు అని గ్రామ్యార్థమా? 3. "సగమవలంబనముగలది శరీరసంతాపము" అనఁగా ఏదో ఒకానొకటి శరీరసంతాపమును సగము కాపాడుచున్నదని యర్థము. ఈ సంతాపమునకు పూర్ణావలంబనము కలిగినచో ఇప్పటికి సరయువు చచ్చియుండునని పర్యవసాయి మగుచున్నది. మూలార్థమిదిగాదు. సంతాపమునకు వేఱే అవలంబనముకలదనిగాదు. 4. సంతాపమే సరయువునకు సగము ప్రాణరక్షకముగా నున్నదని మూలము. ఇట్లుండవలయును:—ఈశరీరసంతాపమేగదా లజ్జాపంకమున మునింగియున్న నాకు సగమవలంబనము? మూ. (తె.) అయంహి లజ్జాపఙ్కనిమగ్నాయాః అర్ధావలమ్బనః మేగాత్రసంతాపః.

సున్న. ఛందోవిభవము శసప్రాసము.

మాలిని॥ దశరథపురపౌరోదారకాంతాశ్రుధారల్
[8] భృశగళితములుం దాపేద్ధముల్మత్స్వపాళిన్
1319 గుశము నుడుకఁ జేయన్ గొంచుఁ బెంపొందు మేనే
ననురుసురనిసిగ్గోయంబ కాంతుంద్యజింతున్.

మూ.—బహుళగళితై స్సంతాపోష్ణై స్తటాన్తవిసారిభిః
దశరథపురీపౌరస్త్రీణాం విలోచనవారిభిః
ఉపచయవతీం సంతాపోష్ణాం నిజాం దధతీ తనూం
ముహు రహ మయే మాత ల్లజ్జాం వహామి జహామి చ.

1. ఉదారకాంతాశ్రుధారల్—ఉదారలైన కాంతలా, ఉదారములైన ధారలా? "ఉదారో దాతృమహతో ర్దక్షిణేఽప్యభిధేయవత్" మేదిని. 2. కాంతాశ్రుధారల్—ఎవరింట వారేడ్చిన నాబాష్పములు వెల్లువలై ఎత్తయిన సరయూతటము పయిం బొరలి సరయువులో పడినవా? ఇది లోకాతీతమైనయత్యుక్తియే. అత్యుక్తికొఱకేనా పంతులవారు ఉదారవిశేషణ మిడుట? "అత్యుక్తి రద్భుతాతథ్య శౌర్యౌదార్యాదివర్ణనమ్." మంచియౌదార్యమే! మూలములో 3. "తటాన్త విసారిభిః" అని యశ్రులకు విశేషణమున్నది. దానిచే నదికి వచ్చినవారిబాష్పములు తట

సమీపమందు దొరలినవి యని యర్థ మగుచున్నది. పంతులవారు మార్చుటకుం గారణ మేమన, వారిని అవిశేషణమందలి 4. విసారిభిః పదము ముంచినది. విసారి యనఁగా మత్స్య మనియు నర్థము కలదు. పంతులవారిట ఆయర్థము చేసికొని 'తటాన్తవిసారిభిః' అనుసమాసమునకు శాంతాకారపురాణ ఫక్కిగా 5. 'తటపట యని పేలునట్లు కొల్పఁబడిన' అని యర్థము తలంచినట్లు తోఁచుచున్నది. కాకున్న మత్స్యముల నుడికించిన వని చెప్పటలో నిట నేమి స్వారస్యము గలదు? జలము నుడికించిన వన్న వర్ణన చాలదా? 6. తృతీయపాదములో వీరు ముందు తాపమును పిమ్మట జలోపచయమునుం జెప్పినారు. చతుర్థపాదములో లజ్జను పొందుటయుం ద్యజించుటయుం జెప్పినారు. యథాసంఖ్యముగా తాపముచే లజ్జ కలిగెను జలోపచయముచే లజ్జపోయెను అని సిద్ధించుచున్నది. ఇంతకన్న విపరీత మేమి కలదు? పంతులవారు మూలములోనున్న యథాసంఖ్యాలంకారమును గ్రహింపమికిని శ్లోకార్థము నెఱుంగమికిని ఇంతకన్న తార్కాణ వలయునా? మూలముబడి, 7. ఉపచయముచే లజ్జవహించితిని [భర్త గతించినంతట బలియుటచే లజ్జగదా], 8. తాపముచే లజ్జ త్యజించితిని [తాపము భర్తృమరణజనితశోకమును సూచించును గదా], అని వివక్షితము. ఈయర్థము తెలియక క్రమము మార్చిరి.

గంగ.—...హా రామచంద్రైకజీవితా!

[5] సరయువు.—[తనలో] వీనికే విలాపమిది.
1324 గంగ.—హా మహారాజా! దశరథా! [అని మూర్ఛిల్లుచున్నది].

యమున.—[పైఁటకొంగున వీచుచున్నది.] అక్కా! ఊఱడిల్లు మూఱడిల్లుము. ఎల్లగొనములచే వగచుటకుఁ దగినవాఁడా కాఁడు.

గంగ.—[ఊఱడిల్లి] సఖీ! సరయూ! నీకొకరికేగాదు.—...

గంగ దశరథునిగూర్చి రామచంద్రైకజీవితా అనియేడ్చినది. సరయూవాక్యములో—1. వీనికే అనఁగా ఎవనికి? దశరథునికా? రామచంద్రునికా? 2. విలాపమిది—ఏవిలాపము? గంగావిలాపమా? రాముని ప్రవాసమువలన దశరథుఁడు మృతినొందఁగా గంగకే విలాపము గలిగినదని యభిప్రాయమేని, వీనివలని అనవలయును. రామునికిఁగలిగిన ప్రవాసదుఃఖమునకై గంగయేడ్చినదని తాత్పర్యమా? రామప్రవాస మింక గంగకు తెలియనే తెలియదే? మఱి యీతప్పయొక్క చరిత్ర మేమన,—అస్యైవ విలసిత మేతత్ అని మూ. దీనియొక్క విజృంభితమే యిది, అని యర్థము. 3. దీనియొక్క యనఁగా రామచంద్రైక జీవితత్వముయొక్క; దశరథ

జీవితమైన రామచంద్రుఁడు అరణ్యమునకు పోయినందున దశరథుఁడు విగతజీవితుఁడాయెను, అని యభిప్రాయము. పంతులవారి తెనుఁగుముద్రణములో విలపితముని నీకారమునకు పికారము అచ్చుపడియున్నది. ఈపండితులకు అచ్చుపొరఁబాటనునది యుండదుగాన వీరుదానిని గ్రహించి యిట్లు పాఠముచేసినారు.

యమునాభాషితము వింతగా నున్నది. 'ఏడుపడుము, ఏడుపడుము; చక్కఁగా ఏడువుము' అని యర్థమగుచున్నది. 4. వగవఁదగినవాఁ డనుట కర్థము బాగుగా ఏడువుము అని కాదా? ఇదియు అశోచనీయః అనుపదమున అచ్చుమూర్ఖు పట్టివాఁడు నర్థమును వదలుటచేఁ గలిగినదే. అశోచనీయుఁ డనఁగా ధన్యుఁడు అని తాత్పర్యము.

5. నీకొకరికే గాదు—(శ్రోత్రి సరయువు స్త్రీ). కావున 'నీకొకతెకే గాదు' అన్న మేలు.

౨౯౯ - వ పుట.

[2] 1326 [సరయువు పెదవిఁగదలించుటతో నటించుచున్నది.—ఇది కవివాక్యము. సరయూపాత్రమునకు కర్తవ్యోపదేశము. 1. ఈమాట ప్రకారము ఆపాత్ర మేమి చేయవలసినది? చిన్నపిల్ల లొకరి నొకరు వెక్కిరించు కొనునట్లు వెక్కిరించుచు నగుచుండవలసినదా? ఇటువంటిమాటచేనా రసస్థలు వచ్చుట? మూ. అధరస్ఫురణం నాటయతి=మూతివదరుటను అభినయించుచున్నది. 2. పంతులవారి తెనుంగులో తో అని తృతీయ యేమి?

[6] 1332 ఆ॥ సుజనుఁడైన యట్టిస్వజనునియందుఁగ। ల్గినది శమదోసము నుగనినది
సగరకులంగనాఁడదవదనాఁడంగను। గలదియంతకంటెఁ గష్టమేటు.

ఇది సరయూపద్యగతోక్తి; గంగ దశరథునికి రామవియోగము కలిగినదని సరయూవాక్యములవలన నాలించి, ఆవృత్తాంతమును సవిస్తరముగాఁ జెప్పుమని యడిగి, అంతలో మూలవలెనని, మూల అంతలో అంతయుం జెప్పుమనఁగా, గంగకు స్వజనవిపత్ప్రియుక్తమైన యాతల్లడము గాంచి సరయువు గంగనుగూర్చి తన మదిలో ననుకొనుమాట యిది. ఇంతమాత్రమునకు రామవియోగరూపమైన విపత్తునిచే గంగకు ఎట్టిదిగాని ఆవియోగముతో దోసము సంబంధపడియున్నదని గంగకు ఎఱుకలేదు. కాన యిపద్యములో దోసమునుగనినది అనుమాట సరిగాదు. 1. చతుర్థపాదమునకు మూలము,—మూలము నాగరముద్రణము.

న జ్ఞాతుం నాప్యవిజ్ఞాతుం నేష్టుం నాప్యపేక్షితుమ్
స్వజనః స్వజనే కాలం విపత్ప్రాతం సమీహతే.

'సుజనస్స్వజనేయని పాఠాంతరము. తెలుఁగుముద్రణము.—

నజ్ఞాతుం నాప్యవిజ్ఞాతుం నేక్షితుం న పరీక్షితుమ్
సుజనే స్వజనే జాతం విపత్పాపం సమీహతే.

నాగరముద్రణార్థము.—బంధువు బంధువునకు సంభవించిన యాపత్ప్రాప్తిని ఎఱుంగనుం గోరఁడు, ఎఱుంగకుండనుం గోరఁడు, చూడనుం గోరఁడు, ఒప్పరీక్షింపనుం గోరఁడు.—అక్లేగదా గంగ దశరథునికిఁ గలిగినవిపత్తునుగుఱించి యిప్పుడు వ్యవహరించినది. 2. అవజ్ఞాతుమ్—అనఁగా నిందించుటకు. నిందించుట ప్రకృతవృత్తాంతముగా గంగ కన్వయింపదు. కాన అవిజ్ఞాతుమ్ అనుటయే సరి. అక్లే నాప్యపేక్షితుమ్మ సరి. 3. సుజనే అనుసప్తమిచే సమీహతే అనుక్రియకు కర్తలేక పోయినది. కాన ప్రథమయే యుండవలయును. 4. పంతులవారు సమీహతే శబ్దార్థము నెఱుంగక తగదని యర్థముగాఁ దలఁచి, తుముస్సంతముల కన్నిటికిని కర్మమై ద్వితీయాంతముగానున్న విపత్పాపమును ప్రథమగాఁగొని సమీహతేకు [అనఁగా తగదనకు] కర్తగాఁ జేసినారు. సమీహతే అనఁగా కోరుచున్నాఁడు. "స్వార్థే కస్మైచిత్ సమీహః పునరధికతరే త్వా మునార్యం కరోతి" ముద్రా. "ఇచ్ఛా కాంక్షా స్పృహేహా తృడ్వాంఛా లిప్సా మనోరథః" అమరము. "క్రియాణి వాఞ్ఛన్త్యసుఖి స్సమీహితుమ్".—భారవి. "విభీస్ట తం కారయితుం కృతార్థా" భట్టి. 5. తగదేని తగనిపని సుజనుఁ డేల చేయును? గంగ యేల చేయును? తగక యేమి? ఎఱిఁగినం గదా సాయపడవచ్చునని కోరమి యేమనఁగా దుఃఖాసహత్వముచేత. 6. దోసమునుగనినది—ఈవిశేషణము మూలానుసారియుఁ గాదు. విపత్పాపమ్—వీరితెలుఁగుప్రకారము, పాపజాతములు విపత్తునకు విశేషణములు. కాన 'జాతాం విపదం పాపాం' అని యుండవలయును. తప్పులో తప్పుగా ప్రథమ చేసికొన్న జాతా విప త్పాపా కావలయును. ఎట్లును లేదు. కాన పాపమును విశేషణముచేయుట సరిగాదు. విపత్పాప మనఁగా విపద్యుక్తమయిన పాప మని యన్వయించుటకేని, పాపయుక్తమయిన విపత్తని తెలిసికొంచినారేమి? పాపము ప్రకరణవిరుద్ధము గదా? పాఠ మునునాగరపాఠమే సరి. పాప మనుటచే నత్తిమిండు పిడుగుపడినట్లు వచ్చిపడిన దని స్వారస్యము.

ఆ॥ తనదుప్రతిన నెఱపితసరుటఁబ్రజఁబరి
పాలసంబానర్చివానిఁగనుట
యానెమనిదియొస్పఫులకహాహాస్వర్గ ద్వార
మదియనర్గళముగనగపడియొకి,

మూ.—ఇద మేవ నరేన్ద్రాణాం స్వర్గద్వార మనర్గళం
య దాత్మనః ప్రతిజ్ఞా చ ప్రజా చ పరిపాల్యతే.

తమప్రతిజ్ఞను ప్రజను పరిపాలించుటయే రాజులకు గడియ తీసిన స్వర్గద్వారము.—అని యర్థము. పంతులవారు 1. "తనరుటన్" అని ప్రతిజ్ఞానిర్వహణమును ప్రజాపరిపాలనమునకు కారణముగానో ఫలముగానో మార్చినారు. మార్పు అసంగతము. 2. అనర్గళమను విశేషణమును పృథగ్వాక్యముచేయుట మూలధ్వంసనము. యతిపూరణములు—3. తనరుట, 4. వాసిఁగనుట, 5. అహహా, 6. గనగపడియెడి; ఈరీతి నున్న శ్రేయమనితలంచెద.

ఆ॥ తానొనర్చుప్రతినతప్పకనెఱపుట । మేలుగాఁగఁబ్రజల నేలుటయును
అవనిపతులకిదెయపాకృతార్గళదండ । మమరరాజధాని ద్వారముగద.

మ॥ మునునీవిచ్చినదౌవరద్వయము నిమ్మున్నాకునీ రాముఁడే
[6] 1344 వనవాసంబున కేగుతన్ భరతుఁడే పాలించుతన్భూమినం
చనఁగైకేయిదిమాటవించుజనకున్ వ్యగ్రాత్మునిన్ మ్రొక్కివీ
డ్కొనిసంతృప్తిని రాముఁడేగెనుమహా ఘోరాటవీవాటికిన్.

1. ఇచ్చిన—ఇచ్చినదాని నిమ్మనుట చక్కఁగాలేదు; ప్రతిశ్రుతము నిమ్మనుట సరి. మూలములో "దేయముగా దేనిని చెప్పితివో దాని నిమ్ము" అని యున్నది. 2. ఇమ్మున్—ఉనకారము పాదపూరణము. 3, 4. రాముఁడే ఏగుతన్ భరతుఁడే పాలించుతన్—ఈయవధారణార్థకైకారములచే నింతకుముందు రాముఁడు పాలింపవలయుననియు భరతుఁడు ఏగవలయుననియు నొకయేర్పాటు జరిగియున్నట్లర్థ మగుచున్నది; మూలములో నీయవధారణములు లేవు. 5. కైకేయిదిమాట—ది వర్ణము. 6. సంతృప్తిని వీడ్కొని అనియు నన్వయ మగుచున్నది.

[5] 1349 క॥ చలువలఱేఁడరుగంగన్ । విలాతికింజుట్టిజికము నెట్టనఁగనుటన్
గలువలెజిగిచెడవుజగం । బులుగాచీఁకటనిమునుఁగుఁబోఁడిమివీడన్.

పద్యార్థము.—కలువలుమాత్రము జిగిచెడవు, జగములు జిగిచెడును. 1. జగంబులుగా—ఈగాకుబదులు ఎకారము వేసిన కలువలుం జెడును అను నర్థము వచ్చును. 2. జగంబులెచీఁకటనిమున్గు—అభిన్నావస్థాపదేశమునకై భిన్నపదోపాదానంబు దుర్బలీకరణముగా నున్నది. 'కలువలుమాత్రంబా జగంబులె చీఁకటిలోన మున్గి పోఁడిమివీడున్.' అనుట మేలు. 3. చీఁకటిలో మునుఁగుటను చెప్పుటచేతనే పోఁడిమి వీడుట గమ్యమైయున్నది. గమ్యమును వాచ్యముచేయుటచే ఉత్తమకావ్యత్వ

హాని కలుగును. పోఁడిమివీడక అనుముక్క లేకున్న మేలు. 4. చుట్టుటీకము నెట్టనఁ గనుటక—చుట్టుటీకముచే ననుటకు యతిపూరణాడంబరము. 5. విలాతికి కలువలు చుట్టములా, విలాతికి కలువలకేఁడు చుట్టమా? అని సందేహము గల్గును. 'కలువలకేఁడు విలాతికి వెలలంగా నాతనికిని ప్రియబంధువుఁడౌ,' అని పూర్వార్థమును మార్చుట మేలు.

౬౦ - వ పుట.

శా॥ కైకేయీవచనంబులన్ దశరథక్ష్మాభర్త యొక్కింతసే
[8] పేకాంతంబున మోహమున్ గ్రుధ నిరూపింపంగఁ బోరాడ్ధిఁ దాం
1357 దాతార్హ్యాధురంధరుండుకరగం బౌరత్నముం బోలెడున్
ర్వారాంచంబులఁ బోలెఁ దా విడిచెనా ప్రాణంబుల న్వాండిమున్.

మూ.—నరేన్ద్రః కైకేయీవచనపరిపాటీవివశితః
క్షణం మోహక్రోధప్రసరభరయోరన్తరగతః
సుతం చోరగ్రస్తో మణిమివ కరస్థం సకృపణః
త్యజా నీవ ప్రాణా న్స్వన రయా మముఞ్చ ద్దశరథః.

"కైకేయీప్రార్థనచే దశరథమహారాజు డిల్లవోయి యొక్కింతసేపు మోహ క్రోధములకు గోచరుఁడై చోరగ్రస్తుఁడైనట్లుండి తన చేతనున్న మణివంటి కుమారుని [రాముని] విడువఁజాలఁడాయెను, గడ్డిపరకలను బోలె ప్రాణములను మాత్రము విడిచివేసెను." అని యర్థము. 1. పద్యములో రామప్రస్తావన లేదు. 2. ప్రాణములనే రత్నమువలెను గడ్డిపరకలవలెను విడిచివేసెను, అని యున్నది. ప్రాణములను, రత్నమువలె విడువలేక విడువలేక విడిచెననియు, గడ్డిపరకయువలె సులువుగా విడిచెననియు, ప్రల్లదముగా నున్నది. భావాంతరీకరణమందు ఇంతరస్న పాండుచే యుట యెట్లో! పంతులవారికి చిత్తస్వ గల్గినవిధము వింతగానే యున్నది. ఎట్లున్నను, వీరికి శరణ్యమయిన తెనుఁగుముద్రణములో "సుతం చోరగ్రస్తః" అనుటకు మారుగా శృంగభంగముగా "సతం చోరగ్రస్తః" అని యున్నది. సరి! మణి అచ్చుతప్పు దిద్దుకొనుపాటి తెలివియా? అసంగతత్వము గనుపాటి తెలివియా? 3. సః కృపణః తం మణిమ్ అని యన్వయించి పంచినారు. కవిహృదయము తెలియక అచ్చుతప్పులు కవిప్రయోగముగా నెంచువారికగతి యింతయే. 4. క్రుధ నిరూపింపంగ—నిరూపించుటకు క్రుధ కర్తగా నాభాసిల్లుచున్నది. ఇంటిలిపి పర్యాయపరంపరలో నిది పంతులవారికి సమ్మతము ఇది కాదని యెఱుంగుటకు యోగ్యపృష్టి వలసియున్నది. మూలము బట్టి క్రుధ కాంచుటకు కర్మ గావలయును. 5. "నిరూపింపంగ" అనునీ యాత్యర్థ

పాదపూరణము లేకున్న నిష్క్లేశము పాతకులకుం గలుగదుగదా. 6. వ్యథయు గొప్పది యనియే మూలమునం దున్నది. బహుమాహామున్న శ్లేష్మమహావ్యథ యన్న మూలమునకు సరిపోవును. ప్రాణములను విలువలేనివానినింబోలె సులువుగా విడిచెనని తెలుపుట కు తృణా (నీవ) అని సామాన్యవాచకము మూలమునందుండఁగా, దానికి 7. దూర్వా కాండంబులఁబోలె నని తృణవిశేషవాచకముం బ్రయోగించుట మందము. గడ్డిలో నెల్ల దూర్వ అతినికృష్టమా? గణేశపూజాదికమందు, స్వయంవరమాల్యములందు, మంగళసమాలంభనములయందు, నుపయుక్త మగుటచే ప్రశస్తమని యేర్పడుచున్నది. కావున దానిని చెప్పుట ప్రస్తుతవిరుద్ధముగానున్నది. 8. శ్లోకములో పరిపాటి విపరీతః అనుచో స్త్రీ(లింగవిపరీతస్వారస్యముచేత (శక్తి) ఈఁజెప్పుటు చేతనుం బోలె ఆమాటచేత దశరథునిహృదయము ప్రీలిపోయెనని ధ్వనితమగుచున్నది.

నాతల్లులను గొలుచుచుఁ గొన్నిదినములు గడుపుము.——ఇది శ్రీరాములవారు
[5] 1362 సీతతోఁ బల్కినమాట. 1. ఇది మూలములో శ్లోకపూర్వార్ధము. దీని నుత్తరార్ధము——"వనంబునకు నాతోడఁ జనుదేరవె రామరో" అను నమృతవాహినీ పూర్వార్ధము. ఈయమృతవాహినిలో 2. ఉత్తరార్ధము సరయూవాక్యము. రామభాషితము సీతకు ఉపదేశకము కల్పద్వయము, ఏకైకకల్ప మేకైక శ్లోకార్ధముగా మొత్త మేకశ్లోకముగా నుండుట యెంతయు సప్రయోజనముగాను మనోహరముగాను ఉన్నది. పంతులవారు అంజలి పూర్వార్ధమును గద్యీకరించి, ఉత్తరార్ధముతో సరయూగద్యమును పద్యీకరించినందులకు స్వారస్యాతిశయ మేమియు కారణముగా నగపడదు. ఈరెండు కల్పములకును మూలశ్లోకము.——

అద్యాపి మ్రియమాణా మే । శరదః కతిచి న్నయా
వనం వనజపత్త్రాక్షి । సమాగచ్ఛ సహైవ వా.

ఇట్లు మూలములో సీతతో రాముఁడు చెప్పిన రెండుకల్పంబులును ఏకశ్లోకముగా నున్నవియని సరయువు వాని నేకశ్లోకముగాఁ జెప్పి అప్రాధాన్యము మఱివ సీతకుంచుటకు తనభాషితమును పద్యములో పెట్టక గద్యములోనే పెట్టుకొన్నది. 3. మూలమునందలి వాశబ్దముచే రాముఁడే రెండుకల్పములను ఆదిలోనే ఆలోచించుకొని యుండె ననియు, ప్రథమకల్పము విన్నతోడనే ద్వితీయకల్పము చెవిని బడకమునుపే సీత మూర్ఛిల్లె ననియు, వాశబ్దము ముందు వినఁబడినచో మూర్ఛిల్లదనియు, విశద మగుచున్నది. అందుచేత ఆమెయొక్క రామానురక్త్యతిశయము విశదమగుచున్నది. పంతులవారు వాశబ్దమును త్యజించినందున, అది తమపదములవలనే పాదపూరణ మని తలంచినందున, ఈస్వారస్యము చెడినది.

"యామి నయామీతి ధవే వదతి పురస్తాత్ క్షణేన తన్వఙ్గ్యాః
గళితాని పురోవలయా న్యపరాణి పున స్తథైవ దళితాని."

4. అను శ్లోకముతో సదృశముగా జయదేవకవి యిందు సంవిధానము కల్పించి శ్లోకము రచించినాఁడు. అటు వలయగళనముగని తోడ్కొని పోదలఁచెనని స్వారస్యము. అటను "యామః" అనియున్న పురోవలయములు గళితములు గావు. అందు పాశబ్దము లేదు. మూలముబడి చూడఁగా రాముఁడు గురుజనముకడ తనభార్యానురక్తిని ప్రకటించుచుండెనని రసికులకు విశదమగును. పంతులవారిప్రక్రియంబట్టి చూడ రాముఁడు తొలుత ఈతోడును నాకేల యని సీతను దొలఁగించుకొన యత్నించెనని యు, మూర్ఛ చూచి చచ్చునని వెఱచి స్త్రీహత్యాభార్యాహత్యల కొల్లక గత్యంతరము లేక తోడ్కొనిపోనంగీకరించె ననియు అనురక్తిశూన్యుఁ డనియు స్వారస్య మేర్పడుచున్నది.—5. రామరో—వనజపత్త్రాక్షీయని మూలము. ఇది మూర్ఛితురాలికి సీతకు సంబుద్ధి. కన్నుతెఱచుట మూర్ఛతేఱినందులకు నిదర్శనముగాన, కన్నుతెఱవు మను ప్రార్థనను ఈసంబుద్ధి సూచించుచున్నది. మూఁతపడియున్నకనులకు వర్ణన యేమని దీనిని పంతులవారు కొట్టివేసినారు.—

గతం భయం భీరు సురారిసంభవం। త్రిలోకరక్షీ మహిమా హి వజ్రిణః
త దేత దున్మీలయ చక్షు రాయతం। మహోత్పలం ప్రత్యుష సీవ పద్మినీ.

అని కాళిదాసీయవిక్రమోర్వశీయమందు మూర్ఛతేఱుమనుటకు మాఱుగా కన్నుదెఱవుము, అనియున్నది. అట్టిస్వారస్య మిటనుంగలదు. చౌకకట్టియయే కావలయుఁగాని స్వారస్యమేల!

[5] క॥ నీతోడఁగూడనాకోఁ। బ్రీతిన్నాలుగుయుగములు వెసనలుజాముల్
1367 నీతోడఁగూడకున్ననె। యాతన్మన్వంతరంబు లన్నియయేండ్లున్.

ప్రీతిన్—ప్రా. వెసన్—య. 1. మూలములో, ప్రీతి గమ్యము. పూర్వార్థమున కెల్ల నదియే తాత్పర్యము. దానినే వాచ్యభంగిం గూడఁజెప్పుట, ఉత్తమకావ్యమును పాడుచేయుట, మూలములోనే టీకం గూర్చుట. ఈమాట యిట నావశ్యకమేని ఉత్తరార్థములో "దుఃఖముచేత" అని చెప్పవలదా? ఏమి కౌశలమిది! నలుజాములలోలేని స్వారస్యము, 2. వెసలో నున్నదా? 3. ఔతన్—లూట్లునకు ఆశీశ్శాపసంప్రార్థనవిధు లర్థములు. అందొకటియు నిట పొసంగదు. కాన నిట లూట్ప్రయోగము సరిగాదు. ప్రాసతకారముకై యర్థమును చెఱచుకొనుట! ఇఁక పంతులవారు నిజస్తోత్రపాఠకులు ఏనుశబ్దము కళయని వాదించినట్లే తామిట తద్ధర్మ్యార్థకప్రథమ

పురుషైకవచనము కళయనివాదించి, చౌ+తన్మన్వంతరములు [ప్రసిద్ధమైనమన్వంతరములు] అని యర్థము సాధింతురుగావలయు, చిత్రము చూతము. 4. మఱియు దీని మూలము అనుష్టుప్పు. దానికన్నం బెద్దదైనకందముం దొరంకొనియు వీరు అందుక్తమయిన పదునాలుగును ఇందు చెప్పనేరకపోయినారు. అన్ని యనుసంఖ్యాసర్వనామముచే 'నాలుగు' పరామర్శింపఁబడుచున్నది. అన్నియె యనఁగా మన్వంతరసంఖ్యయని, పదునాలుగనియుం బన్నుదురుగావలయు. అన్నియె యనుసంఖ్యావాచకము ప్రతిపదోక్త సంఖ్యావాచకమయిన నాలుగును పరామర్శింపక గౌణమయిన మన్వంతరమును తడవుట న్యాయ్యముగాదు. పైగా అన్నియె యని యవధారణార్థకము అసంగతముగానున్నది. 5. ఉత్తరార్థములో పదునాలుగు మన్వంతరములు పదునాలుగు ఏండ్లుగాఁగడచిపోవునని యర్థమగుచున్నది. మూలసరళతగనుఁడు.

త్వయా సమం మే చత్వారి । యామా ఏవ యుగాన్యపి
చతుర్దశ సమాస్త్వాం తు । వినా మన్వన్తరాణి మే.

జానకినిఁ జూచుటకే యిట్టులుండ, లక్ష్మణుం జూచుటకు నీ వెట్టివాఁడవు?—

1368 కౌసల్య రామునితో పలికినమాట యిది. దీని కిట్లర్థ మగుచున్నది.—

"నీవు జానకినే సరిగా చూడలేకున్నావు, ఇఁక లక్ష్మణుని నీవు సరిగాఁ జూతువా?" అని. మూ. లక్ష్మణే సమీక్షితరి కో భవాన్ జానకీసమీక్షణస్య: జానకిని నీవు విచారించుకొన నక్కఱలేదు. జానకిని విచారించుకొనువాఁడు లక్ష్మణుఁడున్నాఁడు—అని దీనికర్థము. దీనిని పంతులవారు ఆవిధముగా తెనిఁగించుటకు ఏమేమి పొరఁబాట్లు పడినారో యూహించుట కష్టముగానున్నది. "చెప్పలేనిరాయి" యుపదేశముగా తెనిఁగించియుందురు.

౬౧ - వ పుట.

చ॥ ప్రముదిత వక్త్రశోభగల రామునికిం జెలఁగెలక్ష్మణుం
[11] చమురఁగ మల్లెమొగ్గలన నగ్గలమైన నిజాశ్రుబిందులన్
1379 శ్రమమునఁ దప్పిలోకమె భృశంబుగశోకము దాల్చినట్లుగా
నమయకచెల్లయేమనుచు నాడటనాడెడు వీడెఁబోఁడుముల్.

మూ.—నిరీక్షమాణం రామస్య ప్రముదితముఖామ్భోరుహం రుచిః
జటాపల్లి ర్మల్లీముకుళ సదృశై ర్బాష్పపృషతైః
నిషిఞ్చ న్నామిత్రిః కథమపి వితేనే ఖలు యథా
తథా జాతం మాతః కరుణమయ మేతజ్జగదపి.

1. జడలల్లె—మూలములో జటావల్లీః [=జడ లనుతీఁగలను] అని యున్నది. తీఁగలనుట అశ్రువులను మల్లెమొగ్గలన్నందులకు కడు పోషకముగా నున్నది. ఆసాబగు తెనుఁగులో పోయినది. 2. అమరఁగ, 3. అగ్గలమైన—యతిప్రాస బంధువులు. 4 చతుర్థపాదము అజాగళస్తనము, లోకమెభృశంబుగ శోకముదాల్చునట్లుగాక— 5. ఇట్లు దీని నుపసర్జనీకరించుట సరిగాదు, ఇదే యిందు విధేయము, రచనాభంగిచే దీనిప్రాధాన్యమును దెలుపుట అవశ్యకము; 'అట్లు లక్ష్మణుఁడు చేయఁగా నీలోకమెల్ల శోకము పాలాయెను'—ఏవంరీతిగా నుండవలయును. 6. 'అట్లు' అనుటచేత శోకము దాల్ప లేదనియు నర్థమగుచున్నది. మూలము చూడుఁడు, విధేయప్రాధాన్య మెంత చక్కఁగా కాపాడఁబడి నిర్వహింపఁబడియున్నదో! 7. కరుణమయి మ్మనుమయట్ ప్రత్యయ మెక్కడ, తాల్చుట యెక్కడ? 8. శ్రమమునఁ దద్పుటయేమి? ఏమిశ్రమ? 9. ప్రాసశ్రమకన్నసెం డగపడదు. కథమపి యత్నగౌరవమును తెల్పునుగాని శ్రమమునుగాదు. 10. తడ్పియనురూపము శ్రమముగానేయున్నది, శ్రుతి సుఖముగాదు. 11. శోభఁగల—కలుగుధాతుయోగమున ద్వితీయ నిడుహర మేలకో తెలియలేదు.

[5] ఆ॥ సీతచాలబాలచిఱుతవారలుమీరు। దక్కిణంపుదిక్కుదైత్యనిలయ
1384 మందువలనఁజేపుదుమయ్యవత్సలతచేఁ। జనకుమీవవాచికినిఁకరాము.

మూ.— బాలా విదేహతనయా తరళౌ భవన్తౌ
దిగ్దక్షిణా చ రజనీచరచక్రజుష్టా
తద్వత్స వత్సలతయేద ముదాహరామో
మా రామ గచ్ఛ నయదక్షిణ దక్షిణాశామ్.

1. చాల.—. 2 చిఱుతవారలు — దిట్టలుగారనియర్థమగుచున్నది, మూ. తరళౌ = చపలులు, అనఁగాకౌతుకప్రవణులు, 3. దైత్య—ఒకఁడా, ఇద్దఱా? చక్రశబ్దస్వారస్యముకలదా? 4. అయ్య—మూ. వత్స, అనురాగసూచకముగాన త్యక్తము. 5. ఇఁక—దివ్యమయిన ప్రాసపూరణమేగాని, అర్థమున కంతర్గడుపు. ముటి యు నిందు మూలమందుఁ గల 6. నయదక్షిణ యనురామ విశేషణము నీరసమని పరిహరింపఁబడినది. బాలా తరళ నయదక్షిణాదిశబ్దముల స్వారస్యముచే శ్లోకభావమేమన,—మీరు క్రొత్తక్రొత్త చిత్రములుగాంచుచు ఏమఱియుండఁగా ఎవరేని దైత్యులు సీతను కపట మెఱుంగనేరని దానిని హరింతురు. నీవునీతిజ్ఞుఁడవు. అడుసుద్రొక్కనేల కాలుగడుగనేల. అట్టియనర్థములు కలుగుతావునకు పోకయేయుండుటమేలు. కాన-నటకు పోకుము, అని.

[8] క॥ పురజననయనార్పితమౌ। వరకువలయదామమూని వడిఁజనె రాముం
1392 డురుసురమురజద్విగుణిత। గురుగంభీరఘుష్టశార్ఙ్గకోదండుండై.

మూ.— సురమురజగభీరధీరనాద। ద్విగుణగుణధ్వని చాపదత్తహస్తః
పురజననయనార్పితం దధానః। కువలయదామ జగామ రామభద్రః.

ప్రాసదుష్టి—ప్రథమప్రాసము మూలార్థలబ్ధము. కడమమూఁడును 1. వర, 2. ఉరు, 3. గురు — కృత్రిమపదంతములు 4. వడిఁ—ఈవడి రామునికి జయదేవుం డుపెట్టలేదు. జయదేవుఁడు మెల్లఁగానే నడువనిచ్చినాఁడు, సీతకూడనున్నదిగదా, పాపము! త్వరగా నడువలేదుగదా? పంతులవారు తమ 5. యతిబాధచే సీతారాములను గనికరము లేక తఱుముచున్నారు. 6. ఉరుసురమురజ— ఎంతపెద్దవో వీరు చూచి వచ్చినారా? ఎట్లు తెలిసినది? 7. గభీరధీరనాదము పోయినది, తోలుమాత్రము నిలిచినది. 8. శార్ఙ్గ— ఇది రామునికి పంతులవారు ప్రసాదించినది, జయదేవుఁ డిచ్చినది కాదు.

సరయువు.— సఖీ! గంభీరముగా మ్రోయు సురమృదంగంబులచేతం గంభీర
1398 మైన మ్రోఁతయేమో నీ వెఱుంగవున్నావు.

మూ.— సఖి, న జానాసి। గమ్భీరం ధ్వనద్భి స్సురమురజైః కిమపి గమ్భీరం ధ్వనితమ్।— చెలీ, నీ వెఱుంగవు; గంభీరముగా మ్రోఁగుచు సురమృదంగములు గంభీరవిషయమునే సూచించినవి—అని యర్థము. మ్రోఁత సరిగాదు. సురలు మృదంగము వాయించుటచే సూచించిన యర్థమిది, రాముఁడు దక్షిణమునకే గఁదరలెనుగావున, ఇఁక రావణాదినిధనముగు ననియు, తమకెల్ల సేమము కలుగుననియు. ఈయుత్సాహముచే దేవతలు నాందీనాదము చేసిరని హృదయము. పంతులవారు ధ్వనితశబ్దార్థము గ్రహింపక మ్రోఁత యని తెనిఁగించి యీయర్థమును నివారించినారు.

[10] క॥ వనవాసోత్కంఠనుండగు। జనపతితోఁగూడ నరుగుధరణీసుతచే
1408 తనుమంజులమంజీర। స్వనమున బంధులు దెలిసిరి సాధుచరితముగా.

1. సాధుచరితముగా.— ఎవరిచరితమును? సీతచరితము నని స్ఫురించుచున్నది. 'ఆమెను సాధుచరిత యెంతరు బోధింపవలసినప్రసక్తి లేకపోయెను, భర్త వెంట నామె చనుటచేతనే ఆమెసాధువృత్తము ఎల్లరకుం దెల్లంబాయెను,' అని యర్థమా? లేక, 2. అమెనడవడింబట్టి సాధుచరితమును బంధువులు నేర్చుకొనిరని యర్థమా?

మూ.— గహనవిపినవాసోత్కణ్ఠయా సంప్రయాన్తం
ప్రియతమ మనుయాన్త్యా తత్క్షణం సీతయైవ

చరణకమలగుఞ్జన్మఞ్జుమఞ్జీరశబ్దైః
స్ఫుటతర ముపదిష్టా బాన్ధవా స్సాధువృత్తమ్.

ఇందు సీతయే సాధువృత్తము నుపదేశించిన దని [ఉపదిష్టాః] యున్నది. తెలిసిరనుపదమువలెఁగాక [ఉపదిష్టాః] అనుట అసందిగ్ధముగాను ప్రకృతసముచితముగాను ఉన్నది. పంతులవారు మూలమర్థముగాక యిట్లు చెప్పినారు. మూలములో 3. సీతయా, కర్తృతృతీయ. పంతులవారి 4. 'ధరణీసుతచేతను' హేతుతృతీయ. మక్కికి మక్కీగా పడిన 5. మంజీరస్వనము ఈపాదుచేత, నిరుపయోగమైనది. 'మఞ్జీరశబ్దైః' కరణతృతీయ. సీత [నోటిమాటలచే నుపదేశింపక] అందియలశబ్దముచే నుపదేశించెను, అని కర్తృకరణతృతీయల స్వారస్యము. 6. ఏవకారార్థమును త్యజించుట గొప్పలోపము. బంధువు లేమేని సీతకు ఉపదేశించిరా యనుప్రశ్నకు ఈపద్యముత్తరము. 7. పతి—మూ. ప్రియతమమ్, 8. చరణకమల, 9. స్ఫుటతరమ్, 10. తత్క్షణమ్.—త్యా. ఈపదముల ప్రయోజనము నరయుఁడు. పద్యము నిట్లు దిద్దుకొనిన మేలు గలుగును.

క॥ వనవాసోత్కంఠుండగు । తనవల్లభు వెంటఁజనుచు ధరణిజయే శో
భనమణినూపురమంజు। స్వనమున బంధులకు నేర్పె సద్వృత్తంబున్.

౬౧ - వ పుట.

చ॥ మనుజను నాథు వెన్కఁ బోరిఁబూనిక వేగముగా నె యేగు నా
[15] 1418 జనకజయంఘ్రిలంగి సలసచ్ఛవులంగను బాంధవాత్ములన్
గొనబయి కాకరాలెఁగడు గొప్పగ నశ్రులు శీతలోష్ణముల్
గనఁబెను ముత్తియంబులనఁగా నటు లేలఘుటిల్లెనోకనన్.

మూ.—పురః కాన్తం యాన్తం విపిన మనుయాన్త్యా స్సరభసం
తదా తౌ సీతాయాః కిసలయనిభౌ వీక్ష్య చరణౌ
ముహు శ్శీతా స్తప్తాః కిమపిచ ముహు ర్బధ్ఘనయనైః
సమం ముక్తా ముక్తామధురరుచయో బాష్పకణికాః.

1. మనుజను—విపినమనకని మూలమందున్నది, 2. బంధుజనశోక బాష్పములకు ఉపపత్తికై జయదేవునిచే పెట్టఁబడినది. పంతులవారు పరిహరించినారు. దానికిబదులుగా సారవంతములను 3. పోరి 4. పూనికలను దూర్చినారు. 5. వేగముగా నె—మూ. సరభసమ్—'రభసో వేగహర్షయోః.' హర్షము మీఱ ననిన మేలు.

6. గానె—ఈయవధారణార్థక మేల? సందేహము పుట్టించుటకా? 7. గొనబయి కాక—అశ్రువులలో గొనబును గొనబుకామియు తెలియుట యెట్లు? ఆభేదము కలదా? 8. ఈయసంగతోక్తి పంతులవారిసొంతము. 9. ప్రాసపోటుచే పడినది. 10. కడుగొప్పగ—అమూలకము, పెనుముత్తియము లనుచోటి పెను చాలదా, ఈకడుగొప్పకూడనేల? అధికస్యాధికంఫలమ్మని దంచుటగా నున్నది. మఱిచివరిని కడు గొప్ప అశ్రువులగొప్పతనమును చెప్పదు, యతీశ్వరులవారిమహిమను చెప్పుచున్నది. 11. శీతలోష్ణముల్—ఒక్కొక్కయశ్రువును ఒకవైపు చల్లనిదిగాను, ఒకవైపువెచ్చనిదిగాను, లేక చలువయు వెట్టయు రెంటినిం బుట్టించునదిగాను, ఉండెననియర్థమగుచున్నది. కొన్నియశ్రువులు చల్లనివి, కొన్ని వెచ్చనివి, కొన్నిమాఱులు రాల్చినవి చల్లనివి, కొన్నిమాఱులు రాల్చినవి వెచ్చనివి, అని మూలములో "ముహుశ్శీతాః, ముహుస్తప్తాః" అని యున్నది. 12. కనఁబెను—ఇదియు ప్రాసపోటు తప్పించుకొనుటకు పల్కుటయే. 13. ముత్తియంబు లనఁగా— ముక్తామధురరుచయః— ఇవిచెఱకుమ దాని పిప్పియునుగానుండలేదా? 14. అటులేల ఘటిల్లెనోకనన్—అటులనఁగా ఎటులు? గొప్పలైన ముత్తెములవలెనా, శీతలోష్ణములుగానా? గొనబయికాకయా?—... ఏవిషయమందు ప్రశ్న? అసంగతోక్తిగానున్నది. కాన నిది యేల ఘటిల్లినదో నేనెఱుంగుదును, పాదపూరణార్థము ఘటిల్లినది. 15. మూలములో ముహుర్ముహుస్సమమ్ అనుటచే భావశబలత చెప్పఁబడినది, తెనుఁగులో నున్నయైనది.

గంగ...—అప్పుడుసుఖభోగమును సుమిత్రయుఁ జిన్నవాఁడైన లక్ష్మణునిచే నపేక్షింపఁబడలేదా?

సరయువు.—కోరఁబడినదే.

[5] ఆ॥ పెద్దయన్నవెంటఁబృథుశక్తిఁజనువాని। కయ్యయోధ్యయయ్యెనడవిమఱి
1423 భోగమెల్లరామభూమీశ్వరుండెసుమిత్రసత్పవిత్రధాత్రిపుత్రి. [యు

గఙ్గా.—తదా సుఖభోగస్సుమిత్రాచ ద్వయమపినాపేక్షితం వత్సలక్ష్మణేన.
సర.—సమీహితమేవ.

జ్యేష్ఠానువృత్తి ప్రవణస్యతస్య। వినుఙ్క్తత స్తాం నగరీ మయోధ్యామ్
భోగ స్సమగ్రోఽపి హి రామ ఆసీ। దభూ త్సుమిత్రా జనకాత్మజైవ.

గంగావాక్యములో భోగసుమిత్రలంగూర్చియే ప్రశ్నయున్నది. పంతులవారి పద్యములో అయోధ్యాభోగసుమిత్రలంగూర్చి యుత్తరమున్నది. అడుగనిది అయోధ్య యొకటి యెక్కువ. మూలములో సరయూవాక్యములో[శ్లోకములో] అడి

గిన రెంటికే ఉత్తరమున్నది. ఇటు నాంధ్రీకరణము శాంతాకారచెప్పలేనిరాయి పురాణములకు రెంటికిని అతీతమై పోయినది. శ్లోకార్థము:—అన్నను అనువర్తించుటయందు ఆసక్తుఁడై ఆయయోధ్యానగరిని వదలుచున్న యాతనికి [లక్ష్మణునికి] రాముఁడే సమగ్రమైన భోగమాయెను, జానకియే సుమిత్రయాయెను.—1 పంతుల వారు రెంటికి మూఁడేల చెప్పవలయు? తప్పదుసాంఖ్యమునకు ఫలమైయుండును. అన్నయని మూలమందుండఁగా పెద్దయన్న యన నేల? జయదేవునికన్న స్వారస్యముగాఁ బల్కువారావీరు? 2. పోనీ, తాముకల్పించుకొన్న యధికోత్తరమునకు సరిగా ప్రశ్న నేమేనిమార్చుకొన్నారా? 3. పృథుశక్తియేమి? శక్తిప్రసక్తియేమయ్యా? 4. భక్తి యనరాదా? సక్తియనియేని వ్రాసికోరాదా? 5. కోరఁబడినదే.—మదరాసు తెలుఁగు. కోరఁబడినవే యనిన ఉత్తతెలుఁగగును.

శా॥ అమ్మాయెక్కడి కేగెఁదండ్రి సుతయింద్రాస్థాని కేలావియో
[9] 1432 గమ్ముంగల్గఁగ నాత్మపుత్రునిది పోఁగానేల యాతండర
ణ్యమ్ముంగూర్చి నృపోక్తినాతఁడెటు లన్యాయంబుగం బల్కెవా
క్యమ్మేబంధము గాఁగనాదిఫలమేమానీకు రాజ్యంబయో.

ఇది మేనమామయింటినుండి వచ్చిన భరతునకుం గైకేయికిం జరిగినసంభాషషణము. పద్యము ఇట్లు వాక్యములుగా విడుచున్నది.—(౧) భ. అమ్మా యెక్కడి కేగెఁ దండ్రి? (౨) కై. సుత, యింద్రాస్థానికి. (౩) భ. ఏలా? (౪) కై. వియోగమ్ముం గల్గఁగ నాత్మపుత్రునిది. (౫) భ. పోఁగా నేల యాతండరణ్యమ్ముంగూర్చి? (౬) కై. నృపోక్తిచే. (౭) భ. ఆతఁ డెటు లన్యాయంబుగం బల్కె? (౮) కై. వాక్యమ్మే బంధముగాఁగ నాది. (౯) భ. ఫల మేమా? (౧౦) కై. నీకు రాజ్యంబు. (౧౧) భ. అయో!

1. ఇందు (౧)లో ఎక్కడి కేగె నని ప్రశ్న యసంగతము. ఏగెనని భరతునికిఁ దెలియదుగావున. ఏగెనని తెలిసిన, ఎచటికో అదియును దానితోనే తెలిసియే యుండును; కాన, 2. ఎక్కడ అని మాత్రమే అడుగఁదగును, (౫) ఆపుత్త్రుఁడడవికి పోనేలయని ప్రశ్న. 3. అడవికిపోయెనని భరతునికెట్లు తెలియును? అసంగతాంధ్రీకరణము! దీనిమూలముం గనుఁడు.—

(౧)మాత స్తాతః క్వ?(౨)యాత స్సురపతిభవనమ్,(౩)హా కుతః?(౪)పుత్త్రశోకాత్
(౫)కోసౌ పుత్త్రః?(౬) చతుర్ణాం త్వమవరజతయా యస్య జాతః. (౭) కిమస్య?
(౮)ప్రాప్తోసౌ కాననాన్తమ్.(౯)కిమితి?(౧౦)నృపగిరా.(౧౧)కిం తథాసౌ బభాషే?—
(౧౨)మద్వాగ్బద్ధః.(౧౩)ఫలం తేకిమిహ?(౧౪) తవ ధరాధీశతా.(౧౫)హా!హతోస్మి!

(౧) అయ్యా నాయన యెక్కడ? (౨) స్వర్గమునకుఁ బోయెను. (౩) అయ్యో యేల? (౪) పుత్త్రశోకముచేత. (౫) ఎవరా పుత్త్రుఁడు? (౬) నీయన్న. (౭) అతని కేమి? (౮) అతఁ డడవికిఁ బోయెను. (౯) ఏల? (౧౦) రాజునాజ్ఞచే. (౧౧) ఆయన యట్లేల యాజ్ఞాపించెను? (౧౨) నామాటకుఁ గట్టువడి. (౧౩) అందువలన నీకేమి ఫలము? (౧౪) నీవు రాజ్యము. (౧౫) అయ్యో! చెడితిని!—దీనిం బట్టి పద్యమందలి భ్రంశముల నెఱుంగుఁడు. 4-7. ఈ ౧౫-వాక్యములలో ౪ వాక్యములు, ప్రతాపరుద్రీయములో తురకసిపాయి ముక్కలైన పద్యములో ఎగిరిపోయినవి. 8. వియోగదుఃఖం గల్గఁగ—ఇందు పాదపూరణ మపర్ణహంతమా? కల్గుధాతుసకర్మకతాహంతమా? 9. తండ్రి—నీవుగఁడు అన్న నింతకన్న నుచితముగా నుండును. ఇట్లు నాశము చేసినవారే కవితాతత్త్వవిదులైనచో నింకఁ గానివారెవరు?

౬౩ - వ పుట.

[2] 1434 1. ఓసికోమలకంఠమా!—ఈమాట మగహంసపు సంబుద్ధి. మహత్త్వవిశిష్టమైనదానిని నదీదేవతలతో సంభాషణాదివ్యాపార మొనర్చుచున్నదానిని మహానుచితముగా సంబోధించుట సరిగాదు. విక్రమార్కచరిత్రములో శుకమును కవి «శుకవిభుతోడ» అనియెను; రాజు దానినే «చాతురీధామ శుకరాజసార్వభౌమ,» «శుకాగ్రగణ్య,» «శుకకులేశ్వర,» అనియును సంబోధించినాఁడు. ప్రసన్నరాఘవములోనే ౭౩-వ పుటలో «అన్నపుష్పంధయా» అని రాముఁడు తుమ్మెదను సంబోధించినాఁడు. ఇదియుచితము; ఓసి యనుచితము. అట్లే, యీహంస తన్నుఁగూర్చి తాను 2. అలసినదానను అని మహతిగానూ అమహత్తుగానూ చెప్పకొనుటయు ననుచితమే. ఇటనెల్ల మహద్వ్యవహారమే సరి.

మ॥ తను వెన్నంటిన పౌరులం బరుసఁదోడ్తో మాన్చి విఘ్నంబులన్నా
[11] 1445 మును మున్నే నవిరాగిసద్గుణుఁడు రాముం డెక్కఁడో యెక్కఁడో
జనియెన్ సీతయుఁ దద్విభూతియనఁగా సంతుష్టయై వెన్కవె
వ్కనుబోయెన్ వినవే సుమిత్రసుతుఁడున్ గాఢప్రమాదంబు ప్రీనాన్.

మూ॥— విఘ్నానివానుసరతో వినివార్య పౌరాన్
స్వర్గే స్వయం నయ ఇవైష విరాగ రామః
ఏనం విభూతి రివ సానుజగామ సీతా
తాం లక్ష్మణోపి శుభలాభ ఇవాన్వగచ్ఛత్.

వెంటవచ్చుచున్న పౌరులను విఘ్నములనుంబోలె వెనుకకు మరల్చి రాముఁడు స్వర్గమునకువలె తాను ముందు నడచెను; అతనిని విభూతివలె ఆసీత వెంబడించెను;

ఆమెను సుఖలాభమువోలె లక్ష్మణుఁడు అనుగమించెను.— విఘ్నములను తొలఁగించుకొని నయమవలంబించిన ఎట్లు తప్పక విభూతి గలిగి, దానివలన నెట్లు తప్పక సుఖలాభము కలుగునో, అరీతిని పౌరులను వారించిన రామునితో సీతాలక్ష్మణులు కలసి కూడఁబోయిరి;—అని భావము. ముగ్గురును ఉత్కృష్టస్వభావులనియు భావము. పద్యములో స్వారస్యము తప్ప కడమయెల్ల నున్నది. మూలములో పౌర రామ సీతా లక్ష్మణుల యుపమానములైన విఘ్న నయ విభూతి సుఖలాభములకు వాచకములందు ఉపమేయసమలింగతా నిర్వాహంబువలనిసొంపు పద్యములో 1. గాఢప్రమోదాప్తి నాఁ— అనుచో లక్ష్మణోపమానమును స్త్రీలింగముగాఁ జెప్పుటచే పంతులవారు చెడఁగొట్టినారు. ఇందువలన ఆస్వారస్యమునే వీరు గ్రహింపలేదనుట స్పష్టముగాదా? 2. విరాగి.— కేవలప్రకృతవిరుద్ధము. విరాగికి విఘ్నము దేనికి? రాగముచేతనే గదా నయప్రయోగము? ఔపమ్యము విరాగితో నెట్లుపొసఁగును? రాముఁడు విరాగియేని సీతనేల తోడ్కొనిపోవును? సీతకై కిష్కింధలో నేల విరహమున వేఁగును? సీతకై రావణసంహారమేల చేయును? పిమ్మట పట్టాభిషేక మేల పొందును? ఇప్పుడడవికి పోవుట వైరాగ్యముచేతఁగాదు, పితృవాక్యపరిపాలనకొఱకు. 3. గాఢప్రమోదాప్తి— సుఖలాభమని మూలములో నున్నందులకు ఇందు ప్రమోదాప్తి. మూలములో పుల్లింగనిర్వాహమునకై లాభశబ్దము చేర్పఁబడినది, అర్థమునకు సుఖశబ్దమే చాలును. ఇందు ఆప్రయోజన మెఱుఁగక అనావశ్యకముగా శబ్దడంబర మాత్రలోలుభులై ఆప్తిశబ్దమును స్త్రీలింగమును జేర్చుకొని ప్రమోదశబ్దమందు సిద్ధమైయున్న పుల్లింగమునుగూడ పంతులవారు అనుపయుక్తము చేసికొన్నారు. పాండిత్యము పీఁచు రేఁగుట యన నిట్టిదే.

4. తను, దా—రెంటనొకటి యేనితొలఁగింపఁదగు. 5. విరాగి—పా. 6. ఒక్కుమ్మడిఁ—పా. 7. 8. సంతుష్టులై వేడ్కను—పా. ప్రా. 9. 10. ఈరెండును ఉత్ప్రేక్షోపకర్షకములు. 11. గాఢ—య.

మార్దవప్రకటసు—మృదు.

చ॥ సికతిల మున్నమంబునయి చెన్నలరారెను దారిమార్దవ
[12] 1457 ప్రకటసుశాద్వలంబిలయు వాటానిప్రబ్బలి గల్గిచల్లనై
నికటమునందుముందలరు నీరజినీకుముదిన్యుపేతమై
వికటము నైమరాళరవ విభ్రమమైన సరస్సులెస్సగఁ

మూ.—పన్థా స్సమ స్సికతిలో మృదుశాద్వలా భూః
వేతస్వతీ సరిదియం శిశిరా న దూరే

అగ్రే చకాస్తి సరసీ చ కుముద్వతీయం
కాదమ్బ కూజిత కరమ్బిత హంసనాదా.

దారి సమము ఇసుకతెర, నేల మెత్తనిపచ్చికమైదానము; ఇదిగో చెంతనే చల్లనియేఱు ప్రబ్బలులుగలది, ముందు కలువసరస్సు గలదు, అందు కాదంబరుతము హంసరుతముతోఁ గలసి చిత్తము నాకర్షించుచున్నది.—ఇంతలఘువైన యీయర్థమును ఈపద్యములో ఎట్లు గోనెలో కట్టి కొట్టినారో కనుఁడు. వసంతతిలకను చంపకమాల పెట్టుకొనియు, 1. వాహినిప్రబ్బలిగల్గి చల్లనైనికటమునందు, అనువాక్యమున క్రియవదలుకొన్నారు; ఆలోపమును తీర్చునది మూలములో ఇయమ్ ఉన్నది, 2. ఇందులో తల్లోపము రెండవదియైనది. 3. నికటముఙ్ + అందుఙ్ అని రహస్యమా? నికటమునుపొందును, నికటమందుండును, నికటమందున్నది. డొంకతిరుగుడు. 4. కాదంబకూజిత కరంబితము ఎగిరిపోయినదిగదా? దీనినెగురఁగొట్టనేల? దీనికి బదులు నీరజినిం దూర్పనేల? పద్యము కుదురుటకై యిన్నియిడుములా? కుదిరినదా? మరాళరవవిభ్రమము బహువ్రీహియగుటెట్లు? సరస్సునకు విశేషణమగుటెట్లు? సామానాధికరణ్యోక్తిచేత విభ్రమ బాహుళ్యోక్తియా? సరాళము గాదు. 5. చెన్నలరారెను—ఈభూతమేల? ఇప్పుడులేదని యర్థమా? 6. మృదు అనుటకు మార్దవప్రకటనను; ఇట్టి బేతాళ పదబంధము జయదేవుని కలవడునా? 7. అయిచెన్నలలరారెను — ఇది సున్నకు సమానము. 8. లెస్సగఙ్—పూర్ణానుస్వారము. ప్రాసముకోసము నదూరే నికటమయినది; 9. వికట, 10. ప్రకటము లెక్కువగా వచ్చినవి. 11. నీరజినిని చిన్నయతీశ్వరులవారు ఉంచుకొన్నారు. 12. చెన్నలరారెనును పెద్దయతీశ్వరులవా రుంచుకొన్నారు.

హంస—తర్వాతఁ బ్రాణనాథుని వెనువెంట జానకి చనుచున్నది.

మ॥ హరిణంబుంగనిభీతముంగురుదయాయత్తాత్మయైతిన్నఁగా
[11] హరికాంతామణినీతసస్యాంశుకముచేనాత్మేశ్వరేష్వాసముఙ్
1468 వరలీలాప్తిముఖుంగిడెంపరిముడిఙ్ స్వశ్రోత్రభూషాయుత
స్ఫురితంబౌవరిమొల్కఁగైకొనియిడెన్ సొంపొంపఁగానింపుగఙ్

మూ.—తతః ప్రియతమానుపదం గచ్ఛన్తీ జానకీ।
భీతం విలోక్య హరిణం కరుణార్ద్రచిత్తా
పత్యు ర్నిజేన పిదధే ధను రంశుకేన
కేదారసీమ్ని సదయం కలమప్రరోహ
మాదాయ సాధు విదధే శ్రవణావతంసమ్.

1. చనుచున్నది—మూ. గచ్ఛన్తీ—శత్రంతము, చనుచు, లేక, చనుచున్నదై అనవలయును. ఇది యనువాదమాత్రమేగదా శ్లోకార్థమును విధించుటకు. 2. అట్లు వ్రాసికొన్నచో పద్యములో 'హరిణాక్షీమణిసీత' తో పనిలేదు. తరువాతి భాషితము వక్త్రంతరముదైననే యిట్లు సమాపకక్రియను ప్రయోగింతురు. ప్రాసజిత్తు—ప్రథమప్రాసము మూలార్థలబ్ధము కడమమూఁడును మఱి నేరేడుఁబండ్లే. 3. హరిణాక్షీమణి, 4. వరలీలాప్తి, 5. స్ఫురితంబౌ, 6. సొంపొందఁగా—వ్రత్యుపమైన యతి బూరె=ఇంపుగాన్, 7. స్వ=దివ్యమయిన యతి లద్దు. స్వశ్రోత్రభూషాయితస్ఫురితంబు—దీనికర్థమేమి? తనకర్ణభూషవలె నాచరించిన కాంతిగలదైన, అనియుత్పాతము. అట్టి యాపరిమొల్కను గైకొని ఎవరికిడెను?—హరిణమునకిడెనా? తానుధరించెనా? అవతంసముగా ధరించెననుట కీడొంకతెరుగుదా? 8. మూలములో సదయముగా అవతంసించెనని యున్నది. పంతులవారి కాదయ లేకపోయినదేమి? ఈ దయ కూడదని పంతులవారి తాత్పర్యమేమో? మహాకవులెల్ల కూడునందురు, కారణమరయవలయును. "అవతంసయన్తిదయమానాః" శాకుంతలము. వరిమడిని వీరు చెప్పినారు. 9. మూలకారులు కేదారసీమను [గనిమను] చెప్పినారు. పంతులవారి రచనలో ఆమె పొలముత్రొక్కుకొని పోయిన ట్లర్థముప్పతిల్లుచున్నది. సదయమన్న త్రొక్కలేదని యర్థమగునుగదా? 10. పంతులవారు భూషాయిత అనిత్తాంతమిడుట చూడఁగా, శ్రవణావతంసం కలమప్రరోహమ్ = నిజశ్రవణభూషగానుండిన వరిమొలకను, విదధే=(లేడికి) పెట్టెను, అనియే యన్వయించి యుందురని తోఁచుచున్నది. 11. వరి (మడి), వరి (మొల్క) అని అనవీకృతము.

మ॥ ప్రియమారంగ సరస్తటంబుననదీప్రాంతసైకతం బందునుం
[12] 1480 బ్రియునెక్కింతయుఁ బాయఁజాలనిదియా శ్రీచక్రవాకాంగనం
దయివారంగని దారివారకప్రమోదంబుంగనెన్ రామస
ద్దయితారత్నము సీతయాత్మగుణయుక్తప్రీతి యుక్తంబెకా.

మూ.—తటభువి సరసీనాం సైకతే నిమ్నగానాం
పరిసర మపహాతుం చక్రవాకీం ప్రియస్య
క్షణమపి న సమర్థాం లోల మాలోకయన్తీ
పథి జనకతనూజా ప్రాప హర్షం శుచం చ.

దారిలో సరస్తటముల నదీపులినముల క్షణమేనియు ప్రియునిఁ బాయఁజాలని చక్రవాకిని సతృష్ణముగాఁ గని జానకి మోదఖేదములకు భాజనమాయెను. [ఇప్పటికూటమికి సంతసంబును రాత్రిగల్గువియోగమునకు ఖేదమును.] పద్యములో, 1. మోదము

మాత్రమే చెప్పఁబడినది. తన్మూలమైన తెలుఁగుముద్రణములలో "పథి జనకతనూజా ప్రాపహాస్తం తనూజా" అని చతుర్థపాదము. ముదితనూజాశబ్దము అచ్చుపొరఁబాటని యొకరు చెప్పవలయునా? అది పద్యమున సమన్వయమునకు రానందున దానిజోలి మునకేలయని పంతులవారు దానిం బరిహరించినారు; "స్వస్థానవేషభాషాభిరుత్తాస్సన్త్రః" అనుమాటను లిపికిఁగూడ నన్వయించి, పరదేశలిపి యని నాగరమును నేర్చికొనరైరి. 2. ప్రియమారంగ—ప్రా. 3. హృత్—ఇదేయతిహృదయము. 4. దియా—పా. 5. శ్రీ—పద్యములలో శ్రీయోగము రాములవారికింగూడ లేదు. 6. యతీశ్వరుల వారికటాక్షముచే చక్రవాకాంగనకుఁ గలిగినది. 7. దయివారక—ప్రా. 8. వారక—పా. సద్దయితారత్నము. 9. సత్తు చాలదా, 10. రత్నముకూడనేల? ఈసద్దయితకై కపనమే మానివేయవచ్చును, దోషములేదు. 11. ఆత్మ... చెరా—సొంతకల్పనము. ముదితనూజాశబ్దమునకుబదులు శుచమ్ అనుపదముంటనెఱిఁగిన పంతులవారు ఈసొంతకల్పనము చేసియుండరు. ప్రీతిమాత్రమేగదా యిందుచెప్పినారు? 12. దొంగదొంగను మెచ్చును, ఉంపటాలు ఉంపటాలిని మెచ్చును, అట్లు మెచ్చుటయుక్తమే అను పంతులవారి సిద్ధాంతమును వారిపంటివారే మెత్తురు. ఆహా సొంతకల్పనము! ఏల జయదేవకవి వాక్కును సొంతనుడుల మైలచేయుట!

౬౮ - వ పుట.

వెనుక.

చ॥ అలఁతిగ నెండయుండఁగనె యాఁబయనంబడి మైనమెండుగా
నిలుకడ గల్గుచుండెడును నీరజబంధుని వాలుఁడీల్పడక్
[7] 1487 వెలయుఁ బ్రయాణముల్ కటి రవింగన లేమిని గన్నుమూయఁగా
జలజిని విడుపట్టుగను జక్కఁగ నెక్కను వెనుకక్కఁడక్.

మూ.—యావ త్తీక్ష్ణం తపతి తపన స్తావ దేవ ప్రయాణం
విశ్రామ శ్చ ప్రసరతి రవే రంశుజాలే కరాళే
యాత్రోద్యోగః పునరపి రవే ర్లమ్బమానే విమానే
యామిన్యాం త్యక్తకమలినీ తావ దావాసబద్ధా.

ఎప్పటికి సూర్యుఁడు కొంచెము వేఁడిమియుక్కనో అప్పటివఱకే ప్రయాణము; సూర్యునికిరణజాలము తీక్ష్ణముగా ప్రసరించుచుండునప్పుడు విశ్రామము; సూర్యుని విమానము వాలుచుండఁగా మరల పయనము తొడఁగుట; ఎప్పటికి తామరతీఁగ కన్ను మూయునో అప్పటికి విడియుట.—

1. అలంతిగనెండయుండఁగనె—ఎండ ప్రయాణమున కవశ్యమని యర్థము. ఎండవేఁడిమెక్కుకముండే అని మూలానుసారముగా చెప్పకొనుట యిట్లుగాదు. అవధారణార్థకమయిన యెకారమును అలంతితో చేర్పఁడు. "ఎండ అలంతిగనే యుండఁగా" అనుఁడు. 2. అది మెండుగానైనన్—అని యన్వయక్రమము. (ఆ) పయనము విస్తారముసాగినతర్వాత అనియర్థము. మూలమది కాదుగదా? అదియనఁగా ఎండయని ఆసన్నమును పయనమును అతిక్రమించి గ్రహింపవలయు. మూలముం గనకున్న ఈప్రయాస యుండనేయుండదు. 3. డాలు మబ్బడ్డమయినను డీల్పడును. కాన విమానము వాలఁగానని జయదేవుఁడు చెప్పినదేసరి. 4. ప్రయాణమున్—ఈ నకారము పాదపూరణవికారము. 5. రవింగనలేమిని— సాంతకవనంపులక్షణములు పూర్తిగాఁ గలవు. రవిం గనఁగల్గిన జలజిని కన్నుమూయునా? రవింగనలేమిని అన్నంజాలదా, జలజిని కన్నుమూయుటను జెప్పనేల? ఇది చాలదా, దానిం జెప్పనేల? ఇవి రవిం గనలేక యతిని గన్నవ్రాఁత, 6. చక్కఁగ నెక్కొనుటౌను నక్కుడన్—ఇది సన్న్యాసిమతము. ఇందు రామునికి పంతులవారు బసయేర్పఱిచినారు. దీనియర్థము వీడుపట్టుగను అన్న రానేవచ్చినది. కడమ యన్నివిశేషము లటుండనిండు. 7. ఔనున్ ఏమి? ముక్కుకొననొక జుట్టుగా నున్నది. కొన్నియెడల ద్రుతంబుమీఁద ద్రుతంబన్నారేగాని సర్వత్ర యనలేదు. ఈయానున్ ద్రుతము ఆంధ్రస్వభావమున లేదు. దీనిని సమర్థింప వ్యాకరణములు తెచ్చినను లక్ష్యములు తెచ్చినను సర్వము భాషాస్వభావదూరమని పరిహర్తవ్యమే. ఈప్రయోగము వింతగానే యున్నది.

1488 "మార్గమునయందు సీతక్షమాతనూజ"— క్షమాతనూజ సన్న్యాసి కొఱకువచ్చినది.

1489 ఎడతెఱపిలేని తెరువరులకు — వ్యవధానము లేకుండ గుంపుగా నడచు పథికులకు అని దీని కర్థము. మూ. నిత్యపథికానామ్; ప్రతిదినము పయనము నడచు పథికులకు అని యర్థము.

అరణ్యరోదనపద్యము.

శా॥ శ్రాంతశ్రాంతయునయ్యెసీతపతికిన్ సంసేవనే నెంగడున్
[16] వింతల్గాగనువల్కులాంచలమునన్ దిన్నంగవీచోపుగా
1505 నంతన్ రాముఁడువిశ్రమాంబుముఖుఁడై యాజానకిం జూపిచే
శ్రాంతశ్రాంతుఁడయయ్యెవెండియుఁబథశ్రాంతింగనఁడేమియున్.

గంగ.— అహోవినయముయొక్కమనోజ్ఞత!

పద్యార్థము.—తాఁ బడలియు సీత రాముని తనచీరకొంగుతో వీచుచు నుం చెను. అంత నతఁడుతన మొగమునందలి చెమ్మట లింకిపోయినను, ఆమెచూపు తన పైఁ బొలయఁగా కడు బడలినవాఁడాయెను, గాని మార్గాయాసమునుమాత్రము మఱి పొందఁడాయెను. పద్యార్థార్థము— 1. ఆమెచూపు—దీనికి ఆమె తన్ను ఏడ్చు చుం జూచెననియు అందువలన తాను దుఃఖితుఁడాయె ననియు నర్థమగుచున్నది. 2. మఱి ఆయన మార్గాయాసము పొందమి యెట్లో అది యీశ్వరునికే యెఱుక? మార్గాయాసమేమో మఱల నడచినం దప్పదు. 3. జానకీతుష్టి యనఁగా జానకిని తాఁగాంచుట యనుపక్షమందు, ఆమెయొక్క ప్రయాసకు ఆయన దుఃఖితుఁడాయె నని యర్థము. మఱి మార్గాయాసముపొందమి యేమో అది పూర్వావస్థమే. వీరే దీ నితర్వాతిపద్యములో "దస్సినప్రాణకాంతునిఁ" అని [తనకు విరుద్ధముగా తానే] సాక్ష్యము చెప్పకొనుచున్నారు.

కాన్తేనాథ ప్రణయమధురం కిఞ్చిదాచఞ్చలేన
శ్రాన్తాశ్రాన్తా జనకతనయా వల్కలస్యాఞ్చలేన
చక్రే వీతశ్రమజలకణస్నిగ్ధముగ్ధాననశ్రీః
శ్రాన్తఃశ్రాన్తః సపునరనయా లోచనస్యాఞ్చలేన.

సీత బడలినప్పడెల్ల శ్రీరాములవారు ప్రణయమధురముగా ఈషచ్చంచలమైన తనవల్కలాంచలముతో (నారవస్త్రంబునంచుతో) ఆమెకు వీచిరి. ఆమె దానిచే నెమ్మొగమ్మున చిఱుచెమరు వోయి మనోహరవికాసమును మఱల పొందినదాయెను. అట్లే ఆయన అలసినప్పడెల్ల ఆమెయు ప్రేమమధురముగా ఈషచ్చంచలమైన తనలోచనాంచలముతో [కడకంటితో] ఆయనను గనియెను. దానిచే నాయన నెమ్మొగమ్ము చిఱుచెమరువోయి మనోహరవికాసమును మఱల పొందిన దాయెను.— రాముఁడు వల్కలాంచలముచే నామెయలఁతం దీర్చెను, ఆమె లోచనాంచలముచే రాముని యలఁతం దీర్చెను, అని పరివృత్త్యలంకారము. "పరివృత్తి ర్వినిమయో న్యూనాభ్యధికయో ర్మిథః। జగ్రాహైకం శరం ముక్త్వా కటాక్షాన్ స రిపుశ్రియః" చంద్రాలోకము. ఈపరివృత్తినే "అహో కమనీయతా వినిమయస్య" అని గంగ దీని తర్వాతివాక్యమున తెల్లముచేసినది. [వినిమయ మనఁగా ఒకటియిచ్చి యొకటి బదులు పుచ్చుకొనుట.] ఇచట వల్కలాంచల వీజనమునకును నేత్రాంచల దర్శనమునకును వినిమయము ఎంత కమనీయముగా నున్నది! అమాటయే గంగావాక్యమున కర్థము. పంతులవారు పద్యమును పాడుచేసినట్లే ఈగద్యపుముక్కనుకూడ, కంపానీటరు వీరాసామిగానిని ప్రమాణీకరించి "అహో కమనీయతా వినయస్య" అనుపాడుము

ద్రణమును యథాస్థితముగా తెనిఁగించి చూపినారు. శ్లోకహృదయము—రామునిప్రేమచే సీతబడలిక తీఱెను, సీతప్రేమచే రామునిబడలిక తీఱెను, అని. 4. పంతులవారిపద్యములో వినిమయము లేదు, 5. శ్లోకసారమయిన ప్రేమకూడ, ప్రేమయే, లేకపోయినది. సీతయే రాముని యలఁతం దీర్చినట్లున్నదిగాని, రాముఁడు సీతయలఁతందీర్చినట్లు లేదు. 6. పంతులవారివర్ణన యువజానియైన వృద్ధపతి కుచితముగా నున్నది. ఒ శేపిశాచీ పరిచారికామర్యాదగా పంతులవారువ్రాసినారు, శృంగారరసోత్తరంగముగా జయదేవమహాకవి వ్రాసినాఁడు.

దుష్యంతుఁడు శకుంతలంగూర్చి,

కిం శీతలైః క్లమవినోదిభి రార్ద్రవాతాన్
సంచారయామి నళినీదళతాళవృన్తైః
అఙ్కే నిధాయ కరభోరు యథాసుఖం తే
సంవాహయామి చరణా వుత పద్మతామ్రౌ. శాకు.

మాలతిలో, యూథపతివృత్తము.

కణ్డూకుట్మలితేక్షణా మనుచరిం దన్తస్య కోట్యాలిఖన్
పర్యాయవ్యతికీర్ణకర్ణపవనై రాహ్లాదిభి ర్వీజయన్
జగ్ధార్ధై ర్నవశల్లకీకిసలయై రస్యాః స్థితిం కల్పయన్
ధన్యో వన్యమతఙ్గజః పరిచయప్రాగల్భ్య మభ్యస్యతి. భవభూ.

నాగపతే శ్లాఘ్యయౌవనః ఖల్వసి, కాన్తానువృత్తిచాతుర్యమప్యస్తి భవతః

లీలోత్ఖాతమృణాళకాణ్డకబళచ్ఛేదేషు సంపాదితాః
పుష్యత్పుష్కరవాసితస్య పయసో గణ్డూషసంక్రాన్తయః
సేకః శీకరిణా కరేణ విహితః కామం విరామే పునః
యత్స్నేహా దనరాళనాళనళినీ పత్త్రాతపత్రంధృతమ్. భవభూ.

పంతులవారు చేసినయద్భుతాన్వయము— 7. పంతులవారు కాన్తేన అనఁగా రామునిచేత అని గ్రహింపరు. కాన్తేన [మనోహరమైన] వల్కలస్యాఞ్చలేన [నారచీరయంచుచేతను] 8. ప్రణయమధురం [సేవను—ఇది కంటకారిరసవైద్యము.] 9. చక్రే [చేసెను] అనియు, 10. వీత...శ్రీః [రామునికి విశేషణము, ఇట్టివాఁడై] సః [రాముఁడు], అనయా [జానకిచే] లోచనస్యాఞ్చలేన, 11. శ్రాన్తః శ్రాన్తః [శ్రాంతశ్రాంతుఁడాయెను]. శ్లోకార్థమెఱుంగలేనివారు తెనిఁగింపఁబూనుట ఉట్టికెక్కలేనియమ్మ స్వర్గమునకెక్కఁ జూచుటగాదా. 12. పునశ్శ్రాంతియఁట—పునయని

యపంతత్త్వమెట్లు? పత్రిక్ అని ప్రాతిపదికము. సమాసాంతమందు అత్వము వచ్చునుగాని మధ్యమందు రాదు. పంతులవారు పత్రము అను తత్సమము బట్టి పత్ర అని ప్రాతిపదికముం గల్పించుకొన్నారు గావలయు. పత్రిక్రాంతి యని దిద్దునది.— 13. సం—య. 14. వితల్గాఁగను—ప్రా. 15. తిన్నఁగ—య. 16. పత్రిక్రాంతిం గనం దేమి యుక్— దీని యసంగతత్వము చేతనే ఇది యతిభిత్త్యర్థమయిన సొంతపాఠక మని యెఱుంగఁబడును.

ఉ॥ చేరువ రాఁగమన్కి, మును జెచ్చెరఁ గొన్ని యెయజ్ఞ లేగిత
[14] 1519 చ్చారుకరంబునుండి కొని చాపము దన్నిన ప్రాణకాంతునిక్
ధీరస మొందఁ రాన్వితుని దిన్నఁగఁ గెంజిగు రాకులం పగం
గారహిపిచు సీత విధి కార్య సముంచిత వైజయంతినాక్.

1. అన్వయపదిపంక్తిక్రమ మిందుఁ గలదు.— మన్కి చేరువ రాఁగ, తన్నిన ప్రాణకాంతుని చారుకరంబునుండి చాపము కొని... అతనిక్, అనుక్రియము తెనుఁగుభాషకననుకూలము. ప్రాసచిత్తు గలదు—చేరువ—అర్థలబ్ధము 2. ధీర, 3. చారు—[అప్రసక్తములు], 4. రహి.—ఈమూఁడు ప్రాసపూరణములు. 5. తత్—పా. ఇది లేకున్న మేలు. దీనిస్వారస్య మేమన—ఎవనిచేతినుండి యని యొకప్రశ్న కల్పించుటయు, రాముఁడు అనంతరోపాత్తుఁ డగుటచే రామకరమునుండి యని తోఁచమిచే, 6. నన్యుఁ డౌదఁటా యని పూర్వవాక్యాలోచనము చేయించుటయు, అటు భంగము నొంది రాముఁడే యని తలంపవలయుటయు, ననునిక్లేశము. 7. గా—యతిలంకె. 8. తగక్ అనఁగానే తగంగా అనునర్థము వచ్చినది. యు—పా. 9. తిన్నఁగ—య. ఈపదమునే మందార్థమున వీరు పూర్వము ప్రయోగించి యుండిరిగదా, ఇప్పుడిటు తూర్ణార్థమున ప్రయోగించిరి గావలయు. ఇఁకను 'తిన్న॥ రామభద్రుఁ' అని కల్పితము. 10. తగక్—పా. 11. సముంచిత—పా.

ప్రత్యాసన్నే భవతి నిలయే సంప్రయాతా పురస్తా
న్మూర్తం ధీర్త్యైః కతిపయపదైః శ్యామమాదాయ హాస్తాత్
క్రాన్తం కాన్తం నవకిసలయైః సానుజం వీజయన్తీ
జాతా సీతా సముచిత విధిప్రక్రియా వైజయన్తీ.

12. వీచుసీతవిధికార్య సముంచిత వైజయంతినాక్— మూ. వీచుచు సీత సముచితవిధిప్రక్రియా వైజయంతి యైనది. మూర్ఖువలన వైజయంతీత్వమునను విధేయము పోయినది. శ్లోకమునకెల్ల నేతద్విధానమందే తాత్పర్యము. 13. ముఱియు సముంచితమైనది విధిగాని వైజయంతిగాదు. సముచితము విధులుగా నిది ఎక్కడనైన నొకచోఁ

డినం జాలునని వేయఁబడినది. మహాభారతములో ఆదిపర్వతమన్నట్లు పడినది. 14. మూలములో, వీజయంతి, సముచితవిధిప్రక్రియచేత [స్వార్థికాణ్ ప్రయుక్తమైన యాదివృద్ధి ప్రక్రియచేత] వైజయంతి యైనది, ఆదివృద్ధి పొందినది, శ్లేష మెనసినది, యనుచమత్కారము కలదు. ఇందు అది యెక్కడ?

౬౫ - వ పుట.

1520 క్షితిపతిపుత్రయుగ్మకము చెంపలఁ జెమ్మటఁబావనొప్పె—

చెంపల—గ్రామ్యము. చెక్కుల అనవలసినది. 'చెంప యింపొందెడుఁ' అని ౭౫ - వ పుటలో మఱల నీశబ్దమును ప్రయోగించుకొన్నారు. ఇది వాడుకలో కల దే యందురు. వాడుకలో నివన్నియుం దెచ్చి పెట్టుదురా? పీఁకుట "వంటిదే"

శా॥ వీరల్గాస్వరసావనప్రమదరప్రృథ్వీపాలమాళ్యుజ్జ్వల
[11] శ్రీరత్నస్ఫురదంశుమాంసలపదప్రేంఖన్నఖప్రాంకితుల్
1531 దూరోన్ముక్తచతుస్సముద్రలహరీతోయోత్థశుక్తిస్థల
ద్రాజద్వరశుక్తిభూవలయముఁ దాల్తుర్ధరామండలిఁ.

మూ.— ఏతేహి స్వరసాపనప్రమనిఖిలక్ష్మాపాలమాళ్యుజ్జ్వల
న్మాణిక్యస్ఫురదంశుమాంసలపదప్రేఙ్ఖన్నఖజ్యోతిషః
దూరోన్ముక్తచతుస్సముద్రలహరీవిప్లుష్టశుక్తిస్థ
న్ముక్తాపఙ్క్తివినిర్మితైకవలయాం భూమణ్డలీం భుఞ్జతే.

తెలుఁగు ముద్రణములో "వలయం భూమణ్డలం" అని మార్పు.

1. తాల్తురు—మూ. భుఞ్జతే—ఆత్మనేపదికి అనుభవింతు రని యర్థము. భుఞ్జన్తి అనుపరస్మైపదికి ఏలుదురని యర్థము. రెండును గానిది తాల్తురు అనునది దీనియర్థము కాదు. 2. జయదేవకవి భుఞ్జతే అను నాత్మనేపదిరూపముచేతను, మణ్డలీ మను స్త్రీలింగముచేతను ఈరాజులకును సర్వభూమికిని నాయికానాయకభావ మును నిబంధించి, 3. ముక్తాపఙ్క్తివినిర్మితైకవలయా మని వలయాభరణధారిణి యనుటచే భూమండలియొక్క నాయికాభావమును పుష్టినొందించినాఁడు. తెనుఁగు ముద్రకుఁడు నపుంసకలింగము పెట్టి అభావమును చెఱిచినందున పంతులవారు తదేకప్రమాణకులు కవితాతత్త్వదూరగులై దానిని తాము ను రానీకపోయినారు. మండలిఁ అని స్త్రీలింగమే వీరు పెట్టినారే యనిన ఆ స్త్రీలింగము వీరియిష్టమునకు విరోధముగా వీరితో జగడమాడి వచ్చిపడినది. దానికి వీరు వలయముఁ అని అమహాత్తు

గా బహువ్రీహిచేత వాతవేసినారు. స్త్రీత్వము చెప్పనిచో వలయోక్తిస్వారస్యము లేదు. **4**. మఱి తాల్తురన్నందులకు బాహువునందని చెప్పవలసినది. అట్లు బాహుశబ్దమును లేదు, మఱి తాల్చుట యేమి? తాల్తురను రక్షించుకొనుటకు ధరామండలియందు...శుక్తిభూవలయమును ధరింతురని యర్థము చెప్ప నుద్యమింతురేని, దూరాదివలయాంతసమాసము భూమండలికి విశేషణముగా బహువ్రీహిగా భూకార్త్స్న్యమును దెల్పునది, యిపుడు నిష్ప్రయోజనమగును, కృత్స్నభూప్రభుత్వమును జెప్పనేరదు. అల్పభూప్రభుత్వము నేనియుఁ జెప్పనేరదు. అట్టివలయమును వర్తకులవలననుండి విలిచి పడయవచ్చును. కావున తాల్తురు యతికై వేసికొన్నదే గాని పద్యమునకు పనికిరాదు, మూలార్థము గాదు. "వీరల్బాహువునన్వసమ్రనిఖిలోర్వీపాల" అని మార్చుకొన్న తాల్తురు రక్షితమగును.

**5**. వర, వర,—ప్రథమపాదములో నొకటి, చతుర్థములో నొకటి.—'నిఖిలోర్వీపాల' అనిమూలార్థమునే చెప్పికొన్న నొకవర తప్పును. **6**. 'రారాజన్నవమౌక్తికాఢ్యవలయన్' అన్నచో స్త్రీత్వంబును గలుగును, వర తప్పును, నవముక్తావలయధరత్వమను విశేషమును లభించును.— **7**. శ్రీ—ఇది శ్రీమత్పరహంసపరివ్రాజకాచార్యులవారి కటాక్షముచే రత్నములకు గలిగినది, రాఘవులకుఁగూడ [నేతదవతారకవాక్యమందు] లేకపోయినది. **8**- ప్రాంకితుల్—జ్యోతిషః అని మూలము; **9**. నఖములచే ప్రకృష్టమైన గుర్తుగలవారు.—అననేమి? ఇట్టి నఖములు మఱెవ్వరికి లేవు, ఇవే వీరికి వ్యావర్తకధర్మము; అని డొంకచుట్టి రావలయును. లేక, అట్టి నఖములచే భూషితులా? [నఖాలంకృతు లన్నమాటయా?] ఏయర్థమేనియు అంకితులన్ననే చాలును, ప్రశబ్ద మనావశ్యకము. **9**. లహరీతోయ—తోయలహరీ అన్న మేలు. ఇది విక్షిప్తకు బదులు పడినది. **10**. విక్షిప్త యనఁగా విసరివేయఁబడిన, విసరివేయుటచే నేలకుఁ దగిలి సంధి యొదలి శుక్తి నోరు తెఱచిన దని యర్థము లభించుచున్నది, దానినుండి జాఱుట న్యాయ్యము. ఉత్థమైనమాత్రాన మఱల మున్గవచ్చును. దానినుండి జాఱుటకు న్యాయము లేదు. ధూతాప్త అన్న సరిపడును. **11**. శుక్తిస్థలత్—శుక్తిభూ—శుక్తి అనవికృతము.

౭౮-వ పుట.

ఖరదూషణులను రాముఁడు జయించెనని హంస చెప్పుచున్నది.

[5] క॥ అంతట ముహూర్తమాత్రన । నెంతయుజలీలచేరఁబిల్వఁబడెఁ
1536 శాంతుఁడులక్ష్మణుఁడు.

సరయువు.— [సహర్షంబుగ] రామభద్రుని చేతనా ?

హంస— కాదు కాదు.

సరయువు.— భగవతిభాగీరథీ ! నన్నుఁగాపాడుము. రాక్షససమూహముచే
ననిచెప్పనో ?

హంస.— అరితతి । గంతుగొనఁగ నులియు రామ కార్ముకమణిచేన్.

గంగ.— ప్రథమక్షణమున నగపఱుపఁబడిన బీరెండగలదిది యమృతవృష్టిగాదు.

1. శాంతుఁడు— ప్రాసకోసము శాంతివహించినాఁడు. 2. రాక్షససమూహముచేతనని చెప్పనో ?— మూలములో నిట్లు ప్రశ్నగాలేదు. సందేహమేనియు తెల్పలేదు. 'నిశ్చయముగా రాక్షసచక్రముచేత నని చెప్పను' అని యున్నది. "నూనం నిశాచరచక్రేణేతి వక్ష్యతి." 3. గంతుకొనఁగనులియు— గంతుగొనునట్లుగా అని యర్థమా! గంతుకొన్నతర్వాత యని యర్థమా? అసందిగ్ధముగానున్న మేలు.

4. కాదు.— హంసవాక్యము మొదట రామాపజయము చెప్పనదివోలెఁదోఁచి, తర్వాత రామజయమును చెప్పినది. కావున ఆవాక్యమును గంగ ప్రథమక్షణదర్శితతీవ్రాతప యైనయమృతవృష్టి యన్నది. పంతులవారు ఈయర్థ మెఱుంగక 'అమృతవృష్టి గాదు' అని వ్రాసినారు. రామజయవార్త అమృతవృష్టి గాదఁట! మఱేమి? కాలకూటవృష్టియా? పంతులవారు ఈతప్పుచేసినవిధము వినోదకరముగానే యున్నది. 5. ఏతన్మూలవాక్యమందు కంపోసిటరుగాఁడు అక్షరము లేక ప్రొప్రయిటరువారి యాజ్ఞప్రకారము సకు నే వేసినాఁడు. "సేయంప్రథమక్షణసందర్శితకఠోరాతపా పీయూషవృష్టిః" సేయమ్ అనుటకు నేయమ్ వేసినాఁడు. నాగరము తెలియదాయెను. సందర్భమువలన అచ్చు తప్పు నెఱుంగుతెలివి లేదాయెను. బి. ఏ. విద్యార్థుల నడిగిన గౌరవహాని! ఇఁక నిట్లుగాక మఱెట్లగును!

చ॥ పరకురువిందనేత్రముప్రవాళవిషాణముమౌక్తికోల్లస
[3] 1539 ద్గురుతరచిత్రమండనముకోమలహాటకకాయమైయహా
హరిణముగల్గెనెందడవినంతటభూరిమనోహరంబు సం
చరదమరాగమోయనఁగజంగమరోహణశైలమోయనన్.

1. అహా— పాదాంతాద్భుతము. 2. సంచరదమరాగమోయన— అమరాగమతోత్ప్రేక్ష మహాకాయత్వమును దెలుపును. 3. రోహణశైలతోత్ప్రేక్షయునట్టిదే. అగమాత్రోత్ప్రేక్షయే మహత్త్వమును దెల్పునఁట, మేర్వగోత్ప్రేక్షమాట చెప్పవలయునా? వరాహ సింధురాది మహాకాయములకుం గూడ మహత్త్వము వర్ణనీయ

మైనచో నగత్వోత్ప్రేక్ష కవులు సేయుదురు. "పురోద్యానములఁ మదేభములు ప్రాముతోఁడి నగంబులో యనఁగ," "క్రొవ్విన దగ్గొండ కైవడి గునుకుసెుక్క యొంటిగాని" "అప్పాలమువరాహపోతములు భూవర తొండము లేనియేనుఁగుల్." ఏనుఁగే మహత్త్వమునందెల్పును, అప్పై నగము, అప్పై మేరునగము. తేరులను, దేవాలయగోపురములను మహాకవులు మహత్త్వాభిధానార్థమై మేరురోహణములతోఁ బోల్తురు. మేరురోహణములచే సువర్ణమణిమయత్వము స్ఫురింపదా యనిన, నిశ్చయము లేదు. రెంటిచేతను మహాకాయత్వము తప్పదు.

మేరురోహణాభేదాధ్యవసాయము [తత్సాదృశ్యకథనమును] మహాకాయత్వము చెప్పు హేతువుచేతనే భాస్కరుఁడు అభేదాధ్యవసాయ సాదృశ్యములం జెప్పక

"రోహణాచలము మేరువు గూడి యురుతరప్రభ లీల హరిణంబుఁ బడసెనొక్కొ."

అన్నాఁడు. పడసెనొక్కొ అన్నాఁడు గనుఁడు. పంతులవారు భాస్కరామాత్యనివర్ణనాశక్తి కాసపడినారేగాని దానియర్థమును గ్రహింపనేరక, వైద్యుని యొక్క సంచిమూఁతగాఁడు ఆసంచిని దొంగిలించి గ్రామాంతరము పోయి, జీవికార్థమై అట ఆగుళిక యీగుళిక అనుగఁ దీని యిచ్చి వైద్యము చేసినట్లు చేసినారు. మఱియు నంతపెద్దదిగా అగపడినచో అది యేదో మహాభూత మని సీత భయపడదా? మఱి దానితోలు కొన్నిమొకరాలు గప్పునట్టిది, నెత్తిని గట్టుకొని మోచికొని ఊరూరు హేరేగదా ఇఁక తిరుగవలసినవారు? ఈరసాభాసము లెల్లం గనఁగా నీచతుర్థపాదము పంతులవారిసొంతకవనమని విశదముగాదా?

౬౭ - వ పుట.

తే॥ భ్రూజితాసమశరచాపముగనుచాప
[5] 1544 విజితయువతీవరభ్రూసువిభ్రమముగ
సీతకడకంటిచూడ్కిఁ దాఁజేరె దాని
రాముఁడునునసితోత్పలశ్యాముఁడుమఱి.

మూ.— భ్రూజిద్విజితమనోజచారుచాపః
చాపశ్రీజితయువతీమనోహరభ్రూః
సీతాయాస్తమనుససార లోచనాన్తః
రామశ్చ స్ఫురదసితోత్పలాభిరామః.

1. మూలములో 'స్ఫురదసితోత్పలాభిరామ' అను విశేషణము సీతాలోచనాంతమునకును సీతాకాంతునికి [రామునికి]ని ఉభయమునకు అన్వయించుచున్నది.

ఇందు లోచనాంతమునకు సున్న పడినది. 2. అనుసార అనుటకు చేరె ననుట సరి గాదు. చేరె ననుటచే రామునికి మృగము దొరకినదని యర్థమగుచున్నది. అనుసరించెను అనుటచే మృగము పోవుచునే యుండినది, రాముఁడు వెంటఁ బోవుచునే యుండెను, దొరకలేదని యర్థమగుచున్నది. 3. 'ఘటి' యేమి? చార్థము [రాముఁడు] నకు లోనే వచ్చినది గదా? 4. వర—పా. 5. సు—పా.

శా॥ భీతార్తుంబయియార్చునామృగముతో వేగంబెయేగంగ శ్రీ
[11] 1555 సీతాకాంతదిస్వాంతమాతురతతో శ్రీలక్ష్మణుండుంధను
స్స్ఫీతుండై చనియెంబదాశ్రమము రక్షింపంగనందుండక
ప్రీతిం భీతినివచ్చె నచ్చటికహాభిక్షుండొకండెవ్వఁడో.

మూ.—త్రాసాతురేణ హరిణేన సహైవ తేన
దూరం ప్రయాతి హృదయే జనకాత్మజాయాః
సౌమిత్రి రాశ్రమపదా త్సహ కార్ముకేణ
ద్రాఙ్నిర్జగామ చ వివేశ చ కోఽపి భిక్షుః.

1. తదాశ్రమము రక్షింపంగనందుండ కప్రీతిన్—అమూలము. 2. అర్చు—ఇదియు నమూలకమే. పంతులవారు దీనిచే లక్ష్మణు యని మారీచుఁ డార్చుటను సూచించినారు. 3. అప్రీతిన్—అనుటచే సీతాకృతలక్ష్మణదూషణమును సూచించినారు.

4. "యత్స్యాదనుచితం వస్తు నాయకస్య రసస్య వా।
విరుద్ధం తత్పరిత్యాజ్య మన్యథా వా ప్రకల్పయేత్॥"

అనఁగా నాయకునికి అనుచితమేని రసమునకు విరుద్ధమేనియు అగు వస్తువును వదలివేయవలయును, వేఱువిధముగా మార్పనైన మార్పవలయును—అని యాలంకారికనిబంధన. జయదేవుఁడు తదనుసారముగా నిట జానకి లక్ష్మణుని "నీవు నన్నుఁ గామింపఁ గోరియున్నావు." ఇత్యాదివాక్యముల దూఱ నాడిన కథాంశమును నాయికకు అనుచితమని [నాయకుని కనుచిత మని చెప్పినవారితాత్పర్యము నాయిక కనుచితమైనను మానుమనియే, మార్పుమనియే], చెప్పక మానివేయఁగా, [తదనుసారముగా తత్కారణమైన మారీచకృతలక్ష్మణసంబోధనాదికమునుంగూడ సూచింపక విడువఁగా,] ఈ తెనుఁగుకవియొక్క విపరీతబుద్ధికి అదియే తప్పక చెప్పవలసినదని తోఁచినదిగదా! ఎంతయప్రీతికాక యామెయొక్క సంరక్షణ నుపేక్షించి వెడలిపోవును? పద్యమున చోటులేకపోయెనుగాని, ఉన్నచో నిచ

టు పంతులవారు సీతచే లక్ష్మణుని బూతులుగూడ తిట్టించి యుందురు. జయదేవుఁ డేమి జాగరూకత వినియోగించిన నేమిఫలము? వీరు "నాయన గాదెలో లేఁడ"ని రాజపురుషులకు [పోలీసుబంట్రౌతులకు] చెప్పివేసిరిగదా.

5. సీతాకాంతాదిస్వాంతము—ఈపాదపూరణ దివర్ణస్వారస్యము చక్కఁగా బోధపడినదేగదా? 6 ఏగంగ స్వాంతము అనువృత్త్యమహాతంబును పరిచితమేగదా? ఇట విశేషము—రాలకు రప్పలకును శ్రీకారములు కాఁగా 7. పాదపూరణ శ్రీకారమొకటి సీతకును, 8. యతిభిక్షాప్తశ్రీ లక్ష్మణునికిని కలిగినవి. 9. ఆశ్రమము రక్షింపంగ—సీతారక్షణము చెప్పిన మేలుగానుండును. ఆశ్రమ మనఁగా వీరి యావాసమా, అం దేమిధనము కొల్లపోవు నని భయము? ఋషులను రక్షించుటయా? సీతకు అపాయములేదా? అమెకన్న నెక్కుడా ఋషులు? 10. అహా—ఈహంసక అతిథు వెవఁడో తెలియదు, ఏల వచ్చినాఁడో తెలియదు, ఈయహాకారము సంతోషమునకా, ఆశ్చర్యమునకా? ఏదియు పొసఁగదు. పాదపూరణమునకు. మూలములో ఒక్కమాటేనియు నహాకారము చేయనియీహంస వీరితెనుఁగులో పలుమాఱు చేసి నీచవక్తృదౌర్భాగ్యమును చక్కఁగా పొందినది.

ఇట జయదేవకవి ప్రయత్నపూర్వకంబుగా మూలకథాక్రమమును మార్చినాఁడు. మూలకథలో,—మారీచుఁడు రామబాణహతుఁడై చచ్చుచు లక్ష్మణాయని యార్చెను. వాఁడు చచ్చినతర్వాత, లక్ష్మణుని పరుసములాడి సీత రాముకడకుఁ బంపెను. తర్వాత రావణభిక్షువు పర్ణశాలకడకు వచ్చెను. 'లక్ష్మణా' యను మారీచ శబ్దము వినఁబడఁగానే సీతమానసము రామునిమీఁదికిఁ బోయెనుగాని మారీచునిమీఁదికిఁబోలేదు. రామరక్షణార్థము లక్ష్మణుం బంపినదేగాని మారీచానయనార్థము గాదు. 11. రామబాణము మారీచునికి తగులకముందు ఈసర్వ మసంగతముగాన, ఈయనుచితవృత్తాంతము నెల్ల నడంచియే జయదేవుఁడు హననమునకు ముందు లక్ష్మణనిర్గమనముం జెప్పినాఁడు. ఆమెమనస్సు త్రాసాతురమయినహరిణముతోఁ గూడఁ బోయినదని చెప్పినాఁడుగాని రామునిమీఁదికి పోయినట్లు చెప్పలేదు. కావున లక్ష్మణుఁడు భయాతురమై పోయిన యామృగమునే ఆమెతలపోయుచుంటం గాంచి, ఆమెకై దానిం బట్టుటకు రామునికి సాహాయ్యార్థము పోయెనని యిట జయదేవహృదయము. అందువలన ఆర్పు లేదు, అప్రీతి లేదు, ప్రీతియే. కాన 'నార్చ్చి అప్రీతిక', అనువర్ణనచేత, పంతులవారు కథ యెఱిఁగినవారికి ఈవృత్తాంతమునే సూచించుటయు, ఎఱుఁగనివారికి అప్రీతియేలకో, అప్రీతియేని ఏల పోయెనో ఆకారణములు తెలియక పద్యము అయోమయ మగునట్లుగా చేయుటయు, జయదేవకవికి కరము హృదయశల్యము. నాటక లక్ష్యలక్షణంబుల మొగంబు వీరెఱుంగుదురఁట!

హంస.—కావున నీవు నీదివ్యవారియందు వాల నాకనుజ్ఞనిమ్ము....మూ. త దనుజానీత మాం దివ్యసలిలావతరణాయ. నాగరముద్రణములో తదనుజానీత మాం దేవ్య స్సలిలావగాహనాయ. పంతులవారితెనుఁగు ఈరెంటికిం దప్పటయగాక నదీదేవతలు చెప్పిన యుత్తమురనకుంగూడ తప్పినది. 'సరస్సులో క్రీడించుము.' అని యుత్తరము. ఆయుత్తరము పల్కినది గంగ. హంసయడుగుట సరయువును. 1. నీవు నీ...ఇమ్ము - తప్పు. మీరు నాకు...ఇండు, అన్న తెనుఁగుముద్రణమునకు సరి. **2**. నాగరముద్రణముంబట్టి దివ్య అనుట దేవ్యః అనుటకు తప్పుగదా. ఓదేవతలారా నాకు నీరుచొర సెలవొసంగుఁడు—అన్న నాగరమునకు న్యాయమునకును సరిపడును.

౬౮ - వ పుట.

చ॥ హరిణదృగంగనామణియుదంచితముల్గ దయివ్వియందియల్
[19] వరమణిమండితంబులుపలన్మృదులస్వనముల్ధరించుమీ
1574 విరహముఁగాంచరెప్డుఁబతిప్రీతికెపాత్రముళౌదురింతులీ
స్ఫురదురునూపురప్రవరముల్ధరియించినవీనిశక్తిచేఁ.

మూ.—అధిచరణ మమూ చమూరునేత్రే। మృదురణితౌ మణినూపురౌ విధేహి
అహ రపి విరహం న యన్మహిమ్నా। హరిణదృశ స్సహ వల్లభై ర్లభన్తే.

ఈపద్యములో పంతులవారు మూలార్థము సరిగాఁ జెప్పనేరక, సారము మాని చెత్త చేర్చి, ఉన్నది వదలి లేనిది చెప్పి తూ లనిపించినారు. చెత్త గాక మిగత పద్యము—:హరిణా(క్షీ)ఈమణియందియలను మృదులస్వనములను ధరించుము. వీనిశక్తిచే ఇంతు లెప్పుడును విరహము గాంచరు.—కడమపద్యము మునిసిపాలిటీ వారిది. 1. పద్యములో విరహము గాంచరు అనియున్నది. మూలములో వల్లభులతోడి విరహమని యున్నది. విరహమనఁగానే పంతులవారికి భర్తృవిరహమొకటియే యర్థమగును గాఁబోలు. విరహమన నెడఁబాటు; ఎవరితో నెడఁబాటో ఇచ్చోట అవశ్యము చెప్పవలయును. అంతకుముందు పలుమాఱు భర్తృవిరహ మనుభవించిన దానికి ఒకవేళ విరహ మన్ననే చాలినను చాలునుగాని అట్టి దెఱుఁగని సీతతో స్పష్టముగాఁ జెప్పవలసినదే. పైగా అపూర్వమహిమోక్తి గావున ఆనూపురములను షదిలముగా కాపాడుకొనుటకును విశ్వాసముతో ధరించుటకును వానిమహిమ స్పష్టముగా తెలియుటకై స్పష్టముగా కంఠోక్తముగా యద్విరహమో చెప్పవలసినదే. అట్లు చెప్పమి తెనుఁగులో దోషము. **2** పతిప్రీతికె—ఇంకొకనిప్రీతి నేల తోఁపింపవలయు? ఏమి యీయౌచిత్యము! ఈయవధారణార్థకము లేకున్నఁ గదా మేలు? తుదకు సీతను ఇంకొకని [రావణుని] ప్రీతియేగదా ఎల్లముప్పులందును ముంచినది?

3. పతిప్రీతికిఁ బాత్రము కాదురు—ఈమాట మూలములో లేదు. ఈసొంతముపలని స్వారస్య మేమనఁగా రామునికి ఈమెయందు నీఁకటిగలుగు ననురక్తి ఈనూపురము ల ప్రభావమో ఆయనయొక్క సహజసౌజన్యకార్యమో తెలియమి. సత్యభామ ద్రౌపదిని ఇట్టిక్రియలు భర్తలను వశపఱుచునవి నీకేమేని గలవాయని యడిగి చీవాట్లు తిన్నకథ ననుసంధింపుఁడు. 4. ఈముసలిది అరుంధతమ్మ యీవాదాంగవిద్యలు నేర్పుటకా? ఇంక రామునికి మందుపెట్టుమని వేరువెల్లంకి ఏమైన నిచ్చినదా? ఆ మె యట్టిది గాదు. ఆమెకు కొంచెము శృంగారరసముగూడ నెఱుకయే. 5. ఆమె వల్లభశబ్దము ప్రయోగించినది, పంతులవారికి శృంగారమన్నం దలనొప్పి, వీరు పతి యన్నారు. ఈరెండుశబ్దములకును భేద మెఱుంగఁ గోరికయేని, పతి=నాథ,—అని, వల్లభ=ప్రియ,—అనియు మనమం దుంచుకొని ఈశ్లోకముం జదువుఁడు:—

పురాభూ దస్మాకం ప్రథమ మవిభిన్నా తను రియం
తతో ను త్వం ప్రేయాన్ వయ మపి హతాశాః ప్రియతమాః
ఇదానీం నాథ స్త్వం వయ మపి కళత్రం కి మపరం
హతానాం ప్రాణానాం కులిశకఠినానాం ఫల మిదమ్.

అరుంధతీదేవతకు కవనకౌశలముకూడ నున్నది. ఆమె సీతను 6. చతురు రునేత్రే అని సంబోధించినది, నూపురప్రభావోక్తిలో 7. హరిణాక్షులు...విరహ ముపొందరు, అన్నది; ఇందుచే నీవును హరిణాక్షివిగాన నీవును వీనిచే నిర్విరహము గా సుఖముందు వని చమత్కారముగా పలికినది. ఆహరిణాక్షీ మనకవనములో ఇం తి యైనది. ఆచమత్కారము గంతుగొన్నది. 8. అరుంధతీదేవతకును పంతులవారికిని ఇంకొక్కవిషయములోఁ గూడ భేదము కలిగినది. ఆమె పగలుగూడ విరహము గలు గదని చెప్పినది, వీరు ఎప్పుడుం గలుగదనిరి. పగలెల్ల పదిగంటలకాలము బయట కొలువుగొలిచి వచ్చి రాత్రి యెల్ల నింటనే యుండువానిభార్యకు విరహమా కాదా? ఆమె నిత్య విరహిణియా? విరహ మెఱుఁగనిదా? ఆమెను విరహిణి యనరు. ఎప్పుడును విరహము లేనిదిగానే ఆమె వ్యవహరింపఁబడును. పంతులవారి యొప్పువలన ఇట్టిస్థితి యర్థమగును. భర్తృప్రవాసాదిహేతువులచే అనేకదినవిరహముండదని ఎప్పు డుశబ్దమునకు అభిప్రాయము గాఁదగును. అరుంధతి పగలుగూడ అనుటచే పంతుల వారు చెప్పినట్టివిరహము ఉండదు సరియేగదా పగలు కార్యాంతరవ్యాపృతుఁడై రాముఁడు సీతను విడిచి యుండుటయును సంభవింపదు, సీతతోనే యుండునని అధి కఫలము నిచ్చుచున్నది. పగలు వియోగమున్నను పంతులవారి యొప్పు అబాధితమే, అబాధకమే. అరుంధతీకటాక్షమే శ్రేయముగానున్నది. అంధ్రకవనకౌశలము కొం చెము చూతము. అది అరుంధతికి లేదు.

9. హరిణదృగంగనామణి—ఇందు ఈగంగజాతర యేల? హరిణదృక్కా— అన్నం జాలునే, పా. 10. ఉదంచితము—అందెలకు విశేషణము, నిష్ప్రయోజనము, యతికై వేసికొన్నది. పైకి లేచినదని దీనికర్థము. అందెల కన్వయింపదు. గౌణార్థము కల్పించుకోవలయును. అందెల కేల? వానిప్రభావము ఉత్తరార్థములో కంఠోక్తమే. యతికే దీనిని విశేషణముచేసిన సరిగానుండును. 11. ఇవ్వియందియల్—ఈయందియలనుటకు గుజరాతిపేటతెనుఁగు. 12. మణిమండితంబులు—అరుంధతి మణినూపురములన్నది. వీరు మండితశబ్దస్వారస్యముచే మణినూపురములు కావని సాక్ష్యముచెప్పినారు. 13. వలత్—దివ్యమయిన యతిపూరణము. 14. ఈస్ఫురదురు—పరామర్శలో మఱల నీవర్ణన యేల? 15,16. వర స్ఫురత్తులు ప్రాసార్థముగాని వర్ణనార్థముగాదని పంతులవారి వాదము. ఆపక్షమున ఉరువిశేషణ మేల? పెద్దలైన కాలినుండి జాఱిపోవా? కనుకనే రావణుఁడామెం గొనిపోవుచుండఁగా ఒక కాలిది జాఱిపోయిన దని పంతులవారివాదము. 17. ఆకాలు ఆమెకు జనకుఁడు యజ్ఞభూమి దున్నించినప్పుడే నాగలి తగిలి గాయమై అప్పటినుండి యెదుగనే లేదని నావాదము. 18. ప్రవరముల్—శబ్దములను. చింతకాయతొక్కుగా దంపవలయు. కవనమున్న నేమనుకొన్నారు. ఈతూలు న్యాయస్థానములందు పనికివచ్చునా? మహాకావ్యమందు దీనికి గణనగాని? 19. వీనిశక్తిచేఁ అనిచెప్పనే చెప్పినారు గదా మఱివేఱే 'ఈస్ఫుర...చిన' అని యీమెఱ్ఱియేల? రెంట నొకటి మానవచ్చును. "ఇంతులు......వీనిశక్తిచేఁ" అని నడుమబొట్లుపొడిపించి అచ్చువేయింతము. ఈతుంటను నల్లఁబూసలదండగా అరుంధతికినూపురములకు బదులు సత్కారముగా ఇచ్చి వేయుదము. ఆచారముగాదని ఆమెగొననిచో నష్టియే యుండదు.

సరయువు.—తద్వృత్తాంతమిప్పుడు నేల చెప్పఁబడుచున్నది?—

[4] హంస చెప్పినదానికి తర్వాతికథను గోదావరి సాగరునితోఁ జెప్పుచున్నది.
1578 గంగాయమునాసరయువులు ప్రవాహవేగమున సాగరుం దఱిసి అటను రామప్రవాస ప్రస్తావముగా నుంట కచ్చెరువడిరి. అందు సరయువు పల్కినమాట యిది. 1. ఇప్పుడు ననుటచే ఇంతకు పూర్వము ఇచట చెప్పఁబడుచున్నట్లు ఒకయసంగతార్థము దుర్నివారముగానున్నది. 2. ఈయిప్పుడు అమూలకము. 3. ఏల చెప్పఁబడుచున్నదనిప్రశ్నయేల? ఏల చెప్పఁబడఁగూడదు? 4. మూలమం దిది ప్రశ్నగాదు. ఇందు దానికుత్తరమును లేదు. మూ. కథమిహాపి తద్వృత్తాన్తశేషః స్తూయతే—ఏమి! ఇటను ఆవృత్తాంతశేషము చెప్పఁబడుచున్నది! అని యాశ్చర్యము మూలార్థము. ఇహాపి అనఁగా ఇచ్చోటను గాని ఇప్పుడును గాదు.

1579 మదోద్రేకాతిరేకుండునై—ఇఁక రెండు రేకలు వేసికొన్న బాగు. ఇది బహువ్రీహి యగుట యెట్లు? రావణునికి విశేషణ మగుటయెట్లు?

1580 హాతులమైతిమి—(గంగ వక్త్రి); హాతల మని స్త్రీలింగముగా నుండవలయును.

మూలవిరుద్ధము.

చ॥ దనుజుని కేలు దాఁకమికిఁ దాన నసూయయొసంగినట్టిస
[9] ద్వినుతతరాంగరాగమున వెల్వడి వెల్గొకఁ డంటరాని వే
1589 ల్పనఁగ వెలుంగుచుం గువలయచ్ఛదశీతముగా నెయ్యైతనం
తనెవెస సీతఁ గ్రమ్మె నుఘనమ్ము తటిత్తున నంగనత్తఱిన్.

మూ.—రజనిచరకరాగ్రస్పర్శసంపాతవిఘ్నం
రచయితు మనసూయాకల్పితాదఙ్గరాగాత్
బహుళ మనలపుఞ్జః పిఙ్గరజ్యోతి రుద్యన్
కువలయదళశీతం సంవృణోతి స్మ శీతామ్.

గోదావరి సాగరునితోఁ జెప్పుచున్నది. అనసూయ యిచ్చినమైపూఁతనుండి నిప్పమొత్తము పసిమివెలుఁగుగలది వెలువడినదై రావణునియొక్క చేతితుద సీతకు తగులకుండ విఘ్నముచేయుటకై దట్టముగా కలువరేకులవలె చల్లఁగా సీతను చుట్టుకొన్నది.—అని శ్లోకార్థము. వాస్తవముగా అగ్నియంగరాగమునుండి వెలువడినట్లు మూలములో నుండఁగా, పంతులవారు 1. "అంటరాని వేల్పనఁగ" అని అగ్ని వెలువడలేదని కేవలము మూలవిరుద్ధము వ్రాసినారు. ఎందఱో విద్యార్థులు బియేకు చదువుచుండిరే, ఒకరికడ నేని వీరు ఆమూలాగ్ర మీగ్రంథమొకమాఱు చదువుకొనియుండరాదా? అన్నెల్ల తంటాలుపడి సాధించినదే యేమో యిది! ఆవెల్గు నిప్పుగానిచో తర్వాత రావణుఁడేల వరుణమంత్రముచే మబ్బుతునుకం దెప్పించి దానిని చేతికి చుట్టుకొని అట్టిచేతితో సీతను బట్టుకొన్నాఁడు. ఇట పంతులవారికి జయదేవునిమూల మర్థము గానియట్లే రావణునికి ఆవెలుఁ గర్థము గాలేదా? 2. అనసూయ రావణహస్తము సీతకు తగులకుండుటకై యీయంగరాగ మామెకొసంగినది యని పద్యాన్వయము; అది సరియైనయన్వయము గాదు. 3 మఱియుందు తుదిని ఘనమ్ము తటిత్తున నంగ నని యొకయుత్ప్రేక్ష దాపరించినది. ఘనము నలుపు గదా; దానికిని వెల్గునకును ఏమి సాదృశ్యము? తటిత్తునుండియే ఘనము పుట్టునా? ఈ వెలుఁగు సీతాంగరాగమునుండియే పుట్టి ఆమెచుట్టు వ్యాపించినది. ఇది కేవలము పనికిమాలిన సొంత యుత్ప్రేక్ష.

ప్రాసజిత్తు—దనుజ—అర్థాగతము. 4. సద్విసుతతర, 5. అనఁగ, 6. తనం తనెవెస—పనికిమాలినమాటలు. 7. తాన్—యతిపూరణము. 8. ఘనమ్ము...ఆటన్—య. 9. వెలుంగుచున్—పా.

౬౯ - వ పుట.

జటాయువు రావణు నెదుర్కొనుట.

శా॥ ఓరీపాపుఁడ నేఁగనుంగొనఁగ రామోర్వీశరామన్ హరిం
[11] తేరాచౌర్యముచే గిరీశ్వరశిరఃస్థేందూల్లసద్రేఖనన్
1600 ఘోరాస్మన్నఖరాశి నీతలల నేఁ గ్రోధోద్ధతిం దన్ని ని
న్నేరాచంపెదఁ దత్సుపర్ణుఁ డమృతాన్వీతోరగంబుం బలెన్.

మూ.—ఆః పాపిన్ పశ్యతో మే రఘుతిలకవధూం చోరవృత్త్యాపహర్తుం
సీతాం శీతాంశులేఖా మివ గిరిశశిరశ్శాయినీ ముద్యతోసి
ఏష ఛ్ఛిత్త్వా శిరాంసి ప్రఖరనఖముఖై ర్దీప్తచూడామణీని
త్వా ముద్వ్యాహం గరుత్మా నురగ మివ సుధాకాఙ్క్షిణం సంహరామి.

ఓరీ పాపీ; నేను చూచుచుండఁగానే [నాకనులయెదుటనే] న న్నలక్ష్యపెట్టి, శివశిరశ్శాయినిం జంద్రరేఖం బోలె రామభార్యను దొంగతనముగా నపహరింపఁ గడంగితివి. ఇదిగో వాడికొనగోళ్లతో చూడామణిదీపితములైనతలలను ద్రుంచి నిన్ను నేను, సుధాకాంక్షియైన యురగుని గరుత్మంతుఁడువోలె పరిమార్చుచున్నాను.—అని శ్లోకార్థము. కాఙ్క్షిణమ్మనుటకు రక్షిణమ్మని పాఠాంతరము.

1. పాపుఁడనేన్—నేను పాపుఁడను అని యొకయర్థవిశేషము స్ఫురించుచున్నది. అస్మన్నఖరాశి—అస్మత్పదము బహ్వర్థకము; మాయొక్క యని యర్థము; నేను చంపెదన్ అనునేకవచనములనడుమ నీబహ్వర్థకము చక్కఁగాలేదు. 2. క్రోధోద్ధతిన్—ఈమాట చెప్ప నేల? మైత్ర్యతిశయముచేఁ జంపునా? అట్లు రావణుఁడు తలంచునా? 3. తన్ని—మూ. ద్రుంచి [ఛిత్త్వా]; చంపువిధ మిది, తలలు ద్రుంచుట; తలలను తన్ని మఱియొకవిధముగా చంపెదనని యభిప్రాయము గాదు. కాళ్లతో తన్ని యనుట సరిగాని, గోళ్లతో తన్ని యనుట తెలుఁగు గాదు. కావునను మూలానుగుణము కానందునను, తన్ని యనక ద్రుంచి యనవలయును. అమృతాన్వితోరగంబుం బలెన్—4. ఉరగునింబోలె నని పుల్లింగంబు వేసిన సరిగా నుండును. ఇచట సీత కుపమానంబుగా సుధయు, రావణుని కుపమానంబుగా నురగుఁడును మూలమందు చెప్పఁబడినారు. అందులకై నపుంసకమయిన యమృతాది

శబ్దమును ప్రయోగింపక మూలకవి స్త్రీలింగమును గోరి సుధాశబ్దమును ప్రయోగించినాఁడు. **5.** వీరు అమృతమని నపుంసకలింగముచేసి ఆయుపమును చెఱచినారు. **6.** మఱియు మూలములో, చూడామణులతో వెలుఁగుచున్న, అని శిరములకు విశేషణమున్నది. **7.** శిరములని యున్నదేగాని నీశిరములని లేదు. **8.** అప్లే ఊరక గోళ్లతో అని యున్నదేగాని నాగోళ్లని లేదు. అందువలన గరుత్మంతుఁడు సుధాకాంక్షిని భుజంగుని చూడామణిదీపితములయినఫణములను గోళ్లతో త్రుంచి చంపినట్లు, నిన్ను గోళ్లతో చూడామణిదీపితములైన శిరములను ద్రుంచి నేఁజంపెదను, అని రావణభుజంగు లిరువురికి గోళ్లను వానితోఁ ద్రుంచి సంహారించుటయు అన్వయించుచున్నవి. **9.** పద్యములో నివి రావణునికిమాత్రమే అన్వయించుచున్నవిగాని ఉరగుని కన్వయింపలేదు. చూడామణులు లేనే లేవు. **10.** అమృతాస్వితోరగం బనఁగా నేమి? అమృతముత్రాగినదని యర్థమా? అమృత మెచటనేని పుక్కిటనో మఱియెచటనో పెట్టుకొనియుండినదని యర్థమా? అమృతమును కోరిన, లేక అమృత[కలశ]మును రక్షించుచున్న అను మూలము బాగుగానున్నది. **11.** ఉల్లసత్—శిరఃస్థుఁడు ఇందుఁడనియు, అతనిరేఖ యనియు అర్థమగుచున్నది. శిరస్థము ఇందురేఖగా అన్వయము కావలయును.

గోదావరి.—అంతట...ఆకెది.

[5] 1605 తే॥ క్షణము లేదుగదా జనకజ దియండె
క్రందనము సేయుచిలఁబడెఁగరుణముగను.

మూ.—తస్యాః క్వణన్ కిమపి నూపుర ఏక ఏవ
క్రన్ద న్నివాతికరుణం చరణా త్పృథివ్యామ్
ఆ స్త్రిష్ట తిష్ఠ నిహాలోని ఖలేతి జల్పన్
దూరాజ్జటాయురపి ఖడ్గహతః పపాత.

తెనుఁగుముద్రణము—తస్యాఃక్షణంనఖలు...క్రన్దన్నపాతకరుణం...

**1.** ఆమెయొక్క యందియలలో నొకటిమాత్రము అతిదీనముగా ఏమో యేడ్చునదియుంబోలె శబ్దించుచు పాదమునుండి నేలఁబడెను; తెలుఁగుపద్యము దాని మూలమును ఈ నాగరమూలమునకు దిగఁదుడుపుగానున్నవి. మఱి కవనకౌశలము:—**2.** ఆకెదియని ముందున్నదిగదా, మఱల జనకజది యననేల? **3.** ఏక ఏవ ఒకటియే (యండె) యని చెప్పమియేమి? ఏకవచనముచేతనే గతార్థమేని జయదేవుఁడు ఏకశబ్దమును పైగా ఏవకారమును ఇన్నిటిని చేర్పనేల? **4.** అప్రసక్తముగా ఎన్ని యవధారణార్థకములు పాదపూరణార్థము వేసినారో! ఆవశ్యకముయినచోట

ఒకటివేయ బుద్ధి పుట్టకపోయెనుగదా? 5. ఒకయందె కాల మిగిలినందువలనఁ గదా మఱల ఆమెకు రామసంయోగము కలిగినది.

౩౦ - వ పుట.

[7] తే॥ సంపదలునుదురాత్ములకింపునిడవు। తుదకునాపదలనెయిడితొలఁగుఁగాన
1612 ఆపదలునుమహాత్ములకడలునిడవు। తుదకుసంపదలిడుటచేనిదితగుఁగద.

మూ. ప్రాయో దురన్తపర్యన్తా స్సంపదోఽపి దురాత్మనామ్
భవన్తి చ సుఖోదర్కా విపదోఽపి మహాత్మనామ్.

1. ఇంపునిడవు—ఇడ కేమి? ఇడును. తుదకుఁగదా ఆపద? అంతవఱకు ఇంపే. **2.** అడలునిడవఁట!—ఇడవా? శ్రీరాములవారు సీతావియోగముచే నెంత దుఃఖించిరో రామాయణములోఁ జదువలేదా? అది గహనమేని ఈపుటకు మూఁడవపుట మొదలు అనఁగా ౨౩ - వ పుట మొదలు ఈయాంధ్రీకరణమే కనుఁడు. తప్పకుండ, అడలు నిడును. పైగా ఈ తర్కము వింతగానున్నది. తుదకు ఆపద యిడునుగాన ఇంపు నిడవఁట! ఎక్కడికార్యకారణభావ మిది! ఇంపునిడనివి యుండియేమి లేకేమి? అట్టివి తొలఁగు నని వెఱపింపనేల? ఇంపు లేకపోయిన ముంపా, అను భయావస్థయా? అనుభయము సంసారు లెఱుంగుదురా? కనుక ముంపే, అనఁగా ఆపదయే, సంపన్నులగు దురాత్ములకు సతతము నాపదయే, తుదకాపద యన్నవిశేషమేమి? ఆపూర్వావస్థ ఆపదగాదు దుఃఖమాత్ర మందురేని, ఆపత్ఫల మదియే గదా. అదియే ఉండగా నిఁక ఆపదను వేఱ చెప్పనేల? మఱి నిజకారణమైనయాపద లేక ఆదుఃఖముమాత్రము ఎట్లుండును? **3.** అట్లే తుదకు సంపద వచ్చువఱకు అడలా, సంతుష్టియా, అను భయావస్థయా. అంతిమము ఆపదలవలన సంసారులకు లేదుగదా, కాన సంతోషమే, అనఁగా సంపదయే. కాన తుదిని సంపదయన నేల, సతతము సంపదయే. అదిలేక సంతుష్టియెక్కడిది? **4.** ఇది తగుఁగద—ఇది తగనే తగదుగదా? ఇంపు నిడమి, అడలు నిడమి మిథ్యగదా, మఱి మిథ్య తగుటెట్లు? సంపదలు దురాత్ములకు దౌరాత్మ్యమును పోఁగొట్టిన నదితగును. ఆపదలు మహాత్ములకు రాకున్న నది తగును. ఇదియన్ననో తగనే తగదు. **5.** ఈముక్క లేకున్నను పద్యము తగదుగద? ఇట్లు ఈపద్యమును పంతులవారు జయదేవకవికవనములో సొంతము చేర్పఁబోయి అపవిత్రముచేసి సాధించినారు. **6.** జయదేవుఁ డనునదే మనఁగా—ప్రాయికముగా సంపదలుకూడ దురాత్ములకు తుదకు విపత్తునే గలిగించును, అట్లే ఆపదలుకూడ మహాత్ములకు తుదకు సుఖమే యిడును.—పెంపఁబోఁగా వెంటయైనది. **7.** "తుదకు సంపదలనెయిడి తొలఁగుఁగాన" అని ముగించిన అవ్వమూలుగయినను అమరిక యినిపించుకొనును.

[నేపథ్యమందు] సఖి కాళిందీ వర్థిల్లుచున్నావు.

[6] యమున.— మఱియట్లు సూచీశలాకాశల్యక్షతములైన నాగోళ్లను
1618 లక్తకరసముచేఁ దడుపుచున్నది.—

ఈ యమునావాక్యము అసంబద్ధముగా నున్నది. సూచీ...చున్నది—ఈ భాగమునకు అర్థము,—దుఃఖితురాలైననాకు సంతోష మొసంగుచున్నది, అని. దుఃఖకారణము నిజకుటుంబకమయిన రామాదులకుం గలిగినవిపత్తు. యమున ఈ ‘మఱియట్లు’ లోనగు వాక్యమును ‘వర్థిల్లుచున్నావ’ ను నేపథ్యోక్తిని గుఱించి పలికినది. నేపథ్యమందు ఆమాట పలికినవా రెవరో యమున కింకఁదెలియలేదు. ఇట్లుండఁగా సద్యశ్శ్రుతమైన వర్ధనవచనమునుగుఱించి ఎప్పుడో విన్నదానిం గుఱించి వోలె 1. ‘అట్లు’ అనుటసరిగాదు, ఇట్లు అన్నను మేలు. 2. అకర్తృక వాక్యము. పంతులవారు ఈ వాక్యమును ఇట్లు పాడుచేసిన విధములో వినోదముకలదు. 3. వీరు ఛాయం దెనిఁగించినారు. ఛాయ.— 4. తథా పునః సూచీశలాకా ఇత్యాది. ఇది యమునాప్రాకృత వాక్యమునకుం దప్పుఛాయ.—ప్రాకృతవాక్యము. 5. కా ఉణ సూఈ సలా అ ఇత్యాది. సరియైన ఛాయ—కా పున స్సూచీశలాకా ఇత్యాది. దానికి తెనుఁగు—6. మఱి యీామె ఎవరు సూచీశలాకా ఇత్యాది. వాక్య మసంగతమని తెలిసినచో సంగతికై యరయిక గలుగును. అసంగతమనియే తెలియదే, ఇదేమి ప్రతిభావిశేషమో! అసంగతమని తెలిసికొన్నమాత్రాన నేమి ప్రయోజనము? ఛాయాదోషము తెల్పువాని నెక్కడ తెత్తము?

తుంగభద్ర.—...(రామునికి) తన్నును సుగ్రీవునిని సమర్పించిన హనుమంతుం డప్పగిదినేమో చెప్పుచుండెను. ఎట్లనఁగా?

శా॥ లీలామాత్రముచేవధించిమునువాలిన్ బైఁడిలేడింబలెన్
[18] శ్రీరాముండుపలీముఖేశపదవింజెందించిసుగ్రీవునిన్
1636 శూరత్వంబునమిత్రశత్రునతిమానున్నాకమొదించెస
ద్ధీరత్వంబుననాత్మగోత్రపతినందించెన్హరిస్స్మోదమున్.

మూ.—...రామభద్రే...ఆత్మానం సుగ్రీవంచ సమర్పయతా తథా కిమపి వ్యపసితం హనూమతాయథా.

సహేలం హత్వైనం హరిణమివ హైమం రఘుపతిః
కపీనాం సామ్రాజ్యే ప్రణత మభిషిఞ్చన్ రవిసుతమ్
అపి ధ్వంసాత్సఖ్యు ర్నృపతి మపచక్రే షలభుజా
మపి ప్రీతం చక్రే నిజకులగరిష్ఠం దినకరమ్.

1. హనుమంతుం డప్పగిదినేమో చెప్పుచుండెను, 2. ఎట్లనఁగా,—ఈ చెప్పు చుండెనుయొక్క స్వారస్యముచేత దాని తర్వాతిపద్యము హనుమద్వాక్యముగా తోఁచును. అది తుంగభద్రావాక్యమేగాని హనుమద్వాక్యముగాదు. 3. వ్యవసితమనఁగా చెప్పుచుండెనని యర్థము గాదు. [వ్యవసాయము=యత్నము] అట్లు యత్నించెను, ఎట్లన, ఆయత్నమువలన—అని తెనిఁగించి యుండవలసినది.

శ్లోకతృతీయపాద మర్థముగాక పంతులవారు పంచపాండవులలెక్క చేసినారు. శ్లోకార్థము:—రఘురాముఁడు బంగారులేడినిం బోలె లీలామాత్రమున వాలిని గూల్చి సూర్యపుత్త్రునికి సుగ్రీవునికి కపిరాజ్య మిచ్చుటచే, రావణునికిం గూడమిత్ర ధ్వంసరూపమైన యపకార మొనర్చెను, తనవంశమునకు మూలపురుషుఁ డయిన దినకరునికింగూడ ప్రీతిగావించెను.—4. పలభుజాం=మాంసభోజనులయొక్క, నృపతిం = ప్రభువును [రావణుని], 5. సఖ్యుః=తన్మిత్రుఁడైన వాలియొక్క, ధ్వంసాత్= నాశముచేత, అపచక్రే=అపకరించెను. 6. రావణునికి మిత్రుఁడు వాలి, రాముఁడు వాలిని చంపుటచేత మిత్రమారణ రూపమయిన యపకారము రావణునికి చేసెను. వాలి రావణునికి మిత్రమని యిట జయదేవుఁడు కంఠోక్తముగానే చెప్పినాఁడుగదా. 7. ఈ విషయమం దీయన మురారి భవభూతులమార్గమును త్రొక్కినాఁడు, వారు అనర్ఘ రాఘవ మహావీర చరిత్రలలో ఆయిరువురికిని మైత్రిచెప్పినారు.

శునశ్శేషః—అస్తి కిష్కిన్ధాయాం పురన్దరస్య నన్దనో వాలీ నామ ప్లవఙ్గరాజః। తం చ రజనీచరచక్రవర్తినా దశకన్ధరేణ సహ ప్రవృత్తమైత్రీక మవలోక్య వానరాచ్ఛభల్లగోలాఙ్గూలప్రభృతీనా మాచార్య స్సర్వామాత్యానుమతో జామ్బవా నవాదీత్॥—ముంరా. ౨. అం.

(దనుః)—ప్రార్థ్య మాల్యవతా వాలీ యుష్మ ద్ఘాతే నియుజ్యతే
తేనాపి రావణే మైత్రీ మనురుధ్యాభ్యుపేయతే.

రామః—ఏష ఏవ పన్థా శ్చారిత్రస్య
నతాదృశైః సువృత్తాకార్యే మాధ్యస్థ్య మవలమ్బ్యతే...

లక్ష్మణః—ఆర్య వాలిరావణయోః కిన్నిబన్ధనా మైత్రీ ?

శ్రమణా—కైలాసే తులితే, జితే త్రిభువనే, దృప్య న్నమభ్యుద్యతం
దోర్యుద్ధాయ దశాస్య మిన్ద్రతనయః ప్రక్షిప్య కక్షాన్తరే
సాంధ్యం కర్మ సమాప్య సప్తసు నదీనాథే ష్వథో ముక్తవా
నుస్మృత్యాయ నతాయ నాథితవతే సఖ్యం చ తస్మైదదౌ.

రామునిమీఁదికి మాల్యవంతుఁడు వాలిని ప్రయోగింపఁగా వాలి [నేపథ్యభాషితమున] మాల్యవంతునిగూర్చి యీయుత్తరము పలికినాఁడు—.

త్వన్నియోగా దయుక్తోపి వధః సాధోః కరిష్యతే
పూజ్యోసి నను మిత్రస్య యో గురు ర్గురు రేవ సః.

[సాధోః=రామస్య, మిత్రస్య=రావణస్య]

వాలి.—...యదనేన మాల్యవతా పౌలస్త్యమైత్రీప్రతిశ్రవ మనుస్మార్య తత్రభవతో రఘూద్వహస్య నిధనే నియుక్తోస్మి।...అనతిక్రమణీయం చ సుహృద్వాక్యమ్। ధిక్తం నిపాతహేతుభూతం సుహృత్కార్యాభినివేశమ్। పరిత్యజ్యతా మిదం సౌహార్దమ్.

ఏవమాదికము వీరచరిత పంచమాంకమున వాలిరావణమైత్రికి బహుళప్రమాణము కలదు. ప్రపంచ మిట్లుండఁగా ఈమైత్రిం బడపనేరక పంతులవారు పాదమును పాడు చేసినవిధము చమత్కారముగానే యున్నది. ఈమైత్రిని పంచపాండసంఖ్యానరీతిం బారయించినారుగదా. పాదాన్వయము చేసినరీతిం గనుఁడు: మిత్రశత్రుణ్ నాక మొందించెణ్—అనుటయందెలివిడి:—సఖ్యుః=[మిత్రుఁడైన సుగ్రీవునియొక్క] మిత్ర, 8. పలభుజాం నృపతిం [=పంతులవారు ఫలదు పల అచ్చుపొరఁబాటని తలంచినారు. కాన, ఫలభుజాం=క్రోఁతులయొక్క, నృపతిమ్=ప్రభువైనవాలిని అనఁగా సుగ్రీవుని యొక్క—] శత్రుణ్, ధ్వంసాత్=[చంపుటచేత] నాక మొందించెను. మొత్తమునకు, మిత్ర శత్రువున్నాక మొందించెనని యర్థము వచ్చినదో లేదో చూచుకొండి.

ఇఁక కవనసౌభాగ్యము.—పాదపూరణారణ్యము:—మును, 9. శూరత్వంబున, 10. అభిమానుణ్, సద్ధీరత్వంబున.

11. మును—ముందు వాలిని చంపి తర్వాత సుగ్రీవునికి కపిరాజ్య మిచ్చెనని యీవాక్యార్థక్రమము చేసనే తెలియుచుండఁగా, మును అని ప్రయత్నపూర్వకముగా నిటం జెప్పనేల? దీనిస్వారస్యము:—12. ఈమునుపదము ఎంతవఱకు కన్వయించును? చెందించుటకు గూడనిది విశేషణము? 13. ఒందించుటకుంగూడనా? 14. అందించుటకుం గూడనా? 15. ఇంతవఱకే అని తెలియుటకు నేతన్నివారకము తర్వాతశబ్దము రాలేదు గదా. 16. మఱి వధించుటమాత్రము అయినయెడల, చెందించుటకు 'తర్వాత' అను విశేషణ మక్కఱలేదా? ఈ మునుశబ్దము దుదురనికవనమని చక్కఁగా తెల్పుచున్నది. 17. ఈసౌభాగ్యములలో దలప్రాస భాగ్యముగూడ; అది 18. 'సద్ధీరత్వము'.

౭౧-వ పుట.

సాగరుఁడు.—ఇది యిట్లే. సకలజనసముదానందకరుఁడుగదా, రామచంద్రుఁడు. ఇందే యంతయుం దిలకింపుము.

[ఏతత్పద్యశ్లోకము పంతులవారికి సూదిబెజ్జమంతయేనియుఁ దెలియలేదు.]

ఉ॥ ఉండెదు నీభగీరథజయుక్ రవిజాసరయూసరిద్వరల్
[14] మెండగుకూర్మిఁగూడుకొని మిక్కిలినన్నలరించువారువీ
1650 రొండనె నేనుసాగరుఁడ యుక్తముగారఘువంశపక్షమే
యుండిన మాకురాముని శుభోదయభావమెసంగుటబ్రమే.

ఇటం బ్రకరణము—గంగా యమునా సరయూ గోదావరీ సమేతునితో సాగరునితో తుంగభద్ర చెప్పినది:—సీతాన్వేషణార్థము సుగ్రీవుఁడు హనుమదాదులం బంపెనని. అందులకు సాగరుఁడు బ్రతికితినని సంతసించెను. గోదావరి 'నీ వాక్కుఁడవె గావు, ఈసకలలోకమును బ్రదికినది' అని నిజాహ్లాదమును తెలిపెను. అంత సాగరుఁడు సకలలోకాహ్లాదము ననువదించి సమర్థించుచున్నాఁడు. ఆసమర్థనమే యిది. మూ.

౦ 'సాగరః—...ఇహైవతామ త్వశ్య.

నేదీయసీ హి సరయూ స్తపనోద్భ వేయం
భాగీర థీయ ముదయ స్సగరా న్మమాపి
ఇత్యన్వయా ద్రఘుకులే యది పక్షపాతః
తద్వాత్సలా కిమితి వామపి చిత్తవృత్తిః.

ఎట్లనఁగా:—ఈసరయువు రఘుకులరాజులకుఁ గడు సమీపముననుండునది, ఈమె [యమున] సూర్యునివలనం బుట్టినది, ఈమె [గంగ] భగీరథునివలనం బుట్టినది; నేనును సగరునివలన నుదయించితిని. ఈ సంబంధముచేత మాకు రఘుకులముమీఁద పక్షపాతమేని, మీయిరువురిచిత్తవృత్తియు ఈరఘురామునియందు వాత్సల్యము పూనియున్నదే అందుల కేమిహేతువు? [రామచంద్రమాధురియే హేతువు. అది సకలలోకసంవననమనుట సిద్ధాంతము; అని, శ్లోకావతారికలో "సకలజనకుముదానందకరుఁడు రాముఁడు" అని చెప్పినయర్థమును సమర్థించుట.]

1. పంతులవారు ఈమూఁడునదులకును రఘుకులజులకును సంబంధమును మూలకారుఁడు చూపినాఁడని యెఱింగిన ట్లగపడదు. 2. ఎఱింగియుండిన సరయువునకును రఘుకులజులకును సంబంధమును వీరేలతెల్పరైరి? కడమరెంటను అప్రయత్నముగా కాకతాళీయముగా తన్నామములయందే ఆసంబంధము శబ్దవ్యుత్పత్తిమహిమచే నగపడుచున్నది. వీరు ఆసంబంధమిట తత్పక్షపాతమునకు కారణముగా నుపన్యస్తమని యెఱింగిన, మూలకారుఁడు వాక్యత్రయముచేత విధేయముగా ఆ సంబంధము నుపన్యసించియుండ వీరేల, 3. ఆవిధేయతను పోనడిచి ఏకవాక్యముచేసి విధేయములనెల్ల

నుద్దేశ్యభంగిం బొందించినారు. ఆచార్యకారణసంబంధము నెప్పుడు వీరు కూర్చినారో అప్పుడే వీరు పద్యముం జెఱిచినారు. మఱి వీరుచేసిన శ్లోకాక్షరాన్వయము: 4. వీరు నేదీయసీ యనునది ఒక్కొక్క నదికి [మూఁటికి] విధేయమని తలంచినారు. తపనోద్భవా భాగీరథీ పదములు ఉద్దేశ్యమాత్రములనియు, యమునా గంగా పదపర్యాయమాత్రములనియు నిరభిప్రాయములనియు తలంచినారు. అందువలన ఈ భగీరథజయుక్తా రవిజాసరయూ సరిద్వరాః — అని మూలమందలి యుద్దేశ్యవిధేయము లన్నిటిని ఏకరాశిగా ఉద్దేశ్యములనుగా తెనిఁగించినారు. నేదీయసీపదమును రబ్బరువలె లాగి ద్వితీయపాదముగాఁజేసి, ఆమూఁటికిని కొట్టినారు. [5. నేదీయసీ = మెండుగ కూర్మిఁగూడుకొని మిక్కిలి నన్నలరించువారు.] 6. నేదీయసీ యనఁగా, సాగరుని సరస నున్నదని యర్థముగాదనియు, రఘుకులరాజధానియగు నయోధ్యచెంత ప్రవహించుటచే రఘుకులజులకు సరసనుండునదని యర్థమనియు ఇప్పుడే తెలిపియున్నాఁడనుగదా. తనకు సరసనున్నది,ఉన్నారు, అని వీరు దానిం బాడుచేసినారు. 7. అన్వయాత్ — దీనికి యుక్తముగా అని వీరి తెలుఁగు. యుక్తముగదా అనియే యర్థమో? యుక్తమగురీతిని అని యిది క్రియావిశేషణమో? ఎటయినను తప్పేగదా? 8. ఉండిన — ఇది, భూతార్థకవిశేషణమా? వేదాంద్యర్థకమా? యుక్తముగా అనునది ఉండినకు క్రియావిశేషణమనియు ఉండినపదము భూతార్థకవిశేషణమనియుఁ దలంపవచ్చును, అట్టివాఁడు అని చతుర్థపాదముతో నన్వయము. 9. రఘువంశపక్షపాతముచే రాము పక్షపాతమును సాధించుచున్నాఁడు. మూలము చేదారియో దీని దేదారియో? 10. రఘువంశపక్షమే — పక్షపాతమునకు పక్షమనుట అఱవములో వాడుక. చెన్నపురి యయిన తెనుఁగులోఁగూడ నీవాడుకగలదు. అసలు మిటు నీరాఘవములో ప్రసన్నమైనది. కవితాతత్త్వములో నిట్టిశిష్టవ్యవహారానుగుణముగా ప్రయోగములు చేయవలసినదని యున్నది. కావున నుత్తరాదులారా ఆక్షేపింపకుఁడు. తుదిపాదముననున్న పెద్దవతోఁకగము — తద్వత్సలా కిమిహ వామవిచిత్రవృత్తిః — వంతులవారు, 11. వామవి = మిఱుమిఱువృతిం గూడ, అనఁగా గోదావరీ తుంగభద్రలకుం గూడనని గ్రహింపలేక వామవి యనియు, రసము యన్వయముగాక, 12. చిత్ర అనుశబ్దమును చిత్ర అనియు, మార్చుకొన్నారు. తద్వత్సలా కిమిహ వామవిచిత్రవృత్తిః అని మార్చుకొన్నారు. శాంతాంతర పురాణమే. తద్వత్సలా వామవిచిత్రవృత్తిః కిమిహ, అని యన్వయముట! అనఁగా తద్వత్సలా వృత్తిః వామవిచిత్రా కిమిహ, అనఁగా తద్వత్సలా వృత్తిః వామా విచిత్రా కిమిహ, అనఁగా, తద్వత్సలావృత్తిః వామేహ విచిత్రా కిమ్. — తద్వత్సలా వృత్తిః = రాముని శుభోదయాభావము, వామేహ = ఎసంగుట, విచిత్రాకిమ్ = అబ్బా చెడిపాండిత్య మబ్బెగదా. — 13. జయదేవకవి ప్రమాణశాస్త్ర పారా

వారపారీణుఁడు తన్మర్యాదను ఇట కార్యకారణభావావధారణప్రస్తావమున అన్వయ పక్ష శబ్దములచే స్మరణకుం దెచ్చినాఁడు. **14.** అవతారికలోని తావచ్ఛబ్దము పంతులవారు ‘ అంతయు ’ నని తెనిఁగించినరీతిని సాకల్యార్థముగాదనియు, పరిచ్ఛేదార్థమనియు విశదమగును.

---

# షష్ఠాంకము.

౭౨ - వ పుట.

రాముఁడు.—శా॥ సౌమిత్రీ!ద్రుతలంబు నేరవలయుంజంద్రాంశుఁడేచుంగడుణ్
లక్ష్మణుఁడు.— రామా రాత్రిప్రౌఢ్ను సుద్దియెది రేరాజీతఁడే రాజిలుణ్
[11] రా.— సోముండీతఁడటంచు నెల్లెటిఁగితో [ల.] చూపట్టుంజింకయిందు
1661 రా.— ఓమ త్రేపయసి! హామృగాక్షి! యెటనుందో గ్లాముఖీ! జానకీ.

**1.** అన్నను రామా యని నామగ్రహణముచే సంబోధించుట అనుచితము.

> ఆత్మనామ గురోర్నామ నామాతికృపణస్యచ
> శ్రేయఃకామో న గృహ్ణీయా జ్జ్యేష్ఠాపత్యకళత్రయోః.

**2.** కావుననే మూలములో రఘుపతే అనియున్నది. **3.** ఉపదముచేత లక్ష్మణుని యొక్క వినయాతిరేకంబును **4.** రామునికి తాను భృత్యుఁడను భావంబును, **5.** రఘువంశమున కెల్ల ప్రభువైనయట్టి మహాసత్త్వునికి ఇంత విహ్వలత్వము సరిగాదని బోధనయు, ఇన్ని ధ్వనించుచున్నవి. రామా అనుటచే నన్నియు తుడుచుకొని పోయినవి.— **6.** ఇందు—చంద్రుఁడని పల్కుచునే ఇందుణ్ అని అమహత్తుగా వ్యవహరించుట సరిగాదు. మూ. ధత్తే కురఙ్గం యతః = జింకను దాల్చి యున్నాఁడు గావున. **7.** సోముండీతఁడటంచుణ్ = ఇది; [ప్రా.]. మూలమెంతమనోహరమో!

> సౌమిత్రే నను సేవ్యతాం తరుతలం చణ్డాంశు రుజ్జృమ్భతే
> చణ్డాంశోర్నిశి కా కథా రఘుపతే చన్ద్రోఽయ మున్మీలతి
> వత్సైతద్విదితం కథన్ను భవతా ధత్తే కురఙ్గం యతః
> క్వాసి ప్రేయసి హా కురఙ్గనయనే చన్ద్రాననే జానకి!

**8.** ప్రౌఢ **9.** సోముఁడు అని నవీకరించుట యందముగాదు. అట్లే, **10.** కురంగ, **11.** చంద్రశబ్దము లే-జింక, రేరాజు అనువానికి ప్రయోగించి యుండవలయును. ఆస్వారస్యము మూలమునం గనుఁడు. ఉపపత్తివిస్తర మూహించుకొనుఁడు.

చ॥ అమృతకరుండనీకరములారయఁ గైరవబాంధవంబులో
[18] నమరెడుఁ జాగరూకములె యైభువనాళివిశిష్టచేష్టలన్
1679 సముమతిఁ జెప్ప వేల యది శ్యామ మదీయ వసించు నెక్కడన్
సమృగుఁడవౌదువీవిఁక నిశాచరుఁ డౌదువు చంద్రమా మవే.

మూ.— అమృతకర కరా స్తే బాన్ధవాః కైరవాణాం
సకలభువనచేష్టా జాగరూకా జయన్తి
న కథయసి కథం త త్కుత్ర సా ప్రేయసీ మే
త్వమపి మృగసహాయః కిం చ న క్తఞ్చరోఽసి.

1. జయదేవునికి "ఆరయ" కుండనే కైరవబాంధవములని తెలిసినది. 2. ఔ—ఈపదముండఁగూడదు. ఇదియు ఆరయుటయుం జేరి పాదమును చెఱిచినవి. సకలభువనచేష్టాజాగరూకతకు కారణము 3. కైరవబాంధవత్వము. బంధువులయిన కైరవములకై తిరుగునప్పుడు సకలభువనముయొక్కయు చేష్టలం గనును అని తాత్పర్యము. కావున చేష్టాజాగరూకతను స్థాపించుటకై యుపన్యస్తమైన కైరవబాంధవత్వమందు, ఆరయన్ ఔ అని అప్రసక్తపదములు ప్రయోగించి 4. సందేహమును అప్రసిద్ధతను తోఁపించుట సరిగాదు. సకలభువనచేష్టా అనుచో భువనశబ్దము బహువచనమున సమసించినదిగాదు. పాతాళమందు చంద్రుఁడేఁడి? "నాగీస్తన్యరసాతలం శశభృతాశూన్యం ముఖేస్యాః స్థితే," కావున 5. భువనాళి యనుట సరిగాదు, పైగా రాముఁడు తనభార్య స్వర్గపాతాళములకుం బోయియుండు నని కూడ తలంచునా? కాన ఆళియనుట అప్రసక్తము వ్రాయుటగా నున్నది. జాగరూకము లెయ్యై— 6. ఎ—ఈయవధారణము లేకయే జయదేవునికి వివక్షితార్థనిర్వాహమైనది. ఈయాసయేఁ గాకపోయినదా? యతికొఱకు ఐకారమునకు వ్యవధానము సేయుటకై యీయాస కిది కావలసివచ్చినది. 7. సముమతి— దుష్ప్రాసము. 8. అది శ్యామ—అసహ్యముగానున్నది. 9. మదీయ—తా నుండుకొన్నదేమో యనుసందేహము పుట్టించుచున్నది. 10. కుత్రసా ప్రేయసీ మే అను వేఁడుకో లెక్కడ? అది శ్యామ మదీయ వసించు నెక్కడన్ — అనున దేదమూకభాషిత మెక్కడ? 11. వసించు — ఈఘట్టములో నింతకన్న పనికిమాలినపద ముండునా? 12. ఎక్కడ నున్నది అని యడుగవలయునేగాని, నన్ను వదలి లేచిపోయి యెక్కడ గుడిసెవేసికొని యున్నదని గదా యర్థమగుచున్నది? శ్యామ యనఁగా యౌవనమధ్యస్థ యేని,

శీతకాలే సుఖోష్ణా యా గ్రీష్మే తు సుఖశీతలా
తప్తకాఞ్చనసంకాశా సా స్త్రీ శ్యామేతి కథ్యతే.

అని నిర్ధారించఁబడినదేనియు, ప్రేయని యనుటతో సాటియా? ప్రేయసీ అననందువలన ఆపదముచేఁ జేరిక్కిన నర్థ్గరాలు కాదనియు ఆసంబంధము స్పష్టముగాఁ జెప్పఁదగినది కాదనియు ద్యోతితమగుచున్నది. తృతీయపాద మిట్లు పాడయినది. చతుర్థము.— 13. ఔదువు, 14. ఔదువు, ఈపదము లిందు పనికిరావు. ఇటునివి లేకున్న కవనమునకు మెఱుఁగు. 15. ఈపాదమునకు మూలములో రావణుని వంటివాఁడవని భావముగాని చందమామవు గావని భావము గాదు. సమృగత్వ నిశాచరత్వములు చంద్రునియందునుం గలధర్మములే. 16. మృగసహాయః అనుపదమును సమృగుఁడ వనుట పిప్పీకరించుటయే. రావణునికి మారీచుఁడు సహాయుఁడు, రాము నెలయించుకొని పోవుటచే రావణునికి సీతను దొరకించినాఁడు. సమృగ అన్నమాత్రాన అట్టిసాహాయ్యకరణము స్ఫురించునా? 17. త్వమపి = నీవును [రావణుని వలెనే అనిభావము], అట్టియపిశబ్దార్థముం దెనుంగునం దృజించుట చప్పీకరించుటయే 18. చందమామవే అనుట మూలవిరుద్ధ మని తెల్పితిని గదా.

లక్ష్మణుఁడు.—[తనలో] కట్టా! తిట్లయల యెట్లీమాననీయుని మానసముం
[2] బొరలించుచున్నది? అటులవుటవలన వేఱుగ నరుగఁజేయుదును.
1681 లక్ష్మణః— [స్వగతమ్] అయే కథ మభిషఙ్గతరఙ్గైః తరళయ త్యార్యమానసమ్! త దన్యతో నయామి.

1. పంతులవారు అభిషంగతరంగ మనఁగా తిట్లయల యని వ్రాసినారు. తరంగ మనఁగా అలకదా, పోఁగా శేషము అభిషంగమనఁగా తిట్లు గావలయును. తిట్లేలని? ఎవరుతిట్టిరి, ఎవరిని? అగమ్యగోచరముగా నున్నది. మృగసహాయుఁడవు నక్తంచరుఁడవు అని చంద్రు ననుట లక్ష్మణులవారికి గొప్పతిట్టుగాను కూడనిమాటగానుం దోఁచినదాయేమి? "ఇంతింత గాదయావిశ్వ." అభిషంగశబ్దార్థము నెఱుంగక యీతిట్లు. తెనుఁగునిఘంటువు చూచుకోఁగా పంతులవారి కీయర్థము దొరికినది, ప్రయోగించుకొన్నారు; అప్రసక్తార్థ మని యూహించుకో లేదా? గత్యంతరము గానక వారిమిత్రులు "భుజగోహరియే సత్వతమంబ" న్నట్లు ప్రయోగించుకొన్నారు. అభిషంగ మనఁగా గొప్పదుఃఖము.—రఘువంశమందలి యీక్రిందిప్రయోగములం గనుఁడు.

అథ తం సవనాయ దీక్షితః ప్రణిధానా ద్గురు రాశ్రమస్థితః
అభిషఙ్గజడం విజజ్ఞివా నితి శిష్యేణ తదాన్వబోధయత్.

అభిషఙ్గజడమ్ = దుఃఖమోహితమ్. మల్లి. ఇట అజుని భార్య యిందుమతి మృతి నొందినదుఃఖము; రామునికి సీతాపహారదుఃఖంబును అట్టిదే, అదే శబ్దము.

అథ వ్యవస్థాపితవాక్ కథంచి త్సౌమిత్రి రన్తర్గతబాష్పకణ్ఠః
ఔత్పాతికో మేఘ ఇవాశ్మవర్షం మహీపతే శ్శాసన ముజ్జగార.
తతోభిషఙ్గానిలవిప్రవిద్ధా ప్రభ్రశ్యమానాభరణప్రసూనా
స్వమూర్తిలాభప్రకృతిం ధరిత్రీం లతేవ సీతా సహసా జగామ.

ఇటు సీతకు శ్రీరాములు తన్ను అరణ్యమందు విసర్జింపించిన దుఃఖము.

పుష్పం ఫలం చార్తవ మాహరన్త్యో బీజం చ బాలేయ మకృష్టరోహి
వినోదయిష్యన్తి నవాభిషఙ్గా ముదారవాచో మునికన్యకాస్త్వామ్.

నవాభిషఙ్గామ్ = నూతనదుఃఖామ్. మల్లి.

వెలుపలిప్రపంచ మీతీరు ననున్నది. కాన, కూపములో ఉట్లని తెనిఁగించుకొన్నం జెల్లదు. వనటయల యనిమార్చుకొనునది.— 2. వేఱుగ అనఁగా ఇతరులతోఁ జేరక యని యర్థమగును, ఒంటరిగా ఈయనను పొమ్మనెదను అని వాక్యార్థమగును. ఈయన మనస్సును వేఱువిషయముమీఁదికి మఱలించెద ననివక్తవ్యము. సీతాపహరణదుఃఖమును మఱపించుటకై యట్లు చేయుట.

మ॥ మునునీచేడియతోడఁగూడుకొనిసోమున్మానియేదానిచ
[10] కనిచెక్కిళ్లదిఠాలుగ్రోలిఠవివేడ్కన్జూడ్కికింబండువై
1691 తనరంగానలసీతనెమ్మొగముఁజెంతన్మాకుఁగాన్పించిధ
న్యునిఁజేయంగదెనన్ననన్నద్విజమాజ్యోత్స్నాప్రియోత్తంసమా.

మూ.—తస్మై విదేహతనయావదనం నివేద్య
భ్రాత శ్చకోర కురు మాం చరితార్థవృత్తిమ్
సీతా యదీయకమనీయకపోలకాన్తిః
కాన్తాసఖేన భవతా శశినం విహాయ.

1. మును—ప్రా. 2- చకనిచెక్కిళ్లదిఠాలు—ఇటు చకనియనునది చెక్కిళ్లకువిశేషణముగానున్నది; ఠాలునకువిశేషణముగానుండవలసినది. 3. దిపర్ణ్యస్వారస్యము తెలిసియేయున్నదిగదా. 4. వేడ్కన్—య. ఏడ్చుచుఁగ్రోలునా? 5 చూడ్కికింబండువై తనరంగాన్—చకోరము తనరసనకుంబండువైనం ద్రాగునుగాని నేత్రమునకుమాత్రమైనం ద్రాగదు, శాల్యోదనము మాని మల్లెపువ్వులరాశిని భుజింతువా? అసంగతముగాన నీముక్కసాంతకవనమే, ప్రా. 6. అల—సీతకు విశేషణమా నెమ్మొగమునకా? 7. చెంతన్మాకుఁగాన్పించి—ఉన్నయెడలం జూపునా, లేనియెడల సృజించునా? 8. ఇది సొంతమే, య. 9. మూలములో నివేదించి యని యున్నది, అట్లనఁగా, ఎచటనున్నదో తెలిపి అనియర్థము. 10. ద్విజమా—ఈమాట యేల? పా.

౨౩ - వ పుట.

దృష్టిపిడత.

[6] కల్లోలినినీవలెనే । యల్లలనకురంగనయనయందుంగృశతన్
1697 సల్లలితపుసహజసుశ్రీ । తోల్లసితపుసీత దాప మొందుస్మఱియున్.

1. నీవును కురంగనయనవు, అల్లలనయు కురంగనయన అనియర్థ మగుచున్నది. ఈయర్థ మొల్లరేని 2. ఆకురంగనయన అనవలసినది, 3. లలన యననేల? కురంగనయన యన్న లలనయని తెలియదా? లేదా కురంగనయనను పొమ్మనుఁడు. మూలములో రెండునుండునా, ఉన్నచో జయదేవుని పీయూషవర్షుఁ డందురా, విషవర్షుఁ డందురుగాని. 4. సల్లలితపు—ప్రా. 5. సు—పా. 6. ఉల్లసితపు—ప్రా.—ప్రాసజిత్తుకలదు ;—కల్లోలిని అర్థలబ్ధము, కడమవి పుల్లలే. మఱియున్—పా.

మూ.—కల్లోలిని త్వమివ సాచ కురఙ్గనేత్రా।నూనం కమప్యనుదినం క్రశిమాన మేతి
ఏతావదస్తి భవతీహ నిసర్గశీతా।సీతా పునర్వహతి కామపి తాపముద్రామ్.

జీర్ణారణ్యము.

మ॥ వికసల్లోచనరోచిరాశిలహరీపీతంబులామోదమా
[21] త్రకముల్గాఁదగుకర్ణపూరములనాస్థన్నిల్పికించిద్రుతిన్
1718 బ్రకటింతీవుగదామదంగనకుమిత్రత్వంబు సంధించియా
యకమోమెందుఁగనందగుందెలుపుమయ్యాయన్నపుష్పంధయా.

మూ.—ఉన్మీలన్నయనాన్తకాన్తిలహరీనిష్పీతయోః కేవలా
దామోదా దవధారణీయవపుషోః కాన్తాసఖేన క్షణాత్
యత్కర్ణోత్పలయోః స్థితేన భవతా కిఞ్చిత్సముద్గుఞ్జితం
భ్రాత ష్షట్పద కుత్ర తత్కథయ మే కాన్తం ప్రియాయా ముఖమ్.

రాముఁడు వక్త. ఏమద్ప్రియాముఖముయొక్క కర్ణావతంసంబులైనయుత్పలములు తదీయనయనాంతకాంతిప్రవాహములందు మునిఁగి యదృశ్యములు కాఁగా, పరిమళమాత్రముచేత వానియునికి నెఱిఁగి వానియందు నీవు నీకాంతతోఁగూడ తీఱికగా నెలకొని యుబుసులాడుచుంటివో, అన్నా తుమ్మెదా, ఆమత్ప్రియాముఖ మెచటనున్నదో చెప్పుమా.—ఈశ్లోకమమృతతరంగిణిగా నున్నది. సీతానేత్రము లుత్పలములకన్న నందము లనియు, తత్కాంతులు ఉత్పలకాంతులకన్న పలుమడుంగులు ఎక్కుడనియు ఆదియందే తెలియుచున్నది. మఱి ఈతేఁటికి విరామకాలములభింప

దాని నిది తన కాంతయగు తేఁటితోడిగోష్ఠిలో లాతుల కగపడకుండ రమణీయమైన యేకాంతప్రదేశమునఁ గడుపఁగోరినదై, అట్టిప్రదేశ మరయుచు సకాంతముగా సీతా కర్ణోత్పలములకడకు వచ్చినది. అయ్యుత్పలములు సీతానేత్రకాంతిప్రవాహముచేత మీలితములై యుండుటచేత అదృశ్యములుగా నుండినవి. అట్లయినను పరిమళవ్యాప్తి చేవానియునికి యెఱుకవడినది. అంత నీతేఁటి తాఁగోరినట్లే రమణీయములై ఒరుల కంటికగపడనివైన యాకర్ణోత్పలములలో తనభామతోఁగూడఁ బ్రవేశించి ఏకతమున తద్గోష్ఠీవినోద మనుభవించుచు విస్రంభాలాపంబుల సుఖముగా కోరికవాడమి నల్లె ల్ల కొంతతడ వీచెవికలువయందును గొంతతడ వాచెవికలువయందును, ఉబుసుపు చ్చుచుండెను.— అట్టియీప్సితరమణీయప్రదేశములచే మీ కుపకర్త్రయయిన నాప్రి యాముఖమును నీ వేమఱవు నీకాంతయు నేమఱదు, కాన తద్వృత్తాంతము మీకుఁ దెలిసియుండును, నాకుఁ జెప్పుము. నన్నుఁ బాసియున్న నాప్రేయసి యావినోద ప్రదేశములను ధరింపదు, నాతోనున్న ధరించును, మమ్ముఁ జేర్చిన నీకు ఈప్సితలాభ మగును, కావున తద్వృత్తాంత మవశ్యము చెప్పుటమేలు:— అని భావము. పద్యము లో కర్ణోత్పలము లనక **1.** కర్ణపూరము లనుటచేతను, ఆమోదమాత్రావధారణీయ స్వరూపము: లనక **2.** ఆమోదమాత్రకము లనుటచేతను, మూలమునకును పద్యమున కును హస్తిమశకాంతర మైనది. **3.** కాంతాసఖుఁడవనుటకు మదంగనకు మిత్రత్వంబ నుటచేత నందనము జీర్ణారణ్యమైనది. కాంతాసఖుఁ డనఁగా వల్లభతోఁ గూడుకొ నియున్నవాఁడు. ఇచట పెంటితుమ్మెదతోఁ గూడికొనియున్న పోతుతుమ్మెద యర్థ మని గ్రహింపనేరక, మదంగనకు మిత్రత్వంబు సంధించి యని చెప్పుకొన్నందున ఎంత రసము పోయినదో, ఎంత చెడినదో, చెప్పవలయునా! ఈదోషోద్ఘాటనమునకు బహు గొని చెలరేఁగి, కాంతాసఖశబ్దమునకు కాంతతోఁగూడి యున్నవాఁడు, కాంతాద్వితీ యుఁడు అర్థమే కాదని పంతులవారు ఒకచేయి చూడ రని నేఁదలంపనుగాని,

అతరుణమదతాణ్డవోత్సవాన్తే। ష్వయ మచిరోద్గతముగ్ధలోలబర్హః
మణిముకుట ఇవోచ్ఛిఖః కదమ్బ్యా। నదతి స ఏష వధూసఖః శిఖణ్డీ. ఉ. రా.

ఇత్యాద్యభియుక్త వ్యవహారమును గురుముఖంబుగ నేర్చిన స్తిమితపడుదు రని తలంచెద. ఇంతయేల దీనికి పూర్వతరముగు శ్లోకంబునంగల “కాన్తాసఖేన భవతా శశినం విహాయ” అనుచోటి కాంతాసఖశబ్దమును వీరే యెట్లు తెనిఁగించినారు? “నీచేడియతోడఁ గూడుకొని” అని తెనిఁగించినారు. అట సరిగా వ్రాసినవా రిటుఁ దప్పుటకు కారణమెట్టిదిగా నుండును? కుదురని పాండిత్యముగా నున్నది. మూలభా ష కర్థము తెలియక ఎవరినో తెలిసినవారి నడిగి ఆపద్యమున కర్థము నేర్చి, ఓగునో

గుమెచ్చున్యాయముగా తెలియనివాని నెవనినో యడిగి యీపద్యమున కర్థము నేర్చియున్న నుందురు 4. మఱియు అవతంసమును గ్రమ్మినది నయనాంతకాంతిగాని నయనకాంతిసామాన్యము గాదు. కావుననే మూలకారుఁడు అంతశబ్దమును బ్రయోగించినాఁడు. పంతులవారు దాని నెత్తివేసికొని నిష్ప్రయోజనమైన 5. యాళిశబ్దమును కూర్చుకొనుట నీరసతాపతాకాప్రతిష్ఠాపనముగా నున్నది. 6. "కాన్తమ్మే ప్రియాయాముఖమ్" అనుచెఱకునకు 'ఆయకమోము' పండ్లనుండి పీఁకివేయఁబడుచున్న పిప్పి. 7. నిష్పీతయోః అనుటకు పీతంబును అట్టిదియ. కర్ణోత్పలములనుటకు 8. కర్ణపూరములఁట! ఉత్పలమేని సావర్ణ్యముంబట్టి నేత్రాంతకాంతిచే మీలిత మగును, కర్ణపూరమాత్రముం జెప్పిన, అదియేవర్ణముదో? "కనకకమలైః కర్ణవిస్రంసిభిశ్చ," "చారుకర్ణే శిరీషమ్," అవతంసయన్తి దయమానాః ప్రమదాః శిరీషకుసుమాని," "కృతన్న కర్ణార్పితబన్ధనం సఖే శిరీషమాగణ్డవిలమ్బికేసరమ్," "గిరాం దేవీ సద్యశ్శ్రుతికలిత కహ్లార కళికామధూళీమాధుర్యం క్షిపతి," సౌగంధికకహ్లారశబ్దములు ఇంచుకయెఱుపును దెలుపును గలిగి మిక్కిలి పరిమళించుచుండు కలువపేర్లు" అని లింగాభట్టీయము. "యస్యబర్హంభవానీ పుత్త్రప్రేమ్ణా కువలయదళప్రాపి కర్ణే కరోతి," "నిజే పాణే కృత్వా వకుళలతికా బాలముకుళం యయోశ్చక్రే గుఞ్జన్మధుప మవతంసం రఘుపతిః," "కేదారసీమ్ని సదయంచ యవప్రరోహ మాదాయ సాధు విదధే శ్రవణావతంసమ్," "శ్రవణనియమితేన కాన్త మన్యా సమమసితామ్బురుహేణ చక్షుషా చ," "శ్రవణపూరతమాల పల్లవచయంబు," "వతంసీతసారసంబునన్," "సుదృశ శ్శ్రవణాగ్రే సన్నివిష్టఇవ చమ్పకగుచ్ఛః," "ధావతి శ్రవణోత్తంసలీలాదూర్వాఙ్కురం కుతః." బయటిలోక మిట్లుండుటంబట్టి కర్ణపూరవర్ణ మిదియే యని నిశ్చయము లేదు. మఱియు కర్ణపూరశబ్దముచే కుసుమములేయనియేని, ఏకుసుమములో ఆవిష.య మేని, నేత్రాంతకాంతులకు సవర్ణములని యనియేనియు, తెలియరాదు. ఆమోదమును జెప్పినందున కుసుమకిసలయములలో నన్యతరములని తోఁచును. 9. మదంగనకు మిత్రత్వంబుసంధించి యనుటచే, తెలుఁగుపద్యములో తుమ్మెద లటుం జేరుటకుఁగారణముగా సీతామైత్రి చెప్పఁబడినందున, ఇవి యితరమధుపములకుం గానరానిచోటిని గోరిన వని తెలియనందున ఆమోదోక్తిచే కర్ణపూరము కుసుమపల్లవముల నన్యతరమని తెలిసినను ఏవర్ణముదో తేటపడదు. మూలములో, 10. కాన్తాసఖేన యనుటచే తుమ్మెదలు రహస్యప్రదేశమును వెదకుచున్నవని తేటపడుచున్నది. దానిచేత ఆకర్ణోత్పలములు తెల్లవర్ణము వే యని, అనఁగా, 11. నల్లనివే యని తెలియుచున్నది. 12. నిష్పీతయోః పదమునందలి నిరుపసర్గవలన [నిర్=నితరామ్, పూర్తిగా] నే

త్రాంత కాంతి సవర్ణములని యెఱుకవడుచున్నది. సవర్ణములు గానిచో పూర్తిగా పీతములు గానేరవుగదా. నేత్రాంత కాంతులు నీలములుగదా. "ఆమోష్య న్తే త్వయి మధుకరశ్రేణిదీర్ఘాః కటాక్షాః." "నీలోత్పలాని దధతే కటాక్షై రతినీలతామ్." ఇందువలన మూలములో నీలోత్పలములు చెప్పఁబడినవని విశదము. ఈరీతిగా మూల మందు ఉత్పల శబ్దప్రయోగముచే ధ్వనితమైన, **13.** యుపమానిధానము ఇందు ఎంత త్రవ్విచూచినను చేతికి తగులదుగదా? మూలములో "ఉన్మీలన్నయనా న్తకా న్తి లహరీ నిస్పీతయోః యత్కర్ణోత్పలయోః" అనుచోటు,—

"మీలితం యదిసాదృశ్యా ద్భేద ఏవ న దృశ్యతే
రసో నాలక్షి లాక్షాయా శ్చరణే సహజారుణే."

[ఒకపదార్థము మింకొకపదార్థమునం గలసినప్పుడు ఆరెంటికిని సాదృశ్యహేతువుచే భేద మేర్పడకున్నయెడల మీలితాలంకార మగును. ఉ. నిసర్గారుణమయిన చరణ మందు పూసిన లాక్షారసము అగపడకపోయినది.] అని నిరుక్తోదాహృతమయిన, **14.** మీలితాలంకారంబును, "ఆమోదాదవధారణీయవపుషోః" అనుతావున,—

"భేదవైశిష్ట్యయోః స్ఫూర్తా వున్మీలితవిశేషకౌ
హిమాద్రిం త్వద్యశోమగ్నం సురా శ్శీతేన జానతే."

[భేద మగపడినయెడల నున్మీలితాలంకార మగును. ఉ. నీయశస్సులో మునిఁగి పోయిన హిమాలయమును దేవతలు చలిచేత తెలిసికొందురు.] అని నిరుక్తోదాహృతమైన, **15.** యున్మీలితాలంకారంబును, గలవు. ఆరెండును పంతులవారు దరిద్రీకరించిన యి తెన్గుకబ్బంబున నిర్మూలిత ప్రమీలితము లైనవిగదా? పంతులవారు పీఠికలో వ్రాసి కొనినప్రకారము "హృద్యంబుగ నీకృతియం దాద్యంబుం గాంచినట్లు" ఇంచుకేని గలదా? **16.** ప్రకటించితివుగదా—ఈవు ప్రకటింతుగదా, ఈవుగదా ప్రకటింతు, అనుట తెలుఁగుక్రమము. **17.** పుష్పంధయా, ఈపదముచేత ఆసవపానార్థము తుమ్మెద కర్ణ పూరకువలయముం జేరినదని ధ్వని కల్గుచున్నది. అందులకుఁగాదనియు నిజప్రియా గోష్ఠీవిస్రంభభాషణమున కనియు, **18.** "కిఞ్చిత్స్ఫుముద్గుఞ్జితమ్" [కించిద్రుతిగా బ్రకటించితివు]అనుపదములు ధ్వనించుచున్నవి. మూలకారుఁడు ఈవిరుద్ధధ్వని రాకుండ, **19.** షట్పదశబ్దముం బ్రయోగించినాఁడు. **20.** ఆయకయఁట—శ్రీరామునికి సీత అక్కయో గదా? ఇది, **21.** ప్రియా యనుటకు పంతులవారి తెలుఁగు కడురమణీయము; శ్రమ ముదిరినది. ఇట్లీపద్యమున నేకవింశతిసంఖ్యాకదోషములు దేదీప్యమానములుగా న్నవి. ఇదియే సుఁడీ కలికాలసాంఖ్యము!

[8] క॥ ఇదికుంకుమరుచివెలుపలఁ। బొదలించును గాంచిలోనఁ బొరిరాగంబున్
1726 నదితటమున నేడ్చెడుతన। ముదితను గనుఁగానికదియ మొనయదు కరుణన్

1. కరుణన్—పద్యమందెల్ల సారభూతమైన పదము స్వారస్యముగానే పడినది. 2. కరుణచేతనేగదా చక్రవాకము చక్రవాకిని గదియమి? ఏమని కరుణయని యనుగనేమి? కదియకున్న విరహముచేఁ జచ్చును, కదిసినం బ్రదుకునుగాన. బ్రతుకఁ గూడదని కరుణ విపరీతకరుణ యనకుఁడు, అది మంచిచక్రవాకిగాన చచ్చిన వెంటనే స్వర్గమునకుఁ బోవును. అది అటుకు త్వరగాఁ బోవుఁగాక యని దానికాంతుఁడైన చక్రవాకము దానిం దఱియక దూరదూరమున నిలుచుచు అది తత్క్షణమే చచ్చుటకై యీశ్వరుని ప్రార్థించుచున్నది, అనఁగా ప్రేయరు చేయుచున్నది. సవ్యసాచిగా సాధింపఁగలవారుగాన దీనికే కరుణలేదని యర్థమును సాధింతురేని, జక్కువకు పెంటిమీఁద కరుణలేమి లోకవిరుద్ధము. 3. మూలములో కరుణమ్—అని స్త్రీలింగము గాక, ఏడ్చెడు నను క్రియకు విశేషణముగా, కనికర మగునట్లు అని యర్థముగా, శబ్దము ప్రయుక్తమై యున్నది. 4. కరుణన్ అను స్త్రీలింగశబ్దమునకు దయచేత నని యర్థము. పంతులవారి కీభేదము తెలియలేదు. సంస్కృతము తెలిసినట్లు తెనిఁగింపందొడంగినారు. మూలమునకు సరిగా నుండవలయునేని కరుణముగా అనవలయును; ఆపదమును ఏడ్చెడు అనుక్రియకు విశేషణముగా దానికి ముందు ప్రయోగింపవలయును. "కరుణం రటన్తీమ్" అని మూలము. మూలములో ముహుః అనియున్నది. 5. గొంతెండునట్లు సదా ఏడ్చుచున్నదని హృదయము. అది యిందు లుప్తముగదా. మఱి యిందు, 6. నదితటమున అని యున్నది. మూలములో, 7. పారేతరఙ్గిణి—నదియొక్క యవలియొడ్డున నని యున్నది. పోతోకయొడ్డున పెంటియొకయొడ్డున నని యెడఁబాసినతీరు చెప్పఁబడియున్నది. ఆయర్థమునిం దఱఁచివేయుటకుం గారణ మేమి? తెలియమియే. 8. కాంచి—కర్త యేది? ఇదియా; ముదితయా? ద్వితీయపక్షమున ఇది పైరాగముగలది లోరాగముగల ప్రేయసియేడ్పు నుపేక్షించుచున్నది, అని పద్యార్థము. ఈపక్షమందును రథాంగముల కనురక్తిలేమియే తెనుంగుకవిహృదయమగును.

మూ.—యోఽయం బహిః కలితకుఙ్కుమరేణురాగ
మన్తస్తు సంభృతదయం హృదయం దధానః
పారేతరఙ్గిణి ముహుః కరుణం రటన్తీ
మాలోకతే సహచరీం న తు సన్నిధత్తే.

ఐంద్రజాలిక సీతాదర్శనమున రామునికిరాఁగలయవస్థ సూచితము.

ఉ॥ ఈయదిచక్రమిందువుపయింపఁగనుంబ్రియవిప్రయోగముల్
[13] బాయమగండురామమఱియు సంగముసౌఖ్యముఁ బొందుఁబొందగన్
1739 జాయను బాసిగాసిపడు నాకన నెన్నొకొ యయ్యెనయ్యయో
యోయన దుఃఖదంబులు విఘూష్ణకరోదయముల్ క్రమంబునన్.

మూ.—అయ ముదయతి చన్ద్రో విప్రయోగం ప్రియాయాః
శ్రయతి తపతి సూర్యే సఙ్గ మఙ్గీకరోతి
మమ తు జనకపుత్రీవిప్రయుక్తస్య యాతం
శత మధిక మపీదం చన్ద్రసూర్యోదయానామ్.

**1**. సంగముసౌఖ్యము—మునలివక్త సుచితము. **2-9**. పొందఁగన్, మఱియు, సౌఖ్యము, గాసిపడు, అన, అయ్యయో, ఓయన, దుఃఖదంబులు, క్రమంబునన్—పాదపూరణములు. ఈ పాదపూరణకార్యములో పునరుక్తి!—**10**. గాసిపడు= దుఃఖదంబులు, **11**. క్రమంబునన్ = ఓయన; మూలములో, **12**. శతమధికమపీదమ్ అని యుండఁగా దానిని ఎన్నొకొయని మార్చుటకుఁ గారణమేమి? **13**. మూలమందు శతశబ్దముచేత సీతాపహరణము మొదలు ఇప్పటికైన కాలపరిమితిని జయదేవుఁడు సూచించినాఁడు. ఆనాటకప్రయోజనము నిందు వీరు సున్న చేసినారు. ఒకపద్యమేని మూలమునకు సరిగా కుదురరాదా?

౭౮-వ పుట.

నిజశబ్దార్థము తెలియక పంతులవారు పాడొనర్చిన వాక్యరత్నము. [3-వది].

[నిజ=తన; నా కాదు.]

[తెరలో] సఖా! రత్నశేఖరా! చిరకాలమున కగపడితివి.

[17] లక్ష్మణుఁడు—[ఆకర్ణించి] ఇదియేమి? [మఱియుఁదెరలో] చెలికాఁడా
1756 చంపకాపీడా! ఇది యిట్లు. నేనింతకాలమువఱకు, నఖిలమాయానిధియు, మాయావిదులలో నగ్రేసరుండును నైన మయుఁడను దానవునియొక్క కూఁతురును, నాతోఁబుట్టువు, నవునామె ననుసరించుటకు లంకయందు నునికిఁగొనియున్న చిత్రరూపుఁడను దానవునివలన, సకలమయిన యింద్రజాలకలనఁ దెలిసికొనుచుంటిని.

లక్ష్మణుఁడు.—అవు నిది యెవరో యిరువురు విద్యాధరుల సంవాదము.

ఈసందర్భమువలన నిట కిష్కింధకడ నిరువురువిద్యాధరులు రత్నశేఖరచంపకాపీడులు చిరకాలమునకుం గలసికొన్నారనియు, ఆయిరువురిలో రత్నశేఖరుఁడు లంకలో ఇంద్రజాలము నేర్చి అప్పుడె అటకువచ్చినాఁడనియు విశదము.—

ఇటు పంతులవారి నేపథ్యవాక్యమందున్నట్లు ఈరత్నశేఖరుఁడు మయపుత్త్రుఁడేని 1. అసురుఁడుగదా కావలయును, లక్ష్మణుఁడు వీనిని విద్యాధరుఁ డనుట యెట్లు పొసంగును? 2. ఇంతియగాక వీఁడు మాయావిదగ్రేసరుఁడైన తనతండ్రివలన నేర్వక యొరునివలన నేర్చుట యేమి? 3. మఱియు వీఁడు ఎవనిపుత్త్రుఁడో వీనిసఖునికి తెలియకుండునా? సఖునితో 4. ఇప్పుడు 5. అపృష్టముగా తండ్రిపేరు చెప్పకొనేల? 6. మయప్రస్తావమువలనం బ్రయోజనమేమి? మఱియు 7. తనతోఁబుట్టువును తనతోఁబుట్టువనియే నిర్దేశింపక మయునికూఁతు రనుట యెట్టిది? 8. వీనికి దానికిని తల్లియొక్కతెయు తండ్రులు వెవ్వేఱా? ఇది తంజావూరిగాయకుఁడు పాడినట్లు బగుజాగుజుగా నున్నది! ఈనేపథ్యవాక్యమందు విశేషములు—రత్నశేఖరుని తల్లిని మయుఁ డుంచుకొన్నాఁడు, దానికిని మయునికిని గలిగినకూఁతును చిత్రరూపుఁడు తా నుంచుకొనుటకు [లేక తన్నుంచుకొమ్మని] ఆశ్రయించుచున్నాఁడు. 9. ఆకూఁతురు [అవునామె] 10. దుశ్చరిత్రగావునను తనతల్లియొక్క దోషమువలనఁబుట్టినదిగావునను, 11. దానిపేరు చెప్పుటకు తాను [రత్నశేఖరుఁడు] లజ్జితుఁడైనాఁడు.—ఆహాపంతులవారు నిజశబ్దార్థము నెంతచక్కఁగా నేర్చుకొన్నారు! ద్వితీయనేపథ్యోక్తికి మూలము:—

వయస్య చమ్పకాపీడ, ఏవ మేతత్ । మయా హ్యయన్తం సమయ మఖిలమాయానిధే ర్మయనామ్నో దానవస్య పుత్త్రీం నిజసహోదరీం మన్దోదరీ మనువర్తితుం లజ్జాక్కయాం కృతాలయా చ్చిత్రరూపనామ్నో దానవాత్ సకలమిన్ద్రజాలక మాదదానేన స్థితమ్ ॥

ఇందు రత్నశేఖరుఁడు వక్త,వీఁడు విద్యాధరుఁ డని లక్ష్మణవాక్యముచేత స్పష్టము. అట్టి వీఁడు 12. మందోదరీభ్రాత యెట్లగును? అగునేని. యసురుఁడు గాక విద్యాధరుఁడెట్లు? సంస్కృత విద్యార్థులకు ఇటు నాతోఁబుట్టువను తెల్గు తప్పనియు [13. నిజ = తన], తనతోఁబుట్టువు [చిత్రరూపునితోఁబుట్టువు] అనవలసినదనియు, 14. మయపుత్త్రుఁడు చిత్రరూపుఁడు [రావణుఁడు జానకీకాంక్షియైనందున దుర్మనాయమానయై యున్న] తనతోఁబుట్టువును మందోదరిం డేర్చుటకు లంకలో కొంతకాల ముండఁగా నతనియొద్ద 15. ఈవక్త రత్నశేఖర విద్యాధరుఁడు ఇంద్రజాలము నేర్చుచుండె ననియు విదితమగును. ఇప్పుడు స్పష్టముగదా:—మయుఁడు మాయానిధి, 16. కాన వానిసుతుఁడు చిత్రరూపుఁడును మాయానిధియే, 17. ఆచిత్రరూపుఁడు చంపకాపీడుని కపరిచితుఁడుగా నుండనోవును—గాన నతఁడు [అనఁగా రత్నశేఖరునిగురువు] ఎవరో, ఏకారణమున నంతటిమాయా

నిధియో, ఏల యెప్పుడులంకనుండెనో అవృత్తాంతవిస్తరమును చంపకాపీడునికి రత్నశేఖరుఁడు నిజచిత్రాదర్శన కారణోక్తిలో చెప్పుట అత్యంతప్రసక్తము. ఈపంక్తులకు ఈవాక్యమెట్లన్వయించినది? సందర్భశుద్ధి యెట్లు కుదిరినది? మాటకు మాట పెట్టుటయే యాంధ్రీకరణమా? అబ్రవీత్తుపురాణము తప్పైనను సంగతముగానున్నది. ఇది "కణ్టాకారిరసంపీత్వా కర్ణంభిత్వాగుదంపహేత్" అనుయోగము ప్రకారము పెద్దపండితుఁడు వైద్యముచేసిన కథగా నున్నది.

1. షష్ఠ్యర్థము తెలియమిచేపాడయినసూక్తిరత్నము. [౨-వ ఉదాహరణము].

[2] 1758 [తెరలో] సఖా! రత్నశేఖరా! ఐననదియేమో, నిజకళాదర్శనమును గావింపుము. [తెరలో] చెలికాఁడా! చంపకాపీడా!

క॥ నరులకుసురాసురులకుం। గరుడోరగసిద్ధసాధ్యగంధర్వులకున్
గరమరిదియైనచిత్రము। వెరవారఁగఁజూపుమెవనివృత్తమొనరెడున్.

ఇది బహుగొనిచెప్పినదే. మొదట చంపకాపీడుఁడు [ఇంద్రజాలవిద్య యెఱుఁగనివాఁడు] రత్నశేఖరైంద్రజాలికుని, విద్య చూపుమని యడిగినాఁడు. దానికి ఉత్తరముగా రత్నశేఖరైంద్రజాలికుఁడు చంపకాపీడునే చిత్రము 2. చూపుమని యడుగుచున్నాఁడు. ఇది బహు కాదా? ఇంతకన్న నసంగతముండునా? మూలము.—

అసురసురనిశాచరోరగాణా। మపి నరకిన్నరసిద్ధచారణానామ్
కథయ జనవిలోకనైకచిత్రం। స్ఫుటమిహ కస్య విజృమ్భతాం చరిత్రమ్.

సురాసురరాక్షస భుజంగనరకిన్నరసిద్ధసాధ్యచారణులలోపల ఎవనిచరిత్రమును జనులకుఁజూడన త్యద్భుతముగా నుండుదానిని స్ఫుటముగా నిట చూడఁగోరెదవో చెప్పుము.—అని యర్థము. పద్యము నిట్లుమార్చిన మూలానుగుణముగాను సమన్వితముగాను ఉండును.

సురనరనిశాచరులలో। గరుడోరగసిద్ధసాధ్యగంధర్వులలోఁ
గరమద్భుతంబు నెవ్వని। చరితముఁ గనఁదివిరెదీవు చయ్యనఁజెపుమా.

[దీనిమూలము పంతులవారి కన్వయము కాలేదు.]

ఆ॥ సీతలక్ష్మండుగౌతమీతీరత। పోవనములఁబార్శ్వములనుబరఁగఁ
గడపినాఁడనిమిషకలననెయ్యవియట్టి। దినములింకముందు సెనరుపడెడు.

ఇట రాముఁడు తనయెదుట సీతయున్నట్లు మతిభ్రమచేత తలంచి, అంతలో సీత లేమి నెఱింగి, మతిభ్రమ తన్ను వంచించినదని చింతించి, అంతలో వంచనగాదు, ఉపకారమే చేసినదని పలికి ఉపకరించుటనే సమర్థించుచున్నాఁడు. మూలము:—

[7] గోదావరీతీరతపోవనేషు । సౌమిత్రిసీతాపరిపూర్ణపార్శ్వః
1765 ముదా నిమేషా నివ యాన్యనైషం । దినాని తాన్యేవ పునః స్మృతాని.

సీతయు లక్ష్మణుఁడును ఇరుప్రక్కలం బరఁగ, గోదావరీతీరతపోవనములయందు సంతోషముతో నిమిషములనుబోలె నేదినములను గడపితినో ఆదినములే [మతిభ్రమచే] మఱల స్మరణకు తేఁబడినవి.—‘పురస్కృతాని’ అనిపాఠాంతరము; ఎదుటఁ బెట్టఁబడినవి, అనఁగా ప్రత్యక్షీకరింపఁబడినవి; అని యుపకారసమర్థనము. తపోవనములు గడపుట కధికరణము; పంతులవారు దానిం గ్రహింపలేక 1. పరఁగుట కధికరణముగా చెఱిచినారు. అట్టియీయధికరణమును తెచ్చి మధ్యను గ్రుచ్చుటచే 2. పార్శ్వములు తపోవనపార్శ్వములనియు రామపార్శ్వములుగావనియు నర్థముగాఁ దోఁచుచున్నది. మూలములో బహువ్రీహిచే రామపార్శ్వలనియేర్పడుచున్నది. 3. అందలప్రయోజనము కొంత యేమియు నెఱుంగనివాఁడనై యనునభిప్రాయమే. అదియు 4 పరిపూర్ణవిశేషణముచేత చక్కఁగఁ బోషితమైనది. తెలుఁగులోపై మార్పులవలన స్వారస్యము తపోవనములో లీలనమై పోయినది. 5. ఇంకముందు అనఁగా ఇటుతర్వాత భవిష్యత్కాలములో అని అర్థమగుచున్నది. ముందు అనఁగా ప్రమోల నని యర్థముచేసికొందమన్న, 6. ఇంకను—ఇటుతర్వాతను అనునర్థము ఆప్రయాసను విఫలీకరించుచున్నది. దీనికి, ఇప్పటికిని అనఁగా ఆదినములు పోయి చిరకాలమైనప్పటికిని, అని యర్థము చెప్పకొన్న కొంతసరిపడును. మూలముంగనక యిది స్ఫురించునా? వారు ప్రథమోపస్థితార్థముగానే చేసియుందురు. కాకతాళీయముగా ఈవ్యాఖ్య కెడముకలిగియుండును. తెనుఁగులో 7. ముదము త్యక్తముగదా?

[16] క॥ ఇదివేనిచేతఁజూపెన్ । ముదమునగోదావరియలమొత్తములనిరుల్
1781 ముదితవియవచనసుధల్ । గుదురుగఁజెవిచేరలఁజవిఁగొందుఁబలుమఱున్,

1. ఇది—సీత. రాముఁడు వక్త. ఇది యనుటకన్న మాయింటిది, మాయబ్బాయులతల్లి అనరాదా? ఈపిశాచి యనియేనియు, తుదకు ఈశక్తి అనియేనియు చెప్పరాదా? ఏమిశృంగారరస మొలుకుచున్నది ఈపదములో! 2. ముదితవి—ఇది యనితొడఁగినపిదప మఱల నిట ముదిత యనుట అర్థస్ఫూర్తిభంజకముగానున్నది. 3. ఇది యనుటచే పురోవర్తిని యని యర్థమగుచున్నది. అది యన్నను మేలు. మూలములో సర్వనామము నామవాచకమునకు తర్వాత వచ్చినందున ఈదోష మగపడలేదు. 4. పలుమఱు చవిగొందున్—మఱల ద్రాగుదునో అని మూలము కోర్కని తెలుపుచున్నది. గొందునెమఱలన్—అనిమార్చినయెడల సాధనప్రయాస మక్కఱలేకయే వక్త్రభీష్టమని తెలియును. అర్థమందుసందేహముచే నిట్లువ్రాసియుందురు. 5. అలమొత్తముల 6. నీరుల్—కముల వీచి విచేష్టితములు అని మూ:—

రామః—[పునఃసప్రత్యాశమ్] అపి నామ

తాన్యేవ పక్ష్మలదృశో వచనామృతాని
భూయోఽపి కర్ణచులుకై రహ మాపిబేయమ్
యై ర్మా మదర్శయదసౌ వికసత్ప్రమోదా
గోదావరీకమలవీచివిచేష్టితాని.

సీత యేవచనామృతములతో గోదావరీకమలవీచివిచేష్టితములను వికసత్ప్రమోదయై నాకుఁ జూపెనో ఆపక్ష్మలాక్షియొక్క ఆవచనామృతములను మఱల నేను వీనుఁజేరల ద్రాగుదునా?— ఏవచనామృతములను రాముఁడు విన వేఁడుచుండెనో ఆవచనామృతములే రత్నశేఖరేంద్రజాల కళాప్రభావ ప్రత్యక్షీకరిష్యమాణ నిద్రితోత్స్వప్నాయమాన సీతా భాషితముగా గోదావరీత్యాదికమయిన యాంతర్యాతిపద్యములో రామునికి వినఁబడియెనని సంవిధానవైదగ్ధి.—కమలవీచి విచేష్టితాని=7. తత్కాలమందు ఆవీచిచేష్టితములు రామునికి వింజామరవీచుటగాను, 8. కమలచేష్టితములు వెల్లగొడుగుపట్టుటగాను, ఉండెను. అట్లని దీనితర్వాతిపద్యము "గోదావరి" యను నది దీనికి తెలివిడిగానున్నది కనుఁడు. అట్టి యాసౌభాగ్యమునకు, వికసత్ప్రమోదయై, దానిని సీత శ్రీరాములకు నివేదింపక తా ననుభవింపదుగావున, ఆయనకు ఆకమలవీచివిచేష్టితములను సవ్యాఖ్యానముగా చూపెను, ఆవ్యాఖ్యావచనామృతము లే మఱల నాచెవిని బడునా యని రామాశయము. చేష్టితమును నీరు లనుటచేతను, కమలములను వదలుటచేతను, మొత్తమును పెట్టుటచేతను, పంతులవారు జానకీవ్యాఖ్యను నిర్మూలముచేసినారు. పంతులవారు 9. సలిలవీచివిచేష్టితాని యను తెనుంగులిపిలోని తప్పపాఠమును పాడుచేసినారు. 10. ఈపద్యంపుశ్లోకమునకు దీనితర్వాతిపద్యంపు శ్లోకము వ్యాఖ్యయని కనిపట్టనేరకపోయినారు. 11. పక్ష్మలదృశః—సీత నింతమాట యనవచ్చునాయని 'ముదిత' యన్నారు. దీనికిని తెనుంగుముద్రణములోని 'నీరజదృశః' అనుదానికిని రెంటికిని నిష్పక్షపాతముగా కరకరాయకొట్టినారు. 12. వికసత్ప్రమోదా యన్నాఁడుగాన, ఆప్రమోదవికాసము ముఖమునంగదా తెలియును, అందును నేత్రములందుఁగదా చక్కఁగా తెలియును, కావున 13. తత్ప్రమోదమేదురములయిన యానేత్రములను శ్రీరాములవారు ఉత్కంఠాపూర్వకముగా స్మరించుచున్నారని ఆపక్ష్మలదృక్పదముచేత మహాకవి మనకుం దెల్పినాఁడు. పంతులవారు అట్టిస్మరణలు సదాచారము గాదని, బూతని, శృంగారలంపటులదురాచారమని, వానిని రానీయక ముదితయని తెలిఁగించినారు. ఉక్తక్రియాసంబద్ధావయవవర్ణనాపూర్వక నిర్దేశసౌభాగ్యమునకు ౧౦౨-వ పుటం జూడుఁడు. 14. పలుమఱు—

వెండియుననియర్థముగా భూయశ్శబ్దమువచ్చినచో నెల్ల పంతులవారు పల్మాఱనియే తెనిఁగించుచున్నారు. భూయస్.....పునరర్థే—పునః...ద్వితీయవారే, అని యుభయత్రశబ్దస్తోమమహానిధి. 15 కుదురుగ—పాదప్రాసపూరణము. ఇంతకన్న ప్రాసము చెడిననుం జెడుఁగాకయని, [ఓహో, మఱచితిని ప్రాసము చెడుటయని యొకటి లేదుగదా, ఏయక్షమున కేయక్షరమైనను ప్రాసకు పనికివచ్చునుగదా] కుయ్యక అనిచెన్నపట్టణపుఁదెనుఁగుగా వేసికొనిన స్వారస్యముగా నుండును. 16. ఇదియెల్లం జూడ వేనిచేత అను కరణతృతీయకంటె వేనితో అనుసహార్థతృతీయ మేలని తోఁపదా?

[పూర్వశ్లోకోక్త కమలవీచివిచేష్టితములకు తెలివిడి.]

[5] క॥ గోదావరియోసొబగుఁడ। తాఁదాల్చుంజేతనువెలిదామరగొడుగుక్
1786 ప్రోదిగనలవెలిసీవురు। నేదకయేవీచునీకునిదియరుదుగదా.

ఛా.—తవ సుభగ ఉత్క్షిపన్తీ। తరఙ్గసితచామరం రఘుమృగాఙ్క—
ధవళకమలాతపత్రం। ధరతి గోదావరీ స్వహస్తేన.

సొబగుఁడ—మూలములోని 1. రఘుమృగాంక అనుసంబుద్ధి త్యక్తము. ఈవిశేషణము సౌభాగ్యమునుమాత్రము చెప్పుచున్నది. అది రఘువంశరాజశ్రేష్ఠ అనియర్థమిచ్చుచు 2. రాజవు గాన నీకు రాజోపచారములు [ధవళాతపత్రధవళచామరములు] సమర్పించినదని ధ్వని. ఇంత సారవంతముగానిచో పంతులవారేల త్యజింతురు! 3. చేతను—స్వహస్తేన అని మూ. స్వయముగాఁ జేయుసత్కారము ఉత్కృష్టముగదా. అందుకై స్వశబ్దము ప్రయుక్తము. ఆప్రయోజనముం గనలేమి నిందు త్యక్తము. ఈరెంటికిని బదులు పెంట యేమియు రాలేదా యనిన, రా కేమి? 4. ఏదకయే, 5. నిదియరుదుగదా; అని రెండురానులువచ్చినవి. పూర్వపద్యములో కమలము నేది మొత్తములు వెట్టినదోషము ఇప్పటికేని బోధపడియుండునా?

౭౫ - వ పుట.

ఈ గోదావర్యాద్యైంద్రజాలిక సీతాస్వప్నభాషితమును శ్రీరాముఁడు వాస్తవ సీతదే యని యూనవాలుపట్టుచున్నాఁడు:—

చ॥ పరిమితమాటుహృద్యమగువాగ్విభవంబొనుకోమలంబయూ
[17] సరసముమాధురీధురిఁబ్రశంసితమింకను నేమనంజనుక్
1803 స్వరమనవీణియందనరుపంచమముంబురణించుదీనికిక్
వరకలకంఠకంఠరుతిపన్నెడెడుక్ శ్రుతివాదభూమియై.

పరిమితకమనీయః కోమలో వాగ్విలాసః
సరసమధురకాకుస్స్వీకృతా కాపి రేఖా
ధ్వని రపిచ విపఞ్చీపఞ్చమ స్యానువాదీ
శ్రుతి రపి కలకణ్ఠీకణ్ఠసంవాద మేతి.

ఇట సీతాస్వప్న సమాలాపముయొక్క గుణములు వాగ్, రేఖా, స్వర, శ్రుతులు, క్రమముగా నాలుగు పాదములందును వర్ణింపఁబడినవి. గోదావర్యాదిపద్యమే ఆస్వప్న సమాలాపము. ఆపద్యమే పూర్వము గోదావరీతీరమందు సీత శ్రీరాములవారితో తాను పల్కినపల్కు. సీత నింక నిట ఇంద్రజాలములో శ్రీరాములు చూడలేదు. ఆమెయొక్క ఈసమాలాపము విని యిది యామెదే యని యానవాలు పట్టుచున్నాఁడు. సరసము — పంతులవారు ద్వితీయపాదమందు వర్ణింపఁబడిన విశేష్యము యిన 1. రేఖనువదలివేసి 2. రేఖాకాకులం దఱిమివేసి, కాకు విశేషణములయిన 3. సరస 4. మధురములను ప్రథమపాదమందలి 5. వాగ్విలాసమునకే తమ భాషలో వాగ్విభవమునకే విశేషణములనుగా ననుగ్రహించినారు. ఇట్లు ధ్వంసము నేయుట "సరసము! మాధురీధురిం ప్రశంసితము. ఇంకనుఁ ఏమనంజనుఁ!" తఱిమివేసిన రేఖాకాకులకు బదులు ఏమియు లేదా యనిన, లేకేమి? సమృద్ధి 6. ఇంకను + 7. నేఁ + 8. మనంజనుఁ — ఇంక రాముఁడు బ్రదుకవచ్చును. దీనివలన నిప్పటికి సీతయేయని రామునికి నిశ్చయమైనది, అని యభిప్రాయమగుచున్నది. అట్లేని మఱి పండుగగా రెండుపాదముల స్వరశ్రుతులను వర్ణింపనేల? "అదే యిది" అని రాముఁడుపల్కినప్పుడు ఈనిశ్చయజ్ఞానము లేదా? లేనిచో అదేయి దని యెట్లు పల్కినాఁడు? నిశ్చయజ్ఞానము ముందే కలిగినది, దానినే వాగ్రేఖాది గుణపరీక్షచే దృఢపఱుచుకొనుచున్నాఁడు. కాన, ఇంకనునేమనంజనుఁ అను వాక్యమునకు మత్కృతద్వితీయవిభాగమే ఆంధ్రరచయిత తలంచినదేని, ఆవాక్యమిట నుండఁదగదు, పద్యముతర్వాత, పద్యమునకు వెలిగా నుండవలయును. ఏల యనఁగా పద్యమెల్ల "ఆలాగుననే" అనునారంభసామర్థ్యముచేత సీతాసమాలాపతా సమవధారణపరము గదా? మొదటివిభాగమే తెలుఁగుకవికోరినదేని, ఈముక్కకు ఎక్కడను చోటు వలవదు. మఱల నుత్తరార్థమందు పంతులవారు 9. స్వతంత్రముగా నిబద్ధమైన శ్రుతి స్వరూపవర్ణనను తృతీయపాదోక్త స్వరవర్ణనాంగముగా ననుగ్రహించినారు. 10. దీనికిఁ — స్వరమునకు అని యన్వయించుచున్నది; పంతులవారి యభిప్రాయము వాగ్విలాసంబున కనియో? మూలచతుర్థపాదార్థము :— శ్రుతియును కోయిలయెలనాగమూఁతకు సరిపడుచున్నది. పంతులవారు ఈపాదములోఁగూడ సొత్తు మార్చినారు. 11. జయదేవుఁడు సీతాలాపమున కిడినశ్రుతిని వీరు కోయిలమూఁత

కిచ్చివేసినారు. మార్పులు చేయనేల, తనకు పద్యము మూలమునకు సరిగా కుదుర కున్న పద్యకవనమును నిరాకరించి గద్యకవనము చేయరాదా? ఎంతసుఖముగా నున్న జయదేవవాక్కు ఈతెన్గులో ఎన్నియిడుమలంబడినదో యరయుఁడు. ఈ పద్యములో నింకొక చమత్కారమున్నది.—అది యేదనఁగా—పరాకున పిల్లవాని జుట్టు తీసివేసినదివాకీర్తి అందుకై శాపాలుపెట్టినయవ్వకు జుట్టిడి పరుగెత్తి పోయిన చమత్కారము. **12.** కలకంఠీకంఠ అన్నచోటఁగల స్త్రీప్రత్యయము **13.** మాధురీ ధురతల కెక్కినది. మాధుర్యాః ధూః, [లేక, మాధుర్యాః ధురా] = మాధురీధురా సూ॥ ఋక్పూరబ్ధూఃపథా మానక్షే. ఇప్పటికిని తెలియకున్న ఎవ్వరినేని వైయాకర ణుల నడుగునది. ధురీధురి అని ధ్వనిసామ్యమువచ్చినమాత్రాన సంతసిల్లరాదు.

**14.** వాగ్విభవంబొ—ఇది ప్రథమోపాత్తముగాన దీనికి ఒకారముక్కుఉ లేదు. లేకున్న మేలు; అనంతరోపాత్తములకున్న నుండఁదగు. **15.** అయా—ఇంతయవధారణ మేల, ఈసందేహజ్ఞాపనమేల? **16.** వాద—సంవాదమును పాడుచేసి వాదముచేసినం దున శ్రుతి ఆలాపమందుండలేక కలకంఠీకంఠరుతియందుఁ జేరినది. కలకంఠీయని, పాపము! మూలకవి ప్రయత్నపూర్వకముగా చెప్పుకొన్న స్త్రీత్వమందు ఏమియు స్వారస్యములేదా? తీసివేయవలసినదేనా? సీతాకంఠముగాన, **17.** మృదుత్వాతిశ యము లభింపలేదా? సహృదయులే ప్రమాణము.

[పూర్వోక్తపద్యము వెంబడివాక్యమిది.]

[విలోకించి] ప్రియురాలు మఱి యెక్కడ? ఎట్లిది యదృష్టచంద్రరేఖము చం
1804 ద్రాతపము?—విలోకించినవాఁడు శ్రీరాముఁడు. ఈవాక్యము ఆయ
నది. అదృష్ట...పము—సీతనుగానక, "ఇదేమి సీతాసమాలాపము వినఁబడుచున్న
ది, సీత యగపడదు," అని యభిప్రాయముగా పల్కినమాట. మూ. తత్కథ మదృష్ట
చన్ద్రరేఖ శ్చన్ద్రాలోకః. అప్పయ దీక్షితులవారు ఏతజ్జయదేవకృతాలంకార శాస్త్ర
ప్రకరణమయిన చంద్రాలోకమునకు కువలయానందమను వ్యాఖ్యంజేసియు అందు
మూలకారుఁడైన యీజయదేవుని పేరు తెల్పకపోయినందులకు ఇట నిది జయదేవుని
స్తోత్ప్రసవచనమని సంప్రదాయజ్ఞులయిన పెద్దలు పల్కుదురు. చంద్రాలోకశబ్ద
మును చంద్రాతపయని మార్చిన తెల్గుముద్రణము ననుసరించి యీవైతిహ్యాస్ఫూర్తికి
మనపంతులవారు భంగ మొనర్చినారు.

అంతటఁ జూడఁబడుచు జానకిప్రవేశించుచున్నది—చూడఁబడుచు అననేల?
1805 ఇప్పటి కీనాటకములో రంగమందు ఎందఱు ప్రవేశింపలేదు? అప్పడెల్ల
ఈమాట కావలసివచ్చినదా? ఇది తప్పుడు ముద్రణమునకు తప్పుతెలుఁగు. తప్పుడు

మూలము.—తతః ప్రవిశతి నిరూపయిష్యమాణా జానకీ. పంతులవారికి నిరూపయిష్యమాణా శబ్దమందలి భవిష్యదర్థక ప్రత్యయమున కర్థము• తెలియలేదు. నిరూప్యమాణా అనియన్న నేమర్థమో ఆయర్థమే దీనికి గ్రహించినారు. దీని కిటువర్ణింపఁబడఁగలదై యని భవిష్యత్తర్థము. మఱి దీనికేని పొందికయెట్లు? ఇట "యథానిరూపయిష్యమాణా" యని యుండవలసినందులకు యథాశబ్దము అచ్చులోపోయినది. యథానిరూపయిష్యమాణా=వర్ణింపఁబడఁగలప్రకారముగా=చేయఁబోవు వర్ణనకుసరిగా. ఇట సీమె ప్రవేశసమయమం దుండవలసినవిధము దీని క్రైదపపంక్తి యాదిగా ఒకకేల నిత్యాది పద్యమందు వర్ణితమైయున్నది. ఇట సీతాపాత్రము ఒకకేల నశోకశాఖ పట్టుకొని రెండవకేల చెక్కిలియుంచుకొని కన్నుల బాష్పకణములురుల కేశపాశము విస్రస్తమై నితంబముపైఁ గ్రమ్మ నిదురలో నున్నదిగా ప్రవేశింపవలయును. ఇట్లే ఆమె యింతర్వాతి పద్యమందు వర్ణింపఁబడియున్నది. ప్రవేశ సన్నివేశ విశేషము ముందే చెప్పఁబడియున్నచో యథానిర్దిష్టా అని తెల్పుదురు. ఆసన్నివేశ విశేషమిట ముందుఁ జెప్పనందున, ఇఁక చెప్పనున్నందున భవిష్యదర్థకముగా కవి యథానిరూపయిష్యమాణా అని తెల్పినాఁడు. దీనింగూడఁ గనిపట్టుమి కవితా తత్త్వవిత్త్వమే.

సీతాప్రవేశసన్నివేశకథనము.

మ॥ ఒకకేలంగయికోఁబడెందగనశోకోర్వీజసచ్ఛాఖవే
[17•] 1822 ఱొకకేలందినచంద్రమస్సరుచియయ్యుం జెంపయింపొందెడుకా
సుకచంబుల్ లులితంబులై పిఱుఁదుపైసొంపొందెడుంబొర్లుచుకా
బ్రకటంబౌఁగదపక్ష్మలేఖవిగళద్బాష్పోరుపుష్పాప్తమై.

1. సచ్ఛాఖ, 2. సుకచము—ఈ సుసత్తులు కవనకళాదుర్గతులకు మేరురోహణములుగదా? 3. తగఁ—నిద్రలో చక్కఁగా పట్టుకొనుట యెట్లు? 4. చెంప యింపొందెడుకా—చెంప యనఁగానే యింపుపోయినది. చెక్కు సొంపొందెడుకా, అనుకోరాదా? రాదు. ఏలయన, సొంపొందెడుకా అని తృతీయపాదములో చెప్పకోవలసియున్నది. అట నింపొందెడుకా అనరాదా? రాదు. అట యతికై ఆసొంపు, కాన నిట ఇంపొందెడుకా తప్పదు. కావున దానికి పూర్వము చెక్కు అని యుకారాంతము పొసఁగదు, కాన 'చెక్కుచెన్నారెడుకా'. గండమునకు వెలితురా? మఱి, 5. శోభ యెడలినదని వర్ణింపవలసిన యీ ఘట్టమున ఆదిలోనే శోభనేవర్ణించుట, దానినే ప్రధానీకరించుట, శోభాదరిద్రత నుపసర్జనీకరించుటయు, వైరస్యధురంధరత్వముగా నున్నది. చెక్కుపెంపేదెడుకా అని దిద్దుఁడు. 6. సుకచంబుకా—మంచి వెంట్రుక—సీతకు ఒకటి కెచ్చు లేదా? ఇదేటికవనము! ఈవర్ణన కెవ్వరికేని యేద్పు

రాదా ? ఈయేకవచన హఠమేమి ? దీనికై, 7. లుళితంబునై అని యొకపాదపూరణ నకారమేమి ? సుకచంబు ల్లుళితంబులై యనియేల చెప్పఁకోరాదు. కచశబ్దార్థము పంతులవారు నేర్చుకొన్న బాగుగానుండును. కచము=వెంట్రుక, కావుననే కచశబ్దము తలకట్టును చెప్పుచో బహువచనమందే ప్రయోగింపఁబడును, భారాదిపదఘటిత సమాసముననేని ప్రయోగింపఁబడును. "కచాః కళిన్దజాతీరతమాలస్తోమమేచకాః" చంద్రా. "అస్యాఃకచానాం శిఖినశ్చ కిన్ను విధిం కలాపౌ విమతే రగాతామ్" నైషధ. "వికచకచకలాపః కిఞ్చిదాకుఞ్చితోయమ్" "అస్యాః సపత్నైకవిధోః కచౌఘః స్థానే ముఖస్యోపరి వాసహాప" నైషధ. నామలింగానుశాసనముం గనుఁడు—"చికురః కున్తలో వాలః కచః కేశ శ్శిరోరుహః" అని వెంట్రుకం జెప్పి "తద్బృన్దే కైశికం కైశ్యమ్" అని వెంట్రుకలమొత్తమును అమరుఁడు చెప్పినాఁడు. 8. సొంపాందెడుఁజా—ఈ ద్రోహి యతికి సొంపుగాని, ఆమెయొక్క దుర్దశకు తల్లడిల్లుచున్న రామునికేమికొంపు ? సొంపేదెడుఁజా అని దిద్దునది. 9. ప్రకటంబు—ప్రా. 10. బోఁగడ బి—పా, 11. ఉరుపుష్పావ్రుతము—పుష్పముచేతనే పెద్దపెద్ద బాష్పములని యర్థము గలుగుచుండఁగా ఉరు అనుట పిరంగిగుండ్లయంత బాష్పమని తెల్పుటకా ? 12. మూలములో మొత్తమును స్తబకమన్నాఁడేగాని, బాష్పముల నవకణములనే చెప్పినాఁడు, మహత్త్వము నపేక్షింపలేదు. పుష్పములం జెప్పుటకన్న కోరకములం జెప్పిన కొంత మేలుగా నుండును.

మూ.— ఏకేనాలమ్బితేయం శిథిలభుజలతాశోభినా శోకశాఖీ
హస్తేనాన్యేన చాయం దినతుహినకరక్లాన్తకాన్తిః కపోలః
ఏష స్రస్తో నితమ్బే లుఠతికచభర స్త్యక్తకాఞ్చీకలాపే
నేత్రోత్సఙ్గే చ బాష్పస్తబకనవకణైః పక్ష్మలాః పక్ష్మలేఖాః.

13. శిథిలభుజలతాశోభినా—అని హస్తమునకు విశేషణము, నిద్రావస్థను సూచించుచున్నది. అది పద్యములో త్యక్తము. ఇటుశుభధాతువున్నను అది హస్తసౌందర్యవర్ణనాపరమని తలంపఁదగదు. సామాన్యమైన యొప్పిదమును మాత్రమే తెల్పుచున్నది. ఏలయన, తత్కారణముగా భుజలతాశైథిల్యము చెప్పఁబడినది. 14. దినతుహినకరక్లాన్తకాన్తిః—ఈవిశేషణమందు స్పష్టముగా క్లాంతశబ్దముచే సొంపేదుటయే చెప్పఁబడినది ; ఇది పద్యములో విపరీతముచేయఁబడినదిగదా. 15. త్యక్తకాఞ్చీకలాపే—ఇదియు సొంపేదుటం దెలుపునదే నితంబవిశేషణము, పద్యములో నిదియు త్యక్తము, పైగాసొంపుచే వికృతము. 16. కాంచీభూషణరహితమైన యని యర్థము. 17. కాంచీభూషణమును వదలవలసిన యవస్థ సీతకుఁ గలిగ

నని రామునిదుఃఖము. దుఃఖమును సంతోషముగాను, సంతోషమును దుఃఖముగాను, తెనిఁగించుట కవితాతత్త్వవిత్ప్రకాండమా, ఏడమూకమా?

చ॥ వికసితనీలనీరజమువిభ్రమముంగనుకన్నుదోయిప్రా
[16] 1838 యికసుమకోమలాంగమువహించునహాశిథిలత్వమెంతయున్.
[వెండియువిమర్శించి,] తగునిది మనస్సంతోషమునకు, స్వప్న
మందు దీనిచేనెవఁడో చూడఁబడినాఁడు. ఐనదీనికి,

ఇఁకఁబలుకంగఁదంగనపుడెన్నఁబ్రవాళసుశోభఁజెన్నగున్
బ్రకటముగాముదశ్రుకణవారముమౌక్తికరాశినాఁడగున్.

మూ.— ఆమీలన్నవనీలనీరజతులా మాలమ్బతే లోచనం
శైథిల్యం నవమాలికాసహచరై రఙ్గైరపి స్వీకృతమ్
[పునర్విమృశ్య] నూనమనయా హృదయప్రమోదాయీ కో౽పి స్వప్నే
దృష్టః । తథాహి।
ఆలాపాదధరః స్ఫురన్ కలయతి ప్రేఙ్ఖత్ప్రవాళోపమా
మానన్దప్రభవాశ్చ బాష్పకణికా ముక్తాశ్రియం బిభ్రతి.

ఇంద్రజాలికసీతావస్థను రాముఁడు వర్ణించుచున్నాఁడు. ముకుళితమగుచు నేత్రము నల్లగలువమొగ్గతో సాటినొందుచున్నది. నవమాలికలకు ఈడుజోడయిన యవయవములు వాడిపోయినవి. [వెండియు విమర్శించి] నిజముగా ఈచెలువ ఉల్లమునకు మోదమిడునట్టికల యేదో కన్నది. అట్లే, ఏలన.—[కలలో సలవరించిన] మాటచేత మోవి అదరుచు చలించుచున్న తలిరుతోడి సామ్యమునొందుచున్నది. ఆనందమువలనఁ బుట్టినకన్నీటి బొట్టులును ముత్తెములసొంపును పొందుచున్నవి. —అని యర్థము.

1. వికసిత—ఇది గొప్పతప్పు; నిద్రించుచున్నదానికన్ను వికసించినకలువవలె నుండునా? ఏమికవన మిది? 2. ప్రాయికసుమకోమలాంగము = సామాన్యపుఁ బుష్పములవలె మృదువయినదేహము. ఉత్కృష్టకుసుమమును చెప్పక పోయినది, మూలోక్తమైన నవమాలికలను జెప్పకయుం బోయినది, ఇదేమి సాధారణపుష్పములం జెప్పుట! మూలమందు అవయవములం జెప్పఁగా ఇట దేహమునే చెప్పుట! అవయవములని బహువచనమందు స్వారస్యము లేదా? 3. శ్రీరాములు ఒక్కొక్కయవయవమునుం దిలకించి వాడుట నెఱింగి రనిస్వారస్యము; దేహముం జెప్పిన నది రాదు. నవమాలిక శిరీషమువలె కోమలతకు ప్రసిద్ధము, స్త్రీయవయవములకు కవిప్రియమైన యుపమానము.

“తవ న జానే హృదయం। మమ పున ర్మదనో దివాపి రాత్రిమపి
నిర్ఘృణ స్తపతి బలవత్ । త్వయి యుక్తమనోరథా న్యఙ్గాని.”

ఇందు అఙ్గాని యను బహువచనంపుఁబ్రయోజనము నెఱింగి యిట మన శ్లోకములో ననుసంధింపుఁడు.

“త్వదఙ్గమార్దవే దృష్టే కస్య చిత్తేన భాసతే
మాలతీశశభృల్లేఖాకదళీనాం కఠోరతా.”
“అఙ్గానా మకఠోరతా యది దృషత్ప్రాయైవ సా మాలతీ.”

మాలతీనవమాలికలు రెండును జాజిభేదములే, ఒకదానివంటిదే ఇంకొకటి.

తగునిదీత్యాదిగద్యము తప్పుముద్రణమునకుం దెలుఁగు.—మానమనయా హృదయప్రమోదాయ స్వప్నేపి కోపి దృష్టః—యద్యస్యాః॥ మానమనయా = దీనిచేత కొలత = తగునిది. హృదయప్రమోదాయ = మనస్సంతోషమునకు. స్వప్నే=స్వప్నమందు, అపి = ం, కోపి = ఎవఁడో, దృష్టః = చూడఁబడినాఁడు. యది=ఐన, అస్యాః = దీనికి.— 4. స్వప్నమందెవఁడో కనఁబడినాఁడని యెట్లు తెలియును? ఇంతకన్న నసంబద్ధముండునా? ఎవఁడేని పురుషుఁ డగపడిననే గాని మనస్సంతోషము లేదా? ఏమిరోఁత యిది! ఎవఁడో అని రాముఁడెట్లు చెప్పును? 5. తన్నే గదా రఘుమృగాంక అని సంబోధించిపలవరించినది? 6. తనతో గోదావరీతీరమందు పలికినమాటనే గదాయిపుడు మఱల పలవరించినది? ఈవిరోధములు పంతులవారి కేలాతోఁచవు? సరియైనపాఠంపుఁదెనుఁగు నావ్రాసినది కనుఁడు, తెలుఁగుముద్రణము తప్పని స్వప్నేపి యను నపిశబ్దమువలనం దెలియదా? మానమేమి? నావ్రాసినమూలముంబట్టి తెలుఁగుముద్రణమును దిద్దుకొనుఁడు. 7. అవుడు—అధరమునకు ఇంతకన్న సింగారమైనపదము లేదా? కెమ్మోవి, మోవి, పెదవి యివెల్ల పాడుమాటలా? 8. ఔడనఁగా పెదవిక్రిందిభాగము, అవుడుగఱచుట యనఁగా వీరులుకోపావేశముచేత పైపలువరుసతో క్రిందిపెదవిక్రిందిభాగమును కఱచుటగదా?—ఇట అవుడనుపదము కేవలము పనికిరానిది, అతివిరసము గానున్నది, కవితావిషము గా నున్నది. 9. మూలములో మోవియదరుట వర్ణింపఁబడియున్నది. అదరుటచే పలవరింతయు దానిచే స్వప్నంబును సూచితములు. అదరుమోవి కుపమానముగా 10. చంచలప్రవాళము చెప్పఁబడినది, రెంటంగలచలనమును పద్యములో గంటకొట్టినది. అందులకు బదులు 11. సువర్ణము వచ్చినది. ఇప్పటి కొకసువర్ణముచేతనే [సువిభ్రమ] పద్యము బరువెక్కినది. ఇది రెండవది చేరినది; సుశోభయఁట! సువర్ణములు అంకమున కిన్నియని గాని పుట కిన్ని యనిగాని ఒకక్లుప్తి యున్న మంచిది; పద్యపద్యమునకు ఇష్టమువ

చ్చినన్నియైనచో మోచుట కష్టముగాదా? **12.** ఇది క్రాసచంపకముగాన నిందా కప్రకటముండఁదగును. అట్లేగదా. క్రాసముత్తేభముగాన దానియందు ప్రకటంబు. అట్లు సమయోచితముగా మార్పుగూడఁ జేసికొనుచుండవలయును. కేవలము గ్రుడ్డితనముగా పోఁగూడదు. **13.** రాశి—ఆనందబాష్పసమూహము ముత్తెములరాశివలె నున్నదని వీరివర్ణన; ముత్తెములు రాశిగా నిలుచునుగాని బాష్పములు రాశిగా నిలుచునా! ఆహా సొంతరాశి యెంత చేటు దెచ్చినది! స్వతంత్రించి వేసిన యడుగల్ల నెంగిలియాకులోనే పడవలయునా! రాజి యన్న సరిపడును. రాలు బాష్పకణములు ముత్తెసరములవలె నున్నవని భావమగును.

అనేన పర్యాసయతాశ్రుబిన్దూన్ముక్తాఫలస్థూలతమాం స్తనేషు
ప్రత్యర్పితాః శత్రువిలాసినీనా మున్ముచ్య సూత్రేణ వినైవ హారాః. రఘు.

**14.** "ఇఁక" స్వారస్య మిఁకనె యెఱుఁగనగును. **15.** అహా, **16.** ఎంత యుక్—ప్రా. పా.

సీత.— [కనులుదెఱచి] అయ్యో! ఎట్లుమనును? గోదావరి జక్కరయె
[3] క్కడ? ఎక్కడనల్లగలువవలెఁ జామనిచాయవాఁడు రాముఁడు? లం
1841 కాపురియెక్కడ? ఎక్కడ రాముఁడే మనుగడగాఁగల సీత? [అనిమూర్ఛి ల్లినది.]

మూ.—సీతా.— [ఉన్మీల్యలోచనే] హద్ధిహద్ధి। అణ్ణారిసో మే జీఅలోఓ
గోలాణఈ కహిం సా ణీలుప్పలసామలో కహిం రామో
లఙ్కాణఅరీ అ కహిం కహింఅ రామెక్క జీవిదా సీతా.

ఛాయ.— హాధిక్ హాధిక్? అన్యాదృశో మే జీవలోకః
గోదానదీ కుత్ర సా। నీలోత్పలశ్యామలః కుత్ర రామః
లఙ్కానగరీ చ కుత్ర। కుత్ర చ రామైకజీవితా సీతా.

1. ఎట్లుమనును—తెలుఁగుముద్రణములో మూ.—కహం అణ్ణారిసో జీఅలోఓ. ఈప్రాకృతవాక్యమునకు తెలుఁగుముద్రణములో ఛాయ లేకపోయినది. అందువలన పంతులవారు దీని కర్థము తెలియక, తర్వాతివాక్యమునుబట్టి 'ఎట్లుమనును' అని యొకతడుకు అడ్డము వెట్టినారు. ప్రాకృతవాక్యార్థము—ఏమి! ప్రాణిలోకము వేఱువిధముగానున్నది! అనఁగా, అందాక తనకు స్వప్నములో గోదావరి, రాముఁడు పుండరీకాతపత్రము వీచీచామరముగా ప్రపంచము అగపడుచుండెను. ఇప్పుడు అదేమియు లేక లంకాదిక మగపడుచున్నది, అని భావము. **2.** పంతులవారివాక్యము "గోదావరిజక్కర...సీత"—మూలములో ఆర్యావృత్తముగా నున్నది. తెలుఁగు

ముద్రణములో ఛాయకుముందు, 3. ప॥ అని ముద్రితము గానందున వీరది పద్యమని యెఱుంగలేక గద్యముగాఁగొని గద్యీకరించినారు. ఆపాటి యీపాటి తెలివిగలవారికి ఛాయను చదువునప్పుడే ఇది పద్యచ్ఛాయయని పొడకట్టును. తెనిఁగించుటకై స్తనశల్యపరీక్షగా చదివినవారికి తెలియమి వింతగానే యున్నది. తెలియనిదానికి మసి పూసి నేరేడుఁబండుచేసిపెట్టుట చమత్కారమే.

౭౬.-వ పుట.

[4] క॥ తనకూఁతురైన సీతం । జనవు మెయిన్ నేఁడు దేర్ప సమకట్టుదదో
1845 ఘనకఠినప్రకృతికయో । తనదుబిడ్డయందు నేని దయయెటులొందవున్.

మూ.—నిజా మపి సుతాం సీతాం నేయ ముద్బోధయిష్యతి
నిజేప్యపత్యే కరుణా కఠినప్రకృతేః కుతః.

1. తనకూఁతురైన సీతన్—నిజా మపి సుతామ్—ఏనన్ అని విభాగము సాధ్యమయినను, స్ఫురించుట సులువుగాదు. అపి శబ్దార్థమును స్ఫుటముగా చెప్పవలసినది. "తనసుతయైనసుసీతన్" అని వ్రాసిన మేలు. 2. చనవుమెయిన్—చనవు లేక సమకట్టునా? చనవులేక నేఁడేర్చుటకైనచో సమకట్టునా? ప్రాసపూరణము. [ఇది—భూదేవి.] 3. ఘన—దివ్యమయినప్రాసపూరణము.

4. తుదిని పాదభంగము. ఇటు కందలక్షణము రూపఱినది. సరలు పాదాదినున్నవి. ఇదియే సులక్షణమని పంతులవారికనేల వాదింపరు? తిమ్మకవిని అప్పకవిని తిమ్మప్పలని మఱల తిట్టరా? అయినను దిద్దిపెట్టెదను. "తనదుశిశువునందు నేని"—పంతులవారు తనదు అనురుచ్యరూపమునకై ఛందస్సును గోలుపోయినారు. "అపి మాషం మషం కుర్యా చ్ఛన్దోభఙ్గం న కారయేత్." అని పెద్దలు చెప్పుదురుగదా.

మ॥ చెలికాఁడైన యశోకమానిజసఖిన్ శీఘ్రంబుగాఁ దేర్పమి
[6] ల్లలనం బల్లవహస్తశీకరముల ల్లంజల్లుచుం జల్లఁగన్
1851 వెలయంగం డన కంటినీటినిదిము న్నిపాదునం బోసిని
న్నలరించెంగద ప్రత్యహంబునుదయా యత్తైకచిత్తంబునన్

మూ.—స్నిగ్ధాశోకద్రుమ నిజసఖీం తూర్ణ ముద్బోధ యైనాం
సిక్త్వా సిక్త్వా కిసలయకరస్రంసినా శీకరేణ
ఏతస్యాః కిం నయనకమలస్యన్దిభి స్సాన్ద్రసాన్ద్రై
ర్బాష్పోత్పీడై రనుదిన మపి త్వం న సిక్తాలవాలః.

1. చెలికాఁడైనయశోకమా—ఇట్లు తెనుఁగువాఁ డెవ్వఁడును సంబోధింపఁడు. 2. చెలికాఁడా, అశోకమా, అనుట తెనుఁగు. మఱియు, 3. కాఁడు ప్రత్యయానుసారముగా అశోకుఁడా అని మహత్త్వము చెప్పుట శ్రేయము. 4. ఇది—నాగరముగా లేదు. 5. దయాయత్తైకచిత్తంబునఁ—ఇది యొకవికారము మఱల వచ్చినది. సీత నిత్యమేడ్చుట రామవియోగముచే నని వాల్మీకి జయదేవులు తలంచిరి. అట్లుగాదఁట, అశోకముమీఁది దయచేతనఁట! ఆటలాట! ఈ రహస్యము వీరి కెట్లు తెలిసినది? కలికాలసాంఖ్యముచే నయిన ప్రత్యగ్దృష్టివలనం దెలిసినదా? 6. ఆహా యతి భిక్షా ప్రభావము!

వినఁదగనిదియగు దీనిచే మాఱుపలు కెట్లుగలుగును.—ఇది వినఁదగనిదే,
1852 సంస్కృతభాష వీరికి తెలియనందులకు మంచి లఘూదాహరణము. దీని
మూలము—కథ మనాకర్ణితకేన ప్రత్యాఖ్యాత మనేన—ఏమి వినిపించుకోకయే నిరాకరించినది యిది!

త్రిజట.—చెలీ! అకాలమనోహరమయిన యీ నీముఖరేఖచే నూహించు
[4] చున్నాను. ఎందువలననఁగా, మనోజ్ఞమైన దానిని దేనినో చూచిన
1856 దానవని. చెలీ! ఇదియిట్లే నేనిప్పుడు కలలో గోదావరియొక్క కేలం జై
కొనఁబడిన యలతుంపురుసీపురుచేతను, వెల్లదామరయెల్లిచేతను, గొలువంబడు నా మగనిఁ గనుఁగొంటిని.

ఈవాక్యము చదువఁగానే మూలము చూడనక్కఱలేకయే, 1. 'ఎందువలననఁగా' తప్పనియు, 'చెలీ! యిట్లే' మొదలుగాఁగల వాక్యమెల్ల సీతాభాషిత మనియు మూనలకుంగూడ విశదమగును. వీరికి తెలియమి వింతగానున్నది. ఎందువలననఁగా—మూ. యత్కిల—ఏమనఁగా. శబ్దమునకు రెండర్థములున్నను సమయోచితముగా నర్థమూహింపవలయు. భోజనకాలమందు సైంధవమం దెమ్మన్న గుఱ్ఱముందెచ్చి విస్తరి కడఁ బెట్టవచ్చునా? పంతులవారిమూలములో ప్రాకృతవాక్యమునకు ముందు, 2. 'సీ' యని యున్నను ఛాయకు ముందు 'సీ' లేదు. ఇఁక నాక్షేపనేమి ఆసీతావాక్యమును త్రిజటకుం గూర్చుటకు? తప్పుఁజూపినవారిపై "నిర్మలావయములు" అని పద్యములు పాడలేమా. అట్టివి అల్లలేమా? మఱియు నిట విశేషాంతరము—పంతులవారి మూలములో గోదావర్యాః అని ముద్రకుఁడు ఎన్నిచోట్లనో మూనిన విసర్గను ఇట వేయించినాఁడు. మఱి పంతులవారికి ఉపపత్త్యనుపపత్తి విచారమేల? 3. తటాలున గోదావరియొక్క యని తెనుఁగున ముట్టించినారు. 4 కొలువఁబడుటకు కర్త యెవరని విచారించినారుగారు. గోదావరిచే అనవలయును, విసర్గను విసర్జింపవలయును. కోపపడఁగూడదు, నిర్మలావయవపద్యములు పాడఁగూడదు.

సీత.—ఏది తలఁపఁబడనిదో, అదియు నీజగమునఁ గలదుగదా? రాముమోము
[2] చందురుం జూడని దగుచును జనకునికూఁతురు మనుచున్నది. అందువల్ల
1858 సోయీనా యనుఁజయిన నాపెనిమిటిచే నుప్పరికింపఁ బడినదానను.

1. ఇటు ఒకవింత యేమనఁగా, “ఏది...చున్నది”—ఈ వాక్యము మూలములో ప్రాకృతమందు ఆర్యావృత్తముగా నున్నది. పంతులవారి తెనుఁగుముద్రణములో పాదములు విడఁదీసి ముద్రింపలేదు. ఇఁక కవితాతత్త్వవిత్తుగారికి ఆర్య యని తెలియుట యెట్లు? ఆ ప్రాకృతవాక్యమును అర్థానుగుణముగా ప్రాకృతముగానే నోట చదివినను ఆర్యయని నడలోనే తెలియును. ఇంతటి పండితులకు ప్రాకృతము అర్థానుగుణముగా చదువఁ దెలిసియుండునా? మఱి యింక గతియేమి? వచనముగా దంచుటయే? 2. “అందు...దానను”—అను ముక్కకు మూలము—తస్మాత్కిమమునా జీవితేన ఉపేక్షితాస్మి ఆర్యపుత్రేణ—కావున, ఏల యీజీవితము? ఆర్యపుత్రునిచే నుపేక్షింపఁబడితిని. ఇది పంతులవారిమూలము, తదర్థమును. నాగరముద్రణములో తత్ కి మనేన స్వప్నేన జీవితేన వా ఉపేక్షితాస్మి ఆర్యపుత్రేణ. అర్థము - కావున, ఈస్వప్నముచేనేమి ఈజీవితముచేతనేమి? [రెండును నిష్ప్రయోజనములు అని తాత్పర్యము]. ఇందు స్వప్నముం జేర్చుట కడు సరసముగా నున్నది.

౨౨ - వ పుట.

[14] క॥ మొరసెడునందియయేనిన్ । దొరకెఱిఁగింపదు ననుమఱితొలఁగన్దానే
1872 పొరసెనెమూఁగతనంబది । యొరులననఁగనేలదయ్యమొత్తిడియిడఁగాన్.

ఇదియు సీతావాక్యమే ప్రాకృతమూలకమే, అయినను దీనిఛాయకుముందు ప॥ [పద్యము] అని గుర్తుండుటంబట్టి దీనిని పంతులవారు పద్యీకరించినారు. ప॥ లేనిచో గద్యీకరించి యుండరా? మూ.—ఛా.—

వాచాలేనాపి కథితా నాహం నాథస్య నూపురవరేణ
అథవా విధివిధురవశాత్తేనాపి మూకత్వం ప్రాప్తమ్.

1. ‘మఱి తొలఁగన్’, 2. ‘ఒరుల ననఁగ నేల’—య. ప్రా. యతిపూరణము నిరర్థకము, 3. ప్రాసపూరణము మూలమందు నూపురమూకతకును విధివైధుర్యమునకునుం జెప్పఁబడిన కార్యకారణ భావమును పోఁగొట్టినది. 4. మఱియు ఇటు నుపన్యస్తమైన మూగతనము అసమర్థితము. 5. దైవ మొత్తిడి సీతకిడినదా, నూపురమున కిడినదా? 6. దైవ మొత్తిడి యిడిన నొరుల ననరా దనఁగా, అత్యాప్తమిత్రమైనదైవమే యిట్లు నేయఁగా ఇతరులు నేయరా, అనియర్థమా? దైవమొత్తిడియిడినప్పుడు ఇతరులుచేయునపకృతియు దైవప్రేరితమేగాన మూలకారణమైన దైవమునే

యనవలసినదిగాని తద్వశంవదుల నన్యులనని ప్రయోజనములేదని భావమా? మం చిది 7. యీపక్షమున నూపురము బుద్ధిపూర్వకముగానే సీత కపకారముచేసినట్లు అర్థము సిద్ధించుచున్నది. ఇది 'అనఁగనేల' అనుపదముల స్వారస్యము. 8. మూల ములో సీత నూపురముమీఁద ఈతప్పు మోపలేదు. అది సీతాదశను రామునికి చెప్పఁ గోరినదియ యైనను దానినోటిని సీతాద్వేషి దైవము నొక్కివేసినది అని సీత తలంచి నది. సీత కరుణాభరణగాని కవియా? కాన నీప్రాసపూరణము మూలకుతారమే. 9. వాచాలమన బహుభాషి, మొరయుట యనఁగా భాషణ మగునా? 10. ఎఱిఁగిం పదఁటు—చెప్పినదికాదని మూ. 11. కథనము మాని ఎంతమొరసినను రాముఁడు తెలిసికోనిచో నిది యేమిచేయఁగలదు? మొరయుటచే నెఱింగించుట యెట్లు? బహుభా షణశీలమయ్యును ఈమాట చెప్పకపోయినదని నింద. చెప్పమి విరోధము. 12. వా గ్వ్యాపారమును తెలుపుధాతువునే యిటఁ బ్రయోగింపవలసినది, మూగతన్నమనుట వాగ్వ్యాపారశక్త్యభావము నేగదా? 13. నూపురవరమని మూలములో నుత్కృ ష్టచెప్పఁబడినది. చెప్పమి నూపురదోషముగాదు దైవదోషమనుటచే, ఆపరత్వము, సమర్థితము, అరుంధతీదత్తము ప్రభావవంతమనియు నభిప్రాయము, కాన 14. వా గ్వ్యాహారంబునం జెప్పినను చెప్పఁగలయది యని యాశంక. పద్యములో వరము నేల త్యజించిరి! ప్రయోజనము తెలిసినను తెలియకపోయినను మూలములో నున్న ది యిటనువేసిన గ్రహించువారు గ్రహింపరా? పనికిరానిమాట యని నిశ్చయించుకొ ని వీరు "పీఁకి" వేసినారు.

[3] క॥ ఎవఁడో వీఁడొ కకీశ। ప్రవరుండధమహాబలుండు ప్రాకారంబున్
1875 నవలీల దాఁటి లంకం। బ్రవేశముంజేసె మ్రోఁతఁబడని పిడుగనన్.

1. ఇట ప్రాకారంబున్ + నవలీల అనియే పదములో, ప్రాకారంబున్ + అవ లీల అనుపదములను పంతులవారి వ్యాకరణముంబట్టి సంధిచేసి ప్రాకారంబున్నవలీ లగావించి తర్వాత అచ్చులో ఒకనకార మట ఒకనకార మిటను ముద్రించుటయో? 2. మ్రోఁతఁబడని పిడుగు—వీరిసొంతము. 3. మ్రోఁతలేనిపిడుగన్న నర్థముండు ను. 'మ్రోఁతలేక పడుపిడుగు' అన్నను అర్థము కలదు. పడక మ్రోఁతమాత్రము గలిగి నపిడుగు, పడనుంబడక మ్రోఁతయు లేనిదైన పిడుగు, అని పంతులవారి సొంతకపన మున కర్థములు, రెండును రెండే, వాని కిట నర్థసంగతి యెట్లో?

ఓరోరి లంకానివాసులారా! చాలుం బ్రాసముచేతను, రాక్షసరాజకుమారుఁ
[5] డక్షుఁడు వీఁడతిడుపిడుఁడగుచుండానే తదభిముఖముగ ముఖరథనుద్ధరుండ
1880 గుచునరుగుచున్నాఁడు.—

1. ఈవాక్యంబును అక్కందంబును రెండును మూలములో నేపథ్యభాషితములు, సంస్కృతము. ఈగద్యలోనిది "ఓరో...చేతసు" మూలములోను గద్యమే, కాని 2. "చాలుంద్రా...చున్నాఁడు"—ఈభాగమెల్ల మూలములో పద్యార్థముగా నున్నది. దీనికి పూర్వార్థము పైకందంపుమూలము. ఈరెండుం గలసి ఒకవసంతతిలకగా నున్నవి. అందులో ఆపూర్వార్థమునకు ముందు తెలుఁగుముద్రణములో ప॥ అని పద్యచిహ్నమున్నది, కాన దానిం బద్యీకరించినారు. ఉత్తరార్థము మొదల ప॥ అని గుర్తులేదు. 3. అటుపై పర్యవసానము చెప్పవలయునా? దానిం బంతులవారు గద్యీకరించినారు. చదువునపుడేనియు పద్యమని తెలియదా? ప్రాకృతము తెలియలేదు సరి, సంస్కృతముకూడ పద్యమని తెలియకపోవలయునా? 4. భయముగొల్పినది, భయముతీర్చినదియు, నగునీరెండువాక్యములును బహుకారణములచే నన్యోన్యతుల్యములు. రచనయందును ఒకటివలె నొకటి పద్యముగానుండుటయే సొంపౌ, 5. అందులోను ఒకటి పూర్వార్థముగాను రెండవది యుత్తరార్థముగాను ఉండుటయే సొంపౌ, రెండవది యిట్లు వాజ యగుటయే సొంపౌ యూహింపుఁడు.

శా॥ ప్రద్యుమ్నజ్వరవేదనాపరితద్బాష్పప్రస్నుతిశ్లాఘ్యమా
[10] 1890 ణద్యుస్త్రీకుచకుమ్భకుంకుమరజోన్యస్తాపరాధోజ్జ్వలం
బుద్యద్దిగ్గజదంతిదంతశిఖరప్రోల్లేఖవిఖ్యాపిత
ప్రద్యోతోరుజగజ్జయంబిదియెనావక్షంబునిస్గారెడున్.

1. మదనజ్వరమెవరికి? స్వర్గస్త్రీలకా? 2. బాష్పము లెవరివి? స్వర్గస్త్రీలవా? పూర్వార్థమునకీ యర్థము సహజముగా వచ్చుచున్నది.—స్వర్గాంగనలు [భర్తృవియోగమొంది] మదనవేదనచే నేడువగా వారియశ్రువులచే వారికుచముల కుంకుమ కరఁగి పోయెననియు. వారియాకష్టమునకు కారణము, అనఁగా, వారిమీఁద ఆయపరాధము చేసినది, రావణునియురమనియు.—ఇది రావణునికరవాలమునకుఁ బొసంగునేగాని యురమునకుఁ బొసంగదు, కాన నీయర్థ మసంగతము. 3. పద్యభంగిలో శ్లాఘ్యమాణ మేది? రజస్సు గావలయు. రజస్సు వారికుచములదే గాన, బాష్పములు వారివే గావలయును, కాన కందర్పజ్వరము వారిదే గావలయును. ఇది యసంగతమైనది. శ్లాఘ్యమాణము రావణునియురమం దంటుకొన్న స్వర్యోషాకుచకుంకుమరజ మందము. 4. అది యేని తా నున్నప్పుడు పెట్టనియపరాధము శ్లాఘ్యమాణమై పెట్టునా? 5. అట్లేని శ్లాఘ్యమాణము అపరాధ మందము. ఎక్కడిదా యపరాధము? రజస్సుచేఁ గలిగినది. ఆరజము ధరించుట అనఁగా సురాంగనలను హరించుట యపరాధమని రావణుఁడొప్పుకొనునా? 6. ఆరజము ధరించుట అనఁగా

వారిం గామించుట, సీతవిషయమున నపరాధమే, సీతవిషయమై తదేకపరాయణుఁడు గానుండవలసినదిగదా యని టీకచేయుదము. ఆపక్షమున మందోదరింగామించుట సీతవిషయమున నపరాధముగాదా? మందోదరీకుచ కుంకుమమునుం గూడ నిందు మొత్తముచేయవలదా? కాన అపరాధంబును క్షాళ్యమాణము గాదు. కాన పూర్వార్ధమన్నిభంగులను అసంగతార్థమే, మాటలప్రోవు. ఇంతయసంగతిచేత నేనియు అచ్చుతప్పులను శంకింపక తాత్పర్యము గనలేక మిక్కిలిమిక్కిలిగా తప్పులతడుకను తెనిఁగించుకొన్నారు. 7. మదనజ్వరము సీతకై రావణునికిఁ గలిగినది, క్షాళ్యమాణము ఇతని హృదయము.——

కన్దర్పజ్వరవేదనాపరిపతద్బాష్పస్రుతిక్షాళితం
స్వర్గస్త్రీకుచకుమ్భకుఙ్కుమరజః స్తేయాపరాధోజ్జ్వలమ్
ఏతత్త్వాం సురదన్తిదన్తశిఖరోల్లేఖాఙ్కవిఖ్యాపిత
ప్రస్ఫూర్జచ్చతురన్తవిశ్వవిజయం వక్షఃస్థలం యాచతే.

— ఇదిగో నావక్షఃస్థలము సీతకై నన్ను మదనుఁడువెట్టు బాములచే నాయేడ్పు కన్నీటివెల్లిచేఁ గడుగఁబడినది. బందీకృతసురసుందరీ కుచకుంభకుంకుమమును కొఁగిలింతలందు దొంగిలి ఆదొంగసొత్తును దాల్చి దానిచే ప్రకటమయిన యాదొంగతనపునేరముచే వెలుగొందుచున్నట్టిది, మఱియు దిగ్గజములకోరలకొనలు దున్నినగంట్లే నాసర్వజగజ్జయమునకు విఖ్యాపనశాసనలేఖముగా ధరించియున్నట్టిది. అట్టియీ నావక్షఃస్థలము నిన్ను [నీవు కావలయునని, నిన్ను ధరింపవలయునని] కోరుచున్నది.——అనియర్థము. ఇట సీతమీఁద రావణునికిఁ గలకామాతిశయము, సురాంగనాభోగి యని యతనిసౌభాగ్యాతిశయము, వారికన్నను సీతయందుఁ గలయాదరాతిశయము, అతనింగూడుటచే సీతకు రామాదులవలన నేమియు భయముండదని యతనివిక్రమాతిశయమును, అట్టివానియనునయమును గ్రహించుట మంచిదని సూచనయు రావణవాక్యాశయము. 8. క్షాళితమ్మని భిన్నపదముగా విడఁదీసికొనక తడుకను నమ్ముకొని కలిపి వంచినఫల మీరసాభాసమని యెఱుంగఁదగును.—— 9. ప్రద్యుమ్న——పంతులవారికి ప్రాసార్థము మంచివాఁడే దొరకినాఁడుగాని, రావణునికాలములో నితఁడు లేఁడు, మూఁడవతారములే యెడము. కృష్ణపుత్త్రుఁడుగదా యితఁడు. 10. గజదంతియఁట!——ఇప్పటికి శ్రుతి ముదిరి చక్కఁగా రాగానఁబడినది. హిమవద్గిరి పర్వతపుమెట్టకొండ మలదిబ్బకవనముగా పరిణమించినది. ఆహాహా! చెవుము కిశాస్త్రిజోస్యము! అక్షరము తప్పదాయెఁగదా! పంతులవారికి పేరిగానిపై కినుక న్యాయ్యముగాదు. గజదంతికవికి అట్టినరమానవకవియైన పేరిగాఁడు అచ్చరకోట్లు గావు అచ్చరనిబ్బడా లిచ్చివేయఁడా! ఇం కొకఁడు ఈరసమును మెచ్చఁగలఁడా!

౭౮ - వ పుట.

చ॥ నఱుకుకొనంగమున్న మఱినాతలలుద్భవమొంది మ్రొక్కఁన
[9] 1899 కఁఱిమెడవానికేనినతికైదశమంబెదివంగదద్దినా
నెఱితలయిద్ది మ్రొక్కుచునునీకమలాంఘ్రులకోనిజానకీ
కొఱలఁగనిన్నుఁగోరుఁగడుఁగూర్మినిగొప్పతనంబుగాంచవే.

1. ఈదశమశిరము ఏల వంగలేదు? మెడవాయువా? 2. ఇది యుద్భవమొందినదా లేదా? 3. నఱుకుకొనినతలలు మఱల ఉద్భవమొందిన వెట్లు? 4. ఈదశమము నఱుకుకొన్నదా, నఱుకుకొననిదా? దశమమువంగలేదనఁగా తొమ్మిది వంగినవని యర్థమైనదేగాని ఇది నఱికినది కాదని, ఉద్భవమొందినది గాదని అర్థముగాదు. 5. కఱిమెడవానికేని వంగదన్న విశేష మేమి? హరికి వంగినదా? లేక, హరునికి ప్రసక్తిగల్గియు వంగలేదా?

మూ.—యత్సంతుష్టవతః పురా పురభిద శ్ఛేదోత్సవచ్ఛేదినో
న క్రోధా దనమ న్నవోద్గతశిరః శ్రేణౌ నమస్యామపి
ఏత త్తద్దశమం శిరో మమ నమ త్త్వత్పాదపాథోజయో
రవ్యాజం మిథిలేన్ద్రపుత్త్రి భవతీం ప్రేమాతురం యాచతే.

పూర్వము నేను నాతలలు ఖండించి శివపాదములను వానితో పూజించినప్పుడు, తొమ్మిది తలలు ఖండితములై యీపదియవతలమాత్రము శేషిల్లి యుండఁగా, శివుఁడు నాభక్తికి మెచ్చి నాకు మఱల అతొమ్మిదితలలు ఉద్భవిల్లునట్లు చేయఁగా, ఆక్రొత్తతలలవరుస శివునికి ప్రణమిల్లుచున్నప్పటికిని, ఈనాదశమశిరము తనచ్ఛేదనోత్సవమునకు భంగముకలిగించినాఁ డన్నకోపముచేత ఆయనకు నమస్కారము చేయదాయెను. అట్టి యీనాదశమశిరము ఇపుడు ఓమిథిలేంద్రపుత్త్రి నీపాద రాజీవములకు నిష్కపటముగాఁ బ్రణమిల్లి, ఆతురమై నిన్ను ప్రేమను యాచించుచున్నది. ఈయర్థపుష్టి పద్యచ్ఛత్త్రసంఘన్నులమీఁది కేమయిన చినుకునో కనుఁడు.

6. నతికై వంగదు—నతి=వంగుట. నతి సేయదు, లేక, వంగదు, అనుట సరి. 7. కమలాంఘ్రులు—తప్పుసమాసము. బింబాధరాది కతిపయ సమాసవిశేషములకు వామనాదులు గతి చెప్పినమాత్రాన విశృంఖలముగా తాదృశసమాసఘటన విద్వత్సమ్మతము గానేరదు. 8. కొఱలఁగ—ప్రా. 9. గొప్పతనంబు గాంచవే—ఈమాట చెంచితపాటసరణిం బురణించుచున్నది. "నన్ను బెండ్లాడవే చెంచీత నీకు బహుపున్నె ముంటదే చెంచీత"—ఈపిప్పి అమూలకము.

సీత.—తే॥ అపుడునిను(గాంచులంకేశునవనితనయ
[5] 1904 రావ.— వేఱొదోకాలమేటికి వే(డెదీవు
దాని(దెల్పుమువీ(డెదియేని(జేయు
[ఇటు రావణవాక్యశేషము వసంతతిలకముగానున్నది.]
సీత.— చెల(గునేనిఖద్యోతరుచినిజలజిని.

ఇటు మూలములో సీతాభాషితములు రెండును అర్థమర్థముగా నొకయనుష్టుప్పుగాను రావణుని గీతపాదములు రెండును చిన్న గద్యవాక్యముగాను, వాని కడమవాక్యము వసంతతిలకగాను ఉన్నది. 1. వీరు రావణగద్యమునకు గీతము పెట్టనేల, పెట్టిరిపో, 2. ఒకపాదము శేషించియుండ(గా ఆఛందస్సును అతనిచే మాన్పింపనేల? సీతవాక్యము గీతములోనే ముగియవలయునని నియమమేని, 3. ఇత(డు పద్యము ముగించి పద్యమారంభింపవలయునను నియమ మక్కఱలేదా? ఇత(డు గీతము ముగించి వసంతతిలకపాదములు మూ(డు చెప్పిన, సీత తదీయచతుర్థపాదమున నుత్తరమీయరాదా? ఇరువురికిని ఏకవృత్తము కూడదేని వీనికి 4. ఆమెగీత మేల పెట్టవలయును? సీతకు చిన్నవృత్తమే పెట్టి అర్థమర్థముగానే ముగింపరాదా, 5. రావణగద్యపద్యములు గద్యపద్యములుగానే యుంపరాదా. మూలాతిక్రమణము చేత నిటు అందము చెడినది.

౭౯ - వ ఫుట.

రావ.—ఈచంద్రహాసాసి...కాలవ్యాళము. కావున.....రావణభుజాశ్లేషభేషజమును గ్రహింపుము.

సీత.—శా॥ఓరీరాక్షసమానుమానుముఆకీయోజంగడుంబ్రేలెదే
[8] 1912 మారానాదగుకంఠసీమనెవ(డేనంటండొరుండెప్పుడుర్
శ్రీరామోరుభుజాసితోత్పలవనశ్రీధామదామంబునన్
గ్రూరాత్మ్యండగునీకృపాణముననేన్ గోల్కొందుమంచేటికిన్.

రావ.—అయముదీర్ణః కరవాలకాలభుజఙ్గస్తదిదానీమేవ రావణభుజాశ్లేషభేషజమనుజానీహి.

సీత.—విరమ విరమ రక్షః కిం ముధా జల్పితేన
స్పృశతి న హి మదీయాం కణ్ఠసీమానమన్యః
రఘుపతిభుజదణ్డాదుత్పలశ్యామకాన్తే
ర్దశముఖ భవదీయాన్నిష్కృపాద్వా కృపాణాత్.

చాలింపు చాలింపుము సోఁకా, అనృతములు ప్రేలి యేమి ప్రయోజనము? ఉత్పలశ్యామకాంతియైన రామభుజదండమేని, నిష్కరుణమైన నీఖడ్గమేనియుఁ దక్క వేఱొండు నాకంఠసీమను దాఁకనేరదు.—అనియర్థము. అనఁగా నాకంఠమునకు నీకృపాణము తగులఁగలదుగాని నీభుజము తగులనేర దనిభావము. పంతులవారి సాహిత్యహీనతకు మంచియుదాహరణము. రావణుఁడు చంద్రహాసము పామనియు, ఆపామును చేరనీయనిమందు తనభుజాశ్లేషమనియు సీతకుఁ జెప్పినాఁడు. ఆమె తనకు వేఱువ్యాధియున్నట్లును అది రామభుజ రావణకృపాణముల నొకటిచే శమిల్లునట్లును, మాత్రలు కషాయములు ఏమియు అక్కఱలేనట్లును చెప్పినది. 1. ఇది చెవిటిదాని యుత్తరముగా నున్నది.— 2. ఓరీరాక్షస—మూలములో రక్షః అని నపుంసకలింగశబ్దముచే సంబోధించినది. ఆసంబుద్ధి శ్రీరామునిముందఱ నీవు నిస్సారుఁడవని తిరస్కారమును సూచించుచున్నది. 3. ఒరుండు.—మూలములో అన్యః, అన్యశబ్దయోగముచే భుజదండకృపాణములకు పంచమి వచ్చినది. భుజదండ కృపాణాన్యతరము దక్క నేఱొండు తాఁక దని యర్థము. ఆపంచమియేలవచ్చినదో పంతులవారు గ్రహింపలేదు. 4. ఒరుండు అను మహద్రూపము సరిగాదు. 5. అన్యః అను పుల్లింగము పురుషపరముగాదు. దండకృపాణముల పుల్లింగమునుబట్టి యిటను వచ్చినది. రావణబాహునిరాసపరము. వేఱొకటి [అనఁగా నీబాహువు] అని ప్రకృత తాత్పర్యము. 6. క్రూరాత్ముండగు నీకృపాణమున—మూ.—భవదీయాత్ నిష్కృపాత్ కృపాణాత్—దీనివలన రావణుఁడు క్రూరాత్ముఁడని శబ్దార్థము లభింపదు. 7. భవతో నిష్కృపస్య కృపాణాత్—అనియున్న నెట్లో అట్లు వీరు తెనిఁగించిరి. భవదీయ యన్న భవతః అనునర్థము వచ్చుట కలదుగాన ఆభ్రమచేత నిట్లయినది. జయదేవుఁడు ఖడ్గమునకు చెప్పిన క్రూరతను ఈయన రావణునికిఁ జెప్పి కవనమును వనము నేయనేల? ఈరెంట నేది కవనమో భవభూతి చెప్పుచున్నాఁడు వినుఁడు:—

రే హస్త దక్షిణ మృతస్య శిశో ర్ద్విజస్య
జీవాతవే విసృజ శూద్రమునౌ కృపాణమ్
రామస్య బాహు రసి నిర్భరగర్భఖిన్న
సీతావివాసనపటోః కరుణా కుత స్తే.

నిష్కరుణతను బాహువునకుం జెప్పెనుగాని రామునికిఁ జెప్పలేదు. కవితారస మెచటఁగలదో!

ఓరక్షోధమ మానుమాను ముఱి కీయోజం గడుం బ్రేలెదే
యూరా! నాదగుకంఠ మొందెడియుఁ దానంటంగ రాఁజాలునే!

శ్రీరామోరుభుజంబు నీలజలజశ్రీధామకం బౌక్రాఁదుఁగాఁ
గ్రూరాత్మంబగు నీకృపాణలత యొక్కండిద్దియుం దక్కఁగాఁ.

8. మూలములో ఉత్పలశ్యామకాన్తేః అను విశేషణము కృపాణమునకుంగూడఁ జెల్లును. పంతులవారు దానిం గనలేదు.

"కరవాలకాలభుజఙ్గః."
"పార్శ్వభూమినభీరుభటకదంబకరాళహేతిచ్ఛటాచ్ఛాయలిరులుకొనఁగ."
"కీర్తింప్రసూతేధవళాంశ్యామాతవకృపాణికా."—చంద్రా.
"బాహుసౌధక్రీడఁబరఁగుపంటవలంతితో య్యలినిడుదకస్తూరిబొట్టు...
నరసవిభుకృష్ణరాయభూనాథచంద్రుచేతననిలోనమించుకౌక్షేయకంబు."
"నిస్త్రింశోయంసజలజలదవ్యోమసంకాశనీలః."—ముద్రా.

[పాండిత్యపరమావధి.]

[4] తే॥ చంద్రహాసమ శ్రీరామచంద్రవిరహ । హరిభవాస్మత్తనూతాపహర్వుమీవు
1916 కాంతిజితశుక్తిభవచూర్ణకమవుదాల్తు । ధారచేతనుశీతలవారిసార.

మూ.—చన్ద్రహాస హర మే తనుతాపం । రామచన్ద్రవిరహానలజాతమ్
త్వం హి కాన్తిజితమౌక్తికచూర్ణం । ధారయా వహసి శీతల ముచ్చైః.

1. పంతులవారు కాంతిజితమౌక్తికచూర్ణమును చంద్రహాసమునకు విశేషణముగా గ్రహించినారు. చంద్రహాసము పుల్లింగమనియు నపుంసకలింగముగాదనియు నెఱుంగరైరి. 2. కాంతిజితాది అంభస్సునకు విశేషణము. తాపహర్త జలముగ్రహించినప్పుడు ఆజలమునకు స్వచ్ఛతా శీతలతాది మనోహరగుణంబులు ఉన్నచో ఫలము గలదుగాని, ఆజలమునకు ప్రభవమైనకొండయొక్క గుండ్లు ఎంత యెత్తైన నేమి? తెలుఁగుముద్రణములో "చూర్ణః" అనియున్నదేమో అని శంకింపవలదు. అందులో "చూర్ణం" అనియేయున్నది. ఇంకొకచో నీచంద్రహాసమునకు 3. మౌక్తికవ్యక్తహాసః అనివిశేషణమున్నది. ఇదే మౌక్తికచూర్ణవర్ణమేని దీన ముత్తెములు ఎట్లు అగపడును! కాన నిట నీయుపమను దీనికి చేర్చుట సరిగాదు. "ఉత్పలశ్యామకాన్తేర్దశముఖభవదీయాన్నిష్కృష్య పాదావ్కృపాణాత్" అని ఇది ఇందీవరకాంతియని ఏతత్పూర్వశ్లోకమం దున్నది. అదియు నిట విరోధించును. చంద్రహాసశబ్దలింగమునుగూర్చి దూరప్రయాణములు పంతులవారు చేయ నక్కఱలేదు. ఈగ్రంథమందే ఆశబ్దము నాలుగుమార్లు వచ్చియున్నది. నాలుగుమార్లును పుల్లింగముగానే యున్నది. ఆస్ఫూర్తి యేని యున్నచో నిచట వీరికి సందేహమేని కలుగదా! "తదయం చన్ద్రహాస ఏవ మే బలాదానేష్యతి." "పశ్య అయమసౌ మే।...చన్ద్రహాసః." "భిన్నస్వర్గేభకుమ్భస్థల

బహుళగళన్మౌక్తికవ్యక్తహాసః। కస్యాక్రీడతక్రా(గే) త్రిదశపతియశశ్చన్ద్రహాచన్ద్రహాసః." "ఆకర్ణితస్తవదశాననబాహుదణ్డశ్రీఖణ్డకాననఫణీవనచన్ద్రహాసః." సంస్కృతమునకును వీరికిని చాలదూరమనుటకు ఈలింగజ్ఞానాభావనిదర్శన మొక్కటి చాలదా ? 4. హరి—ఇటనిహతార్థతాదోషము. "నిహతార్థత్వముభయార్థస్య శబ్దస్యాప్రసిద్ధేర్థే ప్రయోగః। యథా। యమునాశమ్బర మమ్బరం వ్యతానీత్। శమ్బరశబ్దో దైత్యే ప్రసిద్ధ ఇహ తు జలే నిహతార్థః." అని సాహిత్యదర్పణము. ఇట్లు దిద్దుఁడు.

చంద్రహాసమ శ్రీరామచంద్రవిరహ। వహ్నిజాతము నాదు తాపంబు నార్పు
కాంతిజితశుక్తిభవచూర్ణకమగువారిఁ! దాల్తు వీవు సుశీతంబు ధారచేత.

[కవిహృదయము నెఱుఁగమి.]

శా॥ కఱచుంగట్టడి సైంహికేయుఁడు శశిం గ్రౌర్యంబునం గోరలన్
[8] నెఱమంటన్దవవహ్ని గాల్చెడును జన్నెగంధపుం జెట్టునున్
1924 మొఱకౌ వీఱిఁడి త్రెంచు నుత్పలసరంబున్ సౌరభోపేతమున్
బెఱుకుం బద్మినిమత్తహస్తిపరహానిం జేయు దుష్టుం డహా.

మూ.—చాన్ద్రీం లేఖాం దశతి దశనైర్దారుణైః సైంహికేయః
నవ్యాం వల్లీం దవదహనకశ్చాన్దనీం దన్దహీతి
అప్యున్మత్తః కవలయమయీ న్మాలికా మాలునీతే
మాలాం దున్మాలయతి నళినీం దుష్టహస్తీ కరేణ.

రాముఁడు వక్త. ఇందు కవి ప్రయత్నపూర్వకముగా రావణోపమానములను రాహుదావాగ్న్యున్మత్తదుష్టహస్తులను పుల్లింగశబ్దములచేతను సీతోపమానములను చంద్రలేఖా, చందనవల్లీ, కువలయమాలా పద్మినులను స్త్రీలింగశబ్దములచేతను వాడించినాఁడు. అతఁడు పడ్డదెల్ల వ్యర్థప్రయాసమేనా? కవిహృదయము కవితాసౌభాగ్యము నెఱుంగని మనకవితాతత్త్వవిత్తుగారు సీతోపమానములను పుల్లింగంబులను అమహత్తునుం జేసి [1. శశి, 2. సరంబు—పుల్లింగములు 3. గంధపుంజెట్టు—అమహత్తు] ఆసౌభాగ్యమును రూపుమాపినారు. 4. మఱియు, సీతను చంపుచున్నాఁడు రావణుఁడని పరితపించుట రామహృదయముగాని, దుష్టులు పరహానిచేయుదురని కలువాయివేదాంతములు పలుకుటగాదు. 5. కాన "పరహా...డహా" యనుసాంతకవనము ప్రకృతవిరుద్ధము. 6. ఉన్మత్తుఁడు దుష్టుఁడా? 7. చన్నె—ఈయేడ్పిటనేల? 8. గంధపుంజెట్టు.—సంస్కృతమయిన గంధశబ్దమునే వీరు చందనపరముగా ప్రయోగించుట కిది రెండవయుదాహరణము. [మూ. ౫౦ - పుట చూడుఁడు.]

చ॥ కువలయదామశోభనిదిగో పచరించుఁగృపాణమియ్యెలా
[5] భవగళమందునిందునఁ బ్రబ్బెడుఁజీఁకటినల్లఁజూడఁగాఁ
1929 దవదనుకైవడిన్ జలధిఁదానెమునింగియుగంబుసర్వమున్
సవచెడిదిర్దిరందిరుగుసంస్మృతిదప్పెడునిష్ఠునాకహా.

ఇటు రాముఁడు వక్త. దీనికై పంతులవారికి దొరకినమూలము:—

రుధిరకరుణస్ఫీతం స్ఫీతం తమః పరిజృంభతే
జలధిసలిలే మగ్నం సర్వం యుగం పరివర్తతే
కువలయదళస్రక్సంశ్లేషోస వై కప దేపదం
యదయమదయస్సదాకణ్ఠేకరోతికృపాణకః.

ఇందు 1. సంశ్లేషోస వై, అనుసంధిదోషంబును, 2. సదాయనుగణదోషము ను ఆర్షములని తలంచిరేమో? పంతులవారు దీనికి చేసినయర్థసమన్వయము:— కువలయదళస్రక్సంశ్లేషః = కువలయదామశోభన్, ఏకపదే = ఇదిగో, సోయంవాకృపాణకః = కృపాణము, సీతా [సదా] కణ్ఠే = ఇయ్యెలాభవగళమందు, పదంకరోతి = పచరించున్. యత్ = ఇందుననే, రుధిరకరుణస్ఫీతం తమః = చీఁకటినల్లన్, పరిజృంభతే = ప్రబ్బెడున్, స్ఫీతమ్ అదయః = చూడఁగాఁదగదు అనుకైవడిన్, జలధిసలిలే = జలధిన్, మగ్నమ్ = తానెమునింగి, సర్వంయుగమ్ = యుగంబుసర్వమున్, పరివర్తతే = సవచెడిదిర్దిరందిరుగు, ం = సంస్మృతిదప్పెడునాకునిష్ఠహా. ఈయసంబద్ధప్రలాపమును ఆర్షమనియెంచక విద్వాంసులచేత దిద్దించియున్న నెట్టులగుననఁగా! —[నాగరముద్రణము.]

విధి రకరుణః స్ఫీతం స్ఫీతం తమః పరిజృంభతే
జలధిసలిలే మగ్నం విశ్వం యుగం పరివర్తతే.
కువలయదళస్రక్సంశ్లేషాత్సవైకపదే పదం
య దయ మదయ స్సీతాకణ్ఠే కరోతి కృపాణకః.

దైవము దయలేనిది, అతివిస్తారము చీఁకటి వ్యాపించుచున్నది, లోకము సముద్రజలములో మునిఁగినది, యుగము మాఱుచున్నది, ఎందుచేత ననఁగా,—కలువరేకులదండను దాల్చుటయనుపండువునకు ముఖ్యాస్పదమైన సీతాకంఠమందు ఈకత్తి కనికరములేనిది అడుగిడుచున్నది గావున. రసమునకును పద్యమునకును ఏమేని సంబంధము కలదా?

3. పరివర్తనమనఁగా నిట దిర్దిరంధిరుగుటగాదు, యుగము కాలము తిరుగును గాని దిర్దిరనెట్లుదిరుగును. "యుగశతపరివర్తా నేవ మన్యేన్యకృత్యై ర్నయత

ముభయలోకానుగ్రహశ్లాఘనీయైః." దిర్దిరం దిరుగుట స్థూలపదార్థములకు చెప్పందగును, "ధరణీచక్రము దిర్దిరందిరిగెఁ బాతాళంబు ఘూర్ణిల్లె." 4. యుగము కాలరూపము సముద్రములో మునుంగు టెట్లు? సర్వ మసంగతమే.—ఇందు 5. లఘువు మీఁద వ్రాసముగాన తవదు వచ్చినది, సరియే, ఇదిగో ద్రుతప్రకృతికముగదా పచరించుతోడిసంహితలో ద్రుతకార్యము రాలేదేమి? ద్రుతప్రకృతికము కాదని వాదింతు రేమో, ఆచమత్కారము చూతము.

౮౦ - వ పుట.

సీత.—... చంద్రహాసమువాదరచేతఁ దొలంగింపఁబడితినో.—మూ. చన్ద్ర
1930 హాసధారయా వధీరితాస్మి = చంద్రహాసమువాదరచేత తిరస్కరింపఁబ
డితినో, అనఁగా చంద్రహాసము నన్నునఱుకక వదలివేసెనో;—సీత మృతిం గోరుచున్నదై చంద్రహాసము తన్ను నఱుకక వదలినందులకు చింతిల్లుట యిది. కాన తొలఁగింపఁబడితినో అనుట కేవలవిరుద్ధము, తొలగింపఁబడనయితినో అన్న వివక్షితార్థము వచ్చును, తొలఁగించుట భూలోకమునుండి యని యర్థసిద్ధ మగును.

[9] సీత:—దీనిచేనేమి? అందాక, ప్రోవయిన నిప్పులకుప్పనువలె నామేనిని
1939 చల్లఁగఁజేయుచున్నాను.

మూ.— కిమనేనతావ దుపనయ దహనపుఞ్జం యథా శీతలయామి ఇమాన్యఙ్గాని. దీనికిపంతులవారి యర్థము.—కిమనేన = దీనిచేతనేమి? 1. తావత్ = అందాక, 2. ఉపనయ = ప్రోవయిన, 3. దహనపుఞ్జం యథా = నిప్పులకుప్పనువలె, ఇమాన్యఙ్గాని = నామేనిని, శీతలయామి = చల్లఁజేయుచున్నాను. ఇందు, యథాశబ్దమును దహనపుంజముతో చేర్చినవింత యటుండఁగా ఉపనయశబ్దమునకు ప్రోవనర్థము నేయుట కడు నాశ్చర్యముగా నున్నది. 4. ఉపనయ = తెమ్ము, దగ్గఱ చేర్పుము. ఉపపూర్వకము నీధాతువు, లోణ్మధ్యమపురుషైకవచనాంతము. 5. యథాశీతలయామీ మాన్యఙ్గాని = ఈయవయవములను నేనుచల్లఁ జేసికొనుటకుఁగాను. యథాశబ్దమున కీయర్థమునం బ్రమాణము— "దర్శయ తం చౌరసింహం యథా వ్యాపాదయామి" పంచతంత్రము. మఱి యిం దింక నొకవిశేష మేమనఁగా, పంతులవా రాంధ్రీకరించినది తప్పుఛాయ. తన్మూలప్రాకృత మిట్లున్నది:— కిం ఇమిణా తా ఉవణేహి మే దహణపుంజఅం జహ సీదలేమి ఇమాఇ అంగాఇ. దీనికిసరియైనఛాయ:—కి మనేన. త దుపనయ మే దహనపుఞ్జకం యథా శీతలయామీమా న్యఙ్గాని. 6. ఇందు తావత్తునకు బదులు తత్తున్నది, 7. ఉపనయను సమాసమున జొరనీయక దానివెంబడి మే యొకటి యున్నది. తత్ = కావున, మే = నాకు.

ఇప్పుడు ఉపనయము సరియైన యర్థము తెలియకపోయినను, ప్రోవర్థముగా భ్రమసినవారు, ఓ ప్రోవా యని చెప్పుకోవలసినదేగాని, ప్రోవయిన యని చెప్పుకొనుట సాధ్యముగాదుగదా. మఱియు, 8. పంతులవారివాక్యమునకేని వారన్వయించిన ప్రకారము తన్మూలమయిన ఛాయకేని నిప్పునంబడెద నని యర్థము కాలేదుగదా? తచ్ఛ్రవణమాత్రాన త్రిజట 'పాపము, శమిల్లుత' అని [రెండుమార్లు] పలుకనేల? 9. 'అప్పుణ్యము నుదాహరించుచున్నా' నని యు నుడువ నేల? మూలానుగుణమైనను కాకపోయినను వ్రాసినవ్రాఁత ముందువెనుకలకు సమరసపడవలదా? సీత మఱల "నిప్పుదెమ్ము నాకోర్కిం దీర్చికొనియెద నని దీనికి మూఁడవవాక్యమున నడుగుచున్నది. దానిచేత అగ్నిప్రవేశమే యిటనుం జెప్పఁబడిన దనుట స్పష్టము. లోఁజెట్టి తెలియదు, ప్రాకృతము పెద్దనున్న; ఇట్టి యాంధ్రీకరణ సాహసికులగతి యింతకన్న నేమగును?

పనికిరాని పద్యము. యతిసు.

[3] క॥ హిమకరచియుతమరకత । సుమణిమయము సూక్ష్మపట్టసుందరముండుకా
1942 సమలయజరసమునందు । రమణునియెడయందణఁతువిరహతాపంబుకా.

త్రిజట సక్తి). 1. సుమణి—ఈసు ఏల దాపరించినది! మరకతమణిత్వణగ్రాహి యందురు. ఆతృణమే యీసు. ఇది యస్థానమున నెంత యసహ్యమో, అలవాటయిన పదములలోఁ జొప్పించిచూడుఁడు, తెలియును. భోజసురాజు, సుదాశిదాసునకు రాజ్యమిచ్చెను. జనకసుభూపతి సద్దశరథ సుమహారాజుతో వియ్యమందెను. ఇటు సద్వట సువృక్షము సుమేఘసుమండలముం దాఁకుచున్నది. ఇత్త్యాదు లెంతయసహ్యములో మరకతసుమణియు నంతయసహ్యము. 2. ముసూక్ష్మమైన పట్టుదుపటె సుందరముఁట! "సున్దరం రుచిరం చారు సుషమం సాధు శోభనం। కాన్తం మనోరమం రుచ్యం మనోజ్ఞం మఞ్జు మఞ్జులమ్," అమరము. ముసూక్ష్మము—సుందరము. ఈరచన, నీయశస్సు తెల్లనిగంగవలె తెల్లనిది, నీకీర్తి నల్లని యమునవలె నల్లనిది, అన్నట్లున్నది; స్వానందించుఁడు. 3. రమణునియెడయందు—రమణుఁడు అనఁగా మనోజ్ఞుఁడును. రావణుఁడు మనోజ్ఞుఁడు గాఁడా? ఏల నిప్పులోఁ బడెదవు రావణు సేవించి సుఖముండుము, అని త్రిజటాభిప్రాయమా? ఎంతపనికిమాలినపదము పడినది! మూ. రాము అనియున్నది. ఎట్లుపాడైనదో కనుఁడు.

హిమకరకిరణకరమ్బిత । మరకతమయపీనపట్టకప్రతిమే
అవిరళమలయజసరసే । రామోరసి తాప మపహరసి.

౮౧-వ పుట.

తే॥ అయ్యోయయ్యోయశోకమిదయ్యునయ్యెఁ
గాసశోకంబునాదుభాగ్యంబుకతన
[5] 1947 రామవిధివైధురియునఁటయేమియూహ
నేయఁగానీదుదైవంబుచెయిదికడిఁది.

మూ.— అయే కథ మశోకోఽపి మమాయం శోకతాం గతః
కిన్నోపపాదయే ద్వత్స రామస్య విధివైధురీ.

1. అయ్యోయయ్యో — మూలములో నింత యేడ్వలేదు. 2. అశోకమిదయ్యు— అశోకమయ్యు నిది, అనియేని, ఇది యశోకమయ్యు, ననియేని యున్నమేలు. 3. సశోకంబు—మూలములో శోకతా మనియున్నది. వీరు చేసినమార్పులో విరుద్ధార్థమయినది. సశోక మనఁగా దుఃఖపడుచున్నదర్థము గాని దుఃఖ మిడునది యర్థముగాదు.

రక్త స్త్వం నవపల్లవై రహమపి శ్లాఘ్యైః ప్రియాయా గుణై:
స్త్వా మాయాన్తి శిలీముఖాః స్మరధను ర్ముక్తా స్తథా మామపి
కాన్తాపాదతలాహతి స్తవ ముదే తద్వన్మమా ప్యావయోః
సర్వం తుల్య మశోక కేవల మహం ధాత్రా సశోకః కృతః.

4. ఊహ నేయఁగా నీదు—ఊహ నేయించినమాత్రాన విధియొక్క క్రౌర్యాతిశయ మేర్పడదు. విపరీతంబులఁబుట్టించిన నేర్పడును. కాన నోపపాదయేత్ అను పాఠమున కేని నసంభావయేత్ అను పాఠమున కేని, (దేనిని) ఉపపన్నము నేయదు, సంభవింపఁజేయదు, అనియే యర్థము చెప్పుటసరి;—ఊహను చెప్పుట సరిగాదు. 5. విధివైధురి...నీదు అనువాక్యమున వచ్చినయర్థమే మఱల దైవముచెయిది కడిఁది యని వచించుట పునరుక్తిదోషగ్రస్తంబగు చచ్చుడుపాద పూరణంబు.

[7] ఆ॥ చిన్ననాఁటనుండి శ్రీరామచంద్రుని । కేలిప్రేలుపట్టిగ్రాలెదీవు
1954 వేఱుసీతయనఁగవినుతవెట్లీలంకఁ । బొందినావురత్నముద్రికయహ.

మూ.— యాశైశవావధి మనోరమరామచన్ద్ర
హస్తాఙ్గుళిప్రణయినీ సుభగా సువృత్తా
అస్యైవ సా జనకరాజసుతా కథన్ను
లఙ్కా ముపాగతవతీ మణిముద్రికేయమ్.

సీత వక్తి) 1. కేలిప్రేలుపట్టి—శుష్కం కాష్ఠం తిష్ఠత్యగ్రే కవనము. మూ. హస్తాఙ్గుళిప్రణయినీ. పద్యములో 2. సుభగా 3. సువృత్తా యను ప్రధానవిశేషణ

ములు త్యక్తములు. సుభగా=లెస్సయైనసిరి గలది, భర్తృవాల్లభ్యము గలది. సువృత్తా=చక్కఁగాగుండ్రమైనది, మంచినడవడిగలది. 4. వినుతవు—ఈమాట లేకున్న మేలు ఇది యుండుటచే సామ్య మేధర్మమందో స్పష్టము గాదు. ఇదిలేకున్న 'వేఱునీతయనఁగ' అనువాక్యము ఉంగరమునకు నుపసర్జనమైన శ్రీరామచంద్రుని కేలిఁ బ్రేలి పట్టుట సామాన్యధర్మ మని వచించును. 5. లంకకువచ్చుటయు సామాన్య ధర్మము గానే యగపడుచున్నది. కాన వ్రాలెదీవు అని వేఱువాక్యము చేసి యీధర్మమును సామాన్యములో చేరనీయమికన్న 'వ్రాలునీవు' అని వ్రాలుటను విశేషణముచే సిన శ్రేయము, వచ్చుటయు సాధర్మ్యమునం జేరును. 6. పొందినావు—ఈరూపము లక్షణకారులచే ననుగృహీతముగాదు. మహాత్మైన పొందినాఁడవు, ఇతరమైన పొందినదానవు అని రూపములు. బాలవ్యాకరణము, క్రియా. ౧౧౭ - వ సూత్రముం బరికింపుఁడు. 7. అహ—ఇది కొసవిసరు. ఆఱవదానికి యాశ్చర్యము.

౮౭ - వ పుట.

లాలించుచున్నది.—మూ. లాలయన్తీ=లాలించుచు; ఈ స్వల్ప భేదముచేత
1955 బాధయేమా? 'లాలించుచున్నది' యనఁగా సీత యుంగరమును కొంచెము సేపులాలించి, లాలన నిలిపి, అటుతర్వాత ఉంగరమును రామలక్ష్మణులనేమ మడిగెను అని యర్థమగును. 'లాలించుచు' అనఁగా లాలనను నిలుపకయే లాలనకాలముందే నేమ మడిగె నని యర్థమగును. ఇది భేదముగాదా? మఱియు "లాలించుచున్నది" యని కవివాక్యమును సమాపకముగాఁ జెప్పినచో దానితరువాతి భాషితమునకు ముందు పాత్రముపేరు వ్రాయవలయును. అట్లు వ్రాసియుండలేదు. అందువలన ఈ కవివాక్యమునకు ముందుభాషితమెవరిదో దీనితర్వాతి భాషితమును వారిదే అని యెఱుంగనగును అందురేని, అట్లు లాలనయైనపిమ్మటనే తర్వాతి భాషితభాగము పలికెనని యభిప్రాయమేని ఏకభాషితములో నడుమ "లాలయిత్వా" [లాలించి] అని కవివాక్యము అసమాపకముగానుండుట సంప్రదాయముగాని సమాపకముగా నుండుట గాదు.

సీత.— మఱియెందుచేత మానుసులకుఁ గ్రోఁతులకు నిటువంటిచెలిమికలిగినది?

హను.— రామబాణముచేతనే.

[8] తే॥వాలికిఁ జంబడెస్వర్లోకబహుళవైభ। వంబు మొదటను బిమ్మటవాలిదైన
1963 తారతోఁ దుత్తఁదన్మహోదారరత్న/ముకుటమర్పితమతనికిమహితచరిత.

సీతా.— కేన పున ర్నరవానరాణా మీదృశం సఖిత్వం నిర్మితమ్.

హను.— రామబాణే నైవ.

వాలినే విసృజతా ధనురజ్జ్యాం । నాకలోకలలనాకుచకేళిః
తారయా సమ మదీయత చాస్మై । వానరేన్ద్రపదవీమణిమాళిః.

అర్థము.—సీత.— ఎవనిచేత మఱీనరవానరుల కిట్టిసఖ్యము కావింపఁబడినది ?
హను.— రామబాణముచేతనే.

వింటియొడిని వీడుచున్న దానిచే [రామబాణముచే] వాలికి సురాంగనాకుచకుంభకేళియు ఇతనికి [సుగ్రీవునికి] తారతోడికపిరాజ్యపదవీమణిమాళియు నీఁబడినవి.

1. కేన—దీనికి కర్మార్థకమయిన అదీయతయొక్క కర్తయైన రామబాణేన అను కర్తృతృతీయయే యుత్తర మగుటచేతను, [ఇది నిర్మితమ్మను కర్మార్థకక్తాంతముతో ఘటితమై యుండుటచేతను] ఇది కర్తృతృతీయగాని హేతుతృతీయ గాదు. మఱియు వీరుతలంచినట్టిది హేతుతృతీయయే యగునెడల నిర్మితమ్మని కర్మార్థకముగా నుండక జాతం నిర్వృత్తం సంపన్నమ్— ఏవంరీతిగా కర్త్రర్థముగా నుండును. కావున దీనిని ఎందుచేత అని తెనిఁగించుట తప్పు, ఎవనిచేత అనవలయును. 2. నిర్మితమ్—కావింపఁబడినది. భాషాస్వభావమునకు విరుద్ధముగా తలబీకరగాయగా విద్యార్థులనేడిపించు ననంత సంఖ్యాకపద్యానుబంధములలో నొకటి దీనికై మిగిలించుకోరాదా ? అట కర్తృతృతీయ యని తెలిసియున్న నిట పద్యానుబంధముపడి యుండును. అట నదియున్న, ఇట నిది మఱికి.

వాలికీత్యాది — 3. వింటియొడిని వీడుచున్న యను విశేషణమందును శ్లోకార్థములతుదిఁగల 4. యనుప్రాసమందును గలభావపుష్టిని సహృదయులే యెఱుంగుదురు. మఱి వింటియొడి వీడుచున్న అనువిశేషణముయొక్క స్వారస్య మేమన, వింటిని విడియు విడకముందె వాలికి స్వర్గము, సుగ్రీవునికి కపిరాజ్యమును గలిగినవని, ఆకృత్యమున రామునికిఁగల యత్యంతసౌకర్యము ధ్వనితమగుచున్నది; దానిచే రామునిమహాసామర్థ్యము తోఁచుచున్నది. మూలములో 5. విసృజతా అను శత్రంతముచే హేతుకార్యసహత్వలక్షణమైన యక్రమాతిశయోక్తికై చెప్పఁబడిన యాగపద్యమును బ్రద్దలుచేసి, 'మొదట, పిమ్మట,' అని టీకవ్రాసినపాడుచేఁత శోచనీయముగా నున్నది. 6. కేన అనుప్రశ్నకు రామబాణముచేతనే అని యుత్తరమైపోయినది. దానితోనట్లు సంబంధించిన యీరామబాణమే 'ఇఁడఁబడె' 'అర్పితము' అనువీనికి కర్తయగుట సరియయిన యన్వయముగాదు; తత్పరామర్శక పదమిందుఁ గావలయును, అది లేమి లోపము. మూలములో విసృజతా అనుతృతీయావిభక్తి తదాకర్షకమున్నది. 7. మహోదారరత్న మకుటము—"ఉదారోదాతృ మహతోః" అమరము. దాత్రర్థ మిట పనికిరాదుగాన మహదర్థము చెప్పుకోవలయును, దాన మహామహారత్న

అని యర్థమగును. అట్లు చెప్పరాదా యనిన, చెప్పరా కేమి? చెప్పవచ్చును, బజారుభాగవతములో రూపాయ పొగడింపులో చెప్పలేదా మహామహాపంతులవారని?
8. ఇంద్రుఁడు అర్జునునికి కిరీట మిచ్చినట్లు రాముఁడు ఈమహామహారత్నమకుటమును సుగ్రీవుని కిచ్చెనని యర్థమైనదేగాని వానరరాజ్య మిచ్చిన ట్లర్థముగాలేదు. మూలములో ఆవెలితి లేదు, 'వానరేన్ద్రపదవీమణిమాళిః.' కవిహృదయము చెత్తదిబ్బమీఁద పడియుండదు.

హను.—క॥ ఒగిబహుళపక్షశశివలె

[5] రఘునాథుఁడుకృశతఁగాంచుఁబ్రతిదినమందున్

1968 సీత.—అయ్యో! అయ్యో!

హను.—తగునతనికువలయద్యుతి

యగపడుననుభావముక్రియనడరితెలుపుగాన్.

సీత.—ఇపుడేమో తేఱుకొనుచున్నాను.

ఆర్యపుత్త్రులు నాకై దుర్బలులైనారా యని సీతయడుగఁగా హనుమ చెప్పు నుత్తరము ఈపద్యము.

మూ.— బహుళపక్షశశీవ దినేదినే । రఘుపతిః కృశతా ముపయాతి సః
కువలయప్రతిమా ద్యుతి రస్య తు । ప్రవికస త్యనుభావవశంవదా.

శ్లోకమున ఉత్తరార్థమునకు అర్థము—రామునియొక్క కువలయసన్నిభమైన దేహకాంతిమాత్రము ఆతనిప్రభావముచేత వికసిల్లుచున్నది.— 1. ఇందు తెలుపై యడరినదని చెప్పలేదు. ఈమాట విని సీత తేఱుకొనుచున్నాను అని చెప్పినది. 2. కార్శ్యమునకు అయ్యోఅయ్యో యని యేడ్చినట్టిది అతిపాండిమకుమాత్రము తేఱుకొనుటెట్లు? రెండును విరహకార్యములేగదా? సామాన్యముగా సువర్ణచ్ఛాయగలవాఁడే తెల్లఁబడిన దిగులుపడవలసియుండును. ఇందీవరవర్ణుఁడే తెల్లఁబడిన ఇఁక ప్రాణాశ వదలుకోవలసినదేగదా? అందులకు సీత తేఱుకొన్నదఁట! ఏమివర్ణనయిది! మూలములో ఈతెలుపులేదు. కానను త్తరార్థాంధ్రీకరణము రాభణుఁ డైనది. వాస్తవమేమనఁగా— దేహముకృశించినదిగాని తేజస్సుకృశింపలేదు. కార్శ్యమువలన తేజస్సు మఱియు విశేషముగా వికసించినది.— ఆతేజమువలన కార్శ్యము అగపడుటలేదు.—ఇదియుత్తరార్థభావము. సీత కార్శ్యమునకు చింతించి, తేజోవికాసమునకు తేఱుకొన్నది. ఇది యీక్రింది శాకుంతలశ్లోకమును బోలియున్నది.

ప్రత్యాదిష్టవిశేషమణ్డనవిధి ర్వామప్రకోష్ఠార్పితం
బిభ్రత్కాఞ్చన మేక మేవ వలయం శ్వాసోపరక్తాధరః

చిన్తాజాగరణప్రతాన్తనయన స్తైజోగుణాదాత్మనః
సంస్కారోల్లిఖితో మహామణిరివ క్షీణోపి నాలక్ష్యతే.

ఇప్పద్యములో 3. గఘుప్రాసాద్భుతము. లఘువుపై గప్రాసముగాన 4. ఒకి 5. తగులు తగిలినవి.

౬౩ - వ పుట.

సీతకు రాముఁడు పంపినసందేశము.

అమృతకరుండుచండకరుఁడంబుధరుండుదవానలుండుస
[7] 1975 ద్విమలసరిత్సమీరణముభీమఫణిశ్వసనానిలంబుగా
నమరెడువల్లిబల్లెముగనాఁగువలాటవియీఁటెకూటువో
సుముఖిరోనీవియోగమునఁజొప్పడెనాకుజగంబువింతగన్.

1— 4. సత్, గా, నమరెడు, గనాఁ, —పా. పా. ప్రా. య. శ్వసనానిలమునకు 'గానమరెడు' కావలసియుండునేని కడమవానికి అక్కఱలేదా? 5. భీమఫణిశ్వసనానిలంబు— ఫణి మనకు భయంకరముగానున్నను కుపితము కాదేని విషము గ్రక్కక శాంతముగానే శ్వసించుచుండును. విషశ్వసనముకైకవి కుపితఫణినిని చెప్పినాఁడు. కాన భీమ యనుట చెఱుచుటయే. 6. వల్లికి మూలమునం గల నవవిశేషణము ఇట పోయినది. 7. వింతగన్— అమృతకరుఁడు అట్లుపన మయినను వింతయే. అంబుధరుఁడు కాకియుండునను వింతయే. మఱియు, వింత కాశ్చర్య మనుపలని నదేగాని దీనితర్వాతిపద్యములో చెప్పినట్లు నెంజెలిపననేల? వింత కాశ్చర్యము, కీడునకు నెంజెలియు న్యాయ్యములు. చల్లనివాఁడు కాల్చువాఁడగుట యిత్యాదిగా పూర్వము తనకు నేమముడినవెల్ల నిప్పుడు ప్రాణహారము లగుచున్నవని ప్రాతికూల్యము చెప్పఁబడినది. మూలములో విపరీతమని యున్నది. అమృతకరుఁడు చండకరుఁడగుట పూర్వము రామునికనుకూలమైన దిపుడు ప్రతికూల మగుటయేగదా?

హిమాంశు శ్చణ్డాంశు ర్నవజలధరో దావదహనః
సరిద్వీచీవాతః కుపితఫణినిశ్వాసపవనః
నవా మల్లీ భల్లీ కువలయవనం కున్తగహనం
మమ త్వద్విశ్లేషే సుముఖి విపరీతం జగదిదమ్.

“విపరీత—...ప్రతికూలమ్” శబ్దస్తోమమహానిధి. ఈచంద్రాదు లన్నియు నీతోడి యీవియోగమున నాప్రాణమును హరింపనున్నవి, త్వరలో నినుఁగలయనేని—బతుకను, అని యుపన్యాసము.

చ॥ ఎవనికిఁ జెప్పి యిబ్బాలము నే నెడఁబాయుదు నెంజెలిం జెలీ
[4] యెవఁ డెఱుఁగంగలండు మనయొద్దిక చెల్మిబల్మిఁ దాఁ
1979 దవ నెఱుఁగున్న దాత్మయె సదా నినునంటియె యుంట నీమనం
బవుగద నామనంబువలె నక్కట పొక్కెద నేమి సేయుదున్.

మూ.— కస్యాఖ్యాయ వ్యతికర మిమం ముక్తదుఃఖో భవేయం
కో జానీతే నిభృత ముభయో రావయోః స్నేహసారమ్
జానా త్యేకం శశధరముఖి ప్రేమతత్త్వం మనో మే
త్వామేవైత చ్చిర మనుగతం తత్ప్రియే కిం కరోమి.

నేను ఈకష్టమును ఎవరితోఁ జెప్పి దుఃఖశాంతి చేసికొందును ? [అందులకై]మ
నయిరువురియొక్క రహస్యమైన స్నేహసారమును ఎఱిఁగినవాఁడు ఎవఁడున్నాఁ
డు, ఓచంద్రముఖీ, మనప్రేమతత్త్వము నెఱిఁగినది నామనస్సొకటి కలదు, అదియు
చిరకాలము నుండి నీకడనే యున్నది. [నాకడలేదు, కావున దానితో చెప్పుకొనుట
కు లేదు] కావున నేమిచేయుదును ప్రేయసీ! — అని యర్థము. 1. పద్యమం దుత్త
రార్థమునకు చచ్చుదువాయువు తగిలినది.— 2. ఒద్దిక— నిభృతశబ్దమునకు రహస్య
మైన, అన్యుల కవిదితమైన, యని యర్థము, ఒద్దిక యర్థము గాదు. ఎవ్వరెఱుంగర
నుటకు ఈవిశేషణము సమర్థకముగాన రసవంతమగు పదమే పడినది. వీరికీ పదము
న కర్థము తెలియదు. [illegible] - వచ్చుటలో నినుతో [illegible] పద్యములోఁ గాదు. ఈపదము
ను[నిభృత] [illegible] అని [illegible]. అవిదితమైనదైన, [illegible] సని
యుట సర్థము. [illegible] అత్యశిరమును హనుమంతుఁడు తాను [illegible]
వెసినట్లు సీతతో చెప్పెను. ఈశ్లోకమును బరిశీలింపుఁడు:—

న పుంసక మితి జ్ఞాత్వా తాం ప్రతి ప్రేషితం మనః
స తు తత్రైవ రమతే హతాః పాణినినా వయమ్.

ఈపద్యములో 3. అక్కట 4. పొక్కెద అనవసన్న ప్రాయము. ఈవక్తవ్య
మునే ఇంతకన్న నెంతయు సందముగాఁ జెప్పుటకేగదా కరమువద్యములు.

సీత.— ఇదే నాప్రతిసందేశము. వారక కాఱుచున్న కన్నీటి నెలయేటివేఁ గతి
1980 గినదయ్యును నాచూడ్కి నీయొక్క నెమ్మొగమ్ము సోయగమ్మును నీరానఁ
గోరుచున్నది.— ఇందు, "వారక...చున్నది" అనువాక్యము సీతాప్రతిసందేశము
గదా? భావాలంకృతిసమృద్ధమై యున్నది. రామసందేశము శ్లోకరూపముగా నుండెను
గదా, సీతాప్రతిసందేశంబును అట్లే శ్లోకరూపముననే కవి రచియించి యుండవలయు
నని ఔచిత్యలుబ్ధులకుం దోఁపదా? పంతులవారికిం దోఁపకపోయెఁగాక! దీనిప్రాకృత

మూలము ఆర్యావృత్తము. పంతులవారి తెలుఁగుముద్రణములో పాదవిభాగములులేక ముద్రితమైనది. ప॥ అని ముందు గుర్తు లేకపోయినది. ప్రాకృతవాక్యమును నోటు చదువుటకేని వచ్చియున్న ఆనడలోనే ఇది యార్యయని యెఱుంగవచ్చును, ఛాయ వలనంగూడ ఒకపాటి తెలివిగలవారు ఇది యార్యయని యెఱుంగుదురు.

బహుళగళన్నయనజల। నిర్ఝరపర్యాకులాపి మమ దృష్టిః
తవసుభగవదనసహచర। లావణ్యరసం పిపాసతి.

ఈవిభాగము నేను జేసినది. పంతులవారి మూలపుస్తకములో లేదు. ఇందు ప్రథమపాదాంత ల[లఘువు], చతుర్థాంతమునకు ముందుండు స[లఘువు], ఈరెండును గురువులైననిది యార్యయేగదా. పైగా, ఆర్య కందమువలెనే గదానడచును. ఈ యార్యను గనిపట్టలేమి యిది యేటిప్రతిభయో ఏటికవితాతత్త్వమో తెలియరాదు! దీనితర్వాత సీతచెప్పినయార్యకుముందు పంతులవారిమూలములో ప॥ అనిచిహ్నంబును, అర్ధార్ధవిభాగచిహ్నంబును గలవు, కాన దానినిమాత్రము పద్యముగానే రచించినారు.

[3] ఆ॥ ఎట్లో రాజపుత్రుహింసించితక్షుని। వానరాపశదుఁడపాఱెదెటకు
1983 నిన్నుమన్నిగొనఁగనెన్నురావణునాజ్ఞ। నింద్రజిత్తుకార్ముకేంద్రమూని.

మూ.—హత్వా కథఞ్చిదపి రాజకుమార మక్షం
రే వానరాపశద కుత్ర పలాయితోసి
త్వాం హన్తు మిచ్ఛతి దశాననశాసనేన
దర్పోద్ధతో ధృతధను ర్నను మేఘనాదః.

ఇదినేపథ్యభాషితము. 1. హింసించి తక్షుని—హింసించి యక్షునిఅని క్త్వార్థకముగా మార్చి తర్వాతిదానితో ఏకవాక్యముచేసిన కార్యకారణభావము సుగమముగా నుండును. 2. మూలములో అట్లే క్త్వాంతముగా నున్నది. 3. ఇది భర్త్సనవాక్యము, ఇందులో నుత్తరార్ధము కేవలభర్త్సనము. అట్టివాక్యము 'జజ్జైమిజ్ఝ్యా' అన్నట్లు అనునాసికభూయిష్ఠముగాను అవీరవ్యంజకవర్ణకముగాను ఉండుట కవితాతత్త్వదవిష్ఠతం దెలుపుచున్నది. రసభావోచితముగా పదసంఘటనచేసిన మహాకవులు తెలియనివారేనా?

జ్యాజిహ్వాకావలయితోత్కటకోటిదంష్ట్ర
ముద్గారఘోరఘనఘర్ఘరఘోష మేతత్
గ్రాసప్రసక్తహసదన్తకవక్త్రయన్త్ర
జృమ్భావిడమ్బివికటోదర మస్తు చాపమ్.

౧౪ - వ పుట.

హను.—...ఇంతవఱకైన మాటలతోఁ జాలును— మూ. తదల మతఃపర మాత్మాపలాపేన—[ఇది ఆంజనేయులు సీతయొద్ద సెలవుగొనుచు చెప్పినమాట.] కావున ఇఁక నన్ను దాఁచుకొనక ప్రకటించుకొనియెదను.—మాటలే అర్థమేని ఆత్మ యననేల? అపలాప యనుటకు అచ్చులో మొదటి ప వర్ణము పోయినది. ఈమె
1984 తోసంభాషించుటకై హనుమ ఇంతసేపు రాక్షసులకు అగపడక యుం
డెను. ఇపుడు సంభాషణ యైనదిగాన, వచ్చినకార్యమైనదిగాన, ఇఁక మఱల వారలకు తన్ను ప్రకటించుకొనఁబోవుచున్నాఁడు.

---

## సప్తమాంకము.

౧౭ - వ పుట.

[విభీషణునివాకిటిచెత్తతొట్టి]

[8] తే॥ అభ్యుదయసిద్ధితమకెవ్వునర్థిఁగోరు। సుజనులనురాగమున నెందుచూడరుగ
1992 చవితినాఁటిశశాంకలేఖవలెఁదలఁచి। పరసతీఫాలపట్టికఁబరఁగినఁగడు. [ద

1. ఇతరులకభ్యుదయము గోరువారు చూతురా? 2. కొంతకాలము కోరువారు చూతురా? 3. అనురాగమునఁ గానిచో ద్వేషమునఁ జూతురా? 4. పరఁగకున్నఁ జూతురా? 5. తలఁపకచూతురా? దీనిని వేయిమడుంగులు మెఱుఁగుగా మార్చెదను.—బొట్లుపొడిచినచోట బొమ్మజెముడు (నాగజెముఁడు) పొదలు నిర్మూలితములు.

అభ్యుదయసిద్ధి......గోరు । సుజనులు......చూడరుగద
చవితినాఁటిశశాంకలేఖవలె...... । పరసతీఫాలపట్టికఁ.......

6. తలఁచి—ఏవిషయమున శశాంకలేఖవంటిదని తలఁతురు? 7. ఆకృతిలావణ్యములయందా? తలఁచిశబ్దము తీసివేసిన అద్రష్టవ్యతయందు అని నిశ్చయముగాఁ దెలియును. 8. పైగా చవితి చంద్రుని చూడనట్లు పరస్త్రీఫాలమును చూడరని కవి చెప్పవచ్చినాఁడుగాని, సుజనులు పరస్త్రీఫాలపట్టికను చూడనప్పుడు వారిమనస్సులో చతుర్థీశశాంకరేఖయు తత్సాదృశ్యంబును ఆరూఢములై యుండునని చెప్పరాలేదు. దీనిమూలము మొలచిన క్లైట్లున్నదో చూడుఁడు.

ఉదర్కవృద్ధి మిచ్ఛద్భి ర్న సద్భిః ఖలు దృశ్యతే
చతుర్థీచన్ద్రలేఖేవ పరస్త్రీఫాలపట్టికా.

[రావణునిదియిది.]

[7] ఆ॥ కొఱలుపరవనితలకుచ కుంభములయందు । ఘోరవైరికుంభికుంభములను
1999 బడవురక్తిశక్తిఁబరమ భీరువులవి । దృష్టులనుబృషత్కవృష్టులుమఱి.

మూ.—పరస్త్రీకుచకుమ్భేషు కుమ్భేషు పరదన్తినాం
నిపతన్తి న భీరూణాం ముష్టయః శరవృష్టయః.

1. పరస్త్రీ పరదన్తి యని పరశబ్దమును మార్పమిలో సొబగున్నది. పర, ఘోర అని మార్చుటచే నది పోయినది. 2. కుమ్భేషు కుమ్భేషు అని మార్పమిలో సౌభాగ్యము కలదు. కుంభములయందు, కుంభములను అను మార్పుచే నది పోయినది. 3. ఘోర—వైరులు ఘోరులా, కుంభులు ఘోరములా, కుంభములు ఘోరములా? 4. పృషత్కవృష్టులు పడమికి కారణము ఘోరతయా భీరుతయా? భీరువులకు ఘోర మేగాన ఘోరతను చెప్పనేల? ఇట ఘోరత కారణమేని అట కొఱలుట కారణమా? అటఁ గూడ ఘోరశబ్దము వేయవలదా? ‘ఘోరపరవనితలకుచకుంభములయందు’ అనియే కవనముచేసిన స్వారస్యము మహాల మంటును.—5. రక్తి శక్తి అన్నారుగదా? రక్తి కలదని తాత్పర్యమా? లేదని తాత్పర్యమా? లేనిచో భీరుతాదోషము గాదు, వైరాగ్యదోషము. రక్తి కలదనుపక్షమున, రక్తిఁబడవు, రక్తిలేక పడును అని స్వారస్యమునకు అవకాశము కలుగును. అట్లే శక్తికిని. 6. మఱి—ఇది యీపద్యముమూతి నొకపాగచుట్టు. 7. కుచకుంభములందు దృష్టులా పడును? ముష్టులని నేఁదలంచెద. కుచకుంభముల దర్శనమాత్రముచే సంతుష్టి యాతయాముల కేగాని యువలకుఁగాదని నా మతము.

మధు తిష్ఠతి వాచి యోషితాం హృది హాలాహల మేవ కేవలమ్
అత ఏవ నిపీయతే ధరో హృదయం ముష్టిభి రేవ తాడ్యతే.

దృష్టులు పడవనఁగా నేమర్థము? రహస్సాన్నిధ్యముకలుగదని యర్థమా? రహస్సాన్నిధ్యమందు దృష్టిమాత్ర భోగము చాలదుగాన ముష్టులనియే చెప్పఁదగును. రహస్సాన్నిధ్యముకానిచో రెండును లేవు. కాన ముష్టిశబ్దమే జయదేవునిదని తలంచెదను.

ఆ॥ ...పరవనితలకుచకుంభములను... । ...పరకుంభికుంభములను
బడవు......భీరువులవి । ముష్టులనుబృషత్కవృష్టులను,...

పంతులవారిపద్యముకంటె నిది వేయిమడుంగులు మేలు.

౧౭౭ - వ పుట.

[విరుద్ధమతికృత్తు.]

చ॥ శివునిశిఖాగ్రజంబయిన సింధువునున్నిరసించు లీలమై
[17] నెవడిన కీర్తియెవ్వనిదియే కడుగుందెస లన్నగోడలన్
2016 దవిలితి వట్టివాఁడవెటు ధాత్రితనూభవపై నయో యిదే
యవును బులస్త్యసంతతియ శోభ్యునికిం దగ నట్టికందికన్.

విభీషణుఁడు రావణునికిఁ జెప్పుట—1. లీలమైనెవడినకీర్తి—లీలమైన్+ఎ+వడిన్+అ+కీర్తి అని యొకభేదము. లీలమైన్+ఎ+వడిన్+అకీర్తి అని యొక భేదము. ప్రథమచ్ఛేదంబున రావణునికీర్తి గంగను నిరసించినదని యర్థము, రెండవ భేదంబున రావణునియకీర్తి గంగను నిరసించినదని యర్థము. కీర్తియనియే మూలము. ఇట్లు విపరీతార్థమగునట్లు రచించుట కవనకౌశలము నున్నయని పడగయెత్తుట. 2. ఎవ్వనిదియే—2-5. ఈపాదమున ఇప్పటికైనయవధారణార్థకముల లెక్క—ఎ+అ+ఏ = మూఁడు. ఇందొక్కటియేనియు నావశ్యకము గాదు. ఇన్నిటిని వీని నిట దగ్గఱ దగ్గఱఁగానే పెట్టుట గొగ్గిపండ్లతో వెక్కిరించినట్లున్నది. 6. వడిన—ఇది ప్రాసబంధువని యెవ్వరెఱుంగలేరు. 7. దెసలన్నగోడలన్—ఇది విగ్రహవాక్యశైలి, 'పద్యార్హము' గాదు. 8. మూలములో రావణుఁడే పులస్త్యసంతతిశీతద్యుతికి లాంఛనమని యున్నది. ఇందు వీరు తదీయ జానకీప్రణయము అట్టిలాంఛన మని వ్రాసిచ్చినారు. ఈమార్పునంగల స్వారస్యమేమో తెలియలేదు. వీరు మూలమున కిట్లపార్థము చేసికొని యుందురు. 9. నిషేధించుటగాన నీవే లాంఛన మవుదు వనుటయే మేలు. అతని వలన ఇతరులకుఁ గలుగుచెఱుపు నుపన్యసించుటకంటె నతనికే గలుగుచెఱుపు నుపన్యసించుట దుష్కృత్యమును మానుటకు బుద్ధి పుట్టించును. మూలానుసారిగాఁ జేయవలయు నన్న నిట్లు మార్పవచ్చును. "ధాత్రితనూభవమీఁద నగ్రజా। యవుదు పులస్త్యసంతతియశోబ్జుని కింకను లాంఛనంబుగాన్" 10. తగునట్టికం దొకటి కలదా? మూలసారస్యముం గనుఁడు.

యస్య త్ర్యమ్బకమౌళిఖేల దమల స్వర్లోక కల్లోలినీ
లీలా లఙ్ఘన లమ్పటేన యశసా దిగ్భిత్తయః క్షాళితాః
సోఽపి త్వం జనకాధిరాజతనయాబద్ధాభిలాషః కథం
హా జాతోఽసి పులస్త్యసంతతియశఃశీతద్యుతే ర్లాఞ్ఛనమ్.

11. అమల అనుట అతిక్రమణము ధావళ్యమందు అని తెల్పుటకు. 12. కల్లోలిని యనుట పెదపెద్దయలలు విఱుగునప్పుడు అవిఱుపులోఁ గలుగు ధావళ్యము కడను

యలభావశ్యముకన్న నెక్కుడుగాన దానింగూడ నితనియశ మతిశయించినదని తెల్పుటకు. 13. లంపటశబ్దముచే నాసక్తి సూచితముగాన ఆయశము నిరంతర వర్ధిష్ణు వని తెలియుచున్నది. 14. జనకాధిరాజతనయా—అధిరాజ అని పూజార్థక ఘటితముగాఁగూడ జనకుని చెప్పుటచేత—ధనురారోపణపణము, అందు ఇతఁడు భగ్నుఁడగుటయు, రాముఁడు సిద్ధి నొందుటయు, అందువలన, 'జానకి బలవద్భర్తృక తదభిలాషచే నీ కపాయ' మనియుఁగూడ, నభిప్రాయము; మహాపవిత్ర యను నభిప్రాయంబును జనకోక్తిచేత సిద్ధమే. దాన, నీకు లోఁబడదు, బలాత్కారణమందు నీకు నాశము, హింసనమందును నాశమే, అని ఫలితము. ధాత్రితనూభవ యనుటచే నీ రెండవ యభిప్రాయముమాత్రము వచ్చునుగాని మొదటిది రాదు. 15. బద్ధాభిలాషః—అభిలాషయే పాతకము ప్రాణహరము, తాఁకిన నేమాదువో యని భావము. 16. తవిలితి వనుటల్లో—నీచోపసర్పణము సూచిత మగుచున్నది. ఇది నీచోపసర్పణము గాదు, లోకమాత్రుపరస్పణము కాన నీపద మిట ననుచితము. 17. జాతోసి—అయియున్నావు, అని యర్థము. ఇఁక రావణునికి నాశమే గాని సీతాపాతివ్రత్యభంగము చేయఁజాలఁడుగాన, ఇప్పటికిఁ బొందినయభిలాషవలననే లాంఛనమైనాఁడు గాని, ఇఁక నొందుదోషమునఁ గానేరఁడుగాన, అగుదువని భవిష్యద్వాచకముగాఁ జెప్పుట సరిగాదు. [తద్ధర్మార్థకముగాన కాలనియమ మక్కఱలేదని వాదింతురా? ఆపక్షమున కాలసామాన్యవాచకము చెప్పుటకన్న వక్తవ్యకాలమాత్రవాచకమునే చెప్పుట మేలు.] కొంచెపాటిమార్పు:—

శివునిశిఖాగ్రసజంబయినసింధువునూర్మ్ములదాఁటిలీలమై
రెవనియశఃప్రవాహమవహేలగముంచునెదిక్తటంబులన్
డవడనకట్టెయీ వెయిటుధాత్రితనూభవఁగోరియన్నలా
యవుదెవులస్త్యసంతతియశోమృతరోచికిలాంఛనంబుగాన్.

[9] తే॥ రోషభీషణపాటలలోలదృష్టి। గర్వమున నెత్తఁబడినట్టిఖడ్గముష్టిఁ
2025 బొనరురావణుచే వంశభూషణుండు। బెగడ కెదఁదన్నఁబడెను విభీషణుండు.

మూ.—కోపపాటలితలోలదృష్టినా। కిఞ్చిదున్నమితఖడ్గయష్టినా
రావణేన నయధర్మభూషణ। స్తాడితో హృది పదా విభీషణః.

1. భీషణశబ్దవ్యవధానముచేత పాటలత రోషకార్యమని యొకయన్వయము సహజమని యొకయన్వయము, రెండు గలిగినవి. మూలములో ఈవ్యవధానము లేదు. ఇందు ఈసందేహము ఫలము, విశేషము, దోషము. 2. తర్వాత భూషణ, భీషణ, యని వచ్చినయనుప్రాసమునకు నందొకటి భీషణము నిటఁబెట్టుట అపకర్షకము.

3. దృష్టివికారమునకు రోషము కారణము, ఖడ్గోద్యమనమునకు గర్వము కారణము, తన్నుటకు బెగడమి కారణము అని పంతులవారితాత్పర్యమా? ఖడ్గముష్టి నెత్తుటలో గర్వమేల చెప్పవలయు? ఆగర్వము తన్నుటలో లేదా? ఆగర్వమే దృష్టిలోలనములో లేదా. అటుమాని యిటుమాత్రము చెప్పనేల? ఆగర్వము వానికి ఇంతకు ముందు లేదా? మఱి యిటు తదుపన్యాసంబున ఫలమేమి? పాదము కుదురుటయే. 4. ఎత్తఁబడినట్టిఖడ్గముష్టిఁబోనరు—ఇది తెనుఁగు కాదు. ఆంధ్రు లిట్లు పలుకరు, 'ఖడ్గముష్టి యెత్తి' యందురు. 5. ఇది విగ్రహవాక్యము పద్యానర్హము. 6. ఇటు నెకపోనరు రెండుబహువ్రీహివిగ్రహముల కుమ్మడియగుట లాఘవమేగాని హానులయ వ్యక్తగణితమర్యాద నందుచున్నది. $3a + 3b = 3(a + b)$. ఈవిగ్రహణ సంకలన సంక్షేపణములు కడురసాపకర్షకములు, కావ్యానర్హములు. మఱియు 7. గర్వమున నెత్తఁబడినట్టి ఖడ్గముష్టిఁబోనరు—ఇందు అప్రసక్తముగా గర్వమున ననియుం జెప్పుటచేత కత్తిని పూర్తిగానే ఎత్తెనని యర్థమగుచున్నది. మూలములో 8. కిఞ్చిదున్నమిత అనఁగా కొంచెమెత్తినఅని యున్నది. కొంచెమెత్తుట కోపావేశాభ్యాసదోషముచేత, అట్లే యుంచుకొనుట తన్నఁబోవుకోపావేశములో దానిపైని దలంపులేమిచేత, తలంపులేమి కొంచెముగానే యెత్తినందులచేత. కాన, కొంచెముగా అనునర్థమును విపరీతము నేయుటసరిగాదు. 9. బెగడక—విభీషణుఁడా రావణుఁడా? పంతులవారు, సువిభీషణుండు అనివ్రాయ నది యచ్చుపొరఁబాటుచే నువిభీషనుండని పడినదా?

కరా.—జానకీవిరహవిహ్వలుండగు లంకానాథుని మనోవినోదముకొఱకు
[6] నెవఁడో యొకచిత్రకారుఁడు రచియించిన యీచిత్రపటము తద్గోచర
2031 ముగాఁ గావింప నొకానొకనిచేతనిచ్చి పుచ్చిన దిచ్చిత్రపటమని, మాల్యవంతునిచే నాజ్ఞాపింపఁబడితిని.— వీనిని ఉన్మత్తవైద్యశాలకుపంపవచ్చును. వీని పేరు కరాళకుఁడు, వీఁడు రావణునికి మహామంత్రియు మాతామహుఁడు నగు మాల్యవంతునిపరిచారకుఁడు. వీనిచేత నొకచిత్రపట మున్నది. ఈవాక్యమువలననే తెలియవలసినదిగాని దీనివలనం దెలియకుండ పంతులవారిచే. ఇది విరచితమైనది. ఈ కరాళకభాషితమునకు అర్థసంగతి కలదా? ఇందులో మాల్యవంతునివాక్యము ఎది మొదలుగా నెంతవఱకు? మూలమువలన విడునా, కనుడము:—

మూ.—ఆదిష్టోస్మి మాల్యవతా, జానకీవిరహవిహ్వలస్య లఙ్కేశ్వరస్య మనోవినోదనాయ కేనాపి చిత్రకారేణ విరచితం చిత్రమిదం తద్గోచరీకరణాయాయమితి కస్యాపిహస్తే దర్శనీయమిదం చిత్రమితి॥

1. పంతులవారి వాక్యములోని యనన్వితదోషము “ రచియించిన యీచిత్రపటము ” అనుమాటలను “ రచియించినది యీచిత్రపటము ” అని సమాపకముగాఁ జేసినం గొంత తీఱును. పిదప, 2. ఇచ్చి పుచ్చినది అనుటకు ఇయ్య వలసినది. అని మార్చిన కడమయు ముప్పాతిక దీఱును. 3. ఈకరాళకుఁడే దీనిని రావణునికడకుం గొనిపోలేదు. పిమ్మట దీనిని ప్రహస్తుఁడు తెచ్చి రావణునకుం జూపి వివరించినాఁడు. 4. కావింపనొకానొకనిచేత, అనుచో, కావింప సమర్థుఁడగు నొకనిచేత అని మార్చిన సరిపడును. 5. పంతులవారిమూలములో అయమితి అనునది అలమితికిఁగాని అయమలమితికిఁగాని ఇతికిఁగాని పొరఁబాటనియు, [6. అశ్లే దర్శనీయమనుట అర్పణీయమనుటకుఁ బొరఁబాటనియు] తలంపఁదగియున్నది. పంతులవారు తప్పు దిద్ది తెనిఁగింపకపోయినను మార్పక గోకంబర్థుగా నయినం దెనిఁగించిన నింతకన్న బాగుగానుండును. మార్చినవారు తెనుఁగులో సమన్వితమగున ట్లేని మార్పరాదా?

[పంతులవారికి చంద్రమశ్శిలా, పద్మచ్ఛద శబ్దములకు అర్థము తెలియమి.]

శా॥ ఓరీనూఱుముచంద్రమశ్శిలపయిన్ బ్రోత్సాహివై చందనం
[10] బోరీకూర్పుము చామరంబుఁగడునేర్పొంపంగఁజంద్రాంశులన్
2041 సారోదారమృణాలసూత్రతతిచేఁజానొందఁబద్మచ్ఛద
స్ఫారాబ్బిందువులన్ రచింపుసుమణిస్రగ్వర్యమోరీవెసన్.

మూ. రేరే చన్దన మిన్దుమణ్డలశిలాపట్టే సముద్ఘృష్యతాం
రేరే చామర ముజ్జ్వలై శ్శశికరైః శ్వేతం వినిర్మీయతామ్
రేరే బాలమృణాళతన్తులతికాసూత్రేణ పాథోజినీ
పత్త్రస్థై రుదబిన్దుభి ర్మణిమయో హార స్సమాసూత్ర్యతామ్.

1. ఇన్దుమణ్డలశిలాపట్టే — మండలశబ్దముచే చంద్రుఁడేగాని చంద్రకాంతశిల కాదని జయదేవుఁడు తెల్పినాఁడు. చంద్రమశ్శిల యని చంద్రకాంతమేగాని చంద్రుఁడుగాఁడని పంతులవారు రాద్ధాంతీకరించినారు. 2. చంద్రుని సానచేయుట శైత్యశైత్యాధిక్యములకు. అవియేల, సంసారిపక్షముగా నుండుమని పంతులవారి తాత్పర్యము. ఇందూపలము, శశిదృషత్తు, అనుపదములం గనుఁడు.

యదగారఘటాట్టకుట్టిమ। స్రవదిన్దూపలతున్దిలాపయా
ముముచే న పతివ్రతౌచితీ। ప్రతిచన్ద్రోదయ మభ్రగఙ్గయా.
విధుకరపరిరమ్భా దాత్తనిష్యన్దపూర్ణైః
శశిదృషదుపక్లృప్తై రాలవాలై స్తరూణామ్

విఘలితజలసేకప్రక్రియాగౌరవేణ

వ్యరచి స హృతచిత్తస్తత్ర భైమీవనేన. నైష.

క॥ నెలపొడుపుల సురనది ని । ర్మలతరతదగారకుట్టిమస్రవదిందూ

పలతుందిలాపయగుచుం । దెలివొందుఁబతిప్రతాపచితీసంపత్తిఁ. శృ. నై.

3. మణ్డల—దీనిగర్భములో ఎట్టిదివ్యమయినయుపమను ఇమిడ్చినాఁడు జయదేవమహాకవి! మండలమనుట గుండ్రనిసానను సూచించుటకు. గందపుసానకు పూర్ణచంద్రునికన్న నుత్కృష్టమైనయుపమానము గలదా! ఈమండలశబ్దార్థమును వదలుట ప్రాణమువదలుటయే. 4. శిలాపట్టమనుట నున్ననిసానయని తెల్పుటకు, శిలామాత్రమెల్ల చందనము నూఱుటకుఁ దగిన యాకారముగా నుండునా? 5. పంతులవారు ఈయాకారలోపమునకును చంద్రునితీసిరాయివేసినందులకును బదులుగా ఈ రాతిమీఁదనే చందనమును బలమంతయువేసి ప్రోత్సాహముతో నూఱిన నీచందనమే చంద్రునిపై నూఱినదానికి సమమగునని రాద్ధాంతీకరించినారు. 6. ఉజ్జ్వలైః శ్వేతమ్—వెలుంగునట్టి (కిరణములతో) తెల్లని (చామరమును) అనుట కళంకభవములైన నల్లకిరణములను చేరనీయక కట్టుమని హెచ్చరిక. ‘నల్లకిరణములుచేరినను రాపణులవారు విరక్తులు కోపింపరు కడు నేర్పొప్పినం జాలు’ నని పంతులవారి తా. నల్లకిరణములు విరహతాపమును చల్లార్చునా? పంతులవారి నడుగవలయును. ఇంకొక విషయమందుం గూడ పంతులవారు జయదేవునితో డీకొనుచున్నారు. 7. ఆతఁడు [పాథోజినీపత్త్ర] తామరాకులను చెప్పఁగా వీరు [పద్మచ్ఛద] తామరరేకులను చెప్పినారు. 8. ఆలోపము జలబిందువులు [స్ఫార] పెద్దవిగా నున్నందీయునని వాదించుచున్నారు. తామరాకునకు “నళినీదళకల్పితస్తనావరణమ్,” “నళినీదళతాళవృన్తైః,” “మన్మథలేఖ ఏషనళినీపత్త్రే నఖైరర్పితః,” “నళినీపత్త్రభాజనగతముదకమ్మహాస్తేసన్నిహితమాసీత్.” శా. “ఆనీరమెమొత్తెమట్లు నళినీదళసంస్థితమైతనర్చు.” తె. భ. “కృశాఙ్గ్యాస్సంతాపం వదతి నళినీపత్త్రశయనమ్,” “స్థిత మురసివిశాలం పద్మినీపత్త్రమేతత్.” రత్నా. ఇట్టి వెన్నియేనియుఁ గలవు. తామరాకున జలబిందువులు ముత్తెములవలె తళతళ ప్రకాశించినట్లు, తామరరేకున నొప్పవు. మఱియు ఏవన్నెరేకున నావన్నెగా నగును. చెందామరలో పద్మరాగములవలె నగును. పైగా భేదవిశేషములతో అగపడుటయే దుర్ఘటము. ముక్తాహారమేగాని పద్మరాగాదిహారము చలువగొలుపదు. 9. పర్యము—పా. 10. సర్వదోషములు సువర్ణముచే నిర్హృతములగు నని పంతులవారు సుకుణి యని సువర్ణము పెట్టుకొన్నారు. ఈసువర్ణము వ్యయించి చంద్రమణ్ణిలా పద్మచ్ఛదశబ్దములకు అర్థము తెలిసికొనియుండిన ఇంతకన్న నెంతయు మేలని తలంచెద.

• ౮౮-వ పుట.

ముని.—విరహాసంతప్తుఁడైన లంకేశ్వరునికి శీత లోపచారార్థముగా నిశాచరు
2042 లేల నియోగింపఁబడుచున్నారు?—

విరహికి శీతలోపచారముగాక యేమిచేయ మనును? నిశాచరులనుగాక మఱి యెవరిని నియోగింపుమనును? కథంశబ్దమును చక్కఁగా తెనిఁగింపలేనిచో, ఆమునిని ఏలశబ్దమును గడ్డములో ముడిచికొమ్మనుఁడు. రావణుఁడు సీతావిరహవిహ్వలుఁడని యీమునికరాళకునివలన వినియే యున్నాఁడు. వీనికి అగ్గిపలాస్తిరి వేయవలసినదే.

"అమృతాంశుండు" పద్యము. 1. పులుముట—'పీఁకుట' వంటిది. 2. కంజ
[3] దళము—కంజినీదళమనవలయును. 3. గంధము — చందనపర్యాయము
2045 గా ఈపదమును వీరు ప్రయోగించుట యిది ప్రథమపర్యాయముగాదు. ఈసారనిరాసములో రలయతిభాగ్యముగూడ.

[3] కరాళకుఁడు—[తెరవైపుచూచి] ప్రహస్తుఁడనువాఁడు వీఁడేల రాజ
2048 ద్వారమును జేరుచున్నాఁడు?

1. ఈవక్త కరాళకుఁడు, మాల్యవన్మహామంత్రియొక్క పరిచారకుఁడుగదా. వీఁడు ప్రహస్తమంత్రిని వీఁడనుట యెట్టిదో. పైగా, 2. మంత్రి రాజద్వారమునకుఁ బోవువిషయమున నొకజిజ్ఞాసయా? అపూర్వమును గుఱించి పలికినట్లు పలుకుచున్నాఁడుగాని, ఏరాచకార్యమునకు పోవుచున్నాఁడో యని జిజ్ఞాసగాదు. ఇట్టి జిజ్ఞాస యిట్టిపరిచారకునికి సుసంభవముగాదు. పంతులవారు కాలేజిపండితులని యెఱిఁగినవాఁడు ఒకనాఁడు వీరు కాలేజికి పోవుచుండఁగాఁ గని, 'ఏల పంతులవారు కాలేజికి పోవుచున్నారు?', అని యడిగిన నెట్లుండునో అట్లున్నది. రాచకార్యములను గుఱించిన జిజ్ఞాసయేని ద్వారశబ్ద ముండదు. కథంశబ్దము వచ్చినవాక్యములనెల్ల పంతులవారు ఇట్లే పాడుచేసినారు. 3. వీఁడు ప్రహస్తుని 'అనువాఁ' డననేల? 'వీఁడ' న్నదిచాలదా? అతండు విన్నయెడల వీనిని పుటంబువేసి యుండఁడా? అనువాఁడు చచ్చుడుతెనుఁగుముద్రణముయొక్క దోషము.

[2] నీవు కార్యము నిర్వర్తింతువుగాక.—పంతులవారికి నాటకభాష తెలి
2050 యదు. మూ. భవానపి సాధయతు. 1. నీవును పొమ్ము అని యర్థము. 2. కార్యనిర్వర్తన మర్థమేని సాధయతునకు కర్మ యుండును.—"ప్రాయేణ ణ్యన్తకః సాధి ర్గమేః స్థానే ప్రయుజ్యతే॥ యథా శాకున్తలే ఋషీ గచ్ఛావ ఇత్యర్థే సాధయావస్తావత్" అని సాహిత్యదర్పణము నాటకప్రకరణములో నున్నది. వీరికి నాటక

ఘోష యటుండనిండు సామాన్య కావ్యపరిచయమ్మునుగూడ నసదుగానున్నది. నైషధము తృతీయసర్గలో ౬౨-వ శ్లోకము.

తవ వర్త్మని వర్తతాం శివం। పునరస్తు త్వరితం సమాగమః
అయి సాధయ సాధయేప్సితం। స్మరణీయాః సమయే వయం వయః.

"సాధయ=గచ్ఛ" మల్లి. కవితాతత్త్వ మగుపడుచున్నదా?

[3] తే॥ అకట రాజిల్లలాటస్థలక సుముఖర। కాంచికాగుణ కేశపక్ష యనగుచును
2053 మారనారాచయష్టినామాన సమున। దూఱినది యది నేఁ జేయుదు నిఁక నేమి.

రావణుఁడు సీతం దలపోయుట.—1. సుముఖర కాంచికాగుణ—వింటికి అల్లె త్రాడుండునుగాని నారసమున నుండునా? ఉండదుగాననే మూలములో

రాజిల్లలాటఫలకా కమనీయకాంచి
త్కాంచీగుణప్రణయినీ ధృతకేశపక్షా
హా కిం కరోమి మమ సా హృదయం ప్రవిష్టా
నారాచయష్టి రివ పుష్పశిలీముఖస్య.

కాంచీగుణప్రణయిని యన్నాఁడు. గుణమునకు సఖి యని యర్థము. కాంచీగుణమందు ప్రీతిగలది యని సీతాపరమయిన యర్థము, 2. కేశపక్ష—కేశములనెడు ఱెక్కలుగలదని నారాచపరార్థము. సీతాపరముగా ఱెక్కలవంటి కేశములు గలది యని యర్థము. తుమ్మెద ఱెక్కలయినం గావు. ఊరక ఱెక్కలసామ్యముచే కేశములకు ఉత్కర్షయా? కాన నర్థమున సొంపు లేదు. "పాశః పక్షశ్చ హస్తశ్చ కలాపార్థాః కచాత్పరే" అని యమరము. పక్షశబ్దమును కలాప [సమూహ] వాచకముగా మూలకారుఁడు ప్రయోగించినాఁడు. పంతులవారి బహుప్రీహికి ఆయర్థము రాదు. మూలములో ధృతకేశపక్షా=ధరింపఁబడిన కేశకలాపముగలది [సీత]; 3. [దూఱినది] యది—సీత యన్నను ఛందస్సు చెడదు. అది యనుట యందముగాదు.

చిత్రపటమును ప్రహస్తుఁడు రావణునికి వివరించుట:—

[10] ప్రహస్తుఁడు.—ఇంతవఱకిది, తిమి తిమింగిల వాలాహతికంపిత సలిలకల
2063 కలకోలాహలోన్నిద్రము సముద్రము.

రావణుఁడు.—ఇది యేమి? దాని కుత్తరమున, రత్నాకరము ననుసరించి తాపింఛపుంజాఖండలధనుస్సహస్రము ననుకరించి, గగనమును గపిశముగఁ గావించుచున్నది?

ప్రహస్తుఁడు.—ఇది యా సుగ్రీవపాలితము కపిబలము.

రావణవాక్యమునకు మూలము— [పంతులవారిపుస్తకముప్రకారము]. అయే కిమిద ముత్తరేణ—తరఙ్గమాలిన మనుతమాలషణ్డ మురధనుస్సహస్రానుకారీ కపిశయతి గగనతలమ్.

1. ఇందు ఉత్తరేణ తర్వాత గీటు తప్పు, మాలినకు మనునకు నడుమ ఎడము తప్పుగాదు, 2. షణ్డం అనియుండవలయు. ఇదమ్మని నపుంసకముగాన...కారీ అని పుంరూపము తప్పు, కారి అనవలయు. పంతులవారు తుదితప్పును దిద్దుకొన్నారో లేదో తెనుఁగునం దెలియదుగాని, తొలిరెంటిని దిద్దుకోలేదు. అందుచే పెక్కుతప్పులు చేసికొన్నారు. 3. ఒప్పయిన యీ యెడమును తప్పుగాఁ దలఁచినారు. దిద్దుపాటు ప్రకారము తెనుఁగు:—ఓహో! ఇదియేమి తరంగమాలికి [సముద్రమునకు] ఉత్తరమున, తాపింఛషండము వెంబడి, ఆఖండలధనుస్సహస్రానుకారి, గగనమును కపిశము నేయుచున్నది? పంతులవారివాక్యముం జూతము. 4. దానికి—అనఁగా దేనికి? ప్రహస్త వాక్యోక్త మయిన సముద్రమునకు. మఱి “దానికి [సముద్రమునకు] ఉత్తరమున రత్నాకరము ననుసరించి” యని యీతీరున వాక్య ముండునా? దాని ననుసరించి యుత్తరమున—అని యుండును. “రత్నాకరమున కుత్తరమున దాని ననుసరించి” అనియేని యుండును. కాన నిట తప్పున్నదనితోఁపదా? 5. దానికికి మూలము లేదు. అది యొకతప్పు. దానికిం దీసివేయవలయును. 6. పంతులవారి కిట ఉత్తరేణశబ్దయోగమున ద్వితీయ వచ్చునని లక్షణము తెలియనందున ఈ దానికిశబ్దమును వేసి వాక్యమును చెఱుపుకోవలసి వచ్చినది. ఉత్తరేణ తరఙ్గమాలినమ్—సముద్రమున కుత్తరమున, అని యన్వయము. సూ. ఏనపా ద్వితీయా.

ఫలభరపరిణామశ్యామజమ్బూనికుఞ్జ
స్ఖలితతనుతరఙ్గా ముత్తరేణ ప్రవన్తీమ్
ఉపరివిఘటమానప్రౌఢతాపిఞ్ఛనీలః
శ్రయతి శిఖర మద్రే ర్నూతన స్తోయవాహః. మాలతీ. ౯.

“ఉత్తరేణప్రవన్తీమ్ = ప్రవన్త్యాః ఉత్తరస్యాం దిశ్యదూరే” అని నాన్యపేవుఁడు. “తత్రాగారం ధనపతిగృహా నుత్తరేణాస్మదీయం.”—మేఘ. “ధనపతిగృహాన్ ఉత్తరేణ ఉత్తరస్మి న్నదూరే దేశే ‘ఏన బన్యతరస్యా మదూరేఽపఞ్చమ్యాః’ ఇత్యేనప్ప్రత్యయః. ‘ఏనపాద్వితీయా’ ఇతి ద్వితీయా” అని మల్లి. మఱియు అదూరార్థముగూడ ఉత్తరేణశబ్దముచేతనే లభించినదిగాన, 7. అనుశబ్దము తరంగమాలికి సంబంధపడినదికాదు. కాన, 8. అనుసరించిపదమునకు రత్నాకరము కర్మకాదు. 9. కాన దానికి కర్మగా తమాలషండము విడిపోవలయును. రత్నాకరమున కుత్త

రమున తమాలషండము ననుసరించి యని రాపలయును. అందుల కుపపత్తిసంప
ద:— అఖండలధనుస్స్వహస్రోపమానముచే నన్నివర్ణములును వచ్చినవి, కావున
మఱల ప్రత్యేకించి విశేషించి తమాలషండోపమానము చెప్పిన ప్రయోజనమేమి?
మొత్తముగా కపిశవర్ణమే తుదకు చెప్పఁబడినది. సాగరవేలయందు తమాలవనము
ను కవులు వర్ణించుట ప్రసిద్ధము. కాన నిట వేలాతీరతమాలవనము వెంబడి కపిబల
ము విడిసియున్నదని యెఱుంగనగును.—

"అమ్భోధీనాంతమాలప్రసవకిసలయశ్యామవేలావనానామ్." ముద్రా.

"లవణోదధివేలాతమాలకన్దళస్య భగవతః పురుషోత్తమస్య." మురారి.

"దూరా దయశ్చక్రనిభస్య తన్వీ। తమాలతాళీవనరాజినీలా
ఆభాతి వేలా లవణామ్బురాశే। ర్ధారానిబద్ధేవ కళఙ్కరేఖా." కాళి.

ఈ ప్రసన్నరాఘవమందే [౫ - అ. ౬౮ - పు.] గంగా యమునా సరయువులు
వేలాతమాలతిరోహితలై గోదావరీ సాగర సంభాషణమును విన్నారని చెప్పఁబడియు
న్నది. "తదాకర్ణయామస్తావ ద్వేలాతమాలతిరోహితాః." దానికిం బంతులవారి
తెలుఁగు.—"మనము వేలాతమాలముమాటుననుండి తద్వృత్తాంతము నాలకింతము."

10. తాపింఛషండసన్నిభము కొంతదండు [భల్లూకాదికము] అని తాత్పర్య
మేని తుదను గగనమును నీలముగాను కపిశముగాను గావించుచున్నదియని యర్థ
ముగా మూలములో, నీలయతి కపిశయతి చ గగనతలమ్—అని యుండును. అట్లు
లేదు గావునను, ఈ రావణప్రశ్నకు ప్రహస్తోత్తరము కపిబలముమాత్రమే యగుటచేత
ను, పంతులవా రివాక్యమును దగ్ధపటలము చేసినారనుట సిద్ధాంతము.

౨౯ - వ పుట.

[అముద్రసముద్రశబ్దముల శ్లేష నెఱుంగమి]

మ॥ విడుమీత్రాసము నోసముద్రుఁడ కదుర్ వేరాముక్రోధాగ్నిద్రా
[6] వెడుబందీకృతదేవసుందరులవై పెంపొందుకన్నీళ్లనే
2069 యడరున్నీ మకరీగణంబితనివానమ్ముల్లఙ్కాస్యాంగనా
జ్వలగండస్థలపత్రభంగమకరీసంహారమేచేనెడుర్.

మూ.— త్రాసం ముఞ్చ సముద్ర కోపదహనో రామస్య పాస్యత్యయం
బన్దీభూతసురేన్ద్రసున్దరదృశా మశ్రూ రముద్రం పయః
కామం తే మకరీగణో విహరతా మేతస్య లఙ్కేశ్వర
స్త్రీగణ్డస్థలపత్త్రభఙ్గమకరీవిధ్వంసినః సాయకాః.

1. మూలములో రాఘ్నుని కోపాగ్ని అముద్రపయస్సనే త్రాగును, నీవు సముద్రుఁడవుగాన నీకు భయమువలదు, అని యముద్ర సముద్ర శబ్దశ్లేషవలని స్వారస్యము. దీనిం బంతులవారు గ్రహింపలేదని పద్యములో 2. అముద్రశబ్దము తాను లేకయే సాక్ష్యమిచ్చుచున్నది. ఇందులో లడప్రాసముకూడ 3. ఇతనివౌనమ్ముల్, 4. సుందరులవై పెంపొందు—— ఇందలి తచ్ఛబ్దస్వారస్యము విదితమైయె యున్నదిగదా? 5. వౌ, 6. వై పెంపొందు——పా. య.

రిక్త.

[8] క॥ సకలనిశాచరమౌళి। ప్రకటమణిప్రభాపూజితాంఘ్రిపద్ముండగునే
2077 నిఁక రావణసందర్శన। మకుటిలముగఁజేయనర్హుఁడగునే వీఁడుఁ౽.

లఘువుపై కప్రాసముగాన, 1, 2, 3. అకుటిల సకల ప్రకటలు వచ్చినవి. నిశాచరోత్తముఁడయ్యు వీఁడుఁగూడ[ఇంతయపరాధియయ్యెఁగావున] నన్నుఁజేర నర్హుఁడుగానేరఁడు, అని యర్థము గాఁబోలు. ఈపక్షమున అగునేని యనుటకు, అగునుగాన, అని యర్థము చెప్పకోవలయును. ఇందు 4. అర్హశబ్దమును 5. అకుటిలశబ్దమును వేసినందున మూలహృదయము పంతులవారికి తెలియలేదని విశదమగుచున్నది.

నిశాచరశిరోరత్నరఞ్జితాఙ్ఘ్రిసరోరుహః
ప్రియోఽపిదశకణ్ఠస్యనైషదర్శనమేష్యతి.

6. రావణుఁడు కాలచోదితుఁడై చెప్పినమాట యిది. వీనిముఖ మిఁకనేఁ జూడను, అని రావణుఁడు పల్కెను. తనశత్రువులతోఁ గూడ ఇతఁడును యుద్ధములో తనచేత మడియును అని యతనిభావము. రావణవాక్యము దైవమహిమచే రావణుఁడే మడియుటచే సిద్ధించినది. ఇంకొకనాటకమున మాల్యవంతుఁడు “విజయేతాం రామలక్ష్మణౌ రావణకుమ్భకర్ణౌ” అనిదౌహిత్రులు జయించునట్లు గోరి యాశీర్వదింపఁగా, ఆవాక్య మనృతముగాకయే వారే ఓడుటచే సిద్ధించినది. అట్టిచమత్కారమే యిటను జయదేవకవి నిబంధించినాఁడు. దానిని గ్రహింపక పంతులవారు ‘అకుటిలముగ అర్హుఁడుగాఁడు’ అనుపదములు పెట్టి కాకతాళీయముగా నేనియు దానిని రాకుండఁ జేసినారు. 7. వీరు ‘భూయోఽపిదశకణ్ఠస్య’ అనుపాఠమును తెన్గించినారు. “ప్రియోఽపి దశకణ్ఠస్య” అనునది దీనికన్న నెంతయుశ్రేయము. 8. సరోరుహాః అనువిశేషణము షష్ఠిగా దశకంఠుఁడు తనకు చెప్పకొన్నది, దైవవశమున ప్రథమగా విభీషణునికి అన్వయించుచున్నది. నేను రాక్షసరాజను నన్ను వదలినయాపరాధముచే విభీషణుఁడు మడియు నని రావణార్థము. విభీషణుఁడే రామానుగ్రహ

ముచే రాక్షసరాజనియు రావణుఁడే మఱియు నన్నియు ద్వైవార్థము. అంతయుం దెనుఁగులో వచ్చుతం గలసినది.

౯౦ - వ పుట.

రావణుఁడు.—ఆ! ఏమియిట శంకింపఁదగినది? ప్రతీకారము నేయఁదగినది యునా? ఇందుచేఁగద?

[10] తే॥ కపులకోలాహలంబుచేఁగాంచునాదు।మదిముదంబునెయెంతయుమానసీయ
2087 యైనమందోదరినునూపురాప్తములు।శింజితముచేవలెంజాలమంజులముగ.

మూ.— ఆః కిమిహ శఙ్కితవ్యం ప్రతివిధాతవ్యం వా? అనేన హి।
కోలాహలేనోల్లసతా కపీనాం। మనో మదీయం ముద మేవ ధత్తే
మన్దోదరీనూపురభూషణానాం। మహామణీనా మివ నిస్వనేన.

1. ఆ! ఏమి యిట శంకితవ్యముగాని ప్రతీకారము నేయవలసినదిగాని? అనియుండవలయును 2. ఇందుచేఁగద — అనుట వాక్యార్థపరామర్శకముగా నగపడుచున్నది. దానిమూలము 'దీనిచేత' అనునర్థముగలసర్వనామము, 'అనేన' అనునది తర్వాతిశ్లోకములోని కోలాహలేనకు విశేషణము 3. అనేన కోలాహలేన — ఈకోలాహలముచేత అనియర్థము. పద్యములో, 4.ఎంతయు, 5. మానసీయ, 6. యైన, 7. ను, 8. ఆప్త, 9. చాల, 10. మంజులముగ — ఇవి పాదపూరణములు. మందోదరి మానసీయతోపన్యాసము అసంబద్ధప్రలాప మనిపించుకొనును.

౯౧ - వ పుట.

మందోదరి.—

[14] క॥ నాగపతిపరిభవంబున। నేగాకుముఖర్వగర్వనిర్వ్యాపృతుఁడవీ
2101 చోఁగదినెశరభనందనుఁ। డీగిరినికటంబుననున్న గేంద్రుఁడవినుమా.

[శ్లేషమనుసరించి, మఱిచ్ఛాయ.]

క॥ నాకపతిపరిభవంబున। నేకాకుముఖర్వగర్వనిర్వ్యాపృతుఁడవీ
వీకడదశరథనందనుఁ। డీకుధరనికటమునందు నేఁచున్నవినుమా.

రావణుఁడు.—ఇందిదియేమివిషాదస్థానము? ఇదిమావిషయమునందుదాసీనము.

ప్రహస్తుఁడు.—దేవాయిది వేఱువిధమున నెఱుఁగఁబడినదే.

మందోదరి తాను రావణునికై పోచిల్లు చల్లించి తెల్పినికొన్న బోయతభాషణమును రావణునికి తెలుపుచున్నది. బోయత సింగపుఁగొదమతోఁ బల్కినవాక్య మిది.

దైవవశమున శ్లేషచే రావణునికిని అన్వయించినది. మందోదరి ఆవచనమును [ఒక ప్రాకృతశ్లోకమును] రావణుఁడు తనకంటినయర్థమున గ్రహించుఁగాకయని యత నిర్మోహం జదివినది. అతఁడు దైవవశమున తనకంటినయర్థముగా గ్రహింపక సింగపుంగొదమకే యన్వయించిన యర్థముగా గ్రహించి 'ఇది మావిషయమున నుదాసీన' మని పల్కినాఁడు. 1. ఈప్రకరణము ఇట్లుమూలములో అతిరమణీయముగా ఘటిల్లియున్నది. తెనుఁగులో మందోదరి ఆయొకశ్లోకమునకే. 2. రెండర్థములకును రెండు పద్యములు నేయుటయు, 3. రావణపద్యమును రావణుఁడు వినియు అది తనవిషయమందు 4. ఉదాసీనమనుటయు, నత్యంతాసంగతముగా నున్నది. 5. మూలములో బోయతవాక్యము రావణపరముగా నన్వయించు నని బోయతకు తెలియదు. 6. ఇందు బోయత బుద్ధిపూర్వకముగానే రావణపరాజయమును వాక్రుచ్చినట్లు నిబంధింపఁబడియున్నది. 7. ఇదియే సరియేని 8. సింగపుంగొదమతో బోయత పల్కినమాట నిట నుపన్యసించుట యసంబద్ధము. 9. పోచిళ్లలక్షణమే యిందు చెడినది. 10. చేత నయినచో ఒకపద్యమే రెండర్థములు వచ్చునట్లు చేయవలసినది. చేతఁగానిచో మధ్యమకల్పము ;—

మూ.—మా హొహాహి ణొ అవయిణో । పరిహవమెత్తేణగవ్వణివ్వూఢో
వసుహామిఉంగిరిసంకడ । మఇందసరహస్సణందణోపత్తో.

11. పంచమాంకములో నప్రసక్తముగా ననావశ్యకముగా సీతకు మాటిమాటికి వీరు సంస్కృతశ్లోకములు పెట్టనేల? 12. ఇట నుప్రసక్తముగా బోయతప్రాకృతశ్లోకమునే మందోదరిచేఁ జెప్పించి 13. సింగపుంగొదమయర్థముగల పద్యమును రావణునిచేఁ బలికించి, అతనిచేత నవ్విషయమున నుదాసీన మనిపించి, 14. రావణపరపద్యమును మందోదరిచేఁగాని ప్రహస్తునిచేఁగాని బలికించియున్న నెంతకుశలముగా నుండును. ఈపాటియుం జేతఁగామిచే నిట నాంధ్రీకరణము పెద్దబగ్గిలో నూరేఁగినది.

శా॥ స్ఫారాస్ఫాలితరామలక్ష్మణధనుర్జ్యావల్లరీఝల్లరీ
[2] ప్రారబ్ధధ్వనితప్రరూఢపులకప్రాగ్భారనీరంధ్రితుల్
2103 స్వైరప్రోత్పతదిద్ధకీశకదళీచంచత్కృపాణాంచలో
దారస్ఫూర్జితదోర్బలైకచపలుల్దర్పింత్రు రాత్రించరుల్.

మూ.—[హేలా]స్ఫాలితరామలక్ష్మణధనుర్జ్యావల్లరీఝల్లరీ
[ఝంకారప్రసర]ప్రరూఢపులకప్రాగ్భారనీరన్ధ్రితాః

[వ్యావల్గత్కపికణ్ఠకాణ్డ]కదళీ[క్రీడ]త్కృపాణాఞ్చ[ల
న్స్ఫూర్జద్దుర్జయ]దోర్బలైకచపలా[శ్చఞ్చన్తి]రాత్రిఞ్చరాః.

ప్రాసలకై నాలుగు మార్పులు, యతి కొకటి, ఒకక్రియకు తెనుఁగు, మూఁడు తెనుఁగువిభక్తులు. ఈఫక్కి మంచిది, మూలగ్రంథము విశేషించి నష్టముగా లేదు. 1. మూలములో కపికంఠములు చెప్పఁబడినవి. శత్రుసంహారమునకు కంఠము నఱుకుట ముఖ్యము. మఱి యెన్నియవయవములం గొట్టినను చావు తత్క్షణమే కలుగదుగదా. కాన నిట తెన్గులో కంఠమును వదలుట సరిగాదు. 2. క్రీడకు బదులు గత్యర్థకమైన చంచనమును మాని క్రీడార్థకమునే ఛందోభంగములేకయే వేయవచ్చును.

ధీరోద్యత్కపికంఠకాండకదళీదీవ్యత్కృపాణాంచలో
అనిమార్చిన కంఠక్రీడలు లభించును.

[2] దేవరా! భవదభిప్రాయాభిజ్ఞుండయిన మాల్యవన్మంత్రిచేత ముందే యిది
2105 చెప్పంబడియెను.

1. చెప్పంబడియెను—మూ. సంవిహితమ్—ఈమాట కిది యర్థముగాదు, సమకూర్పంబడెను, చేయంబడెను అని యర్థము. సంవిపూర్వకధాధాతువునుండియే సంవిధానము వచ్చినది. తెలియమిగాదు మార్చితి మన్నను ప్రయోజనము లేదు. మార్పులో మెఱుఁగు లేదు, రసము చెడినది, ఉత్తరవిరోధము కలిగినది. 2. కుంభకర్ణేంద్రజిత్తులను రణమునకు పంపుమని రావణాజ్ఞ. మాల్యవంతుఁ డింతకుముందే పంపెనని యీయుత్తరము. చెప్పినాఁ డనుటచే వారు యుద్ధమునకుం బోయినారని యర్థముగానేరదు. చేసినాఁడు సమకూర్చినాఁడు అనుటచే యుద్ధముచేయుచున్నారని యర్థమగును.

౯౨ - వ పుట.

[ప్రభిన్నశబ్దార్థము తెలియమి. అన్వయము గర్హ్యము.]

[6] తే॥ భిన్నభిన్నంబులౌమరుభ్సింధురోరు । కుంభమౌక్తికవిచకిలగుణము నొజ్జ
2111 మాహవోత్కంఠితాభ్రచరాఘులకును । జంద్రహాస ముస్మీలనసమ్మదమిడును.

మూ.—భిన్నప్రభిన్నసురకుఞ్జరకుమ్భముక్త
ముక్తాఫలై ర్విచకిలైః కలితాధివాసః
సంగ్రామకౌతుకితఖేచరలోచనానా
మున్మీలయ న్ముద ముదఞ్చతి చన్ద్రహాసః.

ప్రభిన్న = మదము పట్టినయేనుఁగు, శబ్దరత్నాకరము. "ప్రభిన్నో గర్జితో మత్తః" అని కుంజరప్రకరణములో అమరసింహుఁడు.

అసంపదస్తస్యవృషేణగచ్ఛతః । ప్రభిన్నదిగ్వారణవాహనోవృషా
కరోతిపాదావుపగమ్యమౌళినా । వినిద్రమన్దారరజోరుణాఙ్గుళీ. కుమార.

"ప్రభిన్నో మదస్రావీ." మల్లి.

విభావసు స్సారథినేవ వాయునా । ఘనవ్యపాయేన గభస్తిమానివ
బభూవ తేనాతితరాం సుదుస్సహః । కటప్రభేదేన కరీవ పార్థివః. రఘు.

"ప్రభేదః స్ఫుటనం మదోదయ ఇత్యర్థః."—మల్లి.

"ప్రభిన్న—సవన్మదగజే." శబ్దస్తోమమహానిధి.

1. ప్రభేదశబ్దము మదోదయపరముగాను ప్రభిన్నశబ్దము మదస్రావిగజపరముగాను, రూఢిచే వ్యవహృతము లయినట్లు భిన్నశబ్దము వ్యవహృతముగాదు. భిన్నశబ్దముచే మదస్రావిని తెలుపుచో కటపర్యాయప్రయోగము వలసియుండును. ప్రభిన్నశబ్దమున కక్కఱ లేదుగదా. "భేజే భిన్నకటై ర్నాగైః." నిఘంటువులోను భిన్నశబ్దమునకు మదస్రావ్యర్థము ఉపాత్తము గాదు. కాన నిట పంతులవారు ప్రభిన్నశబ్దార్థము తెలియక 'పగులఁగొట్టఁబడిన' యని యర్థముగాఁ దలఁచి, భిన్నభిన్న యని దంచినా రని తోఁచుచున్నది. 2. భిన్నంబులౌ — ఇది దేనికి విశేషణము? సింధురములకా కుంభములకా? దేనికైనను అవి సమాసగర్భగతములు. ఇది వ్యస్తము వాని కెట్లు సంబంధించును? ఇట్టియన్వయము అత్యంతగర్హ్యము. ఈరెండు దోషంబులుం దీఱునట్లు పాదము నిట్లు సవరించుకోవలయును:—పరఁగభిన్నప్రభిన్న సుపర్వకుంభి।—పంతులవారు 3. ఒకభిన్నను భిన్నచేసి తామేమోవునరుక్తి తప్పించి మూలమునకు మెఱుఁగెక్కించినట్లు తలఁచినారు. 4. సత్తు పెట్టినారు. 5. ఉన్మీలనసన్మదమఁట.—ఒండుచో ఆయత్తుల కున్మీలనము లేదా? 6. మూలములో ముదము నున్మీలింపఁజేయుచు అనియున్నది. దానికీపాటు.

౬౩-వ పుట.

[8] ఆ॥ నీలుఁడేసినట్టి నీలాద్రిశిఖరంబు । దపులవక్షమున నుదశముఖుండు
2119 తలఁచుఁదరుణివేయఁదనరునీలోత్పలం । బనుచుఁదద్బలంబునగునెయెంచ.

1. తలఁచుఁదరుణివేయఁ దనరు నీలోత్పలం బనుచు = జవ్వని వేసిన [పురుషుఁడు వేసినకొంచెమేని బలముగా తగులును, అట్లుతగులని యనునర్థముకై జవ్వని వేసిన యనుట. మానానురాగాదికారణములు ఇట కథితములు గావుగదా.] [మృదు] పుష్పమువలె నెంచును, అనఁగా వాని కేమియు దెబ్బదగుల లేదు అని భావము. 2. త

తద్బలంబు నగునె యెంచ—అమూలమయిన యీమ్రుక్కు పంతులవారికి మూలశ్లోక మర్థముగామికిఁ బూటకావుగా నున్నది.—మూ.

వక్షఃస్థలే ఝటితి నీలకరోజ్ఝితేన । నీలాచలస్య శిఖరేణ కృతప్రహారః
లఙ్కేశ్వరః స్మరతి నూనమసౌ వతంస । నీలోత్పలప్రహరణం హరిణేక్షణానామ్.

పంతులవారి తెనుఁగులో, రావణుఁడు తనభార్యలు తన్ను అవతంస నీలోత్పలములతోఁ గొట్టిన ప్రహరణములను స్మరించినట్లు లేదు. మూలములో నట్లున్నది. ఎవతెయేని తరుణి పువ్వుతోఁ గొట్టిన నేపాటిదెబ్బ తగులునో ఆపాటి తగిలెనని సామాన్యము వీరి తెనుఁగున నభిప్రాయము. అటుగాక మూలాభిప్రాయమ యేని, తలఁచు ననుటకు స్మరించు ననియు. 3. వేయఁదనరు అనుటకు తన్ను వేసిన అని యనుండును: 4. అనుచు అనుపదము ఉండదు. 5. వీరి యభిప్రాయమునకు తరుణికన్న అబల మేలు. 6. అవతంసశబ్దమును వీరు వదలుటచేత వీరికిని రసంబునకును మ్లేచ్ఛకృకలాసన్యాయము రూఢికెక్కుచున్నది. అవతంసోత్పలప్రహారస్వారస్యము నిటుం గనుఁడు.

స్మరసి స్మర మేఖలాగుణై । రుతగోత్రస్ఖలితేషు బన్ధనమ్
చ్యుతకేసరదూషితేక్షణా । న్యవతంసోత్పలతాడనాని వా. కుమార.

ఇతి విషమితచక్షుషాభిధాయ । స్ఫురదధరోష్ఠమసూయయా కయాచిత్
అగణితగురుమానలజ్జయాసౌ । స్వయమురసి శ్రవణోత్పలేన జఘ్నే.

ఇతి గదితవతీ రుషా జఘాన । స్ఫురితమనోరమపక్ష్మకేసరేణ
శ్రవణనియమితేన కాన్త మన్యా । సమమసితామ్బురుహేణ చక్షుషా చ.

కోపా త్కిఞ్చి దుపానతోపి రభసా దాకృష్య కేశేష్వలం
నీత్వా మోహనమన్దిరం దయితయా హారేణ బద్ధ్వా దృఢమ్
భూయో యాస్యసి తద్గృహానితి ముహుః కణ్ఠార్ధరుద్ధాక్షరం
జల్పన్త్యా శ్రవణోత్పలేన సుకృతీ కశ్చిద్రహస్తాడ్యతే. రుద్రుఁడు.

చ॥ వరునిఁ గృతాపరాధుని నవారణ వారణయాన యానునం
గెరలి భుజాగుణంబున బిగించి వతంసితసారసంబునన్
గరము దమింపఁగాఁదొడఁగెఁ గాంతుని సాంత్వనశీతలోక్తులాం
తరనిజకోపతప్తఘృతధారక కారణవారిధారగాన్. నరసభూ.

ఇందెల్ల నవతంసము నేఁ గవులు చెప్పినస్వారస్యము నరయుఁడు. పంతులవారు దానినే మానినస్వారస్యమునుం గనుఁడు. దయితచే నవతంసప్రహార మొంది

నవాఁడు సుకృతియఁట, రుద్రవాక్యము. ప్రకృతమందు నీలాద్రిశృంగ ప్రహారమునకు రావణుఁడు ఈషత్తేనియు పీడనొందలేదు సరియేగదా, పైగా, మున్ను తాను తన దయితలయెడ గోత్రస్ఖలనాద్యపరాధము లొనర్చి వారిచేత ననుభవించియున్న యవతంసోత్పల ప్రహారమహాభాగ్యమును స్మరించుకొని ఆసంతోషాబ్ధిలో మునింగియుండెను, అని యవతంస శబ్దస్వారస్యము. అతనికి కొండ శిఖరంపుదెబ్బ అపీడాకరముమాత్రమేగాక ప్రియముగాఁగూడ నుండెనని భావము. 7. ఈ స్వారస్యముకొఱకే కవి నీలోత్క్షిప్తశిఖరమునకు ప్రయత్నపూర్వకముగా నీలవర్ణమును చెప్పినాఁడు. 8. తరుణి వేసినమాత్రాన నెల్లరకుం బ్రియమగునా? "యథాయూనస్తద్వత్పరమరమణీయాపిరమణీ। కుమారాణామన్తఃకరణహరణంనైవకురుతే." నైష. "ఏకస్యాం రూపలావణ్యవత్యాం యోషిత్యుపలభ్యమానాయాం సరాగస్య సుఖముత్పద్యతే, సపత్న్యాస్తద్వేషః పరివ్రాజకాదేర్ఘృణా." శ్రీభోజదేవః.—రావణుఁడేనియు తరుణీమాత్రమున కెల్ల ఆహ్లాదించునా. కాన మూలకారుఁడు ప్రియముగా నిబంధించిన దానిని వీరు ప్రియతాహీనముగా వచించినారు. కావ్యమున రసము ఆత్మ. రసము చెఱిచినపిదప నేమియాడంబరముచేసి యేమిప్రయోజనము?

[పంతులవారికి మూల మర్థముగా లేదు.]

శా॥ నీలుండీతఁడుపంక్తివక్త్రకరసన్నిరేభవాంకంబునన్
రోలంబంబువిధంబునంబరఁగెడున్బోల్చన్మఱొక్కండదష్షా
[3] 2122 నీలుండుందశకంఠమౌళులపయిన్నీలాశ్మలీలాఢ్యుఁడై
పోలుంగాఁదిమికిందిమింగిలమునంబుట్టంగడుంజిట్టలున్.

మూ. నీలోయందశముఖపాణిపఙ్క్తిజానా। మఞ్జేషు భ్రమరతులాం భ్రమన్బిభర్తి
అప్యేకో దశసు కిరీటపీఠికాసు। ద్రాక్ష్యేక్ష న్ననుభవతీన్ద్రనీలలీలామ్.

ఈనీలుఁడు తానొక్కఁడయయ్యును దశకంధరుని యిరువది కేలుదమ్ముల యందును శీఘ్రసంచారముచేత ఏకకాలమందే యిరువది తేంట్లుగా నొప్పుచున్నాఁడు, అట్లే పదికిరీటములను పది యింద్రనీలమణులుగా నొప్పారుచున్నాఁడు.—అని యర్థము. 1. పంతులవారు ఇరువురిని నీలులను కల్పించినారు. యీగపద్యంబున తొలినిరువది తేంట్లుగాను తర్వాత పది యింద్రనీలములుగాను ఉన్నమాట అణఁచివేసినారు. వీరికి చేతులయందెల్ల నొకఁడే నీలుండును, తలలయందెల్ల నొకఁడే నీలుండును అగపడినారు గావలయు. 2. అంకంబునన్ అనునేకవచనముచే ఒకచేతమాత్రమే ఒకనీలుఁడును, మౌళుల యను బహువచనముచే అన్నితలలకును ఉమ్మడిగా నొక్కఁడును అగపడియుందురు. ఇద్దఱుగా, నగపడఁగలవాఁడు ఇరువదుగురు

గాను పదుగురుగాను అగపడఁగలఁడు. కాన మూలమర్థముగాక చేసినరచన యిది. కోఁతి రావణునిచేతులమీఁదుగా నతనితల కెక్కెను. 3. చతుర్థపాద ముమూలకము. మూలవిరుద్ధము. తిమిని మ్రింగునది తిమింగిలము. నీలుఁడు రావణుని కేమియు క్షతి నేయలేదు, చేయలేఁడు. తుమ్మెదయు మాణిమణియు నని వీనికిడిన నీచోపమలచేతనే రావణుమ్రోల వీఁడు కడునల్పుఁడని కవి తెల్పినాఁడు. వీఁడు వేసినకొండకొమ్ము అతనికి నీలోత్పలమువలె తగిలినదని యింతకుముందే వీనియల్పసారతను చెప్పియు న్నాఁడు. కావున పంతులవారు చేర్చినపద్యపూరణమాల్యము మూలహృదయశ ల్యముగా నున్నది.

"ఓయన లక్ష్మణునిచేత నొగిఁదాల్పఁబడెన్"—దీని పూరణద్వయస్వాదిమ
2124 మును అనుభవింపుఁడు.

మ॥ పొరిపర్షించిమహాశుగంబులనుదృప్తుండౌదశగ్రీవుపైఁ
[27] దరువాతంబహుశాస్త్రశులంకగతసంత్యక్తాత్మసౌమిత్రిపై
2151 పరహర్షోరుశుగాత్ములంగపులఁదోఁపంజేసిరాముండుశ్రీ
హరిశ్యామాంగుఁడుపొల్చువీరకరుణవ్యామిశ్రుఁడైచూడుమా.

మూ. వర్ష న్నేవ సమన్తతో దశముఖం చాపచ్యుతై స్సాయకైః
సౌమిత్రిం చ విసంజ్ఞ ముజ్కనిహితం నేత్రచ్యుతై రమ్బుభిః
ఏత త్తర్కయ హర్షశోకతరళాః కుర్వ న్కపీనాం దృశః
రామ శ్శ్యామల కేశి వీరకరుణవ్యామిశ్రతాం గాహతే.

1. సంత్యక్తాత్మ—సౌమిత్రి మూర్ఛితుఁడేగాని మృతుఁడుగాఁడని రామాయణమందును దీనిమూలమైన సంస్కృతగ్రంథమందు నున్నది. విసంజ్ఞమ్—అని మూ. వీరేలకో యిచట నత్యంతామంగళముగా లక్ష్మణుఁడు కాలధర్మము నొందెనని వ్రాసినారు. జీవమువిడిచెనన్నను దేహమువిడిచెనన్నను డింకకొక్కటేననియే యర్థము. 2. వీరి యతిప్రాసపోరికోసము దశాస్యుఁడు 3. దృప్తుఁడైనాఁడు, మూలములోఁ గాలేదు. 4. వీరియతిప్రాస 'తరువాతను' లక్ష్మణస్వామి యాత్మ విడిచినాఁడు. ఔరా! ప్రాస దెబ్బ! 5. మఱియు యతిప్రాసవరము వలన తోఁప మొకటి వచ్చినది. 6. ఆయతిప్రాసములకే శ్రీహరి యొకఁడు ప్రత్యక్షమైవచ్చినాఁడు. 7. మూలములో ఈ యతిప్రాసలు లేవుగాన నీయన యటలేఁడు. 8. ఈయనయొక్క హరిత్వము మూలములో ఈయనకే తెలియదు. ఇట ప్రాసముకై బట్టబయలు. 9. ఈయనయొక్క శ్యామాంగము ఇట నెట్లు ప్రస్తుతము? 10. పంతులవారు విద్యాధరిదివీసి శ్రీహరికి పెట్టినారు. మూలములో శ్యామలకేశియని దానికి సంబోధనయున్నది.

11. పంతులవారు దానిది పీఁకివేసి యీయన 12. యంగేముం దగిలించినారు. 13. దృష్టుండా యతిగారి కటాక్షముచేత అమ్ములు వర్షించినవాఁడు దశాస్యుఁడని యొకయన్వయము లభించుచున్నది. కాన యతిపూజ అవశ్యకర్తవ్యము. 14. తోఁపముయొక్క ప్రభావముచే తత్పూర్వముకవులు దాఁగియుండిరని రహస్యము బయటఁబడుచున్నది. 15. వారు చీఁకటిలో దాఁగియుండ వారిని శ్యామాంగుఁడుగాన శ్రీహరి తనయొడలి చీఁకటిచేత వెలికిఁ దార్చెనని తెలుఁగురచయితగారి చమత్కారము గాఁబోలును. పాదపూరణములు ప్రయోగించుకొనువారునుం గలరుగాని, అదియు సరిగా చేతఁగానివారు వీరొకరగపడుచున్నారు. ఈపద్యము అద్భుతతమముగా పాడయినది. 16. మొదట బాణములు వేసినాఁడఁట తర్వాత నేడ్చినాఁడఁట. ఏడ్చినప్పుడు పోరలేదు, పోరినప్పుడు ఏడ్వలేదు, ఇంక వీరకరుణవ్యామిశ్రత ఎట్లు? 17. వీరకరుణక్రమమేగాని. 18. మఱియు ఆక్రమమయినను అతీతమేగాని వర్తమానముగాదు. 19. చూచుటెట్లు? 'చూడుమా' అఁట! ఎప్పుడో పోరినాఁడు, వీరము పోయినది, ఎప్పుడో ఏడ్చినాఁడు, కరుణము పోయినది, ఇప్పుడు ఇదియు లేదు, అదియు లేదు; [వర్షించి, చేసి, పొల్చెన్.] ఈరెండును ఏకకాలమందును ఉండినవిగావు. ఇఁక వ్యామిశ్రతనిపుడు చూచుటెట్లు? మూలభక్కిం గొంచెము తిలకింపుఁడు. 20. వర్షన్, కుర్వన్, గాహతే, మూఁడును అపరిసమాప్తములు, వర్తమానములు, సమకాలికములు. కావునం గనవచ్చును. 21. ఏడ్చుచుం బోరినాఁ డనుటచే తమ్మునిమీఁది యనురాగాతిశయము సూచితమైనది. అది వీరికి పనికిరాక పోయినది. 22. దుఃఖాభిభూతుఁడయ్యును డిల్లవోక ప్రబల శత్రువును అంపవానలో ముంచెనని పరాక్రమాతిశయము సూచితమైనది. అదియు వీరికి పనికిరాకపోయినది. 23. పరహర్షోరుశుగాత్ములఁట — వారియాత్మలో హర్షమున్నదో శుక్కున్నదో యెట్లు తెలియును? ప్రత్యగ్దృష్టి యెల్లరకును గలదా! ప్రాగ్దృష్టికే తెలిసినమంచిది కదా? 24. పైగా, చూడుమనుచున్నాఁడు. చూచిన సులువుగాఁ దెలియునట్లు జయదేవకవిసార్వభౌముఁడు పతితృజనైకబాంధవుఁడు 25. కపులనేత్రములను హర్షశోకతరళములను చూడుమన్నాఁడు. బాష్పములచే తెలియు నని ఆయన భావము. పంతులవారు 26. పర, 27. ఉరు అని ఆకపులకు కన్నులు పోవునట్లు చేసినారు. ఇది పద్యమఁట, కవనమఁట! ఆంధ్రీకరణమఁట! అదేమియుఁగాదు, శారదకు పంతులవారు పెట్టిన ముంతపొగకాలు.

[పంచమ్యర్థము తెలియమి.]

విద్యాధరి—రాము నారసముల గములచేఁ జీల్పఁబడువాఁడగుచు నెదురుగ
2152 వచ్చుచున్నాఁడు పదిమొగముల రక్కసుఁడు.

ఎదురుగ వచ్చుచున్నాఁడు—ఎవరికి? ఆకాశగతయైన విద్యాధరికని నేఁదలంపను; శ్రీరామునికిఁ గావలయును.—ఇఁట మూర్ఛితుఁడైన లక్ష్మణుని విచారించుకొనుటకు శ్రీరాముఁడు అవకాశాపేక్షియై అపరిమేయ బాణప్రయోగముచే రావణుని రణరంగమునుండి తొలఁగించినాఁడని మూలము. అట్లే ౯౮ - వ పుటలో అమ్మహౌషధు లను పద్యమునకు తర్వాత గద్యములో రావణుఁడు వెండియు రామసమ్ముఖమ్ముగ వచ్చుచున్నాఁడని చెప్పఁబడియున్నది. ఆవాక్యమునకును ఈ “యెదురుగవచ్చుచున్నాఁడు” వాక్యమునకును నడుమ మఱి రావణుని ప్రస్తావము లేదు. కాన, నిట వచ్చుచున్నాఁడనుట తప్పనియు ‘పోవుచున్నాఁడ’నవలసినదనియు విశదముగదా. వీరు వ్రాసినట్లు ఎదురుగానే వచ్చినచో నితఁడు కదనము నేయక రామయ్యగారికి మనస్సు కుదురుపాటునకు వచ్చునందాఁక ఏమిచేయుచుండెను? వీరెట్లేద్దురో, ఆవింత చూచుచుండెనా? ఈపొరఁబాటు గీర్వాణభాష తెలియమిచేఁ గలిగి ఊహాచాలమిచే నెలకొనినది. రామసమ్ముఖా త్పరాపతతి అను ముక్కలోని పంచమికి పంతులవారి కర్థము తెలియలేదు. రామునిమ్రోలనుండి తొలఁగిపోయె నని యర్థము. విభక్త్యర్థజ్ఞానము లేక, సమ్ముఖా త్పరాపతతి, సమ్ముఖం పరాపతతి, యను రెంటికిని ఒకటియే యర్థము ఈయాంధ్రీకర్తగారు వ్రాసికొన్నారు. ఈరెండవవాక్యమే, ‘అమ్మహౌషధుల’ తర్వాతి గద్యములో [“రావణుండు వెండియు] రామసమ్ముఖమ్ముగ వచ్చుచున్నాఁడు” అను ముక్కకుమూలము. పంచమికిని [ఎదురుగ] సమ్ముఖముగ అనియే వ్రాసినారు, ద్వితీయకును సమ్ముఖముగ అనియే వ్రాసినారు. కవితాతత్త్వ మదియేగదా?

[దడ్లంకపద్యము.]

తే॥ వత్సలక్ష్మణయంబకాబ్జములఁదెలుపు
[2] 2154 మయ్యాయువ్వెత్తుగసమస్తమస్తమయ్యె
భాగ్యమర్కకులమునకుబ్రదిమిరాము
నకునునయనాంజనంబూర్మిళకునునకట.

1. ఊర్మిళనయనాంజన మస్తమయ్యెనుటచే సౌమిత్రి మృతిఁజెందినాఁడని నిస్సందేహము. శివశివా! ఇది యెక్కడిలెక్క! అర్కకులభాగ్యము, రామజీవితము. ఊర్మిళానయనాంజనము (ఈ) సమస్తము అస్తమయ్యెనని పద్యమున కర్థము. కానిచో, సమస్తమస్త మయ్యెననఁగా సర్వవిశ్వమును అస్తమించినదని యర్థము చెప్పి, అచటికి ప్రథమవాక్యము ముగింతము. అపక్షమున శ్రీరాముఁడు అర్కకులభాగ్యము లోనగువానికి అకట యని యేడువనేల? ఊర్మిళకు నయనాంజన ముండనేల యని

యేడ్చుచున్నాఁడా? లేక, ఈభాగ్యాదులకు లక్ష్మణునితో నైక్యము చెప్పుట తెనుంగు రచయిత హృదయమా? ఆ పక్షమున అట్టివాఁడవు ఇట్టి యవస్థపాలైతివని సంతాపించుటయు నాశయమా? కానిండు ఆపక్షమున ఈ తెలుఁగు మూలమున కత్యంత విరుద్ధము. మూలము అమంగళార్థము గాదు. ఈయమంగళమునకు ప్రాయశ్చిత్తము గానే యున్నది.

హా వత్స లక్ష్మణ వికాసయ నేత్రపద్మే
మాగాదిదం యుగపదేవ సమస్త మస్తమ్
భాగ్యం దివాకరకులస్య చ జీవితం చ
రామస్య కిం చ నయనాఞ్జన మూర్మిళాయాః.

అయ్యో నాతమ్ముఁడా, లక్ష్మణా, కనుదమ్ములం దెఱవుము; దినకరకుల భాగ్యము రాముని జీవితము ఊర్మిళానయనాంజనంబును ఈసమస్తము నువ్వొత్తుగ నస్తమింపకుండును గాక — అని యర్థము. అస్తమింపకుండును గాక యను మాటను చక్కఁగా జపింపుఁడు, అస్తమయ్యె నన్న దోషము తొలంగును. 2. లక్ష్మణుఁడు తేఱకున్న, దినకరవంశమునకుం గల్గు క్షతికన్న, తనకుఁగల్గుమృతికన్న, నూర్మిళకుం గల్గు దుర్దశ అత్యంతశోచనీయమని శ్రీరాముఁడు తనకు స్నుషాప్రాయయయిన యాయబలయందు బాలయందు కరుణాతరంగితమానసుండై తదీయదుర్దశను వేదను, 'కించ' యని వేఱుచేసి చెప్పినాఁడు. ఆ 'కించ' చేత అంత యభిప్రాయము విశదమగుచున్నది. తెనుఁగులోని యమంగళపు డక్లంకబాజాలో నిదియెల్ల నణఁగారి పోయినది.

౯౪ - వ పుట.

[2] "మాపినతల్లి కాళ్లకు నమస్కరణంబు నొనర్చునప్డు" —
2156 1. మాపినతల్లి కైకేయిగదా! ఇట సుమిత్రను రాముఁడు మాపినతల్లి యనుచున్నాఁడు. అశ్లీలతాదోషము. 2. కాళ్లకు — ఈ పదమును కవులు వాడినను వాడిరిగాని గ్రామ్యకళ్యావగాహిగా నున్నది.

విద్యాధరి. — ఈక్రోంచియను బదితలల రక్కసునిచేఁ జేయఁబడిన యేర్పా
[3] టునం గొండ నిగరముం గైకొనుచు రాముని కెదురుగ వచ్చుచున్నది.—
2159 ఆంజనేయులు ద్రోణపరత్వముం దెచ్చుటం గని విద్యాధరి క్రోంచి యేదో రావణపక్ష మవలంబించి రాముమీఁద కొండశిఖరము వేయుచున్నదని శంకించి ట్లుపల్కినది. దశముఖేన కృతసంధానః = దశముఖునిచే [లేక, దశముఖునితో]

చేయఁబడిన [లేక, చేసికొనఁబడిన] సంధిగలదై అనఁగా దశముఖునిపక్షము చేరి. 1. సంధానమనఁగా ఏర్పాటుగాదు. పైగా పంతులవారు 2. సంధానాత్ అని పంచమిగా మార్చుకొనియు నుందురు. 3. తదీయుఁడయిననే గదా వానియేర్పాటున కొడంబడును. కాన తదీయతాపాదకమయిన సంధినే సంధానమునే మూలోక్తమునే చెప్పక అసంభావ్యతాదూషితమైన యేర్పాటును చెప్పనేల ?

౯౫ - వ పుట.

శా॥ నాకస్త్రీకుచకుంభకుంకుమలసన్నానావిధస్థాసక
[17] శ్రీకాండంబు స్పృశింపకేచెఱుపనేచెఁవాల్గలాఁడేఁడికన్
2176 వీఁకన్దారితదివ్యవారణశిరోనిర్యన్మణివ్యక్తహా
సైకంబెవ్వనిచేతవాసవయశోహచ్చంద్రహాసంబగున్.

1. వాసవయశో హచ్చంద్రహాసంబు— అవిమృష్టవిధేయాంశతాదోషము. 2. హచ్చంద్ర— ఇందలిహర్తను నాదడంబరమునకు నశాబ్దికు లలరుదురు. మూలమున చన్ద్రహా [చన్ద్రహాసః] అనియున్నది. చన్ద్రహన్ అనిప్రాతిపదికముగదా. దానిని 'చన్ద్రహత్' అనిభ్రమసి వీరిట్లుప్రయోగించి యుందురా ? "అన్యేష్వపిదృశ్యతే" అనుసూత్రముచే సర్వోపాధివ్యభిచారముగా డప్రత్యయముపెట్టి "చన్ద్రహా" అని అకారాంతప్రాతిపదికమును సాధించి దానిపై ఆచారార్థక్విప్పచేర్చి అటుపై శతృప్రత్యయముకూర్చిన నీయశోహర్త్రు సిద్ధించును, గాని, దృశ్యతే అని పెద్దలు తాముగన్నవానికి చెప్పఁగా ఇటుమనమే పెద్దలమై మనముగన్న దీనికి చెప్పవలసియున్నది. హృచ్చంద్ర అనిదిద్దుకొన్న బాగు. ఏదోఒకసాధనమార్గముకూడ చూపినపిమ్మట నిఁక నేలదిద్దుకొందురు. పయము దిద్దుకొన్నారా ? కఖగఘప్రాసము దిద్దుకొన్నారా ?

కవనంపుసొంపు. — ప్రాసజిత్తు యథాపూర్వము. నాక అర్థలబ్ధము. 3. శ్రీకాండము, 4. వీఁక, 5. ఏక—పాపరపుల్లలే. 6. లసన్నానావిధ—య. ఇట నానావిధయని చెప్పుటవలనం బ్రయోజనము లేదు. 7. ప్రాసబంధువైనవీఁకకు అన్వయక్లేశము మెండుగా నున్నది. 8. అగుధాతువుతో వీఁక నగున్ అని యన్వయమేని అర్థ మేమి ? 9. దారితాదిసమాసగర్భస్థపదములతో నిది యెట్లన్వయించును ? ఇది యేమి యశ్వత్థామాస్త్రమా ?

మూ. విన్యాసం నాకనారీకుచకలశలసత్కుఙ్కుమస్థాసకానా
మస్పృష్ట్వా వ మార్ష్టు మానీ దనికలహకళాకోవిదః కో విదగ్ధః

భిన్నస్వర్గేభకుమ్భస్థలబహుళగలన్మౌక్తికవ్యక్తహాసః
కస్యాక్రీడత్కరాజ్ఞే త్రిదశపతియశశ్చన్ద్రిహా చన్ద్రిహాసః.

10. కుచకలశలసత్కుఙ్కుమస్థాసక.— కుచకుంభములందు, [లసత్ =] ఒప్పుచున్న, కుంకుమమైపూఁతలు అని యర్థము. వీరు లసత్తును కుంకుమకు తర్వాత వేసినారు. కుంకుమలసత్ ... స్థాసక అన్నారు. ఇందలిభేదమును కుంకుమమే స్థాసకమగు నని యెఱుంగు సహృదయులే యెఱుంగుదురు. అవిరుద్ధార్థము కలుగునట్లుగా ఆసమాసమును విగ్రహించుటకు ఎంతక్లేశము వలయునో పడియే యెఱుంగుఁడు. 11. నానావిధ అని ముందు [అనావశ్యకముగా] చెప్పియు మఱల కాండ అన నేల? 12. మూలమందు మౌక్తిక అనుటచేఁ గలిగిన హాసోపమానోపయోగ్యర్థస్ఫూర్తిసౌకర్యము మణిశబ్దంబునం గలదా? 13. వాసవ—మూలములో త్రిదశపతి; దానిచే దేవసమూహ సమన్వితుఁడై యింద్రుఁడు ఇతని కోడె నని యితనిజయోత్కర్ష తెలియుచున్నది. తనప్రజలను దేవతలను ఇంద్రుఁ డితనివలననుండి రక్షింప నేరఁడాయెననియు తెలియుచున్నది. ఏకాకిని ఇంద్రునింగొట్టుటగాదు సదిక్పాలు నేకూల్చుటయనియు విశదమగుచున్నది. ఇదియెల్ల వాసవ యనుటచే తుస్సయినది. 14. మఱియు అగుఁ అనుచో ఉద్దేశ్య మేది, విధేయ మేది? దారిత ... నైకంబు విధేయముగాను, వాస...సంబు ఉద్దేశ్యముగాను వాక్యమందగ పడుచున్నది. 15. ఇందు వాసవునియశము నడంచుటయు విధేయాంశమే, దానిని ఉద్దేశ్యములోఁజేర్చుకొనుట సరియే? 16. యశోహంత్తు యశశ్చంద్రహాసమునకు సమమా? 17. విన్యాసమునకు—“నానావిధ, శ్రీ” లుపమములా? అక్కఱతో ప్రీతితో చేసికొన్న న్యాసము విన్యాసము. పతులుచేసినదనియును స్ఫురించుచున్నది. వైవిధ్యమాత్రమా దీనిస్వారస్యము? శోభామాత్రమా దీనిస్వారస్యము? పతికృతప్రీతిపూర్వకరచనా వైదగ్ధ్యము దీనిస్వారస్యము. దానిం జెఱిపిరనాఁడనుటచే, బడిపంతులు ఓనమాలు నేర్పునపుడు క్రొత్తయక్షరములు వ్రాయుటకై మంటిలో తొలి వ్రాసినయక్షరములను చెఱుపువిధముగా మకరికాపత్త్రిరచనను చెఱిపె ననియర్థము. అంతియగాని వారికుచకుంకుమమును స్నానత్యాళితాపగతమువలె పోఁగొట్టెనని యర్థముగాదు. మూలమునకు వీనిచే బందీకృతభర్తలై దేవాంగనలు సోరస్తాడమేడ్చిరి, అశ్రువులుగురిసిరి, అని యర్థము; బందీకృతభర్తలై రని ఫలితార్థము. అభూయోధారణము ఏతత్కార్యముగా గమ్యమగుఁగాక. మార్ష్టమ్=తుడిచివేయుటకు; చెఱుచుటకుఁగాదు.

ఘర్మామ్భోవిసరవివర్తనైరిదానీం । ముగ్ధాక్ష్యోః పరిజనవారసున్దరీణామ్
తత్ప్రాన్తర్నిహితవిచిత్రపత్త్రిరేఖా । వైదగ్ధ్యం జిహాతి కపోలకుఙ్కుమానీ. భవ.

శ్రీశబ్దముచేతనే వైదగ్ధ్యము వచ్చునందురేని, వచ్చుఁగాక, పతికృతత్వము విన్యాసపద్దముచే వచ్చునుగాని దీనిచేతరాదు.

[అంతయుంగలదు ఐదువతనముతక్కవ అన్నట్లున్నది.]

[20]
2196 శా॥ పోలంబల్కెడుమెట్టులీదశముఖుంబోరంబడన్వజ్రఘా
తాళుల్నవ్వెడువాఁడువీఁడనావిహాయస్సారకాసారస
ల్లీలన్వీనివిపాణిపద్మములుమేల్మేలౌనసంగంగడుం
గైలాసంబునుజంద్రమౌళియుతముంగావించెరాయంచగాన్.

1. ఆఖల్—మూర్తపదార్థమునకు పాదపూరణార్థము ఆళిపెట్టిన అదియే అసహ్యము, అమూర్తమయిన ఘాతక్రియకు పెట్టిన నిఁకఁజెప్పవలయునా! 2. పడన్—కర్త వజ్రఘాతాళులు. ఎవరికి పడినివి? యుద్ధములోఁ బడినవఁట, ఈయన నవ్వినాఁడఁట. నేనును నవ్వుచున్నాను. దీన నతని బలపరాక్రమము లెట్లు తెలియును. వీఁడు పోరఁగా వీఁడు పడఁగా అని యన్వయమా? 3. పోరి, పడి, అనియేని యున్న నీయన్వము బాగుపడును. పూర్వార్థముగతి యిట్లైనదిగదా; ఉత్తరార్థముం జూతము. దాని కర్థ మిది.—ఆకాశసరస్సున ఇతని కేలుదామరలు కైలాసమ్మును రాయంచగాఁ జేసినవఁట? 4. కైలాసమును రాయంచగా ఇతని కేలుదామరలా చేసినవి? ఆకాశమును సరస్సుగాను, ఇతనిచేతులను తామరలనుగాను, చేసినవారే కైలాసమునుగూడ హంసగాఁజేసినారు. సాధర్మ్యమహిమచే ఆకాశము సరస్సువలెనున్న, ఇతనిచేతులు తామరలవలె నున్న, ధావళ్యాది సాధర్మ్యముచే కైలాసము హంసవలెనుండెను. కాని ఆధావళ్యాదికము కైలాసమునకు ఇతనిచేత వచ్చినదిగాదు. కాన ఈవర్ణన అసంబద్ధప్రలపితముగా నున్నది. 5. ఇందు కైలాసమును ఇతనిచేతు లెత్తినవని యితనిబలోత్కర్షం దెలుపుట సున్నయైనది. కావున నీపద్యము పొల్లు. 6. సత్తు ఒకటి. ప్రాసజిత్తు:—కైలాసమర్థలబ్ధము 7- 9. కడముమూఁడును అంటెంచుకొన్న మీసములు. 10. వీనివి వచ్చినవి. అవి యేవో అని సందేహమువలదు, పాణిపద్మములు. 11. కడున్—అదృశ్యదేవతలు మొదట మేల్మే లన్నారు, ఇంకను చోటుండినది, అంతట ఔనౌనన్నారు, అప్పటికిని చోటు మిగిలియున్నది, వారేమి చేయుదురు, మఱల మఱల ' మేల్మేలు, ' ' ఔనౌను, ' అనుచు ఉండిరి. 12. ఆదిలో ఇతనిపాణులు కైలాసమును చంద్రమౌళియుతము చేసినవని, అనఁగా చంద్రమౌళిని తెచ్చి కైలాసముం దుంచినవని తోఁచును. తర్వాత రాయంచగా చెక్కినవని సిద్ధాంతమై పోవును.

శా॥ కిం బ్రూమో దశకంధరం నిజచమూరక్షైకవాటీభవ
ద్వక్షఃపీఠపతత్కఠోరకులిశాఘాతేషు జాతస్మితమ్
వ్యోమాభోగసరోవికాసిని వనే యత్పాణిపఙ్కేరుహాం
కైలాసేన శిరస్స్థితేన్దుకలికోత్తంసేన హంసాయితమ్.

తన సేనను రక్షించుతలుపుగా నొప్పుచున్న (తన) వక్షఃపీఠమున పడుచున్న కఠోరవజ్రఘాతములకై యెవనికి చిఱునగవు గలిగెనో, మఱియు ఆకాశవిశాలత యనుసరస్సులో వికసిల్లియున్న యెవనికేలుదామరగుబురునందు కైలాసము శిరఃస్థితచంద్రకలికాశేఖరము హంసవలె రాజిల్లుచుండెనో, అట్టియీదశకంధరుని ఏమని పొగడుదుము.—13. పూర్వశ్లోకములో 'త్రిదశపతి యశశ్చన్ద్రిహా' అను విశేషణముచే ఇంద్రుఁడు రావణఖడ్గమునుండి తనప్రజలను త్రిదశులను కాపాడనేరఁడాయెనని తెలిపి, ఇందు రావణుఁడు ఇంద్రుని వజ్రాయుధమునుండి తనసేనను కాచెనని కవి వర్ణించినాఁడు. 14. కవాటీభవత్—కవాటశబ్దస్వారస్యమేమన ;—వజ్రమును తనసేనపైకి పోనీక తానడ్డపడి తనఱొమ్మున దానిదెబ్బను గ్రహించి తనసేనను గాచినవాఁడై, కొండల వ్రక్కలించునదైన యావజ్రము తనఱొమ్ము నేమియు నొంప నక్షమముకాఁగా, నీయాయుధముశక్తి నాబలముముందఱ ఏపాటి, యనునర్థముగా మందహాసము చేసినాఁడని యభిప్రాయము. కవాటశబ్దముచే నిజసేనారక్షణము విశదము. తలుపువేసికొని యింటిజనులు ఎట్లు నిర్భయముగా నుందురో అట్లే ఇతనిసేనలు యుద్ధములో ఇతనివక్షముచే రక్షణపొంది ఇంద్రాదిశత్రువులను సరకుగొనకుండెనని స్వారస్యము. 15. వక్షఃపీఠపతత్తనుటచే వజ్రాయుధప్రహారములు తగులుట ఇతనిఱొమ్మునకే యని స్పష్టమేగదా? ఇంద్రుని వజ్రఘాతము రావణువక్షముపై పడెనో లేదో దేవునికే యెఱుకగాని, పంతులవారి పేనాయుధాఘాతము "నిజచమూరక్షై కవాటీభవద్వక్షః పీఠపతత్కఠోర" అను విశేషణముపైఁబడినది, మనకే యెఱుక. ఇందువలననే పూర్వార్థము తత్తకపిత్తకయైనది. 16. ఇందులో ఉత్తరార్థమున రావణునిచేతులనెడు తామరగుబురులో కైలాసము హంసవలె నుండినది యని అధికరణార్థసప్తమీప్రయోగముచే రావణునిచేతులలో కైలాస ముండెనని యర్థమగుటచేత కైలాసధరణము చెప్పఁబడినది. ఆధరణము పద్యములో నున్నదైనది. 17. వ్యోమ...వికాసిని, అనుటచే ఆధరణము ఉద్ధరణమైనది. 18. కలికా=మొగ్గ. 19. ఇందుకలిక = మొగ్గచంద్రుడు, లేఁతచంద్రుఁడు, శ్లేషచే చంద్రుఁడనెడుమొగ్గ. ఆమొగ్గ ఉత్తంసముగాఁగలవాఁడు శివుఁడు. చంద్రమౌళి యన్న నీస్వారస్యము కలదా? 20. రావణుని వీఁడు అని తిరస్కారముగా

పల్కుటు సరిగాలేదు. పద్యము నిట్లు మార్చుకొన్నచో సారమేమో రాదు గాని కొంత సందర్భశుద్ధియేని కలుగును.

ఏలీల న్వచియింతు మీదశముఖున్ హృత్కీర్తిపై వజ్రఘా
తాళు ల్దాఁక నితం డని న్నగు విహాయస్స్వార కాసారస
ల్లీలన్ వీనికరాబ్జషండమున మేల్మేలౌననం గ్రాలె నా
కైలాసంబు శిరస్థ్సచంద్రకలికాకల్పంబు రాయంచగాన్.

శా॥ హేలోన్మూలితశూలిశైలములుదత్తైలాదిలోకార్తులున్
[3] 2199 శ్రీలంకాభయదంబులింద్రనగరస్త్రీబృందబందీకర
శ్రీలంబుల్ జనకాత్మజాకుచలసచ్ఛ్రీకుంకుమాస్థంబులే
మాలోకింతుము పంక్తికంఠజయదోర్వ్యాపారముల్గ్రాలెడున్.

1. ఇలాది, 2. శ్రీ, 3. శ్రీలంబుల్, 4. శ్రీ, 5. ఏమాలోకింతుము [పశ్యా స్మః అనుపాఠముకన్న సోత్కర్షమ్ అనుపాఠమే శ్రేయము] 6. లంకాభయదంబులు [లంకా + అభయద అనుటకు లంకా + భయద అనియు ఛేదము లభించునట్లు వ్రాసికొనుట.] — ఇవి కపనము కుదురమిని "ఏమాలోకింతుము" అని సాక్ష్యము చెప్పుచున్నవి. 7. ప్రాసజిత్తున్నది:— హేల అర్థలబ్ధము, కడమమూఁడును బజాఱుచెత్త.

[తెరలో] ఓయి దశకంఠుఁడా,

[6] తే॥ అకటసౌజన్యము క్షుఁడపగుచునీవు। ఖరుఁడుమారీచుఁడునువాలియరిగినట్టి
2205 తొంటిదారినెయరుగంగఁగొంటివీవ। నంధువునఁబడునంధానుగాంధునివలె.

విద్యాధరుఁడు — వీనిచే సాకూతంబుగం బలుకంబడు దానినంతయు విందము.

ఈ నేపథ్యభాషితము శ్రీరాములది. [వీనిచే = రావణునిచే] విద్యాధరుఁడు దీని యుత్తరము సాకూతంబనుటచే నిదియు సాకూతము గావలయు. 1. ఇప్పుడిది యున్నదియున్నట్లు చూడ నేమియు నాకూతము గానరాదు. 2. తొంటిదారి యనుటచే దౌర్జన్యమాత్ర మర్థమగుచున్నది. తొంటి లేకున్న నాబాణముచే చచ్చుటయని యర్థమగును. ఆయాకూతము తొంటిచే చెడినదిగదా? 3. ఇట తనంతట నర్థము రాకున్న వృత్తిని ప్రయత్నపూర్వకముగా తొంటిశబ్దముచే నివారించినందున తర్వాత "అంధువునఁబడు నంధాను గాంధునివలె" చూపిన దృష్టాంతము దీనికి సరిపోలేదు. దృష్టాంతము వృత్తిని సూచించుచున్నది, దార్ష్టాంతికము దానిని నిషేధించుచున్నది.

4. మఱియు "నంధువునఁబడ్డునంధాను గాంధునివలె" నల్లుటచే నాకూత మున్నను ఆవిష్కృతమై యనాకూతతం బొరయును. అట్లే సౌజన్యముక్తుఁడ వనుటయు ఆకూత భంజకమే.

పూర్వ మేవ ప్రయాతానాం ఖరమారీచ వాలినామ్
సౌజన్యముగ్ధః పన్థాన మనువర్తితు మీహసే.

5. సౌజన్యముక్తపాఠమును సౌజన్యముగ్ధ యని దిద్ది, తొంటితుంటి విఱుగ, అంధువునఁబడు నంధాను గాంధునివలె వ్రాయుట మానిన మూలానుగుణమగును, ఆకూత సమృద్ధమగును. సౌజన్యముగ్ధుఁడనఁగా అమిత్రులమీఁది చెలిమిచే గుణదోషము లరయనివాఁ డనియర్థము. ముందు వారుపోయినదారి యేదన రామబాణముచే చావు. పంతులవారిశైలిగానే తద్దోషములులేకుండ పద్యమును సవరించెద.

అకటసౌజన్యముగ్ధుఁడవగుచునీవు।ఖరనిశాటుండుమారీచకర్బురుండు
వాలియునుమున్నుచన్నయావర్త్మయందె।పోవఁగోరుచునున్నావుపాలనుదిండి.

6. మఱియు అంధువునఁబడునంధానుగాంధునియం దొకవింత యగపడు చున్నది! పడినవాఁడు ప్రథమాంధుఁడా, ద్వితీయాంధుఁడా? వరుసగా నిద్దఱుం బడిననేగాని దృష్టాంతము సరిపోదు. పంతులవారివాక్యము ద్వితీయునిమాత్రమే కూర్చునుగాని ప్రథమునిం గూల్పదు. పడువిశేషణము సమాసగర్భగతాంధునికిఁ జెల్లదు, అంత్యాంధునికిఁ జెల్లును. ఆద్యుఁడు పడనిచో [అనఁగా ఖరాదులకు అపాయము లేనిచో] తదనుగతిచే నంత్యునికి [రావణునికి] అంధుపాతము [అపాయము] ఎట్లు? వక్షితార్థసంగతముగా తెనుఁగువాక్యములు వ్రాసికొన వీరి కిఁక నెన్నిఁటికిఁ దెలియునుటు! ఈపాటి పద్యమయిన మూలమునకు సరిగా కుదురదుగదా!

౯౭-వ పుట.

"అంధువునఁబడునంధానుగాంధునివలె."

విద్యాధరుఁడు—వీనిచే సాకూతంబుగం బలుకంబడుదానినంతయు వింటిమి.

[4] రాముఁడు.—వాక్సాయకముచే హృదయమునఁ గొట్టఁబడినట్టి వాఁడు
2209 పంక్తికంఠుఁ డింకు డేమిపలుకఁగలఁడు?

1. రంగమందు విద్యాధరియు విద్యాధరుఁడును దప్ప తృతీయుఁడు లేఁడు. రామప్రవేశమును ఎచటను ఇంక చెప్పలేదు. ఇట రాముఁడెట్లుట్టిపడినాఁడు! తెలివివారికి దీనం దెలియుదా ఇట నేదో గొప్పతప్పున్నదని? ఏతన్మూలము.

విద్యాధరః.—ఆకర్ణయామ స్తావత్సాకూత మనేన ॥ రామః ॥ వాక్సాయకేన హృది తాడితః కిమధునా వక్ష్యతి దశకంధరః.

2. "పలుకంబడుదాని"—ఈమాట అమూలకము. ఇది లేక భాషిత మసమగ్రము అనన్వితము. కాన దీనిని వీరు చేర్చుకొన్నారు. ఇంతియగాని ఇది లేమిలింగముగా వాస్తవమయినదోషమును గనిపట్టలేకపోయినారు. 3. ఆకర్ణయామః మొదలు దశకంధరః అను తుదవఱకు ఈవాక్యమెల్ల విద్యాధర భాషితమే దీనినడుమ అంధుని ముద్రణముచే రాముఁడు వక్తయయినాఁడు. వాక్యము ముద్రింపవలసిన రీతి యిది. 4. రాముని కిరుప్రక్కలం బెట్టిన జంటగోడలను పడఁగొట్టివేసి విసర్గ బాపులను పూడ్చివేయవలసినది. ఈముద్రకుఁడు నాలుగుగోడలనడుమ రెండుబావులు కట్టించినయాకూత మేమి? అరక్షితముగాఁ బడుటకై గోడలు చాటుకొఱకు. ఒకబావి తనకు, రెండవది తన్ను ననుసరించినవానికి. ఇద్దఱు నొకటనే పడిన నిఱుకటమగును, చావుతప్పినం దప్పినం దప్పును. వహవ్వా వీని ననుసరింపవలసినదే!

విద్యాధరః.—ఆకర్ణయామ స్తావత్సాకూత మనేన రామవాక్సాయకేన హృదితాడితః కిమధునా వక్ష్యతి దశకంధరః.

విద్యాధరుఁడు—వినదముగాక ఈ రామవాక్బాణముచే సాకూతముగా ఎదం గొట్టఁబడిన యీదశకంధరుఁడు ఇపుడేమి పల్కునో!

అంధుపునఁబడు సంధానుగాంధునవలె నను నిజోక్తి సాంగోపాంగముగా అన్వయించినదా? ఈ పాటి స్వబుద్ధివినియోగమెఱుఁగనివాఁడు కవితాతత్త్వవిత్తఁట! లోకులు కన్నుమూసికొనియున్నారు. ఈభాష కిట్లు విషముపోయు వీరే లోకు లామెను ముగించినట్లును తాము సంజీవనము నేయుచున్నట్లును ఎత్తుధ్వజమునుగూడ లోకులు హర్షించుచు చూచుచున్నారు! ఇట్టింద్రజనుండి జగదీశ్వరుఁడే యీభాషను రక్షింపవలయును.

చ॥ ఖరుఁడన నెంతవాలియనఁగంగపిమారిచుఁడన్న జింకత
[27] 2236 త్థరముఖజంతులందునిమిత్తాంచెదవేటికఖర్వగర్వమీ
వరయుమువచ్చెవీఁడిటుదశాస్యుఁడుస్వఃపురవారణౌఘముఖ్
వరసమరంబునంగెలిచిభాసిలుకేసరివాసిఁగాంచెడుక్.

అటుగాకున్న;

శా॥ కేళీకేసరి కేసరాంచితసటాక్షప్రోల్లసన్మంజుల
క్రీడాచామరకోమలానిలవశ్రీపీతఘర్మాంబువా

శ్రీలుండీతఁడుపం క్తివక్త్రుఁడుజయశ్రీఁగాంచుఁబంచాస్యస
ల్లీలాలాపముచేనపహ్నుతయశోలిప్సుండెవండౌననిన్.

మూ.—ఖరః కీదృ గ్వాలీ కపి రపిచ మారీచహతకః
కురఙ్గ స్తా న్హత్వా కథమపి కథం దృప్యసి మనాక్
అయం పశ్య ప్రాప్తో దశవదననామా సురపురీ
కరీన్ద్రాణాం హేలారచితకదనః పఞ్చవదనః.

అథవా,

కాళీకేసరకేసరాఞ్చలసటాసాటోపసంపాదిత
క్రీడాచామరకోమలానిలలవాచాన్తశ్రమామ్భఃకణః
శ్రీమా నేష దశాననో విజయతే తస్యాస్య పఞ్చానన
వ్యాపారప్రతిపాదనై రపి యశః కీదృక్సమున్మీలతి.

ఈ శ్లోకమునకు తెలుఁగుముద్రణములో కొంచెము భేదముకలదు

కేళీకేసరికేసరాఞ్చితసటా....................
... ... ... ... ... ... ......
............................తస్యాస్యపఞ్చానన
వ్యాహారేణరణేష్వపహ్నుతయశః... ............

ఖరపద్యము.—ప్రాసజిత్తు:—ఖరుఁడు అర్థలబ్ధుఁడే. 1. ఖరముఖజంతులన్, 2. అరయుము, 3. వర—ఈ మూఁడును వెఱబొమ్మలు. 4. ఈవు, 5. వానిఁగాంచెదున్—ఈరెండు పాదపూరణములు. 6. చెడునని వాక్కు పెట్టుకొన్నారు, చెడనేచెడినది. ఈ మాట లేకున్న పద్యము కొంతబాగుగానే యుండును. దశాస్యుఁడు కేసరియని విధేయాంతముగా వాక్యము ముగియును. ఈచెడుట యొకటి దాపరించినందున దీనియన్వయమునకై క్లేశము గల్గుచున్నది. వచ్చెనుకర్త దశాస్యుఁడు. 7. కాంచెడునకు ఎవ్వరు? కేసరియా? దశాస్యుఁడనియే జఘన్యాన్వయముగా నెప్పకొనవలయును. 8. ఆపక్షమున, భానిలు ఏల? భానిలుట వానిఁగాంచుట గాదా? పదభేదముచే మీఁకు రోఁత తెలియదుగావలయును. గెలిచి వానిఁగాంచెదు కేసరి వానిఁగాంచెదున్. ఇప్పఁడైన రోఁత వేయుచున్నదా? 9. గెలిచినది కేసరియా, దశాస్యుఁడా, వారణములను తాను గెలిచి కేసరివాని నొందినాఁడని యన్వయమా? దశాస్యుఁడు వారణౌఘమును గెలిచిన కేసరివాని నొందినాఁడని యన్వయమా? ప్రథమపక్షమున భానిలుపద మక్కఱలేదు. మఱియు నీపక్షము సరియునుంగాదు.

కేసరి స్వఃపురవారణౌఘమును గొట్టఁజాలదు. రావణుఁడు కొట్టినాఁడు. కేసరి కన్న నెక్కుడు కృత్యము చేసినయితనికి కేసరివానిం జెప్పుట సరిగాదు. ఆకేసరి యితఁడే అని యభేదమే చెప్పవలయును. గజవిశేషమును గొట్టిన కేసరివిశేషమగును, ఆయన్వయమే ద్వితీయపక్షము గదా. ద్వితీయపక్షమున ఆకేసరి యితఁడేగాన, వానిఁగాంచెదుక అనఁగూడదు. కావున వీరివాక్కు వీరికే ఫలించిన దంటిని. 10. మారిచుఁడు.— మారీచుఁడనిగదా రూపము. ఈరూపము ఛందస్సుకై చేసిన మషముగా నున్నది. 11. వీనియోగ మేమోగాని వీనిని భోజరాజు రెండుమార్లు నీచుఁ డన్నాఁడు. "మారీచనీచం జనయాంబభూవ," "మారీచనీచమతి రాహవ మారచయ్య." ఇటుస్వవర్గ్యుఁ డైనను తనకత్యంతోపకారి యైనను అదియెల్లఁ జూడక రావణుఁడుగూడ పాతకుఁ డన్నాఁడు. కాన వీని కిట ఖరవాలులకు లేని పాతకబిరుదములో ఏమోకారణము స్వారస్యంబునుం గలవు. కాన పాతకసుత్సనను పాతమార్చుట సరిగాదు. 12, తత్ఖరముఖ — తచ్ఛబ్దముచే పరామర్శసిద్ధించి యుండఁగా న నావశ్యముకగా, బిగువులేని సడలుడుకవనముగా మఱల ఖరయనుట ఖరమే. 13. తునిమి.—మూ. కథమపి హత్వా— మహాప్రయత్నముచేత తునిమి. ఇటుకథమపి అన్న యర్థమును భవభూతి యీలాగున వివరించియున్నాఁడు.

వృద్ధాస్తే న విచారణీయచరితాస్తిష్ఠన్తు హుం వర్తతాం
సున్దస్త్రీదమనే ప్యఖణ్డయశసో లోకే మహాన్తో హి తే
యాని త్రీణ్యకుతోభయాన్యపి పదాన్యాసన్ ఖరాయోధనే
యద్వా కౌశల మిన్ద్రసూనుదమనే తత్రాప్యభిజ్ఞో జనః. ఉత్త.

ఈముక్క పరమనీరసముగాఁ దోఁచి అనఁగా ప్రయోజనము తెలియక,పంతులవారు త్యజించినారు. కవికవితాతత్త్వమునకు వీరికవితాతత్త్వము మహాతేజస్సునకు తిమిరముగా నున్నది. 14. అరయుము—మూ. పశ్య = చూడుము. ప్రత్యక్షముగా నెదుట వచ్చి నిలిచి యరయు మనుట మందము. 15. దశవదననామా—అనిమూలములో నామశబ్దముకూడఁ గలదు. అందులతాత్పర్యము. ఆపేరు విన్నమాత్రాననే శత్రువులు పలాయితులగుదు రని. దాని నెత్తివేసికొన్నందున ఆస్వారస్య మిందు చెత్తగలసినది. దశాస్యుఁడు, కేసరి,—అనియిట; దశవదన, పంచవదన అని మూ. 16. మూలములో పంచవదన శబ్దమున అయిదుమొగములవాఁడు అనుశ్లేషయుం గలదు, 17. నాశక్తిలో సగమునకే సురగజములెల్ల నోడిన వని ధ్వని. అది యిట ధ్వంసమయినది.

కేళీకేసర్యాది.—ఆపద్యము వానిఁగాంచెడుచేత చెడినట్లు, ఈపద్యము 18. లిప్సుండెవండానని చే లిప్సుండెవండును లేక చెడినది. పూర్వార్థమున కర్థము:—ఆటసింగములజూలుతో చేసినయాటజల్లియొక్క పిల్లతెమ్మెరలచే ఎవనిచెమరు పీలువఁబడినదో ఆశ్రీమంతుఁడు. ఉత్తరార్థమున నన్వయమేమి? (౧) పంచాస్యలీలను చెప్పుటచే నెవఁడు అపహ్నుతయశస్సును యుద్ధములోఁ బొందఁగోరునో అట్టి యీపంక్తివక్త్రుఁడు జయశ్రీఁ గాంచును. (౨) పంక్తివక్త్రుఁడు జయశ్రీఁ గాంచును, పంచాస్యలీలాలాపముచే ఎవ్వఁడును అపహ్నుతయశోలిప్సుఁడు గాఁడు. ఇటు పూర్వార్థమున. రావణుఁడు తాను కేసరులను జయించినవాఁడని చెప్పుకొన్నాఁడు. ఇందుచే కేసర్యధికుఁడుగదా? కేసర్యధికుఁడు కేసరిలీలచే కీర్తిగోరుట సరిగాదుగాన, ఉత్తరార్థమున ప్రథమాన్వయము సరిగాదు. ద్వితీయాన్వయమున 'ఎవ్వఁడు' పదమును కాశీయాత్రయంత ప్రయాసపడి గడ్డిపిడికిటియంత ఫలముగా రావణపరత్వావిరోధముగా ప్రశ్నార్థకముగానే యర్థముచేసికొని, "పంచాస్యలీలాలాపముచే నెవ్వఁడును యశోలిప్సుఁడుగాఁడు" అను లోకసామాన్యోక్తిభావమును తప్పించి ప్రకృతోక్తిగానే సాధించినట్లు టీక విధించి, రావణుఁడు పంచాస్యలీలాప్రతిపాదనచే యశోలిప్సుఁడు కాఁడని యర్థము చెప్పదము. అట్లు వీఁడు తాను లిప్సుఁడు కాఁడని చెప్పుకోనేల? లిప్సుఁడని యెవరన్నారు? వీఁడే పూర్వపద్యమున లిప్సువాఁడైనని దీననే తెలుపుచున్నాఁడు. తద్వ్యాఘాతార్థము ఇటు నిట్లు చెప్పుకొన్నాఁడు. అటయిన స్వవచనవ్యాఘాతదోషము, దానిచే నసంబద్ధప్రలాపిత్వమును వీనికిఁ దప్పవు. యశోలిప్సువనై యట్లు చెప్పుకొంటి ననుటకన్న మూర్ఖత యొండు లేదు. మూలములో వీనికి ఈపెద్దమ్మ ఆవేశింప లేదు. తాను జయించినమాట ఆశ్లోకమున చెప్పినాఁడు. 19. తనప్రభావ మంతియగాదని, గజహంతయైన సింగమునుగూడ తాఁగెలిచినవాఁడని, యీశ్లోకమునఁ దెల్పినాఁడు. అథవా అనుట పూర్వోక్తకేసరిసామ్యము నిజప్రభావపరిమితి యనుభ్రమను నివారించుటకు. కాన నీలిప్స యీపద్యమును మాపినది. పంతులవారి కిటు మూలపదముల కర్థము తెలియలేదు. యశః కీదృక్ సమున్మీలతి—యశః = కీర్తిని, కీదృక్ = (ఎట్టివాఁడు) ఎవఁడు, సమున్మీలతి = కోరును, అని గ్రహించినారు. స్వయమాచార్యులైనఫల మిది. ఇందు మఱియు విశేషములు.—20. దిగ్గజములకన్న ఇతని కేళీకేసరి బలిష్ఠమా? కాన పాఠము సరిగాదు. 21. కాళీకేసరి యనుటయే సరి. అపహ్నుతశబ్దమున స్వారస్యములేదు. దానిని పొందికనొందించుటకు క్లేశమువలయును. 22. మఱియు నిందును మూలమునంగల దశానన పంచానన శబ్దప్రయోగమందుఁ గల స్వారస్యము వక్త్ర ఆస్య యని పర్యాయపదోపానముచే చెడినది. ఇంతియగాక దీనితర్వాతి లక్ష్మణవాక్యమున "దశాన

నత్వముచేనొండెం బంచాననత్వముచే నేమి" అనుదానం గలఘరామర్శకు ఆపదము తే ఇటనున్నంగదా సొంపు గల్గును. జిత్తులు.—**23**. ఉల్లసన్మంజుల—పాదపూరణము. **24**. శ్రీ (సీత), **25**. శ్రీఁ (గాంచు),—యతిజిత్తులు. **26**. సత్ లంకెజిత్తు. **27**. లఢప్రాసము.

భగ్ననౌక.

మ॥ మదముంబోనిడియీవిభీషణువలెన్మారాముపాదాబ్జమం
[27] దుఁదగంజేరుటఁగమ్ము తుమ్మెదగసంతోషమ్ముఁగాంతింక నే
2263 నిదికర్తవ్యముగానిచోమిడుతగానేకమ్ము దుష్టాత్ముదు
ర్మదుఁడైకూలినకుంభకర్ణువలెరామస్ఫీతబాణాగ్నిలోన్.

మూ.— దూరోన్ముక్తమదో విభీషణ ఇవ న్యఞ్చచ్ఛిరశ్శేఖరః
స్వచ్ఛన్దం చరణారవిన్దయుగళే రామస్య భృఙ్గో భవ
రే నక్తంచర కుమ్భకర్ణ ఇవ వా కర్ణాన్తచక్రీభ
వచ్చాపోత్సఙ్గవిముక్తబాణదహనే సద్యః పతఙ్గో భవ.

**1**. మారాము—రాము అని మాత్ర మున్న నింతకన్న బాగుగా నుండును. అయిన నేమి చేయుదము, ఈకాలమున యతులు మానపేక్షింతురు. **2**. తగన్—దీనికి ప్రాసముకర్త. **3**. చేరుట—రసభంజకపాదపూరణము. తుమ్మెదగఁగమ్ము=చేరుము; పాదాబ్జమందు తుమ్మెదవు గమ్మనఁగా పాదము నాశ్రయింపు మనియర్థము. **4**. తుమ్మెదగఁగమ్ము—గఁగమ్ము అనుటకంటె గమ్ము అన్న మేలు. **5**. సంతోషమ్ముఁగాంతికనేని—ఏమి వీనికి సీత దక్కునా? ఇంద్రజిత్కుంభకర్ణాదులు చచ్చి నదుఃఖము తీఱునా? వీనికెట్టిసంతోషమ్మును లేదు గాని సంతోషము పరమహంస పరివ్రాజకాచార్యులవారికిఁ గలుగును. **6**. ఇది కర్తవ్యము గానిచో=వా. ఈరెండు నొకటియె జెలగ. దానికి వా సంకుచితావస్థ, తెలుగువాక్యము వ్యాకుచితావస్థ. **7**. గానేకమ్ము—గానే తీసివేయఁ గానే యీవాక్యము చక్కఁ గానే యుండును. **8**. దుష్టాత్మ—ఇది రావణసంబుద్ధి యైనచో, అస్థానసంరంభము. రావణుఁడు పాదాక్రాంతుఁడైనచో దుష్టాత్ముఁడు కాఁడా? అప్పుడును దుష్టాత్ముఁడయేని అమాటను ఆశ్రయణపక్షోపన్యాసమందనక విగ్రహణపక్షమందననేల? ఈపక్షమందేగదా దుష్టుఁడగును ఆశ్రయించిన నిర్దోషుఁ డగునుగదా, యని సమాధానమేని, ఇంకను ఆశ్రయించునో విగ్రహించునో తెలియక తిట్టుట తెలివితక్కువగా నున్నది. సంబుద్ధిగాదు, కుంభకర్ణునికి విశేషణమందుము, అని యుక్తియేని, కుంభకర్ణుఁడు రావణాజ్ఞచే రాముతోఁ బోరమడినెనేగాని, స్వార్థమై యట్లుచేసినవాఁడు గాఁడు. స్వతంత్రుఁడేని వానిదోషములు చెప్పుట భీషణార్థము సముచితమే యగును. ఇట నట్టిసందర్భము

గాదుగాన తద్దోషోపన్యాసము అనుచితము, బలవంతుఁ డయ్యును రామునిచేఁ జిచ్చి నాఁడు అనుటకుమాత్రమే కుంభకర్ణసామ్య మక్కఱకువచ్చునుగాని, అంతకన్నం బనికి రాదు. కాననే మూలములో ఈ [దుష్టాత్మ] ప్రలాపములేదు. పంతులవారు ఈపద్యములో నొకచమత్కారము చేసినట్లగపడుచున్నది. ఏమన, 9. తుమ్మెదతో విభీషణునికిని, 10. మిడుతతో కుంభకర్ణునికిని సంబంధము త్రెంచినట్లున్నది. విభీషణసామ్యము చేరుటకే, కుంభకర్ణసామ్యము కూలుటకే, అని పేరియన్వయము గాఁబోలు. రామస్ఫీతబాణాగ్ని కూలుటకు అధికరణమైనచో మిడుతకుఁ గానేరదు, మిడుతకైన కూలుటకు గానేరదు. మిడుతకు అగ్నిసంబంధము బలీయముగాన, కుంభకర్ణునికే నామము వేయవలెను. ప్రాసముకై 11. "దుష్టాత్మదుర్మదుఁడై కూలిన" అనునీదుర్భాషలు పలుకకున్న మూలమందుంబోలె నన్వయమగును. కుంభకర్ణునికి నామ మక్కఱలేకయే యుండును. అట్లే 12. 'దగంజేరుట' లేకున్న విభీషణుండును మూలమందుంబోలె నిటను నిశ్చయముగా భృంగ మగును.

నష్టములైన సరకులు.—13. దూర, 14. స్వఙ్ఛ్చిర శ్మేఖరః, 15. స్వచ్ఛన్దమ్, 16. రే, 17. న_క్తంచర, 18—24. కర్ణా_న్తచక్రీభవచ్చాపోత్సృష్ట విము_క్త, 25. సద్యః. ఇందులకుబదులుగా తేలినచెక్కలు ఎల్లెడలనవే, ఏఱుకొనుఁడు. 26. గవేషణీయమైన నీవి.—రాముని శరణు చొరుము, లేదా తద్బాణముచే నిదె మడిసెదవు. మూలములో నెల్ల సారభూతమైన పదము సద్యః [ఇప్పుడె] అనునది. దీనిస్వారస్య మేమన, నీకవకాశ మియ్యము అని. అది తెనుఁగునం బోయినది. 27. ఆయర్థము తుదను 'భృఙ్గో భవ' దానికి సరిగా ఈయర్థముతుదను 'పతఙ్గో భవ,' అనుకూలకల్పము 'భృఙ్గో భవ' ప్రతికూలకల్పము 'పతఙ్గో భవ' అని యనుప్రశతిసామ్యముచే పోషితమైన స్వారస్యచంద్రిక యీ తెనుఁగురామునుమోర నదృశ్యమైనది.

తే॥ అయ్యోఖండితమిష్వాసమనుచుపగవ। కూనరాయింక నేదేనియుఱుతరాయ
2264 ధంబుఁగఁ జఁగుముమఱియుయుద్ధంబునకీవు।డీవునాతోడఁబోరాడనెంచితేని.

ఈవు నాతోడఁబోరాడ నెంచితేని—ఈముక్క పద్యపూరణము, చక్కఁగా ఏడ్చినట్లున్నది.

౯౭ - వ పుట.

చ॥ ఎదితననాదుసామ్యమున కెంతయు నైఁచకకోపమూనియే
[5] పొదవఁగఁద్రావెఁబల్మఱుస్వరుత్పలదృక్సుముఖచంద్రహాసము
2269 య్యదివిననేమియియ్యదెదశాననబాహుపటీరకాననా
స్పదఫణిచంద్రహాసమువిభాజితపార్వణచంద్రహాసముక్.

మూ.—అకర్ణిత స్తవ దశానన బాహుఖణ్డ
శ్రీఖణ్డకాననఫణీవ న చన్ద్రహాసః
యేన స్వనామపదసామ్యరుషేవ పీతః
స్వర్లోకలోలనయనాముఖచన్ద్రహాసః.

ఇంచుమించుగా, 1. ఎంతయు నైపక—కోపమూని—ఏపొదవఁగ. 2. పల్మఱు—పో. 3. విన వేమి—పరధ్యానముగా నున్నావేమి? లేక, నామాట వినిపించుకోవేమి, అనియర్థము; నీవు వినలేదా అనునర్థ మపేక్షితము. 4. విభాజితపార్వణ చంద్రహాసముఁ—ఇది పంతులవారి సొంతము. ఇందలి ఁ కొనమూలుగు. ద్వితీయగా నన్వయింపదు. సముచ్చయ మన యోగము లేదు. పంతులవారు ధర్మార్థము చేర్చిన విశేషణము. పరాక్రమమును దెలుపదుగాన దానిని జయదేవుఁడు వేయలేదు. వీరు దానియొక్క ఎన్నిదమ్మిడీలకు కొన్నదో అది యేల చెప్పకవదలినారు? పాదపూరణములకు చోటుండదనియా? ఈపద్యములోని వ్యాకరణపాండిత్యగమకము.— 5. తన నామసామ్యము.—నామము తనదా, సామ్యము తనదా? నామము తనదేని సమాసము ఘటింపదు. నామ యని ముగాగమము లేక సాధ్యసమాసముగాఁ గూడదు. దానిపేరు తానుంచుకొన్నచో తన్ను తానే ఖండించుకోవలసినది, తనపేరు అది యుంచుకొన్నచో దానిని దండింపవలసినది. పంతులవారిసమాసమును చక్కఁగా అన్వయించువారు దానిపేరు తానుంచుకొని దానినిదండించునట్లు పద్యార్థము చెప్పవలయును. ఇది యసంబద్ధముగదా. సంబద్ధము సేయుటకై తనపేరే అది యుంచుకొన్నట్లు అర్థముగా తన శబ్దమును నామతో చేర్చుకోవలయును. ఇది అలక్షణముగదా. పంతులవారికి నిజశబ్దార్థము తెలియకపోయెఁగాని నిజనామసామ్యమని వ్రాసికొన్న ఈలక్షణదోష ముండదు.

మ॥ పదియా బాహులచేత నేదశదిశల్ ప్రధ్వంసముం బొందవే
[3] ర్పదియా బాహులు భారమాత్రములుగాఁ బల్మాండు రుద్రుండగుం
2272 గదయారాధ్యుఁడు కేశవుండు జడధింగా గూర్కు నెల్లప్పునిం
కెదిక ర్తవ్యమటంచు నెంచుచు నులం కేశుండు ఖేదించెడుఁ.

1. బల్మాండు—బాహువులకు క్రియయా, రుద్రునికి జేతవ్యతాసమర్థకవిశేషణమా? 2. జడధింగా గూర్కు—కూర్కుట యద్ధమా, జలధి యద్ధమా? రెండునేని కాశబ్దమును జలధితో చేర్పనేల? జలధింగా గూర్కుఁగా నెప్పునని రెంటిం బెట్టరాదా? అధికమున కధికఫల మ్మగునుగదా? 3. బాహువులకు హిమగిరిప్రాగ్భార

భాజః అనిమూలములో నున్నవిశేషణమును ఇందు చల్లఁగా వదలివేయుటకుఁ గారణ మేమి?

మ॥ ధనువుల్ఖడ్గములోనుగాఁగలుగుశస్త్రంబుల్వైడంగ్రుద్ధుఁడై
[10] తనరన్రావణుఁడోరరామశరకృత్తస్వీయమూర్ధంబులన్
2282 గనియుద్వృత్తుగనింగినొక్కొకటినేకైకొంచువేర్వేతులన్
బొనరంబైకెగయించుచుండనభుజంబుల్వేయుసార్ధంబులన్.

లఘువుపై నప్రాసముగాన దానితల్లిదండ్రులు 1. తనరయ్య 2. పొనరమ్మ యిరువురును "కని" యోగక్షేమము విచారించుకొనుటకు రాకమానరైరి.

3. రామశరకృత్తస్వీయమూర్ధంబులన్—రాములవారు తమతలలనే ఖండించుకొని రని దీని కర్థము. స్వీయశబ్దము రావణునికేగాని రాములకుఁ జెందదన నుపపత్తిలేదు. ఈసమాసమెల్ల బహువ్రీహియై రావణవిశేషణ మాయెనేని అపుడు స్వీయశబ్దము రావణునికే అన్వయించును. ఈపంతులవారు లక్ష్మణునిపై కన్ను వేసి యతనిం గడతేర్పఁగా ఆంజనేయులవారు రక్షించినారు. ఇట రామునిపై కన్నువేసినారు, ఎవరు రక్షింతురో తెలియదు. 4. వేర్వేతులన్—ఇప్పటికి కొన్నిచేతులను చెప్పకయే వేర్వేతు లనుట యసంబద్ధముగానున్నది. కైకొంచున్ అనుచో కైశబ్దము ఉన్నదనుట తిక్క; కైఁగొంచు అనియేని లేదు. 5. ఒక్కొకటి ననుటచే ఒక్కొక్కతల నని యన్వయ మగుచున్నది. ఒక్కటొకటం గైఁగొంచు అనియున్న కొంతసరిపడును. 6. పైకెగయించుచున్—ఊర్ధ్వముగా విసరుచు అని యర్థమగుచున్నది; [రామునిమీఁదికి] విసరుచు అని యర్థము కావలయు, కానిచో క్రుద్ధుఁడై యన్నప్రయోజనము లేదు. ఇతరాయుధములు లేనందున తనతలలనే [పిరంగిగుండ్లనుంబోలె] రామునిపై ప్రయోగించెనని భావము. 7. భుజంబుల్వేయుసార్ధంబులన్—మూలములో ఇరువదిభుజములను అనియున్నది. భుజములు రెండు సార్ధము లయినను భుజములుసార్ధ మగుటయేగదా. 8. ఉద్వృత్తుగ అన్నను పదితలలును ఒకమాఱే ఖండితము లయ్యెనని యేర్పడదు. మూలములో ఇరువదింటిని సఫలీకరించు నన్నందున పదితలలును శ్రీరాములు ఒక్కమాఱే నఱికిరని యర్థము సిద్ధించుచున్నది. 9. భుజంబుల్ సార్ధంబులన్—భిన్నవిభక్తికత లేకున్న సరి. 10. అపిశబ్దముంగనుఁడు.

ధనుర్నిస్త్రింశాదిప్రహరణగణచ్ఛేదకుపితః
దశాస్యః స్వాన్మూర్ధ్నో రఘుపతిశరశ్రేణిదళితాన్
కరై రేకై రేకై ర్నభసి భృశ మాదాయయుగపత్
క్షిపన్నన్యై రన్యై స్సఫలయతి దోర్వింశతి మపి.

చ॥ ఎటులెటురామబాణములఁగృత్తములై ద్వగురుండశానసో
[13] ద్భటశిరముల్ నభంబున దివస్పతికింబులకాంకురాళితో
2295 నటులటులేచుఁబెంపుగఁబ్రహర్షతరంగములిందుజేనిక
కుటిలనిశాటమూర్ధచయకుర్దనకృత్యవినోదనాదృతుల్.

ప్రాసజిత్తు— 1. ఉద్భట 2. కుటిల. యతిజిత్తు 3. కుర్దన. 4. పెంపుగ—పా.
ఈపద్యమునకు నిర్బాధమైన యన్వయార్థములు.—రామబాణములచే రావణశిరములు ఖండితములై యెగిరినకొలందియు: ఇంద్రునికిం బులకలతోఁగూడ హర్షతరంగములు ఏచెను, రామునికి రావణశిరఃక్రీడావినోదాదరములు ఏచెను.— 5. పులకాంకురాళిని పూర్వమున కన్వయముచేసికొందమన్న పులక లెగురునా?

మూ.—ఏతాన్యస్య యథా యథాశు విశిఖైః కృత్తాని రక్షఃపతే
రుద్గచ్ఛన్తి శిరాంసి భీతిపులకైః సాకం దివౌకఃపతేః
ఉన్మీలన్తి తథాతథా రఘుపతే ర్నస్తః ప్రమోదోర్మయః
కణ్ఠచ్ఛేదవినోదకౌతుకభరవ్యగ్రీభవచ్చేతసః.

రామశరకృత్తములయిన రావణశిరములు దేవేంద్రునిభీతిపులకాంకురముల తోఁగూడ నిగిడినకొలందియు కంఠచ్ఛేదవినోదపరాయణచిత్తునికి శ్రీరామునికి హర్షతరంగములు నిగుడుచుండెను.—తాత్పర్యము.—రామబాణములకు రావణశిరములు తెగి నింగి కెగయుచుండెను. వానిం గన నింద్రునికి భీతిచేఁ బులకలువొడముచుండెను. విశేషముగా తలలను తఱుగుక్రీడచే రామునికి హర్ష మెచ్చుచుండెను; అని, ఈ యర్థము వచ్చునట్లుగా తెలుఁగుపద్యమును అన్వయించుకొందమన్న, 6. దివస్పతికి అనుకిషష్ఠికి బదులు దివస్పతియొక్క యని యొక్కషష్ఠియున్నయెడల నందులకను కూలముగా నుండును. అప్పటికిని ఉత్తరార్థమందు అన్వయము కష్టమే. 7. హర్షతరంగములు...ఆదృతులకు విశేషణమా,...ఆదృతులు హర్షతరంగములకు విశేషణమా? హర్షతరంగములు బహువ్రీహి గానేరదు. ఆదృతులను బహువ్రీహిగావిగ్రహించుటకు తిక్కప్రజ్ఞయే గాని సామాన్యప్రజ్ఞ చాలదు. కాన ఉభయంబును ఘటిల్లదు. ఇట నొకవిశేషముకలదు. 8. పంతులవారు చేతసః రఘుపతికి విశేషణముగాను షష్ఠ్యేకవచనముగాను గ్రహించియుండరు. 9. ఉర్మయః వలెనే చేతసఃకూడ [చంద్రహాసమును నపుంసకముచేసినదోషమునకు పరిహారముగా దీనిని పుల్లింగముచేసి] ప్రథమాబహువచనమని తలంచి అబహువ్రీహిగా తెన్గించియుందురు. 10. మఱియు మూలమున చతుర్థపాదములో కంఠచ్ఛేదము చెప్పఁబడినది. ఇందు మూర్ధకుర్దనము చెప్పఁబడినది. కుర్దన మనఁగా క్రీడ. చతుర్థపాదములు సమార్థకములు కావు.

**11.** ఛేదము చెప్పుటచే ఎంత ఖండించినను తలలు తెగకున్నవని కౌతుక కారణము చెప్పఁబడినది. **12.** తలకాయలయాట యనుటచే అసంఖ్యేయశీర్షోత్పత్తి సూచితము గాదు. సైంధవునిశిరమును అర్జునుఁడువోలె ఒక్కశిరమునే శ్రీరాములవారు బాణములచే ఆకాశమున త్రిప్పుచు క్రీడించుచుండవచ్చును. **13.** అచేతనములయినయాతలలే క్రీడించినవనుట పరిహాసము. పంతువారిశైలికి భంగము లేకుండ, 'దివస్పతిదా' అనియు, 'మూర్ధపటుకూటవిఖండనకేళికాంతికిఁ' అనియు, మార్చిన, ఈపద్యమునకు మూలముతో వైరము అంతగా నుండదు. మూలమున చతుర్థపాదము రఘుపతికి విశేషణముగా నున్నది. ఇందును అట్లే ఈమార్పుచే నయినది.

గారా-వపుట.

ఉ॥ ఈతఁడురాముఁడేవఱకునేవునఁదున్మశిరంబులన్దశా
[2] స్యాతతహృద్వ్యథం జెలుపఁడావఱకెంతయు సంతసంబునే
2297 యీతఁడురావణుండెనయహృత్సరసీరుహమందునుంధరా
జాతనిరంతరంబుగనుజక్కఁగనెక్కొనియుంటచేఁగదా.

**1.** రావణు సంతోషమునకు కారణము హృద్వ్యథం జెలుపమి గాని శిరఃఖండనము గాదు. మూలములో శిరఃఖండనాసక్తి హృద్వ్యథం జెలుపమికి కారణముగాఁ జెప్పఁబడినది. వీరు అకారణత్వమును చెప్పమిచే శిరఃఖండనంబును సంతసమునకుఁ గారణమై పద్యము ధ్వంసితమైనది. **2.** మూలమునుబట్టి 'ఏవఱకు' చలుపమికి విశేషణముగా నుండవలయును.

అయం యావ ద్యావ త్ప్రభుహృదయపీఠం రఘుపతిః
శిరశ్ఛేదాసక్త్యా న దశవదనస్య వ్యథయతి
అయం తావ త్తావ ద్వహతి ముద ముచ్చై ర్దశముఖః
కి లైతస్మిన్ దేవీ జనకపతిపుత్త్రీ నివసతి.

నణప్రాసము, సారత్యాగము.

[2] ఆ॥ వికచకుసుమవిసరవిలసితమపు శశి । మణిమయోరుతల్పమునను లీల
2299 నేఁడుపండువాఁడు నేఁడుపండుఁబుడమి । రావణుండు రామురాగదృష్టి.

మూ. వికచకుసుమస్తోమాకీర్ణే పరాగవిభూషితః
శశిమణిశిలాతల్పేఽనల్పే సలీల మశేత యః
అయ ముయ మసౌ రోషారూఢే క్షణం రఘునన్దనే
భువి దశముఖ శ్శేతే ధూళీచ్ఛటాపరిధూసరః.

ఇందు, శశిమణిశిలాతల్పమునందు శయనించినప్పుడు రావణుఁడు 1. [పరాగవిభూషితః] పుష్పాదిచే నలంకృతుఁ డనియు, ఇపుడు నేలఁబడియున్నతఱి 2. [ధూళిచ్ఛటాపరిధూసరః] దుమ్ము మొత్తముచే మలినవర్ణుఁడు అనియు, విశేషణములు సారవంతములు కలవు. తెనుఁగురచయితగారు ఏలకో వానిని వదలినారు ?

తే॥ వెలుచనెఱమంటలనుదెసల్వెలుఁగఁజేయు
[3] నగ్గిలోఁజొచ్చియవనిజయహహవచ్చె
2302 సమధికద్యుతితోదివసముఖసమయ
మునననునిగిడెడునినకరముకుళమువలె.

మూ. ఉద్దామహేతివలయైః పరిదీపితాశం
పశ్య ప్రవిశ్య జనకేన్ద్రసుతా హుతాశమ్
అభ్యుద్యతా సమధికాం ద్యుతిముద్వహన్తీ
ప్రాతర్మయూఖకలికేవ దివాకరస్య.

1. వలయైః అనుటచే ప్రదక్షిణార్చి యని శుభసూచన కవిహృదయము. అది తెన్గున సున్న యైనది. 2. హుతాశమ్ — పాతివ్రత్యశోధనార్థమైనయీయాగారంభమున నగ్నిదేవుని హోమములచే నుపాసించిరని సూచిత మగుచున్నది. ఈ విషయమందే "రత్నాన్యాముఞ్చ సందీప్తే హవిర్జుహుధి పావకే" అని భట్టి. అది 'అగ్గిలో' అనుటచే బుగ్గి యైనది, బగ్గియైనదన్న ననవచ్చును. 3. ఇనకరముకుళమువలె—ఇది సీత కుపమానముగాన మూలకారుఁడు ప్రయత్నపూర్వకముగా మయూఖకలికా అని స్త్రీలింగముగాఁ జెప్పినాఁడు. వీరు దానికి దృష్టిపిడతగా నపుంసకమును బెట్టినారు. ఒకబిచ్చపుగీతమయిన మూలమునకు సరిగా వీరికిఁ గుదురరాదా ?

౯౯ - వ పుట.

విద్యాధరి.—చూడుచూడుము. ఇతఁడు తనవారితోడఁ గూడుకొన్నవాఁ
[6] డగుచుఁ బొలికలనికెలన నరుగుదెంచుచున్నాఁడు రామచంద్రుఁడు.
2308

రాముఁడు.—ఓయీ ! ఎట్లిపుడును బొడమెడు నిశాచరసేనాసోదరంబుతిమిరనికరంబు ?

ఇట పంతులవారు ఆంధ్రీకరణము నద్భుతముగా తగులఁబెట్టినారు. 1. రాముఁడు ఇట మఱల ఆకస్మికముగా రంగమందు అగపడి మాటలాడఁ దొడఁగెను. రామప్రవేశము ఉక్తము కాలేదు. ప్రవేశము చెప్పకయే పాత్రమెట్లు రంగమెక్కెను.

మఱియు నీవిద్యాధరమిథునము ఈయంకము తుదివఱకు అనఁగా రాముఁడు పుష్పకమెక్కి సూర్యబింబమును సమీపించి సూర్యునితో భాషించి అయోధ్యలో ఇలు సేరువఱకు, మఱి భాషింపలేదు. వీరేమయిరి? ఎట నుండిరి. రాములతోఁ గూడి పుష్పకమెక్కిరా? రాములతోఁగూడ అయోధ్యలో వారియిల్లు సేరిరా? రాముని చుట్టములుగా చేరిరా, సీతచుట్టములుగా చేరిరా? వీరిని పుష్పకములో ఏల ఎక్కనిచ్చిరి? ఏమివింత! నాటకలక్షణగంధమేని ఏమూలనైన! ఇట వీరు "అంధువునఁబడు నంధానుగాంధుని" వలెనే తెన్గించినారు. ముద్రకుఁడు అంధువునం బడలేదు, వాని పాపులాడబ్బులు వానికి రానేవచ్చినవి. పడుధాతువు అనుగునికే అన్వయించునుగాన వీరే పడినారు. వీరి యాంధ్రీకరణమే పాడయినది :—ఎట్లన, నిట, 2. విద్యాధర భాషితమొకటి, 3. విద్యాధర మిథున నిష్క్రమణము, 4. రామాదిప్రవేశము, 5. రామభాషిత మొకటి, 6. లక్ష్మణభాషిత శ్లోక మొకటియుం గలగ్రంథము అంధముద్రకుఁడు వదలివేసినాఁడు. వీరి తెలివికి అగ్రంథలోపమువలనిదోషము లగపడక వీరును యథాస్థితముగాఁ దెనిఁగించి ఆంధ్రభాషను మఱి తలయెత్తనీయకుండ సంజీవనము సేసినారు. ఇంతమతిమంతులు వీరు భాషాదౌర్భాగ్యముచేత స్వయంకవు లగుటయేగాక, చేత నొకమాసపత్త్రిక యుండుటచేత పండితప్రణీతగ్రంథములందు గుణదోషనిర్ణేతలుగాఁగూడ సంభవించియున్నారు. నష్టగ్రంథము!—

[విద్యాధరః.—తదేహి కర్ణామృత మిదం పులోమజాయై నివేదయావః।

[ఇతినిష్క్రాన్తౌ।

తతః ప్రవిశతి రామః సీతాలక్ష్మణౌ సుగ్రీవవిభీషణౌచ॥

రామః.— అయే కథ ముపగత ఏవ భగవానమ్బరమణిశ్చరమాచలచూడామ్।

లక్ష్మణః.—పశ్చిమపయోధివేలాం చ। నన్విదానీమ్।

ఉద్దామదిగ్ద్విరదచఞ్చలకర్ణపూర। గణ్డస్థలోచ్ఛలదళిస్తబకాకృతీని
మీలన్నభాంసి మృగనాభిసమానభాంసి। దిక్కన్దరేషు విలసన్తితమాంతమాంసి.]

ఉ॥ ఇందుకరాళిపాల్కడలినేచిన పెన్నురువందుఁదెల్లనై
[17] యిందుశిలాంబుశీకరసమేతమునుత్పలమాలికారజో
2325 బృందమునైచకోరముఖభిన్నసముద్భిదమైచమత్కృతిం
బొందుగఁజూఁపుచుంబొదలుభూరివియోగినిగాత్రపల్లికన్.

మూ. క్షీరాబ్ధే ర్లహరీషు ఫేనధవళా శ్చన్ద్రోపలేషు స్రవత్
పాథఃశీకరిణో వికాసికుముదక్రోడే రజఃపిఞ్జరాః

ఉన్మీలన్తి చకోరచఞ్చుగహనే భిన్నప్రరూఢా శ్చమత్
కుర్వన్తః ప్రియవిప్రయుక్తరమణీగాత్రే సుధాంశోః కరాః.

ఈచంద్రకిరణములు పాలసంద్రంపుంగల్లోలములయందు నురువుచేత తెల్లనివై, చంద్రకాంత మణులయందు స్రవించుచున్ననీటిచేత తుంపురులుగలవై, తెల్లగలువల కడువులయందు పుప్పొడిచేత పనిమివన్నెగలవై, వెన్నెలపులుఁగుల ముక్కులయందు తెగి మఱల మొలచినవై, ప్రియులతోడివిరాళిచేఁ దూలుచున్న చెలువల [విరహపాండువయిన] యంగమునందు [అగపడియు నగపడక] చమత్కారముచేయుచున్నవై, వ్యాపించుచున్నవి.—అని యర్థము.

1. పెన్నురువందు తెల్లనివని యర్థమేని, లహరీషు అని సప్తమి నిట నిలుపనేల? లహరీఫేనేషు అని యుండును. 2. నెలకరములు ఇందుశిలయం దున్నవిధము మూలమున వర్ణితమై యుండఁగా, ఇందుశిలాంబుశీకరసమేత మని అధికరణమును మాఁపుటయు తజ్జలశీకరసమేతత్వమును మాత్రమేచెప్పుటయు అతిమందము. ఇందుశిలలయందు అని వ్యస్తపదముగా నుండవలయును. 3. స్రవత్తును వదలఁగూడదు. 4. ఉత్పలమాలికారజోబృందమునై — ఇదేమి? ఇందుకరాళి రజోబృందముగా నెట్లగును, మాలిక యేమి? ఎక్కడిమాలిక? ఎవరు గ్రుచ్చినారు? ఉత్పలమాలా పద్యమును రచించుకొని ఆపేరు పద్యములో నిట్లువేసికొన్న ప్రజ్ఞకు ఆనందసాగరములో మునింగినారేగాని, మూలకారుఁడు ఉత్పలసామాన్యమును చెప్పక సితోత్పలమును కుముదమును చెప్పినవిశేష మేమో యెఱుంగరైరిగదా. ఆవిశేష మగపడినప్పుడు ఎంతనేవు అనిమేషలోచనములం జూతురో! కవి యిట తీరాద్యాదులనన్నిటిని ధవళవస్తుపరంపరగా చెప్పినాఁడని యెఱుంగుఁడు. 5. పొదలుట—పంతులవారి శ్లోకమునకు మర్థము గాలేదని యీపద మున్నచోటు స్ఫుటీకరించుచున్నది. వీరు పొదలుటను గాత్రవల్లికిమాత్రమే చేర్చినారు. దాని మూలము ఉన్మీలన్తి యనుక్రియ—పాల్కడలియలలు, చంద్రకాంతశిలలు, తెల్లగలువలకడుపు, వెన్నెలపులుఁగులనోళులు, విప్రయుక్తరమణీగాత్రము—ఈదేనితోను ప్రత్యేకసంబంధము లేక, సామాన్యముగా లోకమెల్ల వ్యాపించుటనుచెప్పుచున్నది. 6.చమత్కుర్వన్తః అను శశికరవిశేషణమును వీరుభిన్నప్రరూఢాః అనుదానికి తోడుగా చకోరచంచుగహనమునకుం జేర్చినారు. ఏతన్మూలసజాతీయమైన వెన్నెలవర్ణనము మనుచరిత్రలో తృతీయాశ్వాసమున “మఱియు వికసితకైరవంబు” ల సుచనమం దున్నది; సామ్యముం గనుఁడు. 7. మూలమందు ఒక్కొక్క శశికిరణవిశేషణము ఒక్కొకసప్తమితో నన్వయించుచున్నది; లహరీషు... ధవళాః, ఉపలేషు... శీకరిణః, క్రోడే... పిఞ్జరాః, గహనే... రూఢాః, గాత్రే... కుర్వన్తః,

అని. అట్లుండ పంతులవారు గ్లానమునకు రెండుపెట్టనేల? గహనముకడ నున్న యన్మీలత్తిని దానితోఁ జేర్పక సామాన్యముగానేని విడువక, దూరముననున్న గాత్రముతో చేర్పనేల? ఆంధ్రీకరణ సాహసము నేని అతిసరళమైన యీపాటి శ్లోకము నన్వయించుకోలేక యద్భవిష్యగతులం బొరసినారు. త్యక్తములు. 8. లహరీ, 9. ప్రసపత్, 10. వికాసి, 11. కుముద, (ఉత్పల అన్న భావశ్యము వచ్చునా), 12. పిఞ్జర, 13. గహనే, 14. ప్రియ. విశేషము:—15. భూరివియోగిని, కడమవియోగినుల కన్న దీని దేమియెక్కువ? 16. బృందము, 17. పొందుగ—ప్రా.

అహముష్టిపద్యము.

ఉ॥ చీఁకటిగుంపు శ్రీగళుని శ్రీగళరోచిఁ బ్రాచిఁ గ్రమ్మఁగా
శ్రీకుముదాప్తదీధితియుఁ క్షీరసముద్రపువెల్వగా నొగిన్
[11] 2336 కోకచకోరశోకసుఖకోరకితగ్లపనప్రసన్నదృ
గ్లోకవిలోకితంబగుచు లోకమిదెంతయుఁ గ్రాలు లీలఁగన్.

పద్యార్థము.—తూర్పును చీఁకటి యావరించినది, తర్వాత వెన్నెల విస్తారముగా వచ్చినది. కోకములు చకోరములును లోకమును గ్లానప్రసన్నదృష్టులఁ జూచుచుండినవి, అట్టిదై లోకము మిక్కిలి శోభించుచుండెను.

మూ.—ధ్వాన్తౌఘే శితికణ్ఠకణ్ఠమహసి ప్రాప్తే ప్రతీచీముఖం
ప్రాచీ మఞ్చతి, కిఞ్చ దుగ్ధలహరీముగ్ధే విధోర్ధామని
ఏత త్కోకచకోరశోకరభసమ్లానప్రసన్నోల్లస
ద్దృక్పాతోర్మికదమ్బచుమ్బిత మివ త్రైలోక్య మాభాసతే.

శివునికంఠమువంటి మహస్సుగల చీఁకటిమొత్తము పడమటిదిక్కుయొక్క ముఖమున వ్యాపింపఁగా, పాలవెల్లివలె సుందరమైన వెన్నెల తూర్పుదిక్కును పొందుచుండఁగా, [ఒకవంక చీఁకటియు నొకవంక వెన్నెలయును గలదైన] యీ త్రైలోక్యము ఎట్లుగా విరాజిల్లుచున్నదనఁగా, దుఃఖితములైన కోకముల మ్లానదృష్టుల యలలమొత్తములచేత [పడమటివైపు], హృష్టములయిన చకోరముల ప్రసన్నదృష్టుల యలలమొత్తములచేత [తూర్పువైపు], ముద్దుగొనఁబడినదో యనునట్లుగా విరాజిల్లుచున్నది. జక్కవలు తమవిరాళిం దొలంచు రక్షకుఁడని క్రుంకుచున్న యినుని వగపుతోఁ గాంచుచుండి ఆయన క్రుంకిన పిమ్మటంగూడ అదిక్కునే శోకజడములై నిధ్యానము నేయుచుండినవి. చకోరములు నెలపొడుపుం గని తమబోనము వచ్చుచున్నదిగదా యని ఆనెలదిక్కునే [అనఁగా తూర్పునే] అహ్లాదముతోఁ గాంచు

చుండినవి. ఇట్లని ప్రౌఢోక్తిసిద్ధముగా నిరూపించుకొని, మహాకవి పడమటిచీఁకటిని వానివాడినచూడ్కులనీలిమవ్యాప్తిగాను, తూర్పువెన్నెలను వీనిప్రసన్న వీక్షణములచే తెల్లఁబడుటగాను, ఉత్ప్రేక్షించినాఁడు.

1. చీఁకటి పడమటను వ్యాపించినదని మూలము ఘోషించుచుండఁగా, వీరు తూర్పును గ్రమ్మె ననుట యిదేటి పాండిత్యము! సంస్కృతభాషాముఖ మెఱిఁగిన చదువేనా! 2. వెన్నెల తూర్పునం బొడమెనని మూలము. వీరు ఆమాట చెప్పక యెట్లైన నటు గానీ యని జిత్తుచేయనేల? 3. మఱి ప్రతీచిని ఏల దిగమ్రింగవలయు? వీరు ప్రాచీప్రతీచీశబ్దములు పర్యాయపదము లని భ్రాంతిఁజెందినారు. ఒకటి రెండవ కడ నన్వయార్థము కోరినవారు అధ్యాహరించికొందురు, కోరనివారితో తంటలేదు, అని ప్రతీచిని దిగమ్రింగినారు. "ప్రాచ్యవాచీ ప్రతీచ్యస్తాః పూర్వదక్షిణపశ్చిమాః" అమరము. ప్రాచీ = పూర్వదిక్కు; ప్రతీచీ = పడమటిదిక్కు. ఇఁక నేమి ప్రయోజనము! 4. మూలములోని యుత్ప్రేక్షను వీరేల నాశము చేయవలయు? 5. విలోకితం బగుచు నఁట! వీరు శ్లోకమున కర్థమెఱుంగలేక, ఈతెలివికి 6. 'ఇవ' యను నుత్ప్రేక్షావాచకమును 'ఇహ' యని మార్చుకొని యిట్లు తగులఁబెట్టినారు. వెన్నెలను చకోరప్రసన్నదృష్టిప్రసరముగాను, చీఁకటిని చక్రవాకమ్లానదృష్టిప్రసరముగాను ఉత్ప్రేక్షించినస్వారస్యమును గనలేక ఆహృదయంగమ సౌమ్యలక్ష్మిని ప్రవేశపెట్టుకొన కట్టెకంపలతో నిండిన హృదయమందు చోటు లేనే లేక, ఇవ కల్పవల్లి నున్మూలించి ఇహదుత్తూరమును నాటినారు. చచ్చినపాములవంటి కడమ తప్పులకేమి? ఆంధ్రీకరణములలో ఇంతకన్న పాడుచేయుట యెట్లు! ఈకాలమున వీరు నొక—కాదు, వీరొక—కాదు, వీరే ఆంధ్రభాషామర్యాదా వ్యవస్థాపకులు.

7. శ్రీగళుని శ్రీగళరోచియఁట—నుఱల విష మేల? ఒకమాఱుచాలదా? మూలముంజూచి నేర్చుకోరాదా! 8. కోరకితగ్లపనము—వహవ్వా! ఏమిలబ్జు! గ్లపనము ణిజంతముపై ల్యుడంతము. వాడఁజేయుట యని యర్థము. "గ్లపయతి యథా శశాఙ్కం న తథాహి కుముద్వతీం దివసః" శాకున్త. "మృణాల సూత్రాధికసౌకుమార్యాం బాలస్య లక్ష్మీం గ్లపయన్త మిన్దోః" కుమార. ప్రేరణ కిట నన్వయ మెట్లు? 9. శోకసుఖకోరకితగ్లపనప్రసన్నదృగ్లోక—సుఖప్రసన్న = సుఖముచే ప్రసన్నమైన, సుఖము హేతువే గాని కర్త గాదు. దానితో ద్వంద్వమందున్న శోకముకూడ హేతువే గాని కర్తగాదు. శోకహేతువుచే కోరకితగ్లపనమైనది దృక్కు. కోరకిత = మొగ్గలుగలదైన, అనఁగా ననలెత్తిన, గ్లపన = వాడించుటగలది, అనఁగా [దేనినో, వేనినో] వాడింప నారంభించినది, అని యర్థము. చక్రవాకములదృక్కు దేనిని వా

డించును? వాడఁదొడంగిన ధ్వని చెప్పవలయును. కోరకితగ్లాన అనవలయును. ఈ పాండిత్యము చూడఁగా అర్థము తెలియక ధ్వనిడంబరముగల శబ్దమును భ్రామకణార్థము వేసికొనుటగా నున్నది. 10. అగుధాతుజావ్యయము (గన్) అను నది యుపమావాచకమా? శ్రీగళరోచిగన్ — అనఁగా శ్రీగళరోచివలె అని యర్థమా? ఏమి కౌశలదారిద్ర్యము! అగుధాతువు అభేదమును చెప్పదా? 11. శ్రీకుముదాప్తుఁడేమి? మహా రాజ రాజ శ్రీ కుముదాప్తుఁడుగారుగాదా? గెజెట్టులో నిబంధన ప్రకటింపఁబడియున్నది చూడుఁడు.

రథోద్ధత. [భగ్నచక్ర].

[2] శంకరార్ధతనుశైలకన్యకా । కుంకుమాక్తకుచకోరకాకృతిన్
2338 బాంకమాశశిమనోజ్ఞసూల్లస । త్పంకభూముకుళభంగినంగుగన్.

చంద్రుఁడు తామరమొగ్గవలె నున్నాఁడని యుత్తరార్ధమున కర్థమగుచున్నది.

శంకరార్ధతనుబద్ధపార్వతీ । కుఙ్కుమాక్తకుచకోరకాకృతిః
సూచ్యతే కమలినీభి రున్నమ । త్పద్మకోశకరలీలయా శశీ.

ఉత్తరార్ధమునకు — తామరతీఁగలచే [లేక తామరకొలఁకులచే] [— స్త్రీలచే] ముకుళనార్థము పైకి నిగుడుచున్న తామర మొగ్గయనెడు చేతియొక్క వ్యాపారముచే [చంద్రుని] [వాఁడుగో అని] ఒండొరులకు, లేక, లోకులకు, చూపఁబడుచున్నాఁడు. చంద్రోదయముకాఁగానే తామరలు ముకుళించుచున్నవని తాత్పర్యము. 1. సూచ్యతే అనుటకు అర్థ మెఱుఁగక పాంకమా అన్నందునను, 2. లీలయా అనఁగా అట్టిలీలతోఁ గూడుకొన్నవాఁడై యని భ్రమసినందునను చక్రము విఱిఁగిపోయినది.

౧౦౦-వ పుట.

1. "సన్మనోజ్ఞుఁడఁట" 2 "సచ్చకోర మఁట" — సత్తుపాదపూరణము. చ
[8] చ్చుచకోర మనరాదా? ఇట్టి చేతఁగానికవన మెవరుచెప్పుకొమ్మన్నారు!
2346 3. "ధించుచుఁగల్వమొగ్గలను" — కల్వమొగ్గలను వికసిలంజేయుచు అని
వివక్షితార్థము. 'కల్వమొగ్గలను ప్రొయిలోఁబెట్టుచు' అనిన నాయర్థము రాదా? 4. "కోకిఁ ద్రెంచుచును" — చంద్రుఁడు కర్త. కోకిత్రాడనుట కవితాతత్త్వము. ఈ పుటలో — తలను రెండు పద్యపాదములకు పూరోక్తములు రెండు సత్తులు; "హరిహాయ" పద్యములో, 5. సుపత్రము, 6. సురజతము — రెండుసువర్ణములు; "ధవళరుచి" పద్యములో 7. సువిరహతాపము, 8. సువిమలతారా, — రెండుసూల్లు. ఇఁక కవనభాగ్యము చెప్పవలయునా?

[మూలద్రోహిపద్యము, లేక, పీర్లపండుగచంచ.]

రాముఁడు.—[విమర్శించిస్వగతంబుగ]

[8] ఆ॥ ఇందువిందుఁడనుటయెందులకీయాస । పయసుబిందువుగనుబరఁగునితఁడు
2354 హరిణదృక్కపోలహార్యాస్యములనెల । కొనెడుఁగాదెకాంతిదనరుఁదనర.

1. ఇందువిందుఁడు—ఇట్టి ద్విరుక్తియందు ఏకరూపమునే ప్రయోగింతురు; కాన, ఇందు విందువు, అని యేని, ఇందుఁడిందుఁ డనియేని చెప్పవలయును. 2. అనుట యెందుల కని ప్రశ్నయేని ఆస కన్వయము లేదు. ఆస యెందులకని ప్రశ్నయేని అనుట కన్వయము లేదు. 3. హరిణదృక్కపోల హార్యాస్యములన్—బళాబళి! లేళ్ల యొక్క [చూపులచేతను చెక్కిళ్లచేతను మనోహరమైన] ముఖములయందు అనియు ననర్థము లభించుచున్నది. పతితలను బాధించుట యెల్ల మనకు ప్రజ్ఞయేగద్దా? తన కనఁగా నెవరికి? చంద్రునికా?

ఇన్దు రిన్దు రితి కిం దురాశయా । బిన్దు రేష పయసో విలోక్యతే
నన్విదం విజయతే మృగీదృశః । కోమలామలకపోల మాననమ్.

ఇందుఁ డిందుఁడనుచు ఎందులకు దురాశతో ఈనీటిబిందువును చూచుట? ఇదిగో తేజరిల్లుచున్నదే యీకురంగీనయనయొక్క [సీతయొక్క] నునుఁదళుక్కుచెక్కులతోడి నెమ్మొగము.—ఈపద్యమున శ్రీరాములవారు అల్పగుణమైన చంద్రబింబమును మాని అధికగుణమయిన సీతాముఖముం గాంచం దలంచుగొన్నారు. పంతులవారికి ఈపాటిశ్లోక మర్థముగాకపోయెనుగదా! మూలములో పూర్వార్ధమెల్ల నేకవాక్యము. ఏష పయసో బిన్దుః ఇన్దురిన్దురితి దురాశయా కిం విలోక్యతే? అని యన్వయము. 4. పంతులవారు విలోక్యతే అనఁగా చూడఁబడుచున్నాఁడు, అనఁగా ఎఱుఁగఁబడుచున్నాఁడు, అనఁగా, పరఁగను, అని యపార్థముచేసికొని, తదనుసారముగా, 5. ఒకొక్కపాద మొకొక్కవాక్యముగా అన్వయించుకొని పద్యము నిట్లు వెలిఁగించినారు. 6. ఉత్తరార్ధార్థగంధముంగూడ వీరెఱుంగమికి మోతుబరి [విశ్వాస్యుఁడైన] సాక్షి 'ఆస్యములన్' అను బహువచనము. సీత కెన్నియాస్యములు? 7. సీతయొక్క యాననమని మెరయుచున్న యిదమును వీరు గొంతు పిసికి చంపివేసినారు. సీతాపరముగా వీరు దీనిని గ్రహింపలేదు. కపోలాస్యములకు ద్వంద్వమందురా? అట్లైని ఏకవద్భావము వలదా? 8. మఱి హరి యేల? కపోలము హరిగాదా? కపోలహరి తృతీయాసమాసము గానిచో హరిపద మంతర్గడువుగదా. విలోక్యతే అనఁగా, పరఁగునా? ఆంధ్రీకరణము పఱచునా? ఈయనకు సంస్కృతము

తెలియునఁట! ఎప్పుడు? మూలము ద్వంద్వానుగ్రాహకముగాదు. పంతులవారు స్వారస్యమబ్బుటకై స్వతంత్రించి మార్చిరను పక్షమున సందిగ్ధతాదోషము.

౧౧౧-వ పుట.

మ॥ తనుమధ్యా యెటులొందునిందుఁడు సుధాధాముండు దుగ్ధాబ్ధికిన్
[10] దనయుండయ్యుఁ ద్వదాస్యశోభను లసత్తారుణ్యలావణ్యవా
2364 ర్ధినిధానంబుఁ దరంగితేక్షణవాకింతేఁగమ్ము శీతాంశుఁడౌ
దనునీలాబ్జవనీవిహారకలనాధుర్యోరుహంసద్యుతిన్.

మూ.—అస్య త్వద్వదనస్య విభ్రమలవం లావణ్యవారాన్నిధేః
ఇన్దుస్సున్దరి దుగ్ధసిన్ధులహరీబిన్దుః కథం విన్దతు
ఉత్కల్లోలయ లోచనే క్షణ మయం శీతాంశురాలమ్బతా
మున్మీలన్నవనీలనీరజవనీఖేలన్మరాళశ్రియమ్.

ఓ సుందరీ పాలకడలియలబొట్టయిన యీచంద్రుఁడు లావణ్యసముద్రమయిన నీనెమ్మోముయొక్క విభ్రమలేశము నెట్లుపొందఁగలఁడు? నీ వాకమాటు నీనేత్రముల నుత్తరంగములనుగాఁ జేయుము, క్షణముసేపు వీఁడు వికసిల్లుచున్న క్రొత్తనల్లగలువ వనిలో క్రీడించుచున్న హంసయొక్క శోభను పొందునుగాక.

చంద్రుని అపకర్షించు నీఘట్టమున వీరు మూలవిరుద్ధముగా, 1. సుధాధాముం డనియు [అమూలకము], 2. దుగ్ధాబ్ధికి తనయుం డనియు [తనయుఁడు అమూలకము], నుత్కర్షించి పితృదక్షిణమునకై, 3. 'అయ్యు' నని అపార్థమును ప్రయోగించుకొన్నారు. వీరిమూలములో 4. సున్దరదుగ్ధసిన్ధులహరీబన్ధుః, 5. ఖేలన్మరాళశ్రియమ్—అనియును తప్పులున్నవి. దుగ్ధసింధువునకు సుందరవిశేషణము అపేక్షితము లేని యీయపకర్షలో ప్రస్తుత విరుద్ధముగాదా? వీరు ఆవిశేషణమును త్యజించినారో సున్దరి యని సీతాసంబుద్ధిగా మార్చుకొన్నారో సందేహముగానున్నది. 6. మార్చుకొన్నచో 'సున్దరి' యనక 'తనుమధ్యా' యన్నారు. ముఖవర్ణనాప్రకరణమందు, కన్నులెత్తిచూడుము అని వేఁడు నీచోట, మధ్యవర్ణనా పూర్వకమయిన సంబోధన సరసముగాదు. ఈయన "తనుమధ్యాబిల్వోషలతనయుఁడు" కాఁడు గావున అభక్తిచేత తనుమధ్యానామ మిందు 7. ప్రాసముకై వేసికొన్నను అందగింప లేదు. వీరు తలఁచినట్లే మూలమం దుత్కర్షయే మతమేని దుగ్ధసింధుబంధు పనక లహరీబంధువని యేల చెప్పుదురు? పైగా సాంతొత్పత్తిని బంధువన్న తిరస్కారము గాదా? బ్రహ్మబన్ధుః, క్షత్రబన్ధుః. మిత్రార్థముగానేని వీరు గ్రహింపలేదుగదా. ఆ

పక్షమందును లహరీమిత్రముగా చెప్పుటచేతను [దుగ్ధసింధు పుత్త్రునిఁగాఁ జెప్పుటచేతను] తిరస్కారమేగదా గమ్యము. మరాళీయని స్త్రీలింగ మేల? శ్రయమేమి? వీనిని మరాళశ్రియమ్మని దిద్దుకొన్నారు. బంధువనుటచే ఇటు ఎన్నివిరోధములున్నను, వానిని తెలిసికొనలేక, మఱికొంత పాడుచేసికొన్నారు. 8. మఱియు లావణ్యావారాన్నిధేః అనుషష్ఠిని అన్వయించుకొలేక దానిని ద్వితీయగా మార్చుకొన్నారు. 9. లవణశబ్దస్వారస్యమును తెలిసికోనేరక పోయినారు. 10. నీముఖశోభను ఈచంద్రుఁ డెట్లు పొందునను వీరివ్రాఁతకును నీముఖశోభయొక్క లవమును [లేశమును] చంద్రుఁ డెట్లు పొందును అను మహాకవివాక్యమునకును, సక్క యెక్కడ దేవలోక మెక్కడఁ గదా? దుగ్ధసింధులహరీబిందు వనుటకు సదృశవర్ణన "బిన్దు రేష పయసో విలోక్యతే" అని యుండలేదా? నాగరము తెలియదాయెను, తెనుఁగుముద్రణము అర్థము కాదాయెను. బుద్ధిప్రభావమునకు విపరీతార్థము లగును. ఇక నేమగును!

శా॥ ఇందుశ్రీభువిఁగ్రమ్మునిందుపనరాత్రీందీవరాక్షీకుచా
[9] స్పందశ్రీకరగంధసారముగద్యుఃపద్మాప్రకీర్ణంబుగన్
237 పే. గందర్పస్ఫటికాలయంబుగసుబ్రాకాష్ఠాంగనానాసికం
బందున్ముత్తెముగన్మహేశ్వరజటాప్రాంచల్లతాంతంబుగన్.

మూ.—ఇన్దో రస్య త్రియామాయువతికుచతటీచన్దనస్థాసకస్య
వ్యోమశ్రీచామరస్య త్రిపురహరజటావల్లరీకోరకస్య
కన్దర్పక్షోణిపాలస్ఫటికమణిగృహ నైరృతదిఙ్మృగాక్షా
నాసాముక్తాఫలస్య స్థగయతి జగతీం కోపి భాసాం వికాసః.

రేయువిడగబ్బిగుబ్బకు గందంపుఁబూఁతయు, నింగిసిరికి జల్లియు, ముక్కంటి జడతీవియకు పూమొగ్గయు, వలరాచరాజునకు పటికపురామాడువును, ఈవేల్పుఁ జేనిదెసవెలందికి బులాకీముత్తెంబును, అగునీజాబిల్లియొక్క వెలుఁగులయొక్క చెప్పనలవిగాని వికాసము జగతి నాక్రమించుచున్నది.—అని యర్థము. ఈతేనియబుగ్గను పంతులవారు తుంగగుంట చేసినారు. కుచము గుండ్రముగదా; దానికి చందనముపూసిన నాగుండ్రని తెల్లనిచర్చ చంద్రమండలమువలె నుండును. తెల్లనివింజామరంబును దూరమునకు గుండ్రనగా చంద్రమండలమువలెనే యుండును, పిడి మనకంటికగపడకుండ నొకవిధముగాఁ బట్టుకొనిన దగ్గఱఁగూడను గుండ్రముగానే యుండును; కాన నదియు చంద్రమండలసాదృశ్యలక్ష్మిని బొరసినదే. మొగ్గలనేకములు ఇంచుమించుగా గుండ్రముగా నుండును; కాన తెల్లమొగ్గ చంద్రమండలసాదృశ్యముగలదే. రాజుగారిపటికపుటిల్లు విచ్ఛిత్తికై మదరానురొండుటాణావలె నిర్మితమై యుం

వరాదా? కాన ఇంచుమించుగా అదియు చంద్రమండలసాదృశ్యారూఢమే. ముక్తాఫలమునకు ఆసాదృశ్యము చెప్పవలసినదేలేదు. ఇంతియగాని ఇందుదేనికిని వెన్నెలతోడిసాదృశ్యము చంద్రసాదృశ్యమువలె నింతసౌభాగ్యవంతము గాదు. అట్లుండఁగా పంతులవారు చంద్రసాదృశ్యమును తొలంచి [అనఁగా చంద్రాభేదవర్ణనము మాని], ఇందుశ్రీయని వెన్నెలకే పూర్వోక్తవస్తువులతో సామ్యము చెప్పినారు. ఇది పద్యము నుతగులఁబెట్టుటకు వేసినతొలికట్టియ, పెద్దకట్టియ; ఇందుశ్రీయనఁగా చంద్రుఁడే యర్థమని వాదమునకు రాకమానరు. అట్లని చంద్రుఁడే భువిని కౌఁగిలించుకొన్నాఁడా? ఆకాశములో లేఁడా? రెండవకట్టె యేదన.—2. భువిఁగ్రమ్ము—మూలములో జగతీ మనియున్నది. “ అథో జగతీ లోకో విష్టపం భువనం జగత్ ”—అని యమరుఁడు జగతీశబ్దమును భూపర్యాయములలో పఠింపక, మృత్తికాదిపర్యాయవచనపరములయిన రెండుశ్లోకము లెడపెట్టి తర్వాత పఠించినయభిప్రాయమును తెలిసికొననది. 3. మూఁడవకట్టియ—ఇందువదన—భువియెల్ల చంద్రుఁడే అనునట్లుగా అని యమూలకవర్ణనమా? ఆపక్షమున నీవాక్యములో ఆయైదుగన్నులకును సంబంధమేమి? భువి యనఁగా దివి గాదుగదా? వ్యోమశ్రీప్రకీర్ణకాదులు భువినిగావు గదా? ఈయాక్షేపకుని ఈయన భువినిగౌఁగిలించినదెబ్బకు వానికెల్ల కోరకప్రకీర్ణకాదులు పుట్టినవని వెక్కిరింతమన్న, ఈదెబ్బకు పూర్వమే వానికవి కల్గుటకు ఏమభ్యంతరము? లేక, చంద్రసేవకుఁడా, అనియేని, చంద్రయాచకుఁడా, అనియేని, అర్థముగా ఖీయియిందువనుఁడా అని సుగ్రీవునికి సంబోధనయా? అతని నట్లనుట యేల యన్న, సీతను వెదకించి తోడ్పడినందులకు పరిహాసము. లేక, ఇందువదన అనుటకు “ వర్ణనాశాత్పృషోదరః ” అని దవర్ణనాశమా? సుగ్రీవునిమొగము అమావాస్యాచంద్రునివలెనేగదా యందుమను. పూర్ణిమయొక్క విశేషమేమి? అమావాస్యయే పితృదేవతలు మేల్కొనియుండుకాలము. 4. [అస్పందశీకర—ప్రాసమిత్రము.] 5. క్షోణిపాలుఁడు పరారిచిత్తగించినాఁడు. 6. నాలవకట్టియ—ప్రాక్కాష్ఠాంగనా. ప్రాఁతకట్టెచెలువ యనియు దీని కర్థము. ఏమియందముగాఁ గుదిరినది! 7. నాసికంబందుఁ—కడమన్నిటికిని సమాసములును, ఇట ప్రక్రమభంగముకొఱకును, ప్రాసబాధ తీఱుటకును, వ్యస్తప్రయోగము కావలసివచ్చినది. 8. ప్రాంచత్ - సన్న్యాసిసొత్తు. ఇందుకై వదలుకొన్నది. 9. వల్లరీ! లతాంతశబ్దమందలి లతాశబ్దము ప్రత్యేకవల్లరీశబ్దముయొక్క కార్యమును చేయదు.—పద్యము స్వారస్యముగా నున్నదా! ఏవేనికొన్నియక్షరములు గణయతిప్రాసములు సరిపోవునట్లువ్రాసి ముద్రించిన నది పద్యము గాదా! కవితాతత్త్వవిజ్ఞానము గాధా?

[శనిప్రీతికరము.]

పృథ్వి॥ సదున్నతఘనస్తనస్తబకచుంబితుంబీఫలో
[4] న్నదన్మధురవీణస్వర్ణశిననేత్రసత్ప్రౌఢిమన్
2377 సుధాకరకరాయితార్జునసుకాంతిసత్కాంతమున్
ద్వదీయయయశముంగడుందనరఁబాడెదున్వేడుకన్.

ఈపద్యము చదివినందునంబట్టిన శనిని ఈశ్లోకముచదివి పోఁగొట్టుకొందము.

సమున్నతఘనస్తనస్తబకచుమ్బితుమ్బీఫల
క్వణన్మధురవీణయావిబుధలోకలోలభ్రువా
త్వదీయ ముపగీయతే హరకిరీటకోటిస్ఫుర
త్తుషారకరకన్దళీకిరణపూరగౌరం యశః.

మఱియు నిది పృథ్విగాన దీన పృథ్వియెత్తుసత్తున్నది;— **1**. సదున్నత **2**. సత్ప్రౌఢిమ **3**. సత్కాంతము. చేరునకు, పులుసునకు, మజ్జిగకును ఈసత్తుతో మనము పాత్రములెన్నేని చేయించుకోవచ్చును. కాన పద్యము పాడని తలంపవలదు. పాత్రములు మాత్రమున్నకడుపెట్లు నిండును? భోజనసామగ్రికి ధనమక్కఱలేదా? ఏమి తెలివి! కన్నుదెఱచి చూచినఁగదా అగపడును. **4**. సుకాంతిలోని సువర్ణఖండముంగనుఁడు, ఎట్లు చాటున మిణుకు మిణుకు మనుచున్నదో. దానింగొని దీనికి పాత్రలు చేయించి సామగ్రితెప్పించి శనిసమారాధనచేసి ధప్పళముకొట్టుదము. కవితాతత్త్వమను రహస్యగ్రంథములో ప్రథమాధ్యాయములో “సుసత్తులు వేయునది,” “సరసవిశేషణములం ద్రోయునది,” “నీరసములం గుప్పించునది,” అని ప్రథమ సూత్రత్రయము. ఆరహస్యము మీకేమి తెలియును!

౧౦౨ - వ స్ఫుట.

స్రగ్ధర—ఉత్తరార్ధము. **1**. రలప్రాసకడగండ్లు.

[5] లోలాక్షీగండమున్న - ల్లుళితజలధిక - ల్లోలఫేనోరుఖండ
2382 బాలోకింపంగదేయా - యదనఁబొదలునీ యబ్జుఁడాకాశమందున్.

మూ.— సంరంభోద్రిక్తనక్తంచరమయదశముఖోచ్చణ్డదోర్దణ్డహేలా
కైలాసః సప్తలోకీజయముదితమనోజన్మవాదిత్రశఙ్ఖః
లోలాక్షీగణ్డపాళీలవణిమజలధే రుద్గతః ఫేనపిణ్డః
పశ్య వ్యోమావకాశం విశతి విరహిణాం దత్తశఙ్కః శశాఙ్కః.

పంతులవారు తృతీయపాదమును చెఱిచినారు. 2. చంద్రుఁడు లోలాక్షీగండ మంట! లోలాక్షీ గణ్డ స్థాలీ యనివిడఁదీసికొన్నారు. ఏలోలాక్షికి గండము? అందఱి కినా? 3. పంతులవారికి లవణిమ యనఁగా అర్థము తెలియక, ఆపదము స్ఫూర్తికి రాక యీచెఱుపు గలిగినది. లవణిమ యనఁగా లావణ్యము. లావణ్య మనఁగా కాంతివిశేషము. [ఈచంద్రుఁడు] లోలలోచనలయొక్క చెక్కిళ్లలావణ్యమనెడు స ముద్రమునం బొడమిన నురువుముద్ద యని శ్లోకతృతీయపాదార్థము. దానికి వీరిచేత ఆంధ్రీకరణగండమున నీపాట్లు వచ్చినవి.

పీతో యతఃప్రభృతి కామపిపాసితేన
తస్యా మయాధరరసః ప్రచురః ప్రియాయాః
తృష్ణా తతః ప్రభృతి మే ద్విగుణత్వ మేతి
లావణ్య మస్తి బహు తత్ర కిమత్ర చిత్రమ్.

అని యమరుమహారాజదేహగతులై శ్రీజగద్గురువు నుడివినసువచమును గ్రహిం పుఁడు. పంతులవారి తెన్గుముద్రణములో లవణజలనిధేః అని ముద్రితమైయున్నది. పంతులవారు తన్ముద్రకునికన్న పండితులుగాన ఆలవణశబ్దమే పనికిరాదని యుచితము చేసినారు. 4. గ్రహశాంతిసంతర్పణకై పాత్రసామానుకోసము సర్దుపెట్టినారు. 5. ఈ యదన యతీశ్వరులవారు విరహిణులను హరించివేసినారు. లేక, లోలాక్షులగండము లోనే వీరికెని గండమైనదాయేమి? విచారింపవలయును. అర్థమెట్లున్న నేమి ఇదియుం బద్యమేగదా.

[మఱియతి.]

క॥ ఓనందముకుముదాదుల। కానందముఁగొలుపుచిందుఁడాకానంబుఁ
2383 దానుల్లంఘించునుహాను। మానుండంబుధినిబోలెనహాహాకనుమా!

కందపద్యము. యతిభంగమును అహాహాహా కనుమా! మాకు ఆకు యతి మీ రెక్కడనేర్చితిరి? ఇదేమి కవితాతత్త్వములో నాలవసూత్రమా? మిమ్ము కవన మెవరు చేయుమన్నారు? మీకవనమున కహాహా యని మీరే ఆశ్చర్యపడుదురు! ఈబాధ యేల? ఈమాటు కవిపండితసంఘమును యతిప్రాసలు కొట్టివేయు మని వరమడుగుదము.

[2] రాముఁడు.—ఎందువలనఁగుబేరానుజుఁడు కుబేరునివలననుండి హరించె
2385 నో, యందువలన నిది విమానరత్నమే సరి.—

లక్ష్మణుఁడు.—అన్నా! వీఁడెట్లుకిష్కింధా మాహిష్మతీపతులకంటె వీరుఁ డని యెన్నఁబడుచున్నాఁడు.

1. ఈ లక్ష్మణవాక్యము అర్థబధిరునిభాషితముభంగిని రంగారుచున్నది. పుష్పకము వచ్చినది. అందఱు ఎక్కినారు. శ్రీరాములు పుష్పకమును ఉగ్గడించినారు. లక్ష్మణుఁడు ఈయసంబద్ధప్రశ్న వేసినాఁడు. వాలికార్తవీర్యులప్రస్తావము రాములవారు చేయలేదు. ఈయసంబద్ధప్రశ్నయొక్క జాతక మేమనఁగా, పై రామభాషితములో మూలమున కుబేరానుజునికి 2. త్రిభువనైకవీరుఁడు అని విశేషణ మున్నది. అది తెనుఁగుముద్రణమున అంధముద్రకునిచే త్యక్త మైనది. లగ్నము గ్రహస్థానములుఁ దెలిసినవిగదా. ఇఁక ఫలము బృహజ్జాతకముప్రకార మూహించుకొండి. నన్నడుగనేల? తెలిసినది. "అంధునఁబడునంధానుగాంధునివలె" ఫలము.

తే॥ అట్టిగట్టిబుజంబులనదుముకతనఁ
[10] గాఁగనిశ్శబ్దములుదశకంఠకంఠ
2395 ములుదబాలింగితుండయిజలధులందు
ముంచినకపీంద్రుఁడవ్వాలికాంచుఘనత.

లక్ష్మణప్రశ్న కుత్తరముగా వాలికార్తవీర్యులకన్న రావణుఁ డెట్లు వీరుఁడో ని రూపించువారై శ్రీరాములవారు ముందుగా వాలిమహిమం గొనియాడుచున్నారు.——

1. తదాలింగితుండు—కంఠములచేతనా? కంఠములచే నాలింగనము కొంకల కు సాధ్యము. రావణునికిఁ గాదని తలంచెద. రావణునిచేతనేనా? ఆలింగన మేల? ఆలిఁగితుఁడేని ముంచుట యెట్లు? మున్గిన అనవలయును. ఆలింగకుని ముంచుటకు ఆలింగితుఁడే మున్గవలయు. ఆపక్షమున నిద్దఱుం జత్తురు. కాన అలింగనోక్తి సరి గాదు. ఆలింగితబాహుఁడై అనియేనియుం జెప్పలేదు. ఇది చాలుఁగదా ఇటు అంధానుగాంధత చక్కఁగాఁ బట్టిన దనుటకు.

తాదృక్కఠోరభుజయన్త్రనిపీడనేన
నిశ్శబ్దతా ముపగతై ర్దశకణ్ఠకణ్ఠైః
యత్కీర్తిఘోషణ మకారి చతుస్సముద్ర
వేలాసు కిం స వచసాం విషయః కపీన్ద్రః.

అట్టిగట్టిభుజ 2. యంత్రమున వేసి (వాలి) బిగింపఁగా నిశ్శబ్దతను బొందిన దశకంఠకంఠములచే ఎవని [ఏవాలి] 3. కీర్తి చతుస్సముద్రతీరములయందు 4. చాటఁబడెనో, ఆకపీంద్రుని [వాలి] మహిమను మాటలచేఁ జెప్పఁగలమా! 5. నిశ్శబ్ద [ము యినకంఠ]ములచే [కీర్తి] చాటఁబడె నని విరోధము; 6. అట్లు రావణుని గ్రుద్దుమిక్కనీక కక్షోగ్రత్తము దిటికించుకొని వాలి నాలుగుసముద్రములకును తిరిగినందు

న వాలియొక్క బాహుబలము యెల్లయెడలం బ్రఖ్యాతమయిన దని తత్పరిహారము భావము; కాన విరోధాభాసాలంకారము. పద్యములో విరోధ మేమియు లేమిచే కేవలాభాసాలంకారము. 7. అంధముద్రణములో నుత్తరార్ధము.— ఆలిఙ్గితో జవ ముకాకారి చతుస్సముద్రవేలాసు యో న వచసాం విషయః కపీన్ద్రః॥ ఇందు ఆంధ్రము ద్రాక్షారశాలామర్యాదనుబట్టి 8. జవ అనుట జపయనుటకు బదులని విశదమేగదా. అచ్చుకూటపుఁజట్టములో పంతులవారిప్రాసమందుంబోలె వవల కభేదముగదా. దీని యర్థము. 9. ఆలింగితుఁడై నాల్గుసముద్రవేలలయందు జప మొనర్చునట్లు ఎవఁడు చేయఁబడెనో ఆకపీంద్రుఁడు మాటలకు విషయము గాఁడు.—అని 10. దీనినేని సరిగా వీరు తెనిఁగించినారా? పద్యం పాదచతుష్టయీపరిమిత మ్మన్నందులకు సరిగా పద్య మేమో చేసినారు.

౧౦3 - వ పుట.

[1. గఘప్రాసము. 2. రావణు తొలిమ్మృతి. 3. శ్రీరాములు ఉపన్యాసములో తబ్బిబ్బగుట.]

శా॥ ద్రాఘిష్ఠానినికృత్తమూర్ధతతిపాదస్థానమందుంబడన్
శ్లాఘాపాత్రము గాఁగబిండిశశిలీలన్ దత్సుధాధారలన్
[9] 2404 వేగంగూర్చితగంబునర్జనితుఁగావించెన్నతున్రావణున్
శ్లాఘింపంబడుఁగాతమాతఁడుజగత్సంస్తుత్యుఁడీశానుఁడే.

శ్రీరాములవారు ఆలక్ష్మణప్రశ్నకు ఉత్తరముగా రావణుఁడే వాలికార్తవీర్యులకన్న వీరుఁడని పల్కి 'అట్టిగట్టి' పద్యమున వాలిం బొగడి, తర్వాతనొకపద్యమున కార్తవీర్యునిఁ బొగడి, ఈమూఁడవపద్యంపుమూలమున ఆయిరువురికన్న రావణుని యుత్కర్షను సిద్ధాంతీకరించినారు. పంతులవారికి, 4. ప్రశ్న తెలియక 5. ఉత్తరము తెలియక 6. ప్రకరణము తెలియక 7. ఏతన్మూలము శివశ్లాఘాపరముగా పరిణమించినది. శివశివా!

యస్య ద్రాక్కరవాలకృత్తశిరసః కణ్ఠాలవాలస్థలీం
చూడా చన్ద్రమసం నిపీడ్య నిబిడం సిఞ్చన్ సుధానిర్ఝరైః
స్వాం మేనే శశిఖణ్డమణ్డన ఇతి ఖ్యాతిం కృతార్థాం హరః
పన్థానం దశకన్ధరః స చ కథంకారం గిరాం గాహతే.

ఏదశకంధరుఁడు [అర్చనగా శివపాదములం బడునట్లు] కత్తితో చరాలున తనతలలను ద్రుంపఁగా ఆతలకాయలపాదులయందు శివుఁడు తనశిరస్సునందలి చం

ద్రరేఖను దట్టముగా పిడిచి యమృతప్రవాహములన్నీ పోయుచు అందువలన తనచంద్రశేఖరత్వము సఫలమాయె నని తలంచుకొనెనో ఆదశకంధరునిమహిమను వాక్కులచే వర్ణింపఁదరమా! అని యర్థము. పంతులవారు ఎంత చెఱిచిరో కనునది! పంతులవా రిట రావణుని చంపివేసినారు. శివుఁడు బ్రతికించినాఁడు. మూలములో రావణుఁడు చావలేదు. శివుఁడు తలలను మఱలం బుట్టించినాఁడేగాని 8. చచ్చినరావణుని బ్రతికింపలేదు. తొమ్మిది తలలను మాత్రమే తఱుగుకొనియున్న సమయమున, పదియవదానిం దఱుగుకొనఁబోవుచుండఁగా, దానిఁ దఱుగుకొన్న నిఁక చచ్చునని శివుఁడు ఆతొమ్మిదింటిని ఆలోననే పుట్టించెనని, రావణుఁడే యీనాటకమందే చెప్పినాఁడు. ఈపంతులవారే ఆవాక్యమునే తెన్గించినారు. ఈవిమర్శ ... పుటలో 'యత్సంతుష్ట' ఇత్యాది శ్లోకముం గనుఁడు. శ్లాఘాపాత్రముగాఁ బిండిన జగత్సంస్తుత్యుఁడేమి, మఱల శ్లాఘింపంబడుఁగాక యేమి? 9. పౌనరుక్త్యము దోషము గాదా? ప్రత్యయద్యోతితార్థముచే భేదముకల్పింతురు గావలయు. అట్లేని, రాములవారు శ్లాఘింపంబడుఁగాక అనఁగానే అందఱు భోజనకాలమందు నమఃపార్వతీపతయే హర హర హర హర మహాదేవయన్నట్లు ఏమేని శివస్తుతి పలికిరా? ఈప్రయత్నము వాస్తవముగా శివశ్లాఘకముఁ గాదు. ప్రాసకై నాల్గుమాలు కావలయు. "అప్యకార్యశతం కృత్వా భర్తవ్యా మను రబ్రవీత్." మూలచతుర్థపాదమందలి తచ్ఛబ్దము వీరియులిపికట్టియయన్వయములో ఆసన్నుఁడైన దశకంధరుని మాని దవిష్ఠుని హరుని పరామర్శించుచున్నది. మున్ను తిక్కనశ్రీనాథాదులు అంగీకరించిరి. ఇపుడు ఇట్టియనేడమూఁకలు తొడఁగినారు. అందును, వీరివలె పాడుచేసినవారు మఱి లేరు. వీరుపండితులఁట! తెలివిగలరఁట! "నిరస్తపాదపే దేశే ఏరణ్డోऽపి ద్రుమాయతే"

ఉ॥ ఎత్తఁబడంగ నెవ్వనియహీనభుజంబులఁజంద్రమౌళిభూ
[8] భృత్తునిరస్తభారతనహీంద్రుఁడునుండలెత్తఁదత్ఫణా
2412 ఖ్యోత్తమరత్నరాజిరుచులుద్యదినాంశులువోలెఁగ్రాలఁగ్రు
చ్చిత్తజవైరిదృక్త్రియముఁజేరఁగనట్టిసలెజ్జివాఱవే.

మూ. యద్దోశ్శ్లాఘిని చన్ద్రశేఖరగిరౌ భారావతారోన్నమ
న్నాగాధీశఫణావళీమణిరుచాం పూరే సముజ్జృంభతి
జాతాస్తుల్యమకాలబాలతపనాతామ్రా శ్చతస్రో దిశః
దేవస్యాపి రుషా తుషారకిరణోత్తంసస్య త్రిస్రో దృశః.

ఏ రావణుఁడు కైలాసశైలము పెకలించి తనచేతులం గొని యుండఁగా అనంతుఁడు తనతల మీఁదిబరువు తగ్గుటచే ఎత్తుకొన్న పడగలపంక్తి యొక్కమణుల కాంతి పూరము పర్వుటచే ఉవ్వెత్తుగా, నలుదిక్కులును, కోపముచే నువ్వెత్తుగా చంద్రశేఖరదేవుని మూఁడుదృక్కులును అకాలబాలాతపాత్రములైనవో [అట్టి యారావణుని చరితములు లోకోత్తరములు గావా, అని పూర్వమున కన్వయము.] 1. చిత్తజవైరి దృక్త్రియముం జేరఁగా అనుటు మూలార్థాపరిజ్ఞాన విలసితము. 2. రావణుఁడు కొండయెత్తుట అనంతఫణి ఫణామణి కాంతి వ్యాప్తిచే దిక్కులెఱ్ఱఁబాఱుటకును, కోపముచే శివలోచనము లెఱ్ఱఁబాఱుటకునుం గారణముగాని, 3. లోచనము లెఱ్ఱఁబాఱుట దిక్కు లెఱ్ఱఁబాఱుటకుఁ గారణముగాదు. 4. అహీన—ఈవర్ణన యెల్ల అహీనత్వధ్వననార్థమే నిబద్ధమై యుండఁగా, అహీనత్వమును ముందే వాచ్యభంగిం జెప్పకొనుట కవనమార్గ మెఱుఁగమిని తెల్పుచున్నది 5. ఉత్తమ—ప్రా. ఉద్యదినాంశులువోలెఁ గ్రాల. దీనిమూలము దృక్కులకుం గూడ విధేయమే. 6. క్రుచ్చిత్తజవైరి—ఏమి యసహ్యమైనకవన మిది! క్రుధ్=క్రోధము; ఈమాటను శివనేత్రారుణ్యాకారణముగా వ్యస్తముగాఁ జెప్పవలసినది. 7. దృక్త్రియ మెట్లు చేరినది? ఈచేరుధాతు వెక్కడిది? దేనికి తెలుఁగు? పంతులవారు. 8. దృశో జాతాః అనునన్వయము గన లేదఁట, పండితు లఁట! కవులుగూడ నఁట!

శిఖండిమండి। తావనిజాకాండచిత్రకూటాచలంబు.

2413 అవిమృష్టవిధేయాంశతాదోషము జాగరూకము. శిఖండిమండి। తావనీజంబు చిత్రకూటాచలంబు, అనునది.

ఉల్లఙ్ఘ్య నీరధి మతీత్య చ దణ్డకాని। నద్యా చ మేఖలకళిన్దసుతే వ్యతీత్య
ప్రాప్తాశ్శిఖణ్డిశతమణ్డితశాఖిషణ్డ। మేతే వయం శిఖరిణం నను చిత్రకూటమ్.

[పీఁకుట, మగసింగముపాలు ఏనుఁగుగున్నలు త్రాగుట.]

[6] క॥ ఏనికగున్నలుతొండము। చే నెఱసింగములజడలఁ జెలఁగుచుఁబీకున్
2419 మానుగనేనుఁగుఁబిల్లలు। మానిచిశువుహరిపాలమఱిమఱిగ్రోలున్.

1. పంతులవారికి ఈపీఁకు నభ్యాసమొకటి సంభవించినది. విమర్శ ౫౧- పు. చూడుఁడు. 2. వేఱుగున్న లనియేని తెల్పలేదు గదా మఱి మానుగనేనుఁగుబిల్లలని పునరుక్తి చేయనేల? 3. ఈ పాదమునే మానివేసిన పద్యమున కేమేని లోపమా కనుఁడు. 4. ఈపద్యమున నింకొక యద్భుతము.—హరి యనఁగా సింహము, మగది, ఆడుఁది గాదు; కావున పాలు మఱిమఱి గ్రోలవచ్చును. రానిచో తొండములున్నవి గనుక పీఁకవచ్చును.

వ్యాజృమ్భమాణవదనస్య హరేః కరేణ। కర్షన్తి కేసరసటాః కలభాః కిలైకే
అన్యే చ కేసరికిశోరకపీతముక్తం। దుగ్ధం మృగేన్ద్రవనితా స్తనజం పిబన్తి.

[ఇటనివిగో] కొన్ని గున్న యేనుఁగులు ఆవులించుచున్న సింగముయొక్క జూలును తొండముతో లాగుచున్నవి. మఱికొన్ని [గున్న యేనుఁగులు] సింగపుఁగొదమలు త్రాగివిడిచిన సింహీస్తన్యమును త్రాగుచున్నవి. [మానిచి శిశుపుర్ అను తెనుంగునకు సరిగా మూలమునం బాఠాంతర మున్నది.] 5. వ్యాజృంభమాణవదనస్య అనుట భయములేక యని తెల్పుటకు. 6. మృగేంద్రవనితాస్తనజ మనుట, వీనిఖిలీకరణమునకు మృగేంద్రము చూచుచు ఆనందించుచున్నదేగాని రోషమూనలేదని తెల్పుటకు. ఈరెండు విశేషణములనుం బంతులవారు హరిపాలలోఁ గలిపివేసినారు.

౧౦౪ - వ పుట.

మ॥ ఇవి గావించునుజక్రవాకులకుఁదామెంతేనియాశ్వాసమి
[2] యవిధ్వాంతాబ్ధిమునింగినట్టిజగతిన్ హర్షంబుగన్ లేపనె
2421 త్తువిలాసంబుగదిక్సతీతతిని వేతోఁచున్ వసంతంబునన్
రవివొసత్కరముల్సరోరుహావనిన్ రంజించుసల్లీలలన్.

1. ఈ పద్యమునినుండి [చతుర్థపాదమున] 2. రెండువీసెల సత్తే యెత్తినారు. సమారాధనకు కావలసినన్ని పాత్రములు ఈరెండువీసెల నగునా? పంతులవారికి ఒకమణుగుసత్తైన నెత్తునంత తెలివి లేకపోయెనని చింతిల్లుచున్నాఁడను. ఎవరైన నేమి? నే నెత్తెదఁ గొనుండు.

ఇవిగావించును(౧)సద్రథాంగులకుఁ దామెంతే(౨)సదాశ్వాసమున్
సవి(౩)సద్ధ్వాంతపయోధిమగ్నజగతిన్(౪)సద్ధర్షితన్ లేపనె
త్తువల(౫)త్సద్గతి(౬)సద్దిగంగనలవేతోఁచున్వసంతంబునన్
రవివొ(౭)సత్కరము(౮)ల్సదంబుజవనిన్ రజించు(౯)సల్లీలలన్.

ఇదె మణుఁగుసత్తు పాత్రములకు, వీనె కూలికిగాను కొసరు, పొండి. సద్రథాంగమేమి? సదాశ్వాసమేమి? ఇత్యాద్యసంబద్ధ ప్రశ్నలు వేయకుఁడు. "సచ్చకోరకుల" మేమి? [౧౦ - వ పుట.] "సుశోక" మేమి? [౫౪ - వ పుట.] ఇటనే సత్కరము లేమిని? కొన్ని పుచ్ఛనకరములు గలవా? సల్లీలలయేమిని? ఏదుష్ఫలీల యొకటికలదా.? పంతులవారి కవనమని తెలియదా?

మ॥ నెరయంజాలసీశానిశాచరవధూనిర్ఘాటనామాంత్రిక
[5] స్ఫురితంబుల్ రజనీప్రసుప్తనళినీప్రోద్బోధవైతాళిక
2426 స్ఫురణంబుల్ జలజాతకోశకుహరప్రోద్ధూతభృంగౌఘఝాం
కరణోంకారసమోపదేశగురులక్ష్యంబుల్దినేశాంశువుల్.

మూ. ఉన్మీలన్తి నిశానిశాచరవధూ నిర్ఘాటనామాన్త్రికాః
సాయంకాలవినుప్తపఙ్కజవనప్రోద్బోధవైతాళికాః
పల్గత్పఙ్కజకోశగర్భకుహరప్రోద్భూతభృఙ్గావళీ
ఝుంకారప్రణవోపదేశగురవ స్త్విప్రద్యుతే రంశవః.

సూర్యకిరణములనే ఇందు మాంత్రికులనుగాను వైతాళికులను గాను, గురువులనుగాను వర్ణించియున్నాఁడు. దానిని గ్రహింపక పంతులవారు ప్రాసకోసము 1. స్ఫురిత, 2. స్ఫురణంబులను, యతికై 3. లక్ష్యమునుం బెట్టుకొని మూలమును మాలఁద్రోచినారు. 4. ప్రోద్ధూత = ప్ర + ఉత్ + ధూత. = మిక్కిలి పైకి కదలింపఁబడిన, ఎవరుకదలించినారు? 5. ఇది అంధానుగాంధన్యాయమునం బడినది; ప్రోద్భూత అనవలసినది.

[అభీషవ = కిరణ.]

మ॥ దివసశ్రీపదయోజనానుభవప్రాప్తింబోలెఖాశోకశా
[11] ఖిపళత్సత్కలికోరుపుంజముదిశాక్రీడత్కురంగేక్షణా
2437 స్వవతంసభ్రమముంబొనర్చుచుదయప్రాంచత్సహస్రాంశ్వభీ
షవలోకంబుకడుంగడున్వెలిఁగెఁదుకజౌనొందఁగానివ్వడిన్.

మూ.—ఆయాన్త్యాదివసశ్రియః పదతలస్పర్శానుభావాదివ
వ్యోమాశోకతరోర్నవీనకలికాగుచ్ఛః సముజ్జృమ్భితః
ఆతన్వన్నవతంసవిభ్రమమసావాశాకురఙ్గీదృశా
మున్మీలత్తరుణప్రభాకరకరస్తోమస్సముద్భాసతే.

వచ్చుచున్న దినలక్ష్మియొక్క పాదస్పర్శమహిమచేత మిన్ననెడి యశోకవృక్షమున మొలచిన క్రొత్తమొగ్గల గుత్తియైనాయన దిక్కాంతల కవతంస విలాసమొసంగుచు పొడుపులేఁబ్రొద్దు కిరణసమూహము చక్కఁగా నిగిడి ప్రకాశించుచున్నది. అని యర్థము.

ఈ యర్థమును పద్యములో తివియువాఁడు నీట జొడఁదీయంగలవాఁడే.
1. పుంజము అనిన అభీషవలోకముతో నన్వయించును. పుంజమోయన [ఓ + అ

నన్] అనిన పౌనరుక్త్యతో నన్వయించును. పంతులవారిది రూపకము. మూలమున ఉత్ప్రేక్ష. ఉత్ప్రేక్షావాచకమును [ఓ+ అనన్ అనియేని, అనన్ అనిమాత్రమేని] చేర్చుకొనియు, ఉన్నది యున్నట్లును రెండన్వయములును కలయం బరికింపుఁడు. ఏది సరసమో యెఱుంగుదురు. 2 మూలమున పూర్వార్థము అతన్వన్నునకు క్రియావిశేషణము. ఇది యెఱుంగక పంతులవారు ప్రాప్తికడఁబోలె వేసికొన్నారు. ప్రాప్తింబోలె— ఈక్రియావిశేషణమునకు ఏక్రియతో నన్వయము? శాఖివలత్తు సమాసముగా దని వాదించి శాఖిన్+వలత్ అని విడఁదీసి వలత్తునకు విశేషణ మనునెడల, "నేను క్రీడత్కుందుక" మర్యాదం బడయును. వీరికి సమన్వితముగా వ్రాయ నింక నెప్పుడు చేతనగుట !3. దివసశ్రీకి 'వచ్చుచున్న' అను విశేషణము త్యక్తము. 4. సత్కలికా—సత్తు లేకున్న పుచ్చినకలిక యనియేగదా తలంతురు ! 5. పుంజము—నేలరాలఁగా మనము చేయురాశియు పుంజమే. అవతంసమునకు అదియేగదా శ్రేష్ఠము ! గుచ్ఛమన్న సహజముగానే ఏకవృంతగతమైన కలికలు. మేలుపదమును ద్రోచి కీడుపదమును ప్రయోగించుకొన్న రసజ్ఞతం గనుఁడు. 6. క్రీడత్—ఇది యేల? ఆటలో అయవతంసము నేలఁబడిపోవుటకా! 7. యతిరాజుగారిమ్రోల నీక్రీడ. అమైనం గైంకర్యము కానిండు. 8. స్వవతంస—ఈ సు లేనిచో పుచ్చినయవతంసమనియే సిద్ధాంతము! 9. విభ్రమమునకు భ్రమమన్నారు. ఈషద్భేదమేగదా? కోమలమును మలమన్నట్లే, కేశవ యనుటకు శవ యన్నట్లే, దీన దోషము లేదు! 10. జానొందఁగా నివ్వడిన్—కురంగేక్షణలక్రీడ యతిరాజుగారిమోర జానొందినది, మఱి యింక వడి గలుగదా?

లగ్నస్థుఁడైన సురగురువు సర్వదోషహననయు నేయునట్లు, ఇందులో, 11. అభీషవము మూలనుండి పద్యమునకు సర్వదోషహతి నేయుచున్నది. ఈశబ్ద మేమి? రూపనిష్పత్తి యెట్లు? అర్థ మేమి? సహస్రాంశ్వభీషవలోకంబు, ప్రభాకరకరస్తోమః అనుటకుం దెలుఁగుగా ప్రయుక్త మని యెన్నవలని యున్నది. సహస్రాంశు=ప్రభాకర - కర=అభీషవ - స్తోమః=లోకంబు, అని తోఁచుచున్నది. అభీషవ మని కిరణ పర్యాయములలో నెచటనుం గానఁబడదు. "అభీషుః ప్రగ్రహే రశ్మౌ" అని యమరుఁడు అభీషుశబ్దమును పఠించినాఁడు. వీ రెచటనేని అభీషవః అను బహువచనముం గని అది ఏకవచనమని భ్రమసి అకారాంతముగా నేర్చియుందురు. అభీషు శబ్దముపై తద్ధితము అణ్ణు పెట్టుదురేనియు ఆభీషవ మగునుగాని అభీషవము గానేరదు. అభీషు శబ్దమునకు మల్లినాథసూరి "సర్వే కోశకారాః మూర్ధన్యాన్తతయా పేఠుః, లోకవేదయో స్తుతాలవ్యాన్తతయా ప్రయోగః" అని చెప్పినాఁడు. ఇట తాలవ్యము పఠించి అభీ। శవలోకంబన్న సర్వదోషపరిహార మగును. అప్పటికి మూలగతగురువు

నకు సర్వబలపూర్తి యగును. ఒకవేళ నిట పంతులవారు, అ అనఁగా ఒకటి, భీ అనఁగా సున్న, ష అనఁగా తొమ్మిది, వ అన్న పదియేను, పదియేను తొమ్మిదులు మూఁడు. మూఁడు సున్నలను ఒకటితో గుణించిన సున్న. సూర్యునికి కిరణములు సున్నగాన, సున్న అనఁగా సూర్యకిరణములు అని సాంఖ్యప్రయోగ మేమేని పెట్టినారా? లేక, ప్రాంచత్సహస్రాంశ్వభీషువే ప్రాంచత్సహస్రాంశ్వభీషవ మని పుస్తకంపుమొత్తముమీఁదనే ప్రజ్ఞాద్యణ్ణు పెట్టినారా? అభీష్వవలోకంబు అన సచ్ఛపొరఁబాటో యన్న జ్ఞానెందయతిగారు విరోధింతురు. పాపము! ఈతప్పును మూలార్థసమన్వయమువచ్చునట్లు వారికవనముగానే దిద్దిపెట్టెదను!

మ॥ దివసశ్రీపదపద్మయోగవిభవాప్తిప్రాప్తఖాశోకభూ
జవళత్కోరకగుచ్ఛమో యనఁగ నాశాపద్మనేత్రాళికిన్
అవతంసంపువిలాసమిచ్చుచు నుద్బోద్యద్బాలతిగ్మాంశ్వభీ
షువితానంబు కడుంగడున్వెలిఁగెడున్ జొక్కించుచున్గన్నులన్.

[ప్రవినీవి=నీవి.]

మ॥ రవియెండాఁకఁ సరాగుఁడై కమలినీరాజీవకోశోల్లస
[5] 2442 త్ప్రవినీవిన్ వదలించుఁదాఁ గరమునన్భవ్యాళిమాలానుకై
తవమెప్పంగను జొప్పడున్మఱియునందాఁకం దదంభోజినీ
చ్ఛవిమత్కొంచిక చారునీలమణిరుగ్జాలంబు గ్రాలుంబొరిన్.

ఉత్తరార్ధ మనన్వితము. 1. చొప్పడునకేని గ్రాలునకేని రెంట నొకటికి కర్త లేదు. 2. చొప్పడున్ అని దిద్దుకొనినది. 3. ప్రవినీవియఁట! యతికి ప్ర ప్రాసకు వి, పద్యమునకు నీవి. కాన నీవియే ప్రవినీవి. అట్లేని ప్రపరాపసన్న్యవానునిర్ధుర్వ్యథి సూత్పరిప్రత్యభ్యత్యపవ్యపానీవియనియుం జెప్పనొప్పునా! ఒప్పదని యెవ్వరనిరి? ఒప్పును, ఒప్పును, ఒప్పును, కొక్కోయమనిమాత్రము పేరువచ్చును, వచ్చును, వచ్చును. మఱచితిని. 4. ఇది యుత్తప్రవినీవి గాదు సత్ప్రవినీవి. దీనికి సత్తున్నందులకు నీలమణికి, 5. ను [కైతవము] ఉన్నది. కాన చింతలేదు.

౧౦౫-వ పుట.

[4] 2446 ఆ॥ గురుయశోదిలీపకులవరమాణిక్య। మఖిలదిగ్వికాసకాదిమూల
మగుచునుదయమొందినట్టిభాస్వంతుని। నిన్నుఁజూడవేఁడుచున్నవాఁడు

మూ.—దిలీపకులమాణిక్యం। సకలాశావికాసనమ్
ఆవిర్భవన్తం భాస్వన్తం। భవన్తంచ ప్రతీక్షతే.

1. గురుయశో—య. 2. వర—పా. 3. త్రిగుచుక్—ఇంతకుముందు దిలీప కులమాణిక్యము కాఁడా. దిగ్వికాసకుఁడు కాఁడా? 4. అఖిల దిగ్వికాస కాది మూలము—వికాసకమనఁగా వికసిల్లఁజేయునది అనఁగా, వికాస కారణము, కాన మఱి ఆదిమూల మనుట పౌనరుక్త్యము. దిగ్వికాసాదిమూల మనవచ్చును. ఇప్పుడు దీని గతి యేమి? ఎట్లైనను తడఁబాటుగానే యున్నది. ఇటుగూడ నభిప్రాయమా? భాస్వంతుఁడు, అఖిల = సకలమైన, దిక్ = దిక్కు, వి = లేనివారియొక్క, కాసకుక్ = కాసవ్యాధికి, ఆదిమూలము = మూలకారణము; కావున, అతనిఁజూడ వేఁడవలసినదే. రవి కాస కాదిమూల మనుటకుం బ్రమాణమేమని యడుగఁగూడదు. 'ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్'' ని వారు చెప్పలేరా? ఆరోగ్యమ్మనఁగా "ఆరోగస్యభావః" అని వివరింపలేరా?

[5] క॥ ప్రాచీకుంకుమతిలకము । ప్రాచీనోదయగిరిశిఖరమణిత్రిభువన
2451 ప్రాచుర్యభవనదీపము । నై చెలఁగెడు సూర్యునికిమదభివందనముల్.

ప్రాచీనోదయగిరి. 1. నవీనోదయగిరి యొకటి గలదా, లేక. 2. ప్రతీచీనోదయగిరి యొకటి గలదా? 3. ఏలవచ్చినది ఈప్రాసబాధ! దీనికై, 4. ప్రాచుర్య,ప్రాచీన, 5. ఐచెలఁగెడు—ఇవి యెల్లంజేరి యిల్లెల్ల చిత్తయైనది. ఇదియుం గవనమే!

తే॥ జలజములఁబోలెఁజేయుచుసద్వికాస
[2] ములనుమామానసములనుముదమెలర్ప.
2453 భానుబింబంబునందుండిప్రభయుఁబోలె
నేదొయొకవాక్యమిప్పడెయుప్పతిల్లు.

రాముఁడు వక్త. ఎంతఛాందసుఁడో చూడుఁడు! 1. 'మామానసములను సద్వికాసములను జేయుచు' అను నీచేఁత్రాటికి 'ముదమెలర్ప' అని యర్థము కాదా? మఱల ముదమెలర్ప అను నేమి?

మూ.—వికాసయన్తీ నితరాం పద్మానీవ మనాంసి నః
ప్రభేవ భారతీ కాపి భానుబిమ్బా ద్విజృమ్భతే.

[illegible]సుఁబోలె వాక్య ముప్పతిల్లె.— 2. మూలమున ప్రభేవ భారతీ కాపి అని యుపమానోపమేయములు రెండును ఏకలింగములుగానే యున్నవి. అసాఁబగు ఇట్టిగ్రంథములో నుండరాదని భిన్నలింగములుగా ప్రయోగించుట న్యాయ్యమే.

[ద్వితీయకు సంబుద్ధి విశేషణ మఁట.]

శా॥ రామా నేత్రకువాలకాననతమఃప్రధ్వంసిచంద్రాతప
[13] శ్రీమంతంబగునీయశోలహరిభాసిల్లంగఁజేయంగదే
2466 భూమిన్వర్షసహస్రముల్మఱియుసంపూర్ణంబునాత్వద్గుణో
ద్దామశ్రీకథనామృతప్లుతముగంద్రైలోక్యమింపొందెడున్.

మూ.— యశఃపూరం దూరం తను సుతనునేత్రోత్పలవనీ
తమస్తన్ద్రాచన్ద్రాతప తవ సహస్రాణి శరదామ్
ఇయం చస్తాం యుష్మద్గుణకథనపీయూషలహరీ
ప్లుతోత్సఙ్గా నన్దత్సురనరభుజఙ్గా త్రిజగతీ.

1. రామా యని రామసంబుద్ధియూ, స్త్రీపర్యాయమూ. 2. సుతనునేత్రోత్పల అని మూలము గాన స్త్రీపర్యాయముగానే గొనఁదగు. ఆపక్షమున రామ యశస్సు స్త్రీనేత్రములకే గాని పురుషనేత్రములకు తమస్తంద్రాపహము గాదా? దీన పంతులవా రిక్కడ మూలార్థ మెఱుంగక తప్పినా రని విశదమైనదా? 3. వీరు చంద్రాతపమును యశఃపూరమునకు గదా విశేషణముగాఁ గొన్నారు. అవిభక్తికమైన [లేక సంబుద్ధిరూపమైన] చన్ద్రాతప అను ఖండమును యశః పూరమ్ అనుద్వితీయాంతమున కెట్లు విశేషణముగా సాధింతురో! 4. 'సుతను...చన్ద్రాతప' యనుసమాసము రామసంబుద్ధి యనియు రామసౌందర్యవర్ణన మనియు పంతులవారు తెలిసికొనవలయును. 5. అట్లు తెలిసికొని ...ప్రధ్వంసిచంద్రాతపా యని ఆకారాంతముగా చేసికోవలయును; అట్లుచేసిన అంత్యగురుత్వము కలుగును. అకారాంతముగానే తెలుఁగుసంబుద్ధి యైనచో గురుత్వము రాదు. 6. ఈమంగళాశీర్వనమునందు ప్రధ్వంసము కవితాతత్త్వములోని పంచమసూత్రమువలన వచ్చినది. 7. అగునీయశస్సనుటచే ఇప్పటికే ఈయన కట్టియశస్సు భాసిల్లుచున్నద నుట విశదమగు. 8. యశస్సు ధవళము, భాసిల్లుట దానికిస్వభావము, అట్లుండ, భాసిల్లఁజేయుమనుట అసంగతము. వ్యాపింపఁజేయు మనవలయును, దానిని వీరు లహరిని చేసినారు గాన, లహరికి ప్రవహించుట ముఖ్యస్వభావముగాని, భాసిల్లుటగాదు గావున, ఎల్లెడలను 9. ప్రవహింపఁజేయుము అనవలయును. 10. సంపూర్ణంబునా— ఇందుసముచ్చయ మన్వయభంజకము. ఆసముచ్చయము లేదను కొందము. 11. ఔశబ్దము దేనికి విశేషణము? సంపూర్ణముగునది యేదో చెప్పలేదు. ప్లుతమా సంపూర్ణము? సమాసగర్భగతముతో నౌశబ్దమున కన్వయము అవ

లక్షణము. కాన నీయుత్తరార్థము అనన్వితము, అసంబద్ధార్థము. 12. వర్ష సహస్రము లను కాలము దేనికి? సంపూర్ణమునకా? ఇంపొందుటకా? 13. భూమిలో త్రైలోక్య మింపొందెడు ననుట అసమంజసము గానున్నది. 'మఱియు' పదకదంబము రెండువాక్యముల నడిమిగోడ యనియు దాని కవలి 'భూమి, వర్ష సహస్రములు' ఇవలికి దాఁటిరావనియు నెట్లు తెలియును? శ్రోతలు భూమిని ఇంపొందుట వఱకును మోచితెచ్చి అప్పటికిని అన్వయింపమిచే మఱి గతి గానక భగ్నోత్సాహులై ఆయస్తులై చదికిలంబడుదురా, ఈభూమికై పూర్వవాక్యమును విస్మృతపదత్ర్యాత్మకమును సమాప్తమును హఠమున పునరాదానము నేయుదురా? ఇట్లు ప్రప్రయాసపడి భూమిని నీయశోలహరిని భాసిల్లఁగఁ జేయంగదే యని యన్వయించుకొని అటుతర్వాత తత్సాహచర్య ప్రభావముచే అదృష్టవిశేషకృతస్ఫూర్తిచే వర్ష సహస్రములుగూడ భాసిలఁజేయుటకే విశేషణమని తలంచి, అవునో కాదోయని సిద్ధాంత మరయుచుండఁగా పాత్రములు అంకమును ముగించివేయరా? విద్వచ్ఛ్రోతలకే ఇట్లు సంభవించుట కవియొక్క అకౌశలమా, వారిపాండిత్యలోపమా? చతుర్థాంకముతుది పద్యముపై విమర్శమును గనుఁడు. కొంచెము సవరణ.

శ్యామానేత్రకువాలకాననతమస్తంద్రామృగాంకాతపా
భూమిన్వేలుసమత్ప్రతాపముయశఃపూరంబుఁబర్వింపుమా
ఆమోదప్లవమానపన్నగమనుష్యామర్త్యమైత్వద్గుణో
ద్దామాలాపసుధార్ణవాప్లుతముగం ద్రైలోక్య మింపొందెడున్.

[6] 2472 సుగ్రీవుఁడు.—ఓయితండ్రీ, ప్రభాకర పరిపూర్ణమనోరథుఁడు - రాముఁడు. ఇందుచేతఁగదా?

[దీనివెంబడినున్న బంగారముయొక్క సారము.]

నిజగుణములచే నున్నతి గలిగె, పిత్రాజ్ఞ పాలింపఁబడియె, 'మిత్రసుగ్రీవుఁడు' 'పాత్రవిభీషణుఁడును' మహారాజులైరి, రావణుఁడు...కథాశేషుఁడయ్యె, బంధువులు చూడఁబడిరి, రాముఁడు పట్టభద్రుఁడయ్యెను, అందఱానంద మొందిరి.—

అయే తాత దినకర పరిపూర్ణమనోరథ ఏవ రామభద్రః। అనేన హి।

ప్రాప్తా నిర్భరమున్నతి ర్నిజగుణై రాజ్ఞా పితుః పాలితా
సుగ్రీవశ్చ విభీషణశ్చ పరమాం రాజ్యశ్రియం ప్రాపితౌ
సంగ్రామే దశకంధర స్సురరిపు ర్నీతః కథాశేషతాం
దృష్టో బన్ధుజన శ్చ హర్ష వికళ ద్బాష్పోల్లసల్లోచనః.

ఈపద్యము సావతారికముగాఁ బాడయినది. 1. పూర్ణమనోరథత్వము కారణముగాఁ జెప్పఁబడినది. అది పద్యోక్తకార్యములకుం గారణముగాదు. 2. రామపరము 'అనేన' పదము వాక్యార్థపరముగా చెఱుపఁబడినది. మూలములో సుగ్రీవవిభీషణులకు రాజ్యమిచ్చుట రావణు సంహరించుట లోనగుకార్యములెల్ల రామకృతములుగాఁ జెప్పఁబడియున్నవి; అనఁగా, ఆకార్యములం జెప్పువృత్తాంతముల కెల్ల అనేన అనుసర్వనామము [రామపరామర్శకము] కర్త. పంతులవారికి అనేన అనఁగా రామునిచేత అనునన్వయము తెలియమిచే వారిపద్యము కొన్నివాక్యముల రాముఁడు కర్తగాను. 3. కొన్నిట నతఁడు కర్తగాకయు సమన్వితి చాలక రచితమై యున్నది. 4. మూలములో పూర్ణమనోరథత్వము సమర్థితముగాను, శ్లోకార్థము సమర్థనముగాను ఉన్నది. ఇత్తెన్గులో అది విపర్యస్తమైనది. రాముఁడు పరిపూర్ణమనోరథుఁ డగుటచే నీకృత్యములు జరుగలేదు; ఇవి జరిగినందున పరిపూర్ణమనోరథుఁడాయెను. 5, 6. ఇట్లు "అనేనహి" అనివచ్చిన పెక్కుతావుల వాక్యార్థపరముగాఁ గొని పంతులవారు పాడుచేసినారు. [౯౦ - పుటను, ౯౭ - పుటనుం జూడుఁడు.] 'ఇందుచేత' అనుమాటకు వక్ష్యమాణ మర్థముగాస్ఫురించుట సులువుగాదు.

మూలార్థము.—నాయనా, సూర్యుఁడా, రామభద్రుఁడు పూర్ణమనోరథుఁడే, ఎట్లనఁగా, ఈయనచేత.—

అత్యంతము ఔన్నత్యము పొందఁబడినది, తండ్రియాజ్ఞ పాలింపఁబడినది, సుగ్రీవుఁడును, విభీషణుఁడును మహారాజ్యలక్ష్మిని పొందింపఁబడిరి, పోరిలో రావణుఁడు సురారి కథావశిష్టుఁడుగాఁ జేయఁబడినాఁడు, బంధుజనులు, హర్షవిగళద్బాష్పోల్లసల్లోచనులై చూడఁబడినారు.

2473 తుదిపద్యమున వబప్రాసము.

# విషయసంగ్రహాదికము

## నాటకలక్షణజ్ఞానము.

అం. ౧. పు. ౧౦. సూ—నవ్వుచు సంస్కృతమాశ్రయించి, ఓయీ బూరగ...
2474 ఇట సూ అనఁగా సూపురకుఁడు. నవ్వు...యించి యనువాక్యము సూపురకపాత్రమునకు కర్తవ్యోపదేశపరము, కవిది. దానినట్లు ముద్రించి యుండవలయును. ఇటసూపురకుఁడు ఓయీత్యాది వాక్యమునెల్ల తెనుఁగుగానే చెప్పినాఁడు గాని సంస్కృతము పలుకనేలేదు. కావున ఈకవివాక్యమున కాశ్చర్యపడవలసినదే.

అం. ౨. పు. ౨౬. అందాఁకరమ్ము, చూతము. [అని యిరువురరిగిరి.]
2476 ,, ,, ౨౯. అందువలనఁబోదము. [అని ముగు రరిగిరి.]

ఇందు మొదటి యరిగిరికి మూ. పరిక్రామతః—(ఇరువురు) నడచుచున్నారు. రెండవయరిగిరికి మూ. నిష్క్రాన్తాః—నిష్క్రమించిరి—రంగమునుండి వెడలిపోయిరి. ఇరువురు—సీతయు సఖియు. ముగురు—సీతయు, సఖియు, చేటియు. ఆయిరువురును పంతులవారి తొలియరిగిరితర్వాతరంగమందే యున్నారు. రెండవయరిగిరితర్వాత ముగ్గురును రంగమునుండి తొలంగిరి. పంతులవారు కడమతావుల నిష్క్రాన్తాః అనివచ్చినచోటనెల్ల నిష్క్రమించిరనియే వ్రాసినారు. ఇటనీయరిగిరులు వీరికి నాటకపరిచయము లేదని దండోరా వేయుచున్నవి.

అం. ౩. పు. ౩౪. అంతట జనకుఁడు పీఠమునుండిలేచి ప్రవేశించుచు
2477 న్నాఁడు.— ప్రవేశింపకముందు పీఠముందే ఉండెనో, నడచుచునేయుండెనో, అదియిట చెప్పినప్రయోజనమేమి? అదిప్రవేశముచే నెట్లుతెలియును? మూ. తతః ప్రవిశత్యాసనాదుత్థితః...జనకః — అంతట జనకుఁడు ఆసనమునుండి లేచినవాఁడుగా...ప్రవేశించుచున్నాఁడు. ఇదిప్రవేశకాలమందు జనకపాత్రము ఉండవలసిన సంవిధానమని పంతులవారు గ్రహించియుండరు.

అం ౫. పు. ౫౮. పంతులవారికి పంచమాంకములో ఒకటియుం బాతిక
2478 పుటయయినతర్వాత అప్పటికి మిశ్రవిష్కంభ మనుదమని తోఁచి 'ఇది మిశ్రవిష్కంభము' అన్నారు. అంతవఱకును రంగమందున్న పాత్రములు గంగాయమునలు. వీరు ఈయంకము తుదవఱకునున్నారు. 'ఇదిమిశ్రవిష్కంభమని పంతులవారనఁగానే వీరు నిష్క్రమింపలేదు. యథాపూర్వము ఈయంకమందు వీరుముఖ్యపాత్రములే. ఇట్లుండఁగా మధ్యలో మిశ్రవిష్కంభమని కలపరించుటకు రూపకలక్షణా

పరిజ్ఞానము నాటకాపరిచయము మక్కికిమక్కీ న్యాయంబును గాక యొండు శరణ
ము లేదు.

అం. ౫. పు. ౬౨. ఇందు, అన్నా యొక్కడికేగెదం(డియను పద్యము
2479 ప్రకరణమెఱుంగువారికి సరయూభాషితము. దీనిని యమునాభాషితముగాఁ
జేయుట వింతయే.

అం. ౬. పు. ౭౫. అంతటచూడఁ బడుచుజొనకి ప్రవేశించుచున్నది.—

అం. ౬. పు. ౭౬. వినఁదగనిదియగు—మూ. విననియట్లభినయించుచు.

అం. ౭. పు. ౮౮. నీవు కార్యము నిర్వర్తింతువుగాక.

అం. ౭. పు. ౯౬. రాముఁడు.—వాక్సాయకముచే...—

అం. ౭. పు. ౯౯. ఇందు రామలక్ష్మణాది ప్రవేశమును విద్యాధరమిథు
ననిష్క్రమణమును చెప్పమి రూపకలక్షణజ్ఞానము సున్నయని చెప్పుచున్నది.

[4] ఈనాటకమందు వీరు ప్రాకృతమునకు బదులు అచ్చతెనుఁగు పెట్టవలయు
2483 నని యొకయసభ్యనియమము కల్పించుకొని దానిని నిర్వహింపలేక పలుమా
ఱు తప్పిపోయినారు. ఈ వాక్యములంగనుఁడు.

అం. ౧. పు. ౧౦. నూపురకుఁడు—ఓయీ! ఎందు సువర్ణమయ...

అం. ౧. పు. ౧౧. నూ.—[భయముతో] నెయ్యుఁడా! త్మైతల..

అం. ౧. పు. ౧౩. నూ.—గురుగృహమునుండి...

అం. ౧. పు. ౧౩. నూ.— ఓయీ! భగవంతుఁడైన...

వీరు షష్ఠాంకములో కొన్నితావుల సీతకు తెనుఁగుపద్యముతో దాని
2484 మూలమయిన సంస్కృతశ్లోకమునుగూడ వేసినారు. ఆవికారమేలకో!
పెక్కుతావుల వాక్యమధ్యమున పదమున కర్థముంగూడ వ్రాయుట.—
2485 లంకేశ్వరా! రామభ్రాతను (రామునితోఁబుట్టువును) గంటివా?—ఇవ్వి
ధమున నుండును. ఇది చమత్కారమే.

## ఛందస్సు.

రలయతి— ౬, ౮౨, ౮౮. అఖండయతి— ౧౫, ౪౭, ౮౨. మ అ య
తి—మను। మానుండంబుధిని బోలె నమహాకనుమా॥ ౧౦౨.

రలప్రాసము—౧౬, ౩౦, ౩౪, ౭౦, ౭౩, ౧౦౦, ౧౦౨. వబప్రాసము—
౧౭, ౨౬, ౧౦౬. నణప్రాసము—౪౩, ౪౫, ౫౨, ౯౨, ౯౮. శసప్రాసము—

౪౨, ౫౭, థదప్రాసము—౬౧. దధప్రాసము—౪౮, ౧౦౧. గఘప్రాసము—౭౨, ౧౦౩. దడప్రాసము—౩౯.

రేఫాంత సంయోగమునకు ముందు హ్రస్వము లఘువు. యత్నప్రకట—౩. భిన్నభ్రూ—౧౪. మణిప్రపూజిత—౭౦. మేఘనాద ప్రహిత—౭౪.

ఒకపద్యములో మూఁడుపాదములు ఉత్పలమాల, నాలవపాదము చంపకమాల—౫౪. కుంటువడిన కందచతుర్థపాదము—'తనదుబిడ్డ' ఇత్యాది నగము. ౮౬. భాస్కర విలసితము, చతుర్థపాదాంత మభాస్కరము—నసగకు జనగ—౩౩.

## గీర్వాణభాషాలక్షణజ్ఞానము.

విద్రుమదళశ్రీకాంగుళిశ్రేణికల్ (చేతుల్)—౧. మందయానదరకూజత్కాంచికాశ్రోణి—౧౦. ఆమోదన్మకరందము—౧౭. త్రివళీకపటంబు—౨౬. ముద్రావిభవత్రిరేఖలు—౨౬. చాపలత[చపలతయనుటకు]—౨౬. అసురీలీలావతి—౩౭. వికర్షిత[అణిచ్చు]—౪౩. పథశ్రాంతి—౬౪. హతులము[స్త్రీలు]—౬౭. మాధురీధురి—౮౫. కమలాంఘ్రులు—౮౭. వాసవయశోహృచ్చంద్రహాసంబు—౯౫. హరిపాలు—౧౦౩. అభిషవలోకంబు—౧౦౪.

## ఆంధ్రవ్యాకరణమర్యాద.

అనుసరించినాను ౫; వచ్చినాను ౮, ౭; బడలినావు ౨౦; పంపఁబడినా
[12] ను ౨౧; మానినావు ౨౮; కొన్నావు ౩౧; చేకొన్నావు ౫౪; ఐనాను
2497 ౮౪; ఆజ్ఞాపింపఁబడినాను ౭౬; పొందినావు ౭౧; నిండుకొన్నావు ౩౧.
2500 పోతిని. ౮, ౪౮; మోసపోతిని ౧౨, ౪౮, ౮౨.

అకర్మకమును కర్మార్థకముగాఁ బ్రయోగించుట.—ఎత్తుకొనిపోఁబడి ౨౨.
2504 కొనిపోబడినవాఁడు ౨౨. కొనిపోఁబడుచున్నారు ౭౯.

అకర్మకధాతువునకు కర్మను పెట్టుట.—గుణములఁగల ౨; అక్కరములఁగల
[20] ౩; పూరముంగల్గి ౬; కుసుమములఁగలది ౭; మైపూఁతలంగలవారు ౯;
2523 రోమహర్షణముంగల ౧౦; అందియలఁగలది ౨౩, ౩౦; పంకముంగలది ౩౦;
మకరికలగములఁ గలిగి ౩౦; విద్దెలంగల ౩౧, ౬౫; వేడ్కఁగలిగి ౩౯; సన్నివేశముఁ
గల ౪౨; సరంబుంగల్గు ౪౬; శోభఁగల ౬౧; వియోగమ్ముంగల్గ ౬౨; తీఁగలఁ
గల ౬౫; మొగ్గలంగల ౯౨; మంచిచిన్నెలఁగల ౧౦౨; క్రూరజంతువులఁ గలది ౧౦౩.
2525 ఇడుగో ౨౫; ఇఁడుగో ౬౭.

2526 అనుఁగువు [యుష్మద్విశేషణము] ౮౩.

నిస్సందియము ౧౪; త్రిజట ౮౪; అప్పున్నెము ౮౦. అయ్యపుత్తుఁడు ౯౦;
2533 ౯౨ (౩), ౧౦౫; ఇది ఆర్యపుత్త్రశబ్దమునకు వీరి వికృతి.

2539 ఇత్వసంధి.—సరే ౧౨, ౨౨, ౮౦, ౮౬, ౮౭. కౌఁగిలిడు ౨౪.
క్త్వార్థేకారసంధి.—తివిచెక్కిడున్ ౧౭, పెల్లగించిల ౧౮.

ద్రుతమునకు అచ్చుతో సంశ్లేషము.—విజృంభణన్ననువు ౫౭; అంగములన్ని డున్ ౨౩. వాఁడున్నా ౫౩.

కంచెకోల్గాంచఁగన్—౩౦. కాల్గోరు ౮౩.

ఏపొరఁబాటుననో ఈభాషకెల్ల ఒకమాటు మనుచరిత్రలో పడినవల్లను బెల్లముగా ప్రయోగించుకొనుట.—ఎందువల్ల ౧, ౧౫, ౩౧, ౮౬. అందువల్ల ౬, ౧౮,
[20] ౪౫, ౪౭, ౫౧, ౭౬, ౭౯, ౮౦, ౯౩, ౯౮. నెలవల్ల ౪. పంపఁబడమి
2559 వల్ల ౧౧. కొనుటవల్ల ౨౦. ఇందువల్ల ౨౩. అర్మిలివల్ల ౫౧. వాగ్రామాధిపువల్ల ౫౩.

2561 నగాగమము లేమి.—ముందుకు ౫౫; ఎందుకు ౮౦.

2563 ఉంచఁబడు ౫. భావింపుచున్నావు ౧౫.

వలెతో సమాసము చేయుట — రేయెండ యెండలయందువలె ౫. తల్లి
[5] యందువలె ౨౫. చకోరమునువలె ౨౫. కప్పనువలె ౮౦. రంజితముచే
2568 వలెన్ ౯౦.

భిన్నవిభక్తికత.—[విమర్శలో విస్తరము]. ఏనాఁడును? దక్షిణాపథమున్ ౨. వక్రములన్మృగాక్షుల యపాంగము లెన్నర ౬. ఉడురూపములవ్వలపు ధారుణిపై వడగండ్లన్—౬. తంద్రిడిదిపదాబ్జద్వంద్వముంగూర్చి ౧౬. దీనిభీముదియానిష్ప్రా మెక్కించి ౧౭. నాయుపజీవిదియేడుపున్ ౧౯. వీరజననివివీనులకు ౨౧. కనుఁగొనుమిదె శీతచ్ఛాయంబుం జురదురుఘుఘుశీకర ముకుటంబునిదియె ౬౩. ముల్కిడి పాటుఁగాంచుటన్ ౬౭. పల్లివిపల్లవంబులన్ ౯౯.

అగుధాతువ్యవహితవిశేషణమునకు ప్రథమపెట్టుమి.—సక్తంబునాజింకన్ ౨౩.

సమాసగర్భగతపదముతో వ్యస్తవిశేషణ మన్వయించుట.—రోమహర్షణముంగల రుచిరబాహువులు ౧౦. నాప్రతిజ్ఞాభంగముకొఱకు ౧౨. నాదుశిరశ్ఛేదము౧ . తననామసామ్యమున ౯౭. శిరస్సునసున్న చంద్రరేఖోల్లసితామృతోర్మిపృషదోషమహత్త్వముచేతఁ బోలెఁ ౯౮. అంధువునఁబడు నంధానుగాంధునివలె ౯౫.

సమాసగర్భములో వ్యస్తపదములు.—తెలుపఁబడిన తనసింగాణిగొనము తాఁకులవలనం గలిగిన కాయలచాయచేఁ. సుధాకరారుణుల గేయంబైన బింబంబులు ౩౬.

వంపలేఁడయ్యెడుఁ ౧౧. ఎక్కుడఁబడదయ్యెడు ౧౬.

విప్పఁజేయంగ [విడఁజేయంగ అనుటకు] ౩౦ వీరవారముచే నభినందింపఁదగినది [తృతీయయెట్లు?] ౧౪. ఒక్కటింబ్రోచి తక్కినవినటికి ఎక్కుడనేని విడవఁబడకుండవు [సమానాశ్రయత లేమి.] ౧౪. చందురుమోము [మోముచందురుఁడనుటకు] ౧. ఔనునక్కుడఁ [ఔఁ అక్కుడఁ] ౬౪. స్వవర్ణకాంతిఁ జితచంపకోత్పలుల్ [కాంతిచే జయింపఁబడిన అని యర్థము.] ౩౭.

## శైలి.

కడపువిమర్శ యంతయు నెంతయో ఈగ్రంథముయొక్క శైలికిమాత్రము అంత వ్రాయవలసియున్నది, దానిని విపులముగా వివరించుటకు మఱియొక యవసరమును గ్రహించెద. ఇట సంక్షిప్తముగా కొన్ని విషయములు సూచించెద. ఛందోవ్యాకరణములయుపద్రవము తెలిసియే యున్నదిగదా.

గ్రామ్యము.—పీఁకు ౧౪, ౧౦౩. బుగ్గ ౨౪. చెంపలు ౬౫, ౭౫. ముటిక్లు ౩. పులిమెడుఁ ౯౯. కాళ్లకు (నమస్కృతి) ౯౪.

అశ్లీలములు.—పాతాళంబున కేగితండ్రిది ౧౬. తొడరకయున్న నెవ్వఁడును ౨౪. జనకునితనయలఁగైకొనురాముఁడు ౪౪. సమస్తమస్తమయ్యె ౯౩.

యతిజిత్తు; ప్రాసజిత్తు; పాదపూరణోపాయము; కొసవిసరులు— అహ, అహో, ఔ, ఏ, ఇత్యాదులు; విగ్రహవాక్య శైలి; టీకాశైలి; జాబితాశైలి; సీసమతొన్వయము; ఆంధ్రభాషాస్వభావాననుగుణము [కర్మార్థకప్రయోగము మొ.—ఎక్కుడఁబడదయ్యెనా? ఎక్కుడఁబడదయ్యెడు ౧౬.] నిషేధార్థకయుక్తృతీయ [ఇందుచే చాలును]; కర్ణకఠోరము.

కబ్బంపుదొసంగులపాఁచి చుట్టుకొనక ఈపొత్తంపుదొరువులో రెండడుగు లేనియు దిగఁజాలము.

## ఉపసంహారము.

ఇట్టి యీలఘువిమర్శచేత ఆంధ్రవిద్యార్థులును భావ్యాంధ్ర కవులును ఆంధ్రభాషకు ఇట్టి యాంధ్రీకరణములవలనను ఇట్టి కవనములవలనను గలిగిన చెఱుపును

చక్కఁగ నెఱింగి ఆంధ్రభారతియొక్క స్వభావమును, మధురిమను, ఔదాత్తతను గాపాడి, యుత్కృష్టగ్రంథములు చేయలేక మానినను మానుదురుగాక, ఈయాంధ్రీకరణమువంటివి మాత్రము చేయకయుందురుగాకయని కోరుచున్నాఁడను. ఈవిమర్శను ఆంధ్రభారతియు జయదేవకవియు నాయొక్క ఉడుతభక్తిసేవగా నంగీకరించి నన్ను ధన్యుంజేయుదురుగాక.

శారదా కాంచికా ద్వితీయకింకిణి

సంపూర్ణము.

---



# శుద్ధపత్రము.

| పుట. | తప్పు. | ఒప్పు. | పుట. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|---|
| ౩ | దుమంతపూ | దుమత్పూ | ౧౭౭ | విగణాని | విగణయాని |
| ౪౫ | భవనత్రి | భువనత్రి | ,, | నసగుట | నసుగుట |
| ౫౨ | బడఁదగినది | దగినది | ౧౮౩ | హిమోన్నతై | హిమోన్నమతై |
| ,, | బడియున్నది. | బడియున్నవి. | ౧౮౫ | రాంని | శిరాంసి |
| ౫౫ | అయుక్తము | అయుక్తము | ౧౮౭ | మాతల్లజ్ఞాం | మాతల్లజ్ఞాం |
| ౬౩ | హూలము | మూలము | ౧౯౪ | ప్రకటించుచుండె | ప్రకటింపవెలిచె |
| ,, | యహాదము | యహాపదము | | | |
| ౬౪ | పదమునం | పద్యమునం | ౧౯౬ | ఉపసర్జినీ | ఉపసర్జనీ |
| ౬౮ | జొల్చు | బొల్చు | ౧౯౮ | బందులకు | బంధులకు |
| ౮౮ | ఈమెడకు | ఈమెకడకు | ౨౦౬ | తాపుత్ప్వశ్య | తాపాప్వశ్వ |
| ,, | ఉవ్విళులూరు | ఉవ్విళులూరు | ౨౩౦ | అభిషంగ | అభిషంగ |
| ౯౭ | కాష్ఠ | కాష్ఠం | ౨౩౧ | కథంచితౌ | కథంచిత్సౌ |
| ౯౯ | నిస్తాన్త | నితాన్త | ౨౪౨ | యక్షమున | యక్షరమున |
| ౧౦౨ | అరవంత | ఆరవంత | ౨౪౬ | కొంపు | సొంపు |
| ౧౨౩ | శ్వేతాపత్ర | శ్వేతాతపత్ర | ౨౪౭ | ఇంద్రజాలిక | ఐంద్రజాలిక |
| ౧౩౦ | ప్రావమ్ము | ప్రాసము | ౨౪౯ | జీవిదానీతా | జీవిదానీతా |
| ౧౩౨ | సంభవించినది | సంభవించినవి | ౨౫౧ | ఆశోకమూ | అశోకమూ |
| ౧౩౩ | ధని | దని | ౨౫౪ | చాలుంద్రా | రాక్షస |
| ౧౩౯ | ధనుర్న్నగమ | ధనుర్న్నిగమ | ౨౫౫ | దిగ్జముల | దిగ్గజముల |
| ౧౪౫ | విశేషమేని | విశేషణమేని | ౨౬౬ | తృతీయమే | తృతీయయే |
| ౧౪౯ | ఆర్యాశ్లాఘా | ఆర్యశ్లాఘా | ౨౬౭ | అతేజము | అతేజము |
| ౧౫౦ | దిగ్జము | దిగ్గజము | ౨౭౪ | రస్వణము | సర్వణము |
| ,, | కృత్యాంతా | కత్యంతా | ,, | మైయెవని | మైనెవని |
| ౧౫౧ | ఈనాలిగింటి | ఈమైదింటి | ౨౮౭ | ప్రహారః | ప్రహారః |
| ౧౫౪ | మణియు | మణిమయు | ౨౯౯ | చావుతప్పినం | చావు |
| ౧౫౯ | ప్రవేశికయు | ప్రవేశకము | ౩౦౨ | పానముచే | పాందానముచే |
| ౧౬౨ | మాయనేని | మాయెనేని | ౩౦౩ | చక్రీభ | చక్రీభవ |
| ౧౬౪ | రించియున్నది | రించియున్నవి. | ౩౦౭ | నేరదు. అ | నేరదు...అ |
| ౧౭౦ | యర్ధీర్ఘ | యద్దీర్ఘ | ౩౧౦ | అగ్రంథ | ఆగ్రంథ |
| ౧౭౨ | ణుకమయ్యె | ణుకయయ్యె | ౩౧౧ | లగుచన | లనువచన |
| ౧౭౬ | అయర్థము | ఆయర్థము | ౩౧౮ | సమాసములును | సమాసములు |

శ్రీ

## సంస్కృత గ్రంథములు.

| | | రూ. | అ. | పై |
|---|---|---|---|---|
| భోజ చరిత్రము, కాలికోబైండు, ఆంధ్ర టిప్పణము | ... | 0 | 8 | |
| విక్రమార్క చరిత్రము ,, ,, | ... | 0 | 8 | |
| బిల్హణ చరిత్రము ,, పూర్ణటీక. | ... | 0 | 8 | |

ఈ మూఁడు గ్రంథములును సంస్కృతభాష నభ్యసింపఁగోరువారికి మిక్కిలి యుపయోగించును.

## తెనుఁగు గ్రంథములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆంధ్రప్రసన్నరాఘవ విమర్శము, ఆంధ్రగీర్వాణ సాహిత్యపరుల కత్యంతోపయుక్తము. | ... | ... | 2 | 0 | 0 |
| ప్రతాపరుద్రీయనాటకము, కాలికోబైండు. | ... | ... | 1 | 4 | 0 |
| కాకితపుబైండు | ... | ... | 1 | 0 | 0 |
| ఆంధ్రాభిజ్ఞాన శాకుంతలనాటకము ఉత్తమము | ... | ... | 1 | 4 | 0 |
| ,, ,, మధ్యమము | ... | ... | 1 | 0 | 0 |
| కావ్యాలంకార చూడామణి (విన్నకోట పెద్దన మహాకవి విరచితము), సరస భూపాలీయమువంటిది. | ... | ... | 1 | 4 | 0 |
| ప్రక్రియాచ్ఛందస్సు | ... | ... | 0 | 2 | 6 |
| నాగానందనాటకము, సంస్కృతమునుండి తెనిఁగింపఁబడినది; సటీకము | | | 1 | 0 | 0 |
| కథాసరిత్సాగరము, అత్యద్భుతకథా మయమయిన బృహత్కథకుఁ దెనుఁగు. మొదటి భాగము. కాలికోబైండు | | ... | 3 | 4 | 0 |
| పారిజాతాపహరణము. | ... | ... | 0 | 4 | 0 |

☞ ఈ గ్రంథములు వలయువారు మదరాసు, ముత్యాలపేట మల్లికేశ్వరునిగుడిసందు 4 నెంబరు ఇంటిలో నివసించెడు మదరాసు క్రిస్టియన్ కాలేజీ సంస్కృత ప్రధాన పండితుఁడగు వేదము వేంకటరాయ శాస్త్రివలన నుండి తెప్పించుకొనవచ్చును.

పది పుస్తకములుగాని అంతకెక్కువగాని ఒక్కమారే పుచ్చుకొనువారికి వెలలో పదియవభాగము కమీషనుగా తగ్గింపఁబడును.